శ్రీరస్తు.



శ్రీమద్వీరశైవజనశ్రవణపఠనార్చనోపయుక్తంబగు

# చెన్నబసవపురాణము

అత్తనూరి. పాపకవిప్రణీతము.

శ్రీమదష్టావరణపంచాచారాన్వితుండును భృంగిగోత్రపవిత్రుండును
వీరమాహేశ్వరస్వరూపుం డగు
గంగపట్టణపు సుబ్రహ్మణ్యకవిచేఁ
బరిష్కృతము.



చెన్నపురి:
వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే
ప్రకటితము.
1925.

# విషయసూచిక.

---

## పీఠిక.

విషయము.



## చతుర్థాశ్వాసము.



## పంచమాశ్వాసము.







శ్రీరస్తు.

# చెన్నబసవపురాణము.



శ్రీ శి .



క. శ్రీగిరిజనువధూవరో
జాగురుకాశ్మీరపంకిలాంకితవక్షః
శ్రీగిరిమల్లేశ్వరుకృప
దాఁ గందుకురమృతలింగధన్యునిఁ బ్రోచున్. 1

ఉ. ఉన్నతకుంభముల్ నిజపయోధర మంద గజాస్యు నంకపీ
ఠి న్నివసింపఁ జేసి బలుకేళి నిజేశ్వరుసాము మేనఁ దా
నున్నెడ మూఁడుమోముల గుహుండు స్తనత్రయ మంచుభ్రాంతినా
న న్నిగుడం దదిచ్ఛ గని నవ్వుభవాని కృతీశుఁ బ్రోచుతన్. 2

చ. ఘనతను దీప్తుఁ డై సమదగండయుగచ్ఛవిదంతకాంతుల
న్వనజభవాచ్యుతాబ్జధరవైఖరి దోఁపఁగఁ జేసి యేసె చూ
గనుఁగొనఁగం ద్రిమూర్తులకుఁ గారణమై తగుమూర్తి నంచుఁ బెం
పెనయు గజాస్యుఁ డీవుతఁ గృతీశున కీప్సిత మావరంబునన్ 3

చ. అరిధరణీధ్రదైన్యశరదాఘనవామయగంధవాహభీ
కరకులిశానలాగ్ని ఫణికల్పితగాత్రనఖాళిపక్షుదు
ర్భరవిషమాక్షవాలములఁ బ్రోచిలు శ్రీశరభాంకసాళువే
శ్వరుఁడు కృతీశుఁ గీర్తిబలశౌర్యశుభాస్తితుఁ జేసి ప్రోచుతన్. 4

ఉ. విశ్వకళాప్రవీణపరివీరుఁడ నీకుఁ గృపాణమైన నే
యాశ్వశిలీముఖాంఘ్రికమలామలభక్తధురీణసత్కృపా
శశ్వదురీక్షకోణ యని సారెకు నామదిఁ దాఁడికొండనం
దీశ్వరు మద్గురుం దలఁతు నెప్పుడు తా నుపదేశికాత్మజున్. 5

సీ. కంసధ్వంసముఖదేవసందోహవినుతగోవిందాస్త్రవహనాభినంది నంది
రంగదుద్భుజంగేశ్వరాంగదపదపద్మసంగతమానసభృంగి భృంగి
రుద్రనిరాకృతిక్షుద్రదక్షవితానవిద్రావణక్రియాభద్రు భద్రు
గాండసంభవకాండఖండనదూషకకాండసంహరణప్రచండు చండిఁ
తే. సర్వసర్వంసహాచక్రశైలగేహ
శక్తమానససంశయభారతిమిర
పటలభాఘాంబురుహసుహృత్ప్రభుని ప్రభుని
బూని వినుతింపెదఁ బ్రణామపూర్వకముగ. 3

మ. వరసర్వజ్ఞశిఖామణిన్ బ్రథితసద్వారప్రమోదాకరున్
నిరతోద్యచ్ఛివధర్మసంచరుఁ గళానీకాంచితావాసు భా
స్వరలింగాన్వితదేహు సర్వవిబుధవ్రాతామృతాధారు భా
సురపాదుం గలితార్తిఁ బాల్కురికివంశ్యున్ గొల్తు సోమాహ్వయున్.

మ. ఘనవల్మీకజ నన్నపార్య ముఖగీర్వాణాంధ్రభాషాకవి
త్వనమాంభోనిధులం జనార్తియుగజీవంజీవతోషక్రియా
కరతేజోనిధులం నిజానుపమవాక్యవ్రాతసంపాదనా
స్ఫురదాశాంబుధులం దలంతు సతతంబున్ గార్యసంసిద్ధికిన్. 8

క. అని యిష్టదేవతాప్రా
ర్థనమును గురుస్తోత్రమున్ బురాతనగణప
ద్వనజాభివందనము కవి
జనసుతిఁ గావించి యక్కజం బగు వేడ్కన్.

సీ. కమనీయధర్మార్థకామమోక్షసుఫలానీకంబునకు సురానోకహంబు
బంధురవిజ్ఞానభక్తివైరాగ్యనిష్ఠామౌక్తికములకు శంబరనిధి
సాంఖ్యయోగాదికచందనభూమిరుహావళులకు మలయాచలంబు
సలలితసాలోక్యసామీప్యసారూప్యసాయుజ్యముక్తిపద్మములకుఁగని
తే. యైన శ్రీచెన్నబసవప్రథానుభవ్య
చరిత మస్మద్గురూత్తమ సత్కటాక్ష
గరిమ నానేర్చుగతి జిహ్వ వరమపావ
నత వహింపఁగఁ జెప్పఁ బూనంగ నంత. 10

తనయశస్స్ఫూర్తి శీతనగాంబుజాతజా
　　త నభోపలగ్న లఘునతఁ బెగడుఁ
దనశౌర్యకలన శంతనుసూను కీచకే
　　తన జమదగ్నినందనుల నొంచుఁ
దనరూపగరిమ శ్రీతనయ నైషధ జయం
　　త నలకూబరుల వాదున జయించుఁ
దనయాగి రాత్రికాంత నరవాహన దైవ
　　తనగ కర్ణుల లెక్కఁ గొనక నెగడుఁ
తే. దనవచోగరిమంబు ధాత నగఁ జాలుఁ
దనప్రతాపంబు సూర్యునెం తనఁగ నోపు
దనరు శ్రీ కందుకూరివంశాబ్ధిచంద్రుఁ
డరితిమిరహేళి యమృతలింగార్యమౌళి. 11

వ. మఱియు సమస్తసిద్ధవిద్యాధరపరిష్కృతుండును ననంతామరసంస్తూ
యమానుండును బరభూభృత్పక్షచ్ఛేదనదక్షుండును గమనీయసుధ
ర్మాధివాసుండును నిరంతరగురువాక్యానుసారప్రచారుండును హస్త
గతశతకోటిసాధనుండును నందనవిహారసంజనితప్రమోదస్వాంతుం
డును శచీసమవర్తిపుణ్యాజనధనేశమహాబలధనాధ్యక్షసర్వజ్ఞాసమా
కీర్ణుండును నగు నమ్మంత్రిపురందరుం డొక్కనాఁడు శ్రుతిరంజకవిప్రవర
విహారకోలాహలంబై నిరుపమామోదసుమనోవిలాసభాసురంబై
యశ్రాంతకమలాంచితాలవాలంబై సలలితనిర్జరాభినయనవిహార
మూలంబై యాశ్రితాళిమనోరథపూర్ణాకారంబై కల్పవృక్షంబన
నొప్పు నాస్థానసౌధరాజంబున జ్ఞాతి బంధు మిత్రామాత్య పురోహిత
సామంత దండనాయక కవి పండిత పౌరాణికేతిహాసక పాఠక పరి
హాసక తాంత్రిక భిషగ్వణిక వాంశిక నర్తక మునజికవైతాళిక వంది
జనపరివేష్టితుండై మణిఖచితకార్తస్వరసింహాసనంబున నొడ్డోలగం
బున్న సమయంబున నిజపితృపితామహాదులు మున్నందిన సత్కృతులు
ప్రసంగవశంబున సభాసదులైన బుధజను లుపన్యసించిన విని సంతో
షస్వాంతుండై సప్తసంతానంబులలోఁ గృతియ యుత్తమోత్తమం
బుగావున నే నొక్కప్రబంధంబు గైకొనినఁ గాక యని తలంచి

తత్త్వాభిజ్ఞులకు నిజాభిలాషం బెఱింగించిన వార లిట్లనిరి.

మ. అనఘా! మీరు దలంచినట్టితలఁ పార్యాభీష్ట మాప్తాళిరం
జన మంహోనాశనం బమేయఫలకృత్సంతానముఖ్యంబు గా
వునఁ గీర్త్యాస్పద మైన యొక్కకృతి నీవు న్వేడ్కఁ గైకొమ్ము మున్
ఘనతాసింగయబాచయాదిసచివాన్వత్యంబునం జెందెడిన్. 13

ఆ. సుగుణసత్కులీను శుభవాక్యసర్వల, క్షణధురీణు సరసకావ్యరచను
నేకశైవగ్రంథవేత్త తేజస్విగా, నెఱిఁగి యందుమాతఁ డిచ్చుసుకృతి.

చ. అనవుడు మందహాసవదనాంబుజుఁ డై యపుడత్తలూరిపా
పనకుఁ జక్కిరాజునకుఁ బౌత్త్రుఁడ శ్రీగిరిమంత్రిమౌళికిన్
ఘనమతి సుంపరాంబికకు నందనుఁ డబ్బసవేశుఁడే యనం
జను బసవేశమంత్రి కనుజన్ముని బాపయసత్కవీంద్రునిన్. 15

క. ననుఁ బిల్వ బంచి తగు తెఱఁ
గునఁ బూజ లొనర్చి యిష్టగోష్ఠి వినోదం
బునఁ గొంతప్రొద్దు గడపిన
వినయపచోగరిమ నసియె వేడుక నాతోన్. 16

చ. శివకరుణాకటాక్షమునఁ జేకుఱెఁ దక్కినయట్టిసంతతుల్
కవిజనహృద్యముల్ భువనగణ్యము భక్తిరసోల్బణక్రియా
భవనము క్లిష్టపక్రకరపాటన మై తగు నొక్కసత్కృతిన్
దవిలె మదీప్సితం బిపుడు దాన మనోరథపూర్తిఁ జెందెడిన్. 17

క. సంతానభూజములలో, సంతానం బైనయట్టిసత్కృతి నీచేఁ
గాంతునని కోర్కిఁ జెందితి, సంతసమున నొసఁగవలయు సరసకవీంద్రా!

మ. అని జాంబూనదనిర్మితాంబర మణీహారాగ్రహారాశ్వచం
దనవీటీ చతురంతయాన సుమనోధామాదివస్తువ్రజం
బున న న్వేడ్క బహూకరించుటయు నేఁ బూర్ణానుమోదంబుతో
నసఘం బైన తదీయవంశకథనం బాసక్తి వర్ణించెదన్. 19

కృతిపతివంశవర్ణనము.

క. హృతకాముఁడు యుతవారిజ
హితధాముఁడు విష్టపత్రయీభరిత యశో

జితసోముఁడు ధారుణిలో
హితనాముఁడు వేయు సన్మునీశాగ్రణి యై. 20

క. అబ్బాసవాలుకులమున, బిబ్బోకవతీస్మరుండు పృథివితరుణిపా
నిబ్బరుఁడరిమృగతతికిం, బెబ్బులియన నప్పమంత్రి పెంపొందుధరన్.

క. ధీరుఁడగునప్పమంత్రికి, వీరేశ్వరుఁ డనఁగ నుద్భవించెను సుజనో
ద్ధారుం డాతని కాత్మజుఁ, డై రంజిలె నప్పసచివుఁ డతిధార్మికుఁ డై.

ఆ. అప్పమంత్రిభార్యలైనపార్వతియందు, గంగవలనసుతులఁగనియెజగ్గ
మాభిధానుమఱియునమృతకవీంద్రుని, శ్రీగిరీశ్వరునివిశేషమతుల.

ఉ. అందుఁ బార్వతీతనయుఁ డై చెలువొందిన జగ్గనాహ్వయుం
డిందుధరాంఘ్రిభక్తి ధరణీశవశీకృతమంత్రశక్తి మె
చ్చుందగు సూనృతోక్తిఁ గరసాహసభోగకళాధురంధరున్
నందను రామకృష్ణ ఘననాముని గాంచె జగత్ప్రసిద్ధిగన్. 24

చ. ఘనుఁ డగురామకృష్ణుని వికాసమనీషకు మెచ్చి సంతసం
బునఁ ద్రిజగత్ప్రతాపకులభూషణరాయుఁ డనంగ మేటిపే
రును మణిభూషణంబులు హరుల్ గజదంతపుఁబల్లకీఁ గొ
మ్మని వయ గోలకొండవసుధాధిపుఁ డాతని కిచ్చె హెచ్చుగన్.

సీ. భూనుతకీర్తియాభూషణరాయండు పేలానగరరాజ్యమేలుచుండి
నిడుదవోల్సీమలోనిరుపమవాసిష్ఠ తటినీతలంబున ధరణిసురుల
కగ్రహారములు కల్పాంతరస్థాయిగా నొసఁగి వనీపకవిసరములకు
వాంఛితార్థంబు లవ్వారిగా నొసఁగుచు బంధుల నరయుచు బహుళ[పుత్ర

తే. పౌత్రకల్యాణవృద్ధిచేఁ బరిఢవిల్లెఁ
గాంతిజితహేళి శివపాదకమలజాళి
దళితదురితాళి నిరుపమదానకేళి
రమ్యగుణపాళి భూషణరాయమౌళి. 26

తే. అప్పనకుఁ బిన్నయాలైనయట్టి గంగ
కుద్భవించిన యాత్మజయుగ్మకమున
నమృతకవిచంద్రుఁ డలరు బ్రఖ్యాతి మీఱి
యరివిభేదియు ఘనతమోహారణుఁ డగుచు. 27

క. ఆతఁడుకొండాంబికయం, ధాతతశైవవ్రతుని సదాచారగుణో

పేతుని పేరయలింగా, ఖ్యాతామాత్యాగ్రగణ్యుఁ గనిసిరులొందెన్.

క. పేరయలింగామాత్యుఁడు, భూరియశోలలిత మల్లిపూఁడి కులజుఁడై
పేరనసుత యగుకొండక్, భారతిఁ బహ్మేప్పిపగిదిఁ బరిణయమయ్యెన్.

క. ఆతస్వియందుఁగని మెక్, బాతకసంహరణచణులఁ బార్థివఘణులక్
ఖ్యాతికళామృతలింగ, జ్యోతిర్లింగాభిధానసూనృతగుణులన్. 30

మ. అమృతామాత్యుఁడు బుద్ధిరాజుకులపద్మాపత్యుఁడై పర్వతుం
డమితామోదముతోడఁ గన్న గురువాంబాసాధ్వికే ల్వట్టి త
త్ప్రియదారత్నమునందుఁ గాంచె తనయుక్ భావాంతరస్థాద్రిజా
రమణుం జేరయలింగమంత్రి శశభృద్రామేయసౌందర్యునిన్. 31

ఉ. పేర్కొన నొప్పు కందుకురి పేరయ సత్ప్రభుచక్రవర్తి క
ళ్యార్కసమానకీర్తి మఘవాత్మజతుల్యవిలాసపూర్తి దు
ష్కర్కశవైరిసంఘభయకారణమూర్తి పరాంగనాళిసం
పర్కవిచారకల్మషవిభంజనసత్పథవర్తి ధారుణిన్. 32

తే. భవ్యగుణధుర్య ముదిగొండ పర్వతార్య
వరవిశాలాక్షులకుఁ గల్గు వనజగంధి
వీరమాంబను వరియించె విభవ మెసఁగ
నంగజాకారి పేరయలింగసూరి. 33

ఉ. పేరయలింగమంత్రి తనప్రేయసియై తగు వీరమాంబికా
సారసగంధియందు శుభచర్యుల మేరుసమానధైర్యులక్
వారిధితూణభక్తుల దివాకరకాంతిసియుక్తులక్ సిరుల్
చేరఁగఁ గాంచె శ్రీయమృతలింగశుభాహ్వాయు మల్లికార్జునిన్. 34

క. అయిరుపురయం దగ్రజుఁడై యలరిన యమృతలింగమహితావనిభృ
న్నాయకభయదాయకవా, క్నాయకుఁడై యేలెనునరసాపురమెల్లన్.

సీ. అతిధార్మికుం డైన యమ్మంత్రివర్యుఁ డశేష దిగంతప్రసిద్ధి గాఁగ
మేటియగా తనపేర పేట మాదేపల్లె కాట్రేనిపల్లెయక్ గ్రామములను
రహి గుడుల్ కట్టించి రామలింగేశ మల్లేశ్వర శరభ మల్లేశ్వరాఖ్య
శర్వలింగప్రతిష్ఠలు సేసి శర్వపురాద్యగ్రహారము లవనిదివిజ

తే. వారముల కిచ్చి సర్వాధికారదత్త
దంతపల్యంకికావాహధవళచామ

తాతపత్త్రాదిబిరుదచిహ్నములు మెఱయఁ
బూజ్యసామ్రాజ్యభోగవిస్ఫూర్తిఁ దనరె. 36

ఉ. శ్రీముడిగొండవంశసరసీరుహభాస్కర వీరనార్య పు
త్త్రీమణి సంతతాశ్రిత సుధీజన యాచకబంధులోకచిం
తామణి నాఁగ సర్వవసుధాస్థలి నెన్నికఁ గన్న సోమమాం
బామహిళ న్వరించె మును పద్మ వరించిన కృష్ణు కైవడిన్. 37

క. సత్యవ్రతు లగువారికిఁ, గాత్యాయనిపదనికరుణఁ గలిగిరి కాంత్యా
దిత్యులు పేరయలింగా, మాత్యుఁడు వీరేశలింగమంత్రియు ననఁగన్.

ఆ. పృథివి నెన్నఁదగిన పేరయలింగంబు, బొమ్మకంటివంశ బుచ్చిరాజు
తనయ యైనయట్టినరఁబోణిశ్రీవిశా,లాక్షిఁ బెండ్లియాడియల రెసిరుల.

సీ. అతనికి నవరజుఁ డైనవీరేశ్వరుం
డవనిఁ బ్రఖ్యాతిచే నలరి సత్క
ళాశాలి కవ్వాలి లక్ష్మిపతికి సుతా
రత్న మౌనా వీరమ్మ రమణిఁ బెండ్లి
యాడి యబ్బింబోష్ఠియం దమృతాఖ్యకు
మారు శూరు నుదారు మేరుధీరుఁ
గనియె నాతఁడు మానఘనుఁడైన ముడిగొండ
గౌరన్న పుత్త్రియై గణుతి కెక్కు

తే. పర్వతమఁ బెండ్లియాడి తత్పర్వహిమక
రాస్యయందునఁ గనె మల్లికార్జునాఖ్య
లేఖకాగ్రణి పేరయ లింగసచివ
సార్వభౌమునిఁ బార్వతీశ్వరునికరుణ. 40

తే. అనఘతరదాని యగుమల్లికార్జునుండు
కూర్మి ముడిగొండ శరభన్నకూఁతు సుంద
రీసతీమణిఁ బెండ్లియై భాసురత్రి
మూర్తులను బోలు తనయుల ముపురఁ గనియె. 41

తే. అగ్రజుం డొప్పు నమృతలింగాహ్వయుండు
నేపునను రెండవసుతుండు సాంబరాజు

వసగ మూఁడవతనయుండు శరభమంత్రి
దానమానయశోభాగ్య ధైర్యయుతులు. 42

సీ. వసమల్లికార్జునాంఘ్రిజుఁడై తగు వేర
నామాఖ్యుండు బుద్ధిరాజామృతారు
లసుతలయ్యాంబ వరియించి యమృతలిం
గామాత్యయన్వయము మల్లన్న బసవ
రాజు పాపయ్యను రసికుల వేర్వర
మానృతవాక్యుల సుగుణయుతులఁ
గరుణాసముద్రులఁ గాంభీర్యవంతులఁ
గని మహాదైశ్వర్యగరిమ గాంచె

తే. వీరిలోపటస్థుఁ డగునట్టి వేరనామాఖ్య
మంత్రిమల్లపతనయుండు మల్లికార్జు
నాహ్వయుం డొప్పు నమృతలింగాహ్వయుండు
వంశభూషణమణి జనావళి నుతింప. 43

సీ. నేర్చినాఁ డేజాణ సిమధకాశ్మీరాదిబహుళదేశామేయభూషణములు
చేర్చినాఁ డేమేటి శీతాచలాత్మజావరపాదయుగళిహృత్సరసిజమున
నేర్చినాఁ డేమంత్రి ద్విజవరాధీశాది సకలవర్ణాశ్రమాచారసరణి
మార్చినాఁ డేదాని కుంభినీవ్యోమాష్ట హరిదంతరాళసంభరితకీర్తి

తే. యతఁడు పొగడొందుఁ గందమామాన్వవాయ
కలశవారాశిపూర్ణిమాకైరవాప్త
వేరయామాత్యతల్లజ వీరమాంబి
కాబ్జవదనాత్మజుఁడు మల్లికార్జునుండు. 44

ఉ. ఆతతకీర్తికై కువలయాశ్వచరిత్రకృతిం గ్రహించి ప్ర
స్ఫీతము లైనకీర్తిపతియేలెటిపాఁడను నగ్రహారముల్
ఖ్యాతిగఁ జేసి బంధులకు గ్రాసమభృత్యులొసంగి శాంభవ
వ్రాతముకోర్కు లిచ్చి విభవంబున మల్లనమంత్రి వర్ధిలెన్. 45

సీ. అతఁడు శాంత్యాదిగుణాఢ్యుఁడై యేలూరు
రాజమహేంద్రవరంబు కొండ

పల్లి యక్షా దుర్గముల్ పాలింపుచుండి కొ
మరవోలుమూర్తికొమార్తె సద్గు
ణాలంబ దుష్కలుషాపనీధరశంబ
యగుగురువాంబఁ బెండ్లాడి శోభ
నాంగుఁడు పెరయలింగంబు నమృతలిం
గంబు పేరేశలింగంబు సాక్షి
ఆ. పతియు మూర్తిరాజు బసవరాజ జన నొప్ప
సుతుల సుజనహితుల సుఖసహితుల
నతులవిభవయుతుల నాప్పురఁ గనియె నం
దగ్రజుండు పేరయామాత్యుండు. 46
ఉ. బాలశశాంకమౌళిపదపద్మసమర్చనకేలి సత్కళా
శాలి మదాంధశత్రుపరిపద్గహనోత్కటకీలి యాత్మభా
మాలి నిరంతరాశ్రితమహీసురపాళి సుసద్గభీరతా
వేలి యనంగఁ దేజరిలు పేరయలింగము మంత్రిమాత్రుఁడే?. 47
తే. అతఁడు శ్రీబుద్ధిరాజవంశాబ్ధిరాజ
పుత్రి, సోమాంబికానామఁ బుణ్యసీమ
విశ్వపాపవిరామ సాక్షీలలామ
పరగుణస్తోమఁ బ్రేమ నుద్వాహమయ్యె. 48
ఉ. ఆతనితమ్ముఁ డైనయమృతాహ్వయుఁ డీశ్వరతత్త్వవేది భూ
నేతృసభాంతరాళినుతనిర్మలసూనృతవాది లోకవి
ఖ్యాతకళావినోది సమదాంధవిరోధివిభేది సంతతో
పేతశుభప్రమోది కడుఁ బెంపు వహించె ధరాతలంబునన్. 49
ఉ. పుణ్యచరిత్రుఁ డాత్మకులభూషణుఁ డౌనయగారిభద్రస
ద్గణ్య సుతావరేణ్య సతతాశ్రితదీనశరణ్య భవ్యలా
వణ్య సమస్తబంధుజనవర్ణితనాయకహర్షదాయిసా
ద్గుణ్య వరించె నియ్యమిని హారొకసుకోరిక సమ్మదాత్ముఁ డై.
క. తత్సోదరుఁ డాకృత్యపి, భిత్సూనుఁడు కీర్తివిజితభిదురాబ్జకళా
భృత్సింహుఁడు పేరేశుఁడు, వత్సాదరసహితనతి తారి ప్రబలె సిరులచేన్.

సీ. మహితపంచాక్షరిమాహాత్మ్య మనుకృతి
యందె త్రైలోక్యవిఖ్యాతిఁ గాంచె
నతిభక్తి శ్రీశైలమందు మానులు మెచ్చ
సంవత్సరము నివాసంబు చేసె
నిష్ఠాగరిష్ఠుఁ డై నేఁడు నాఁ డనక సాం
ఖ్యమహేశ్వరార్చనఁ దా నొనర్చె
హితుల రక్షించి యహితుల శిక్షించి భూ
పతుల వశ్యులఁ జేసి చతురుఁ డయ్యె
తే. నితని కెన యైనమంత్రు లీక్షితితలమునఁ
గలరె! యని సర్వజనములుఁ బలుక నెగడెఁ
గందుకూరి మల్లికార్జునందనుండు
సంగరగుహుండు వీరేశలింగవిభుఁడు. 52

మ. అనఘుం డాతఁడు విన్నకోటవరవంశాంభోధిశీతాంశుఁ డౌ
ననఁ బెంపొందిన భీమరాజసుతయా నక్కాంబికాకాంత స
జ్జనసంస్తుత్య యశోనిరాకృతసుధాసత్కాంత నుద్వాహ మై
కనిమెక్క మల్లయపేరయాహ్వయులఁ దత్కంజాక్షియం దిద్దరన్.

ఉ. అగ్రజు మల్లికార్జునుఁ డహార్యవిఖండనతుల్యవైభవుం
డుగ్రసమర్చనానిరతుఁ డూర్జితసత్యవచోవిశాలుఁ డ
త్యాగ్రహవైరిసంహరణుఁ డంగజసన్నిభరూపవంతుఁ డా
శాగ్రజితాచ్ఛకీర్తి గుణశాలి తలంప నమాత్యమాత్రుఁడే?. 54

సీ. వీరశైవుల కెల్ల వెండిబంగరులింగ
మేటిసూత్రంబు లేమేటి యొసఁగె
శతములసంఖ్య దంపతిపూజ లొనరించి
శాటికాంబరము లేసచివుఁ డిచ్చెఁ
గమనీయమారత్నకాంచనసైచిక
ప్రముఖదానంబు లేప్రభువు చేసె
సతతంబు షడ్రససహితాన్నములు భక్త
గణతృప్తి నేమంత్రిమణి యొనర్చె

తే. నతఁడుఁ గొనియాడఁ దగుమల్లికార్జునుండు
కోరి ముదికొండయన్నయ్యకూఁతు రైన
వియ్యమాచంద్రవదన వివేకసదనఁ
బెండ్లియాడి ధరాస్థలిఁ బెంపుఁ గనియె. 55

క. ఆరసికుని యనుజుఁ డగు, వీరయలింగప్రధాని వేర్కొన నొప్పున్
శారదఘనసారయశున, సారదళనవకుకీర్తిసహితుఁడు సభలన్. 56

ఉ. శాంతుఁడు దుష్టభావరిపుసంఘమదాంధతమిస్రపద్మినీ
కాంతుఁడు భవ్యరూపజితకంధరవాహనసంభవైణభృ
త్కాంతుఁడు సంతతాశ్రితబుధప్రకరావనతారణేందిరా
కాంతుఁడు సార్థధైర్యహిమవంతుఁడు వీరయ మంత్రియే సుమీ. 57

సీ. ఆతఁడు శ్రీబుద్ధిరాజాన్వయశ్రీశైలపతిసుత కామాక్షివలన సుతులఁ
వీరయలింగంబు వీరేశలింగంబు బసవరాజన నొప్పు భవ్యగుణులఁ
గనియెమువ్వురనగ్రగణ్యుఁడౌ వీరన్న బుద్ధిరాజయ్యన్నపుత్త్రిఁ దాయ
మాంబిక వరియించి యవనియేలుచునుండె వీరన్న గండ్రపువీరరాజు

తే. తనయ వియ్యాంబ కేల్పట్టి ఘనతఁ బ్రబలి
బహుళవిఖ్యాతిఁ గనుచుండె బసవరాజు
బుద్ధిరాజవీరేశ్వరు పుత్త్రియైన
వియ్యమాంబను వరియించె విదశమతిని. 58

తే. మఱియుఁ వీరయలింగాఖ్యమంత్రి పిన్న
యతివ యెద్దనపూఁడి నారప్పపుత్త్రి
యైన కామాక్షివలన మల్లయ్య మొదలు
గాఁగలుగునందనులఁ గాంచి ఘనత నెగడె. 59

తే. సుగుణులగు మల్లికార్జునసుతులలోన
నాలుగవ నందనుండగు సాళువపతి
సంతతాత్మీయహృదయపద్మాంతరాళ
సంచరత్సాళువపతి ప్రశస్తిఁ గాంచె. 60

శా. ఢిల్లీనాయకుచేత దంతిహయధాటీముఖ్యవస్తువ్రజం
బెల్లం గైకొని కాశికాప్రముఖగౌరీశావసుల్ గాంచి ని
త్యోల్లాసంబున శంకరార్చనలు దివ్యల్ మెచ్చఁ గావించి సం

ఫుల్లాంభోరుహలోచనాపదనుఁ డై పూషప్రభుఁడై వర్ధిలెన్. 67
ఆ. అయ్యమాత్యవర్యుఁ డతిమోహమునభావ
రాజకులవతంస రామచంద్ర
పుత్త్రియైన లక్ష్మిఁ బురుషోత్తముఁడు లక్ష్మిఁ
బెండ్లియాడురీతిఁ బెండ్లియాడె. 62
తే. భువనవిఖ్యాతిగలవారి పుత్త్రి యగుట
సత్కులోత్పన్నయై వాత్సల్యసహజ యగుట
భవ్యగుణపురుషోత్తము భార్య యగుట
లక్ష్మియే యన నచ్చు నీలక్ష్మి నవని. 63
క. సరసుఁడు పూభువపతికి న, పరజుం డగుమూర్తిరాజు వర్ధిల్లె నహీం
బుకహారకులధరచలహార, ధరధరవరశరసమాన ధవళయశుండై.
సీ. బిరుదముల్ నృపతిచేఁ బెదతండ్రివలెఁ గాంచి
నత్యున్నతమగు స్వాతంత్ర్యము ధరించి
గురువరులకు సింగనవ మనువుర మెచ్చి
వరశివయోగుల కెల్ల నన్నె వెచ్చి
నగణితభక్తగణార్చనములఁ జేసి
యనవిభారము భుజమందు మోఁపి
లింగాంగసమరససంగతి నుతి కెక్కి
ప్రమథకథాశ్రవణమునఁ జొక్కి
తే. సప్తసంతతు లొనరించి శాంతి మించి
యరులఁ బరిమార్చి పౌరులసిరుల కోర్చి
కుజనసంగతి మాని సద్గుణము పూని
కీర్తి గనె వాక్యగోగోజ మూర్తిరాజు. 65
క. అన్నమునను జరుగక తా నున్నపురిని లింగధారి యొకఁ డుపవాసం
బున్న నుగుడునసివ్రతమున, నెన్నికపల్లో నఁగె వారి కెల్లమువమునన్.
ఉ. అమ్మనుజేంద్రమాన్యుఁ డమృతాంశుమదాన్యుఁడు సమ్మదాత్ముఁడై
తుమ్మలపల్లిసంశప్రథితుం డగువీరనముద్దుపట్టి పే
రమ్మ యనంగ నొప్పుసుగుణాకర నువ్వాహమయ్యె భారతిం
దమ్మి వసించువేల్పు ప్రమదంబునఁ బెండిలి యైనచాడ్పునన్. 67

సీ. పలుకువేళల సత్యభాషణంబె కాని యనృతవాక్యము జిహ్వ నంటనీదు
భక్తపూజలు సేయుపట్ల నోపిక కాని మేన రాజసవృత్తి పూననీదు
వినుల కిన్నంబు పూసిపెట్టెడు వేళఁ జేత సంకోచంబు చెందనీదు
పెనిమిటికినుక చేసిన సంతసమె కాని చిడిముడి మనసునఁ జెందనీదు
తే. సర్వసర్వంసహాపుణ్యసతులలోన
నిమ్మహాసాధ్వియే గణియింప మేటి
యనఁగ నుతికెక్కె మూర్తిరాజ్యనుగుఁబోటి
మహితగుణకోటి శ్రీపేరమావధూటి. 68

క. ఆమ్మూర్తిరాజామంత్రికిఁ, దమ్ముఁ డగుచు బసవరాజు ధర వర్ధిల్లెన్
దమ్ములదోరకెంపులమొ, త్తమ్ములదోరమైనసత్ప్రతాపోన్నతుఁడై.
సీ. నారదప్రభ మించి నాకవప్రభ నెంచి యమరినకీర్తిదానములవాఁడు
చిత్రభానుని మీఱి చిత్రభానుని గేరి పరగుసుచిత్ప్రతాపములవాఁడు
భీము పెంపును గెల్చి భీము పోఁడిమి మెచ్చి వఱలినభూతిసత్వములవాఁడు
ధర్ముగర్వము ద్రోచి ధర్మునర్వముఁ బాఁచి తగువిరభక్తిసత్త్వములవాఁడు
తే. జగతిఁ జెలువొందె సువరాష్ట్రశైలసేతు
శీతనగమధ్యరాజత్ప్రభాంతరాళ
వినుత సుగుణుండు మల్లికార్జునసుతుండు
మహితధృతిశాలి బసవరాణ్మంత్రిమౌళి. [సం

క. ఘనముగ నైతమపూఁడియు, మినుమించలిపాఁడుసిరులు మించంగనొ
గెను గురుచరవరులగు బస, వనితో నెనయైనమంత్రి వసుధం గలఁడే.
క. తనమేనయల్లుఁ డావృత, వినయుం డగుబుద్ధిరాజు వీరనచేతన్
గొనె సత్యవతీపరిణయ, మనుకృతి శ్రీబసవమంత్రి యతిసంప్రీతిన్.
సీ. శరభమల్లేశ్వరస్వామిఁ బ్రతిష్ఠించె నైతమపూఁడియం దధికభక్తి
నారామనిధితటాకాదులైతగుసప్తసంతతులొనరించె శాశ్వతముగ
రెండవబసవేశ్వరుం డన లక్షసంఖ్యగణార్చనల్ సలిపె సిద్ధ
సాళువేశ్వరకృపాసంలబ్ధఘనతరభోగభాగ్యముల విస్ఫూర్తి నలరె
తే. నీతఁ డని యెన్నఁదగియె ధరాతలమున
నతిఫలద సోమవాసరవ్రతయుతుండు

మల్లికార్జునగురుపమాంబాత్మజుండు
శరణసమధాని బసవరాజప్రధాని. 73

ఆ. రసికుఁ డతఁడు బుద్ధిరాజకులాగ్రణి
వీరభద్రతనయ వియ్యమాంబ
సకలబంధువినుత సద్గుణనికురుంబ
ప్రేమ మెఱసఁ బలర్పఁ బెండ్లి యయ్యె. 74

ఉ. ఇంతులు సాటి సత్తురె మహీస్థలి వియ్యమతోడ సత్కృపా
శాంతగళేశ్వరశీలపురసంహారభక్తసమర్చనక్షమా
శాంతవికీర్ణపూర్ణసతతాశ్రితపోషణసత్యభాషణా
శాంతనిజేశభక్తబుధసంఘముదానహాసువ్రతంబులన్. 75

తే. అనఘుఁ డైనట్టిబసవరాజునకు వియ్య
మాంబికకు నుద్భవించిరి యబ్జభూష
ణాంఘ్రిసేవాభిమతులు మల్లయ్యమూర్తి
రాజు వీరేశలింగ మణి రసికవరులు. 76

క. ఆముష్యాయణులో నగ్రజుఁడై మెఱసినమల్లికార్జునామాత్యుఁడు స
త్త్వాముఁడు తేజోధాముఁడు, ధాముఁడుకీర్త్యాకృతిప్రతాపగుణములన్.

తే. అతఁడు శ్రీబుద్ధిరాజు వీరార్యతనయ
విశ్రుతనయ వీరాంబను బెండ్లియాడి
సద్గుణనిధాని బసవరాజప్రధానిఁ
గనియెఁ గలశాబ్ధి చంద్రునిఁ గన్నపగిది. 78

ఆ. భూతిసాతిసత్త్వవీతులఖ్యాతిచే, వారిజారిధారిసారిశౌరిఁ
గేరి మీఱుకందుమారిబసవరాజు,తోడ నీడు సేయువాఁడ గలఁడె

క. అకలుషహారుఁడువాగ్జిత,వాక్కాంతుఁడుబుద్ధిరాజు బసవన్నసుతుఁ
డక్కవనెక్కొనిచక్కని, యక్కమహాదేవిఁ బెండ్లియైసిరులొందెన్.

తే. అతనిపినతండ్రి మూర్తిరాజాహ్వయుండు
విశ్వరాజసభాంతర వినుతి గాంచెఁ
దామరసజాండభరితప్రతాపచండ
కిరణవికసితనిజకీర్తికిరణుఁ డగుచు. 81

సీ. దానఘనంబున మానధనంబున రాజరాజప్రభుఁ బ్రబలువాఁడు

సత్ప్రతాపంబున సాధురూపంబున నలరాజకలచేత నలరువాఁడు
భరితకళాపూర్తిబాహుస్థలస్ఫూర్తి రేవతీరమణుని చేవవాఁడు
తతమంజుతరభూతి ధైర్యసమాఖ్యాతి చంద్రధరాభప్రశస్తివాఁడు
తే. ధాత్రినితఁడన నెగడెసుత్రామముఖ్య, దేవకోటీరమణిసుప్రదీప్తపాద
భైరవేశ్వరదత్తసంపత్ప్రమోద, సౌఖ్యశుభశాలిమూర్తిరాట్సచివ [మౌళి.
తే. రసికుఁ డాతండు శ్రీబుద్ధిరాజు బసవ
రాజపుత్రికుమారధాత్రి రమ్యగాత్రి
నచ్చమను బెండ్లియాడి యయ్యతివయందు
బసవరాజాదులను గని ప్రబలె సిరుల. 83
శా. ఆమంత్రీశ్వరు తమ్ముఁ డొప్పు మహిమాకాహార్యాత్మజాధీశ్వరా
ర్చామోదాత్ముఁడు కందుకూరికులదుగ్ధాంభోధిరాకాసుధా
ధాముం డుగ్రవిరోధిసంతమసమార్తాండుండు వీరేశలిం
గామాత్యుండు బిలేశయేశసమవాగ్వ్యాపారుఁ డిద్ధారుణిన్. 84
సీ. కాండసంభవదండిఖండనాఖండల తుండిపాండుర మెల్ల బెండొనర్చి
సారనీరదవారిసౌరుమీఱఁగఁ దేరి రాజరాజఖ్యాతి మ్రందఁజూచి
కంతుజయంతవసంతనలావనీ కాంత తేజము లిసుమంత సేసి
గంగాతనూజవిహంగతురంగస భాంగారజప్రౌఢి భంగపఱచి
తే. యేపుగనుకీర్తి వితరణ రూప శౌర్య
ములు ప్రసిద్ధి వహించె భూతలమునందు
బసవమంత్రీంద్రవియ్యమాంబాసుతుండు
సంగతావారి వీరేశలింగసూరి. 85
తే. అతఁడు భాషాజబుద్ధిరాజాక్కిరాజు
కన్య గుణధన్య లోకైకమాన్య యైన
వీరలక్ష్మిని బెండ్లియై విశదకీర్తి
నలరు శ్రీమల్లికార్జునాదులను గనియె. 86
క. స్మరసుందరుఁ డీవీరే, శ్వరసచివుని పెద్దతండ్రి సత్యవచోభా
సురమూర్తిరాజు సుగుణా, కర యగు శ్రీపేరమాంబికామణివలనన్.
క. చతురంభోనిధి వనజజ, చతురాస్యము లనఁగ జగతి సతతగభీరాం
చితభాషోన్నతినొప్పెడు, సుతులఁగని యెనలువురనువిశుద్ధచరితులన్.

క. అం దగ్రనందనుండు ప్రభు, చందనసమవైభవుండు రాజకళాపా
మందక్రపాకరుం డేభవి, యందుం బ్రబలెమల్లికార్జునామాత్యుండనన్.
క. రెండవతనయుండు శాత్రవ,ఖండనుం డవనీశకార్యఘటనాధ్యుండుభూ
మండలమునఁ గీర్తి నెరల్, పండించిన కాళహస్తిలింగము వెలయున్.
తే. ఆయ్యమాత్యుండు ముడిగొండ యన్యనార్య
పుత్రియైనట్టి సుందరీప్రార్థ్యచంద్ర
వదన సద్గుణసదన నుద్వాహమయ్యె
సకలబంధుజనంబులు సమ్మతింప. [నుండు
తే. మూండవసుతుండు మల్లయమంత్రివిరోధి, బాణసుతసమశౌర్యసంపద్ధు
బహుళయాచకసుపలోకపాకపంబు, ధారుణీస్థలి నొప్పను దానమహి
తే. అతని యనుజన్ముం డమృతలింగాహ్వయుండు [మ.
హాసపదథ్యాని బంధులోకాభిమాని
యబ్జసమధాని సకలవిద్యానిధాని
సతతసన్నుతభూజాని జగతి వెలయు. 93
సీ. అతులితరాజకళాభియుక్తుం డౌట సునవిబుధాధారసీమ గనుట
ద్విజసనాభిప్రాయవిముఖత నొందుట సహజలక్ష్మీవిలాసంబు గనుట
సమధికద్విజరాజసమ్మదాకర మౌట వర్ధితస్వచ్ఛభావంబు గనుట
బటుచిత్రభానుప్రభాసంగతం బౌట నాశ్రితదీనాధార మగుట
తే. నమృత మనుపేరు దూషిగా నతిశయిల్లి
వన్నెగాంచె వసుంధరావలయమందుఁ
గందుకూరి కులాంబుధి కైరవాప్తుఁ
డరితమోహేళి యమృతలింగార్యమౌళి. 94
సీ. శివభక్తిచేఁ గ్రేణి సేయుటింతియె కాదు వీఁడు ధర్మస్వార్తి వృషభమూర్తి
దానగుణంబున తగ్గొనర్చుటె కాదు ధనవృద్ధి నిరసించు ధనదు మించు
విక్రమాధికతను వెత్తి సేయుటె కాదు వాక్ప్రౌఢి గేరు బాహ్వతికుమారు
వైభవారూఢి చేవంచించుటయె కాదు పృథుభోగములనొప్ప నింద్రు
తే. సుందరాకృతి నపహసించుటయె గాదు [వెంపు
సరసతరనీతి నెన్ను వైపథుని చెన్ను.

భళిర! యితఁ డని కవివరుల్ ప్రస్తుతింప
నలరె రిపుజేత యమృతలింగార్యనేత. 95

ఆ. శుక్రకాంతిఁ జుల్కఁ జూచి చంద్రప్రభఁ
గేరి యర్కదీప్తిఁ గ్రేణిసేసి
కొమరు మిగిలెఁ గుందుకురి యమృతాఖ్యుకీ
ర్తిప్రతాపరుచులు నేలయందు. 96

చ. ఎనిమిదిజాము లేవరుస నీశ్వరుఁ బూన్చు సహస్రబాహువుల్
తనకుఁ గలంగి చాల నటు తన్మహిమం బది యెంత యంచు బొ
ఙుని నః తర్పెఁ బూన్చెఁ బదినూటనూఱులు నైదుజాలయు
న్ననినమృతాఖ్యసింహుఁడు మనంబునఁ గొంకక యొక్కవేళనన్. 97

సీ. దోఁటేట శివరాత్రి నీశ్వరప్రీతిగా దీపాయుతంబులెత్తెడుగుణంబు
కాలమ్ములం దప్పక త్రిసంధ్యలందు నుమాధీశుఁ బూజించునట్టి నెళవు
శతసహస్రాయుతసంఖ్యలు శివభక్తసంతర్పణంబులు సలుపుమహిమ
సమశీలతీర్థప్రసాదపాకంబులు నిరతంబు గొనియెడి నియమవృత్తి

తే. వనిశ దశౌషధసేవ సేయనివ్రతంబు
ననుదినము లింగములకు రుద్రాభిషేచ
నంబు గావించునిష్ఠ జనంబు లెన్న
ఘనతఁ జెన్నొందె నమృతలింగప్రభుండు. 98

సీ. సర్వమఖోచితపురస్థానాచారమార్గప్రతిష్ఠాపనప్రాజ్ఞుఁ డితఁడె
యనుపమవేదవేదాంతశాస్త్రపురాణసంగీతముఖకళాశాలియితఁడె
వననిధిమాపశేవధిశివాగారారామసంతానకరణపరిశస్తుఁ డితఁడె
సర్వంసహానాథసర్వకార్యక్రియానిర్ఘటనాఘటనప్రవీణుఁ డితఁడె

తే. తీర్థయాత్రపరాయణాతిథిసమర్చ
నాన్నపానీయదానగుణాఢ్యుఁ డితఁడె
యనుచు సకలజనంబులు వినుతి సేయ
నవని వర్ధిల్లె నమృతలింగాహ్వయుండు. 99

తే. బంధుపోషణుఁ డాతండు భాస్కరాజు
వేంకటేశ్వర వెంకమాంబికల కుద్భ

వించి జనసుతిఁ గాంచిన వెంకమాంబ
శాహరిణనేత్రఁ బ్రేమ సుధ్యావహమయ్యె. 100

సీ. విమలపతివ్రతత్వమునఁ బోలఁగ లేకసగమయ్యెఁ బ్రాలేయశైలతనయ
వినుతక్షమాగుణంబున సాటిరాలేక నడుగంటి దానయ్యె నబ్ధిరశన
సరసవాఙ్మాధురీసమము గా నేరక వెల్లఁదనము నొందె విధిలతాంగి
శ్రితభాగ్యదానప్రసిద్ధికి సరిరాక చంచలమతి యయ్యె జలధికన్య

తే. ఖ్యాతిగలయట్టివార లీరీతి గాఁగ
బుడమిఁ దక్కినసాధ్వు లీపోలఁతి కెనయె?
యనఁగ నుతి కెక్కె నమృతలింగార్యభార్య
శంకరపదాబ్జలోలంబ వెంకమాంబ. 101

క. బొంకుకలనైనఁ బలుకద, హుంకారం బెప్పుడెఱుఁగ దతిథులఁ బ్రోచున్
శంకరుగ నెంచు శరణుల, వెంకాంబకు సాటియైనవెలఁదులు గలరే?

తే. అమ్మహాసాధ్వియం దమృతాభిధానుఁ
డతులసౌందర్యయుతుల దానాభిరతుల
వితతశుభకరమతుల సద్వ్రతతిహితులఁ
గాళహస్తిలింగాదులఁ గనియెఁ బ్రీతి. 108

ఆ. మఱియు నయ్యమాత్యమణికొమ్మరాజయ్య
పార్యనకును లక్ష్మి యాత్మజాత
యైనవియ్యమాంబ నతివేడ్క పరియించె
నఖిలబంధుసమ్మదావహముగ. [దుపలచి

సీ. గోపాలబాలయై గోత్రమెఱఁచువానిఁ జెందులోపాముద్రఁ గ్రిం.
శివవిముఖునకు సంభవముందిన కళంకుఁ గూడినరోహిణిఁ గొదవఁ జేసి
భంగసంగతునకుఁ బట్టియై పుణ్యజనాళిఁ బొందినలక్ష్మి నవహసించి
చట్టుపుట్టువ యయి స్థాణునివలచిన కాత్యాయినీదేవి గాకొనర్చి

తే. బ్రహ్మతేజంబు శుభము నభంగ మార్ద్ర
హృదయపద్మంబు గలవాని కుదయ మంది
పంకరహితామలాన్వయసంభవణ సరస
గుణగణుని నొందె వియ్యమ్మ కోర్కెతోడ. 105

ఆ. బంధుపోషణంబు పతిభక్తి శాంతంబు
సుకృతవర్తనంబు సూనృతంబు
తనకు సహజములుగ ధారుణి వర్ధిల్లె
వినుతగుణకదంబ వియ్యమాంబ. 106

క. ఆసాధ్వియందు వినుతద, యాసాగరుఁ డమృతలింగమాకృతివిజిత
శ్రీసుతుల నీశపదపూ,జాసక్తుల మల్లికార్జునాదులఁ గనియెన్. 107

షష్ఠ్యంతములు.

క. ఏతాదృశగుణధీరున, కాతతకవిబంధుసముదయాధారునకున్
నేతమణిజాతఫణీరు, ట్స్ఫీతఘృణిత్యాగకీర్తిశృంగారునకున్. 108

క. అరిభయదామర్షునకున్, ధరణీసురవినుతవాక్సుధావర్షునకున్
శరణాగతశరణాంచిత, చరణానతకీర్షునకు సుజనహర్షునకున్. 109

క. భూలలనాపాలసభా, జాలనుతాగణ్యపుణ్యసంసక్తునకున్
శైలాధిపబాలానుప, మాలాపపరాంతరంగహరభక్తునకున్. 110

క. హ్రాతరిపుధరణీపతికిన్, సతతావితదీనమర్త్యసమితికిఁ జతు
ష్షష్టితిభూషణగతిదూషణ,మతిశోషణధృతికిదానమహోన్నతికిన్.

క. భూవిదితాత్మీయయశో, జైవాతృకముకుళితద్విషత్కమలునకున్
శైవాగమభావాగమ, ధీవాగమలఁనకు సాహితీకుశలునకున్. 112

క. శ్రీకందుకూరికులర,త్నాకరశశిమూర్తి రాజహర్షదవేరాం
బాకమలాక్షభవునకుం, బ్రాకటగుణ్యమృతలింగవరసచివునకున్.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పం బూనిన చెన్నబసవ
పురాణం బనుమహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన. 114



# ప్రథమాశ్వాసము.



## కథాప్రారంభము.



మచ్ఛైలసుతాధినాథపదరాజీవాళిసద్భృంగ్యలో, పాము
ద్రాహ్లాదయానుకూల్యయుత భాస్వత్కేళియాడత్య భూ
స్స్వామి బ్రహ్మముఖామరాభినుత సిద్ధాశాలి పాపాటవీ
స్తోమానర్గళకీలి యైనఘటజాతుం డొక్కనాఁ డిమ్ములన్. 1

సీ. అతులితవేదవేదాంతచర్చల బ్రహ్మనైనఁ గోడిగమాడుహంసతతులు
వాదించి పాంచరాత్రాదికంబుల వినకరునైనఁ దెగడుశుకప్రతాన
మాగమమంత్రరహస్యార్థములఁ జంద్రధారినైనఁ సహసించుశారికాళి
మహితపురాణవిమర్శ సాత్యవతేయునైన నెంచెడిభుజంగాళినికర
తే. మలరఁ జెలువందుచుండు నిజాశ్రమమున
శిష్యసంఘంబు సేవింపఁ జెలువుతోడఁ
గూర్మికుశపీఠమున నిష్ఠగోష్ఠిఁ బ్రొద్దు
గడుపుచున్నెడ నాకస్మికంబు గాఁగ. 2

శా. శ్రీరుద్రాపరమూర్తి మౌనిముఖరాజీవార్యమస్ఫూర్తి స
ద్వారోదారమనోనువర్తి హృతభక్తవ్రాతజన్మార్తి యో
గారూఢ్యాగతకీర్తి రేణుకగణాధ్యక్షుండు భూలోకసం
చారేచ్ఛం జనుదెంచి యత్తఱి మహాసంతోషసంయుక్తుఁడై. 3

క. తనయాశ్రమంబునకు రాఁ
గని యెదురుగ నేగి మ్రొక్కి ఘటజన్ముఁడు దో
డ్కొని వచ్చి యర్ఘ్యపాద్యా
ద్యనుపమపూజన లొనర్చి యతిభక్తిమెయిన్. 4

శా. స్వామీ ! యెచ్చటనుండి వచ్చితిరొ భవ్యంబైన మీరాక మ
ద్ధామం బేము శుభంబు నొందితిమి చింత ల్వీడె సాక్షాచ్ఛివా

రామాధీశ్వరమూర్తిఁ గాంచినటులన్ రంజిల్లె మత్స్వాంత మ
య్యా! మీపాదసమర్చనల్ సలుపుభాగ్యం బబ్బె నేఁ డియ్యెడన్.
క. అనవుడు దరహాసితాననముగ నాతం డిట్లు పల్కు మునిపుంగవ నీ
వనఘతపోనిధి వని ని, న్ననువాంఛ న్వచ్చినాఁడఁ గౌతుక మొదవన్.
వ. అని మఱియును. 7
ఉ. కంతువిరోధియాజ్ఞ ననుకంప దలిర్పఁగ వీరశైవసి
ద్ధాంతము నీకుఁ జెల్పి విదితంబుగఁ దత్క్రియ మెల్ల సర్వరా
ద్ధాంతము నీముఖోదితపథంబునఁ జేయఁగఁ బూని భూమిభృ
త్కాంతతనూభవాధిపునిధామము వెల్వడి సత్వరంబునన్. 8
క. వచ్చితిటనిన్నుఁగాంచితిఁ, దచ్చరితమువినుమటంచుఁదప్పకయాతం
డచ్చొత్తినగతిఁ జెప్పిన, సచ్చరితుఁడుకుంభజుండు సంభ్రమపరుఁడై.
చ. అనఘ దయారతిన్ ఘనరహస్యము దెల్పితి బుద్ధ మర్త్యుఁ బా
వనమతి వైతి నిం కొకటి వాంఛిత మెట్లన విన్నవించెదన్
మనసిజవైరియాజ్ఞ మెయి నాగభుగర్వుఁడు భూస్థలిం గరా
శనమహిమంబుఁ బెంచె నని సంయమిసత్తముఁ డొక్కనాఁ డిలన్.
వ. స్కాందపురాణంబునకు నాయకరత్నంబైన శంకరసంహితయందలి శివరహస్యఖండంబునందు వక్కాణింప వింటి నక్కుమారుం డెవ్విధంబున మహీతలంబు పావనంబుగా భక్తిపర్ధనం బొనరించెఁ దద్వృత్తాంతం బంతయుం దెలిపి కృతార్థుం జేయవలయు ననిన నప్పారశవగ్రామణి యత్యంతసంతోషితస్వాంతుం డై యొక్కింత సేపునకుఁ బూర్వంబున శర్వుం డార్యాసమేతుం డై పేరోలగం బున్న సమయంబునఁ దద్దర్శనకుతూహలంబునం జనుదెంచి విరించి క్రమ్మఱి పోవుచుఁ దన్నుఁ బ్రణవార్థం బడిగిన కుమారునితోడఁ దత్ప్రణవార్థంబు లేద యని యపార్థంబుగా నెదు రెఱుంగక పలికి యతనిచేతఁ గారాగృహబద్ధుం డగుట సురలవలనఁ బరమేశ్వరుండు విని యతని విడిపించి తదోంకారార్థంబు సవిస్తరంబుగాఁ దేటపడం బలికిన నిజతనయుప్రజ్ఞావిశేషంబునకుఁ బరితోషంబు నొంది మేదినీ తలంబున మన్మహిమంబు ప్రకటింపు మని యనుచుటయుఁ దదనం తరవృత్తాంతంబును దక్షిణంబ హృదయగోచరంబగుటయు నానంద

బాష్పధారాపరిషిక్తాంగుండును గంచుకీభూతరోమాంచుండును
గద్గదకంఠుండు నై యతనితో ని ట్లనియె. 11

మ. అనఘా! నీవు వినంగఁ గోరిన మహాపాఖ్యాన మత్యంతపా
పన మంహోవళనం బహీనఫలదప్రాగల్భ్య మార్యైశభ
క్తనికాయప్రమదాస్పదం బతులమోక్షప్రాప్తిసంసూచకం
బనిమేషప్రకరాభిగణ్య మియి పెంపొ ధారుణీమండలిన్. 12

తే. కుంభసంభవ నీమదికోర్కి దీరు
పనుము శర్వునికరుణ నేఁ గనినభంగిఁ
దెలుపుదు నటంచు రేణుక దేశికుండు
చెన్నబసవేశుచరితంబు చెప్పఁదొడఁగె. 13

సీ. శ్రీకరాంబరచుంబిశిఖరాభిరామంబు బహురత్నసానుప్రభావిరాజితంబు
శరభమృగేంద్రాదిసత్వసంకీర్ణంబు దేవవృక్షోద్యానదీపితంబు
కనకాంబుజోజ్జ్వలకాసారకలితంబు బహుళనిర్ఝరీచయభ్రాజితంబు
కిన్నరబృందసంగీతనాదయుతంబు పటుతాపసావాసభాసితంబు [బు

తే. దళితపాపంబుముక్తిప్రదాయకంబు, ప్రమథనిలయజ్ఞసర్వజ్ఞపాలితం
వేదవేద్యంబు తారకవిలసితంబు, భవ్యవిభవంబు కైలాసపర్వతంబు.

ఉ. ఆయతతద్ధరాధరశిఖాగ్రసమంచితహీరదేవతా
నాయకరత్నకాంచనఘనద్యుతిసంచయ మెల్ల నేకమై
తోయదమార్గదేశమునఁ దోరముగాఁ గనుపట్టు టొప్పె గం
గాయమునాసరస్వతు లుపకంఠి నభిన్నతఁ జేరుకై వడిన్. 15

సీ. పున్నాగవిస్ఫూర్తిఁ బొల్చు టింతియె కాదు
పున్నాగవిస్ఫూర్తిఁ బొల్పు మీఱెఁ
జమరికాకీర్ణమై చెన్నొందుటయె కాదు
చమరికాంచత్ప్రభ ల్చాల మిగిలెఁ
గుంజరాశనదీప్తి గొరలు టింతియె కాదు
కుంజరాశనదీప్తి గొమరు మిగిలెఁ
బ్రియకబృందంబునఁ బెంపొందుటయె కాదు
ప్రియకబృందంబునఁ బేర్మిఁ గనియె

తే. ననఁగ వృతమ్ముగాకీర్ణ మగుచు సకల
భువనసన్నుతిఁ గాంచె నద్భుతము గాఁగ
శతసహస్రసుధాభానుసన్నిభప్రి
కాశమహిమాస్పదంబు తత్క్ష్మాధరంబు. 16

వ. మఱియు నద్ధరాధరరాజంబు విరాజమానం బై స్వర్గలోకంబునుం బోలె రంభాదేవపల్లభసురుచిరవిలాసం బై యర్చిష్మతీపురంబునుం బోలె నిరుపమశుచిప్రదేశం బై సంయమనీనగరంబునుం బోలె విలసితధర్మావాసం బై నిర్బతిభువనంబునుం బోలె సంతతపుణ్యజనస్థానం బై వరుణపట్టణంబునుం బోలె భాసురభువనోన్నతం బై గంధవతీపుటభేదనంబునుం బోలె శంకరప్రవాహవిలసితం బై యలకాపురంబునుం బోలె శంఖమకరపద్మాకరం బై యీశానలోకంబునుం బోలె నీలకంఠసంచారం బై పాతాళంబునుం బోలె నాగలోకకలితం బై యొప్పుపర్వతశిఖాగ్రంబున. 17

చ. పగడపుఁగంబముల్ తళుకుబంగరుబోదెలు తమ్మికెంపురా
నిగనిగ లీనువాకిలులు నిద్దపువెన్నెలఁ దేనిరాలఁ జె
న్నగుజిగిగోడలుక్ సొగసులై తగుపచ్చలతోరణంబులుం
నగఁ జెలువొందు నొక్కమణిధామము శర్వనివాసయోగ్యమై. 18

క. ఆమహనీయ సభాభవ
నామలమధ్యప్రదీపితార్క్యాయుత తే
జోమయనవరత్నాంచిత
సీ హైమసుఖాసనమునందు నతిముదమొదవన్. [లుప

కమలభవాండముల్ కందుకంబులరీతిఁ బట్టియాడెడుగణప్రభులుగొ
సహజైకలింగసిద్ధాప్రతస్ఫూర్తిచేఁ జరియించు భృంగిలాస్యంబొనర్ప
నాంది వృషభేశ్వరానతాకారం బయి తగఁ నందిసంపది తలఁగజడియ
తే. నతులితాష్టాంగయోగానందపరవశు లైనమౌనీశ్వరు లభినుతింప
నమరగజగామినులు చామరములు వీవ
గరుడగంధర్వముఖు లిరుగడల నిలువ
శైలతనుజాతయును దాను జంద్రమౌళి
నిండుకొలు వుండెఁ గన్నులపండువుగను. 20

వ. ఆసమయంబున. 21

ఉ. పాలను నీరు వేర్పరుచుపక్షి పయి న్వడి నెక్కి స్వప్రభా
జాలము మేనువుం బెనగ సంచితపణ్యనవీనదాచ్ఛతో
మాలయమౌ కమండలువు హ స్తమునన్ వెలుఁగొంద శారదా
లోలుఁడు వచ్చె సర్వసురలోచనపద్మము లుల్లసిల్లఁగన్. 22

చ. అటు చనుదెంచుచున్ గిరిసుతాత్మజుఁ డొక్కెడ బాలకేలిఁ బ
ర్యటన మొనర్చుచున్నతఱి నాతని లెక్క యొనర్ప కేగ ది
క్పటు గని తత్పదాబ్జములపై నుదు రంటఁగ సాఁగి మ్రొక్కి వి
స్ఫుటసితమాంతసూక్తములఁ బొంగుచు సన్నుతిఁ జేసె నీగతిన్.

సీ. బాలేందుకోటీర పన్నగకేయూర పాథోధితూణీర భవవిదూర
పద్మాక్షసుతశిక్ష పావనమునిరక్ష భక్తసంచయపక్ష పావకాక్ష
కలితకృపావాల కార్ముకాయితశైల కంధరకాకోల ఖలవిఫాల
నీరజాంబకమిత్ర నిర్జితానుకగోత్ర నిరుపమశుభగాత్ర నిగమసత్ర

తే. పార్వతీసంగ రవినిశాపతిరథాంగ, గగనధునిజూటహస్తపంకజకరోట
కోటిరవినిభతేజ తారకకుధరరాజ, నిరుపమోల్లాస దారువనీవిలాస

చ. అని యిటు సన్నుతించి ప్రమథాధిపు లోచనసంజ్ఞ నొక్కెడన్
వినయము మీఱ నిల్చి యతివిస్మయ మందుచు నాతఁ డాత్మహృ
ద్వనజ మెలర్పఁ గొంతదడి తద్గిరిజేశసభావినోదముల్
గనుఁగొని శర్వు వీడుకొని క్రమ్మఱి పోవుచుఁ దొంటిపైఁ బడిన్.

ఉ. శంకరతుల్యుఁ డైన శివజన్మునిఁ జూడక నేగుచుండఁ ద
త్పంకజగర్భుపైఁ గినుక పర్వఁ గుమారకుఁ డౌర వీఁడు ని
శ్శంకతఁ బోవుచుండె నను సడ్డ యొనర్పక యంచు నుగ్రుఁ డై
కింకరుచేత రాఁ బనిచి గీష్పతితో నిటు పల్కె నత్తఱిన్. 26

తే. ఎవ్వఁడవు నీవు? నీనెల వెచట నుండు?
నామ మెయ్యది? యుద్యోగ మేమి? యిప్పు
డిటకు రాఁ గత మెద్ది? మా కెఱుఁగఁ దెలుపు
మని యడుగ నట్టు లడిగిన నబ్జభవుఁడు. 27

మ. అమరజ్యేష్ఠుఁడ సత్యలోకము మదీయం బైన ధామంబు నా
మము నన్ బ్రహ్మ యటండ్రు సెల్లెడల నస్మత్కృత్య మెన్నంగ స్వ

ర్గము భర్గుం గొనియాడఁగా నిటకు వేడ్క న్వచ్చితి న్నావృద్ధుఁడా
ఘుము నిం కొక్కటి వేఱె నే నడిగెదన్ నిక్కంబుగాఁ దెల్పుమా.

క. ఏమేమి చదువుకొంటివి, తామరసభవా! యటన్నఁ దనమది వాణీ
కాముని ననుఁ జదువడుగఁగ, నేమిటికని తలఁచి నగుచు నిట్లని పలికెన్.

క. వేదములు నాముఖంబునఁ, బాదుకొన న్విద్యలడుగఁ బనియున్న దియే
నేఁ దెలియని యది యెయ్యది, లేదు తలఁప నాకు సాటి లేరు జగములన్.

వ. అనిన దరహసితాననుం డై కుమారుండు. 31

తే. సకలవిద్యలలో పలసారమైన, విద్య యొక్కటి వినుటకు వేడ్క యయ్యెఁ
గాన నను జిన్నవాఁ డని గడుపకిప్పుడు, పన్యసింపు మటన్న నప్పద్మభవుఁడు.

క. వేదముల కాదియగుబు, గ్వేదముఁ బఠియింపు మొదల విస్పష్టముగా
నాదానుస్వారసువర్ణోదారం బైన ప్రణవ మొప్పఁ బలుకనన్. 33

చ. విని తలయూఁచి చాలు నరవింహజ! యీ ప్రణవార్థ మెట్టిదో
కినియక తెల్పి నాహృదయకీలితసంశయ మెల్లఁ బాపుమా
యనిన నజుండు లేఁతనగ వాననసీమః దలిర్ప నంబికా
తనయునితోడ గర్వ మెసఁ దార్కొన నిట్లని పల్కె నత్తఱిన్. 34

ఆ. మాటలేల ప్రణవమంత్రంబు నేన తత్, వర్థ మేన యనిన నగ్నిభవుఁడు
నమలఁ గెంపుగదురఁ గండచపేటికా, పూర్వకముగ నతనిఁ గర్వమణఁచి.

సీ. అంతటఁ గినుక చల్లారక కారాగృ
హాధ్యక్షుఁ డతిరోషితాక్షుఁ డైన
వీరబాహుని బిల్చి విమలప్రణవమంత్ర
మంత్రార్థములు చంద్రమౌళి యగుట
నెఱిఁగి యుండియు జ్ఞానహీనుఁ డై నే నని
పలికెఁ గావున వీనిఁ బట్టి కట్టి
స్కందశైలంబున బంది నుంచు మటన్న
నాతఁడు పరమేష్ఠి నట్ల చేసె

ఆ. లోకసృష్టి పిదప లోపంబు గానీక
స్కందుఁ డెప్ప టట్ల జరుపుచుండె
నంత సురలు మునులు నంబుజాసనునకై
చింత నొంది సాంబశివు గుఱించి. 35



చ. ఘనతర మైననిష్ఠఁ జిరకాలతపం బొనరించి పార్వతీ
వనజముఖీసమేతుఁడయి పత్స్యలతం బొడసూపినట్టి భ
ర్గుని విమలాంఘ్రియుగ్మమునకుం బ్రణమిల్లి యనేకభంగులన్
వినుతియొనర్చి వాంఛితము వేఁడుఁ దటన్న మహోత్సాహోదుతన్.

క. శరజన్మునికోపంబున
సరసీజాసనున కైన సంకట మెల్లం
గరుణ జనింపఁగఁ బలికి ఖ
చరమునిసంఘంబు మఱియు సవినయ మొప్పన్. 38

క. దేవాదిదేవ! విను మీ
సేవకుఁ డగుబ్రహ్మకైనచిక్కఁడలుట యే
మావాంఛిత మని పలికిన
భావజసంహారుఁడు మిగులఁ బ్రముదితుఁ డగుచున్. 39

క. పరమేష్ఠి న్విడిపించెద, నరుగుఁడు మీమందిరంబులకు వడి నందీ
శ్వరుఁగనుఁగొనిపిలిపిప్పుడు, పరగునమత్సుతునికడకుఁజనియాతనితోన్.

శా. స్వాతంత్ర్యంబు వహించి గర్వ మెసఁ బర్వం బల్కు నీరేజసం
జాతుం బందిని బెట్టి శీతలనుభృజ్జాసూనుఁ డంచుం సురల్
నాతోఁ గూయిడి రట్లు గావున దయాలంబుండవై యాతనిన్
నీతాజ్ఞాలయుఁ జేసి పుచ్చు మిపుడే విశ్వంబు నిర్మింపఁగన్. 41

మ. అని నావాక్యము గాఁగఁ బల్కి విగతాహంకారుఁ గావించి జీ
వనజాతోద్భవుఁ డాఁక వీడి సుఖియై వార్త ల్వడిం దెమ్ము పొ
మ్మని పంపం జని నందికేశ్వరుఁడు స్కందాద్రిం సఖుల్ దాను దా
రొక్కని క్రీడించుచునున్నషణ్ముఖు హతాఘుం గాంచి మోదంబునన్.

క. నిటలతటఘటితకరసంపుటుఁడై యిటుపల్కెనతఁడుస్ఫుటవాక్యములం
జటివినతుఁడైన దిక్పటుఁ, డిట కనిచిన వచ్చినాఁడ నినసంఖ్యాక్షా.

క. వనజాసను చెఱ మానుపు
మని యనిమిషమునులు వేఁడ ననలాక్షుఁడు దా
విని యిటు లొనరింపుదుఁ గా
కని యెం. గావునఁ బదాజ్ఞ యాతఁడల నిడుమా. 44

చ. అన విని యీశ్వరాజ్ఞ దలయందు ధరించితిఁ గాని దుర్మదం

బునఁ దను దా నెఱుంగక ప్రపూర్ణమహత్త్వ మనుస్వరూప మే
నని పచియించినట్టి నలినాసను ముక్కు చెఱఁ బెట్టి యూరకే
చను మని యుత్తటి న్విడచి చక్కఁగఁ బంపఁగ నంత వెట్టినే. 45

తే. నలినసంభవు విడు మంచు నందికేశ
నీవు వచ్చితి గావున నే సహించ
నయ్య నిఁక నొండుపలుకకు మరుగు మనిన
నాతఁ డరుదెంచి శివునకు గారితి దెలుప. 46

చ. విని సరసహాసవక్త్రుఁ డయి విశ్వగురుండు గిరీంద్రనందనం
గనుఁగొని వింటె నీతనయు గాళకు మచ్చుట కింక వేగ నేఁ
జనక విధాతృమోక్షణము సల్పఁడు వాఁ డని తెల్పి యప్పుఁడా
య్యనఁ గడుప్రేమ మీఱ సతి నంతిపురంబున కన్చి చెచ్చెరన్. 47

క. పారిషదామరముని పరి, వారుండును దివ్యవృషభవాహుం డై సీ
హారకిరణార్ధధారి కుమారగిరీంద్రమున కరిగె మది ముదమొదవన్.

చ. అటు చని కాంచె శంకరుఁ డహార్యసుతాసుతపుత్త్రు సన్మణీ
కటకకిరీటకుండలవికాసితశోభనగాత్రు సృష్టిసం
ఘటనవిలాససమ్ముదితకాంచనశైలనివాసగోత్రుని
స్ఫుటనుతిపాత్రు దీప్తిపరిభూతసహస్రపయోజమిత్రునిన్. 49

మ. కని డాయం జనునంతలోపలన తత్కాలించోర్వీభృద్ధ్వేది ది
గ్గన సర్గం బటు సిల్పి లేచి వృషకాట్కాండాగతీర్ణుండు సం
జనితామోదియు నైన తండ్రికి నమస్కారంబు గావించి ని
ల్చిన పట్టిం గని కౌఁగిలించి యెదలోఁ జెన్నొందుమోదంబునన్. 50

తే. అంత గిరిధన్వి పరిచారికాళి సత్వ
రముగ నుంచిన సింహాసనమునఁ గూరు
చుండి సుతు నంకతలమున నుంచుకొని శి
రంబు మూర్కొని బుజ్జిమొగంబు దువ్వి. 51

మ. తనయా యాటలు మాని వేతె పనిమీఁద న్నిల్చుచందంబు దోఁ
చె న దేకార్యము? దెల్పుమా! యనిన నే సృష్టిక్రియారూఢవ
ర్తనచే నుంటి నటన్నఁ బద్మజునిఁ గాదా మ్మున్ను తత్సృష్టి సే
య నియోగించినవార మిప్పు డిటు సేయం గారణం బేమొకో! 52

వ. అనిన నతం డిట్లనియె. 53

క. తను నెకరి నెఱుఁగ కాడిన, వనజాసనుఁ బట్టి బంధివైచితి వన నా
తనిమాటలే మొసిపెప,న్వనియెదఁగా కిపుడువాని విడువుము పుత్రా!

చ. అనవుడు నేమియుం బలుక కాతఁడు మోమువర వాంచియున్నఁ గ
న్గొని శివుఁ డబ్జజన్ముపయి నూల్కొనుకోపము నాదువాక్యముల్
మనమున లక్ష్యమాకతన మా అనఁ జాలక మిన్నకుండె నీ
తని నడలించి చెప్పక విధాతఁ జెఱ న్విడఁడంచు నత్తఱిన్. 55

ఉ. నేరుపునేరముల్ పిదప నిర్ణయమయ్యెడుఁ గాని యిప్పుడా
నీరజసంభవుల్ విడుము నీమదిఁ గోపము గూడ దంచు నే
గారవ మొప్ప నెల్ల వినఁ గానవు తండ్రి యనుజ్ఞ మీఱి సం
చారక మొనర్పు కుచ్చితుల సాటికి రా మది నెంచినాఁడవో? 56

తే. అనిన గిరిజేశుభాషణంబుఁ గనుల కెంపు
కామముడియుఁ గాంచి పార్వతీపుత్రుఁడాత్మ
జంకి వినయంబుతో లేచి చాఁగి మ్రొక్కి
వీరబాహుని గను నంత వేగ యతఁడు. 57

క. జంభారిముఖులుచూడఁగ,నంభోరుహభవునిఁ దెచ్చిహరుప్రోలనిడం
గుంభినిజాఁగిలఁబడివా,గ్జృంభణమొప్పంగనతఁడుగీల్కొనుభక్తిన్.

దకారగుణితము.—

చ. దరసమ దేవదానవవిదారణ దిక్పట దీనపోషకా
దురితతమస్సహస్రకర దూషకసంహార దేవదేవ దై
న్యరహిత దోర్బలాంతకవినాశన దౌత్యభృదాది తేయ దం
భరసవిశోషణప్రథితపావక దర్పకదర్పభంజనా. 59

చ. అని వినుతించు నాతని ప్రియంబునఁ గన్గొని శూలపాణి యి
ట్లను శిఖిసాది వీ వనుచు నాటతమిం దెలియంగలేక వం
చన మొనరించె నందుకు విచారముఁ జెందకు మెప్పటట్లుల
జని సుఖవృత్తి నొందు మని సారసగర్భుని వీడుకొల్పినన్. 60

క. మదిముదమందుచు నాతఁడు, మదనారికిఁ దత్కుమారమణికి వినతుఁడై
కదలిచని తొంటిగతి నిజ,సదనంబున భువనసృష్టి జరుపుచునుండెన్.

కం. తదనంతరమున నిచ్చటఁ
బొదలెడు మోహమున మగుడఁ బుత్త్రుని దనచే
రెదఁ జేర్చి యంకతలమునఁ
గదియించి లతాంతకాండఘస్మరుఁ డనియెన్. 62

శా. ఏరా చిన్నకుమార నీరజభవుం డేనేరముల్ సేసెరా!
సారోదారుఁడు వజ్రిముఖ్యసుమనస్సంసేవ్యుఁ డా నాతనిం
ఘోరంబా చెఱ నుంచ నీకుఁ దగునా! కోపించి నీ వట్లనన్
ధీరత్వంబున బాహులేయుఁడును దండ్రిం గాంచి కేల్మోడ్చుచున్.

సీ. అన్న విధాత మి మ్మర్చింప వచ్చెడువేళఁ గ్రమ్మఱిపోవు వేళనైన
నన్నుఁ దక్ష్యముసేయ కున్న నాతనిఁ బిల్చి యెవ్వఁడ? వీవిట కేల వచ్చి?
తనఁ దనపేరును దలముసుద్యోగంబు ఘనతయుఁ దచ్చినపనియు విద్యఁ
దెంపునఁ జెప్పనపిదప నే బ్రణవార్థ మెఱుఁగ వేఁడఁగ నాతఁ డెదురుదన్ను

తే. నరయక యపార్థముగఁ బ్రణవాఖ్యమంత్ర
మును దదర్థంబు నే నని పెనుమదంబు
తొలుకఁ బలికిన తులపయకా నలువ బండ
నిడితి నదలితి మీ రిష్ట విడువు మనిన. 64

చ. అనవుడు పిన్ననవ్వు నగి యబ్జధరుండు కుమార ధాత పం
చన మొనరించినాఁడ వదిసమ్మతమే? యిఁక నీవు చెప్పుమా
యనితరసాధ్యమైన ప్రణవార్థము తేట పడంగ నావుడున్
జనకునితోడ ని ట్లనియె శైలసుతాతనయుండు నమ్రుఁడై. 65

క. సర్వజ్ఞుల రగుమీకున్, సర్వేశ్వర యొకటిఁ దెలుపఁ జాలుదునే? త
ద్దుర్వ్యధిపకథితమంత్రం, బుర్విని శిష్యుండు దెలుప నోపునె యెందున్.

తే. అయిన నాయందుఁ గలుగుదయాసమృద్ధి
కతన మన్ముఖమున వినఁ గాంక్ష చేసి
నారు గావున మీపాదనలినబలము
చేత విన్నప మొనరింతుఁ జిత్తగింపు. 67

ఉ. నావుడు శంకరుండు నిజనందను వాక్యము లాలకించి తా
భావమునందు సంతసము పర్వ రహస్యముగాఁగ విందు సౌ
ఖ్యావహమంత్రరాజ మని యాతనికై చెవి యొగ్గి సంశయా

భావముగాఁగఁ జెప్పెఁ బ్రణవప్రకటార్థ మతండు ధీరుఁ డై. 68

ఉ. ఆగతిఁ జెప్పిన న్ననుపహాస్యముఁ వీనులవిందు గాఁగ ది
వ్యాగశరాసనుండు విని యద్భుతమోహనయానుమోదసం
యోగమనస్కుఁ డై నిజసుతో త్తము నెంతయు గారవించి యా
గా గుణాధుర్య చెప్పితి పరాత్పరమంత్రము తేటతెల్లఁగన్. 69

ఉ. నీకును మాకు భేదము గణింపఁగ లే దణుమాత్రమైన భూ
లోకమునందు భక్తి కడు లోపముఁ జెందిన నట్లు గాన మ
ర్త్యాకృతిఁ బుట్టి నా నగు మహత్త్వము బోధ మొనర్చి మానవా
నీకములఁ భవాబ్ధి కరిఁ జేర్పుము నీ పగు నే ర్పెలర్పఁగన్. 70

తే. ఏతదర్థంబు మును నంది కేశ్వరుని ధ, రాతలంబున కనిచితి నాతనికిన
హేమాంబరిపత్ని మైభక్తినొప్పనాగ, మాంబి కాదేవితనయుఁడవై జనించి.

చ. అసమ్మశనంది కేశ్వరుని యంశమునం జనియించి వించు త
ద్వసవనితోడ సంతతశుభప్రద భక్తి శుభానుభూతిఁ బెం
పెసఁగుచు మర్త్యమానశరణేశ్వరపద్మజనం బొనర్చుచుఁ
వసుమతిఁ గొన్ని వర్షములు వర్తిలు మత్సమదాజ్ఞ వెంబడిన్. 72

వ. అని యి ట్లానతిచ్చిన జనకునివాక్యములు విని కుమారుం డప్పటి నీత
లోద్భవంబున కసమ్మతంబును జనకాజ్ఞోల్లంఘ నానర్హ విచారంబును
మానంబునం జెనఁగొనుటయు నేమియుం బలుకక యశ్రువదనుండై
యూరకున్ననతని భావంబు శంకరుండు దివ్యచిత్తంబున నెఱింగి ధరా
తలంబున భక్తివర్ధనంబొనరింపవలయు ననుతలంపు ప్రేరేప వీఁడంబి
కాసంబోధనంగాని చక్కఁబడఁడని యూహించి పార్వతిందలంచిన
సమస్తజగద్వృత్తాంత వేదినియగు తత్సతీపతంసం బనర్ఘ్యమణిభూష
ణాలంకృతయు నిరుపమవాసనాసమాగతచంచరీకనాదమేదురాఢ్య
తేయమేదినీజలతాంతదామాభిరామయు మందస్మితసుందరవదనా
రవిందయు రాజకీరలీలాసరోజాతహస్తయు దేదీప్యమానకాంచనాం
బరసహితయు నై యనేకనాకలోకైకకోక స్తనీలోకంబుల ధరసమా
నమణిమయంబు లగునాలవట్టంబులు గొందఱు వజ్రమయదండచా
మరంబులుం గొంద ఱతులిత శాతకుంభశుంభద్దండపుండరీకంబులుం
గొందఱు చిత్రవిచిత్రపట్టాంబరకేతనంబులుం గైకొని యురుదేర

విద్యాధరకిన్నరకింపురుషగంధర్వకామినులు సంగీతసాహిత్యవేణువీణాదివినోదంబుల నింపు సంపాదింప యక్షగరుడోరగసిద్ధసాధ్యవిఖ్యాతముఖ్యులు ఖడ్గవేత్రపాదుకాజలకలశవీటికాపేటికాధారిణు లై నడువ దివ్యవిమానం బధిరోహించి స్వకీయమహీధరంబునకు వచ్చి విభావరీశభూషణసభాసికటప్రదేశంబునఁ బద్వాహనావతరణంబు గావించి తనుం గనుంగొని లేచి నమస్కారపూర్వకంబుగా నిటలతటఘటితకరుండగు సునాసీరుం బ్రేమకరుణాకటాక్షేక్షణంబున వీక్షించుచుఁ బ్రాణేశ్వరుఁ డాయం జనుదెంచి ప్రణమిల్లి తదనుమతి నర్ధాసనాసీనయై యుండి చింతాననుం డైన సుతుం గని వీఁ డిట్లు చింతాక్రాంతుండై యున్న కతం బేమని పతి నడిగిన నతండు మందస్మితవదనుండై సతితోడ గతవృత్తాంతం బంతయుం దెలిపి యేతదర్థంబుగా నిన్నుఁ బిలంచితిం గావున నీతని క్షితితలంబున కరుగునట్లు సమ్మతింపఁజేయు మన విని నగతనయ మనంబున నొక్కింత విచారించి తొల్లి భూతలంబున సంభవంబు నొందు నిజవయస్యయగు నాగేంద్రగమనకుఁ గుమారుని గుమారునిఁగా నిచ్చెద నన్న వచనంబున కనురూపంబుగా నీశ్వరుం డానతిచ్చుట కానందంబు నొంది తనయుం డాయఁ దిగిచి తొడలపై నిడుకొని కూఁకటులు పుణుకుచు ని ట్లనియె. 73

అన్న కుమార! మీయయ్య చెప్పినమాట కీవియ్యకోనఁదగు నిలజనించుకతన నీకుఁ గొంత గలుగదు తనకు నీకొక్కింత వేఱులేకునికి నిన్నుఁ బంచెదా జనునట్టిపని కని గాక నే మున్నె పంపఁదలంచి యున్నదానఁ గావున మాయాజ్ఞ గైకొని భూతలంబున కేగి యచ్చట పొనుగుపడిన

భక్తి నుద్ధరించి పరవాదుల నణంచి
యఘము ద్రుంచి దెసల యశము నించి
ప్రాభవించి శర్వభక్తుల రక్షించి
మరలిరమ్ము చింత మాను మనిన. 74

సమ్మతించి గుహుండు జననీజనకపాద
సరసిజాతములకు సాఁగి మ్రొక్కి
మీయనుజ్ఞ నేను మీఱంగ నేర్తునే ?
యట్ల సేయువాఁడ ననుచుఁ బలికె. 75

వ. అట్లు పలికిన కుమారుని వాక్యంబులకుఁ బార్వతీపరమేశ్వరు లానదంబు నొంది యతనిం గౌఁగిలించుకొని శిరమునాఘ్రాణించి ప్రేమ్ము వేగమ్మున మఱలి క్రమ్మని యనేకవిధంబుల గారవించి పారిషదబర్హిర్ముఖ బ్రహ్మదేవర్షి పరివారంబులతో నిజనివాసంబున కరిగి యిష్టవినోదంబులం దేలుచుండి రక్కుమారుం డవనీతలంబునఁ జెన్నబసవేశ్వరుం డన బసవేశ్వరభాగినేయుండై జనియించి యసదృశమహిమావిశేషంబున భక్తివర్ధనం బొనరించెఁ గుంభసంభవా! తద్విధంబు విస్తరంబుగా విను మని రేణుకుండు చెప్పం దొడంగె. 76

## కళ్యాణపురవర్ణనము.

సీ. శ్రీసమంచితరాజశేఖరాగారంబు వరసర్వమంగళావాసభూమి
ప్రాకటవీరభద్రాకరవిభవంబు పటుదంతిముఖబలభాసురంబు
నతులకంభాదికోద్యానవిలాసంబు రమ్యవిద్యాధరభ్రాజితంబు
నగణితపురుషరత్నావళీకలనంబు ప్రబలగంధర్వవిరాజితంబు
తే. నగుచు మారట కైలాస మనుచు సకల
జనము లద్భుతపూరితస్వాంతు లగుచు
వినుతిఁ గావింపఁ దనరెఁ బృథ్వీతలమున
భాగ్యజనకంబు కళ్యాణపట్టణంబు. 77

మ. జ్వలదత్యున్నతసౌధసంఘటితభాస్వద్వజ్రనీలోపలో
జ్జ్వలకాంతిప్రకరంబు నద్దెసలఁ బర్వం బౌరలోకంబు సి
చ్చలు శ్వేతాసితపక్షయామినుల లేశం బైన స్వాంతంబునం
దెలియంజాలక సంశయించు పురివర్ణింపన్ వశంబే! ధరన్. 78

తే. ఆకసం బంటుకొమ్మల నమరి సద్వి
జాధిపాగార మగుచు జంభారివినుతి
పాత్రమై మూలబలముచేఁ బరిఢవిల్లి
సాలము దనర్చుఁ బురిఁ గల్పసాల మనఁగ. 79

తే. రాజమండలసంశక్తిఁ దేజరిల్లి
పుష్కరఖ్యాతిఁ జెలువొంది భువనవినుత
మేఘపదసంగతిఁ దనర్చి మెప్పు గులుకు
కరినికర మొప్పు దివిఁబోలు పురమునందు. 80

చ. జలజసఖాశ్వముల్ గతులు సాటికి రాఁ గని తన్మనోద్ధతిం
దోలఁగఁగఁ జేయ నింగి కయి మీఁగగ నైజఖురోత్థితావనీ
తలరజ మంబరాంబరము దార్కొని క్రమ్మిన వానిచాటునం
బలువిడి భీతిఁ బాఱఁ గని వాని హసించుఁ బురీవరాశ్వముల్. 81

చ. అతులితతత్పురీపథమహాధ్వజసంఘటితాచ్ఛఘంటికా
వితతిజయాభిరావములు విశ్వము నిండినఁ దచ్ఛ్రియార్తి న
చ్యుత జలజాతబాణ పురహారాతరథంబులు గానలందుఁ బ
ర్వతగుహాలం దదీయశిఖరంబులుఁ జేర భయంబు మీఱఁగన్. 82

క. తెలతెలఁబోవుచు నమనీ,డలకులుకుచుబిలములోన డాఁగెడుసింహం
బులుశౌర్యకలనమానరి, వెలయు నెయనిసగుదుగ చటకవీరనృసింహుల్.

ఉ. చేడియనల్ల నించుకఁ బ్రసిద్ధి వహించెను గాని నిల్చి మా
టాడిన నాల్గుదెర్గు ధర నాతనిపౌరుషిమ లెక్కవెట్టఁగాఁ
గూడును యంచుఁ బద్మజునిఁ గొద్దిగ నెంచి వసింతు రప్పురిఁ
బాడబు లుత్తమోర్జితులు భవ్యనిరూఢవచోధురంధరుల్. 84

చ. నిరుపమపద్మినీహితులు నిర్మలమూర్తులు సత్ప్రతానభా
సురతరమోదదాయకులు సుస్థిరమిత్రసమేతు లప్పురీ
వరనిలయాభిరాములయి వర్ధిలు రాజులు రాజు లెక్కసే
యరు తమవిక్రమస్ఫురణ నాతఁడు వర్తిల లేక యుండుటన్. 85

క. బేహారులు మృదుసత్య, వ్యాహారులు కీర్తివిజితహారశైలసమీ
కాహారులు కవిదంతిమ,ణీహారులు గలరు పురి నసంఖ్యవిహారుల్. 86

క. శూద్రులు హాలనిర్జితబల, భద్రులు సద్గుణగణాధిభద్రులు సుఖని
ర్నిద్రులు వితతగభీరస,ముద్రులు గల రచట బుధసమూహాసురద్రుల్.

సీ. ఏవీథిఁ జూచిన నిభదానవాంతకసదనసముత్కరసంభ్రమంబు
లేనంక నరసిన నేణాంకకోటీరపాదపంకేజాతభక్తమహిమ
లేచాయ నాలింప హిమగిరిజాధిపలలితకథాసుధాలాపచయము
లేచక్కి గణియింప హేమధరాధరబాణానుసేవానుభావనంబు

తే. లెచటఁ దలపోయఁ బద్మినీహితమ్ముగాంక
జాతవేదాంబకాభంగశాస్త్రచర్చ

లప్పురీవరమాహాత్మ్య మభినుతింప
నలవియే శేషఫణికైన నజునికయిన. 88

క. ఆపుటభేదన మేలెడు
భూపాలకుఁ డర్థినికరపోషణుఁడు సమ
ద్వ్యాపారచణుఁడు శుభముల
నేపుఁ గనఁ బిజ్జలాఖ్యుఁ డివ్వసుమతిలోన్. 89

ఉ. జైనకులప్రవర్ధనుఁడు శాశ్వతకీర్తియుతుండు నిర్మలా
నూనగుణాభిరాముఁడు ధనుర్గుణటాంకరణారిమండలీ
మానససాధ్వసప్రదుఁడు మన్మథమాధవరూపశాలి నా
నానరనాథసన్నుతసనాథుఁడు తత్క్షితినేత వర్ధిలెన్. 90

క. ఆరాజమంత్రివర్యుం, డై రాజిలు సకలదిగధిపాంబుజవదనా
భూరిస్తనహారాయిత, చారుసమాఖ్యుండు బసవసచివుం డెలమిన్.

సీ. యేధన్యమానసం బిందుశేఖరపాద
తోయసంభూతభృంగాయమాన
మేకృతార్థకృపావలోకనం బర్థిదై
న్యాశుశుక్షణివార్షికాంబువృష్టి
యేపుణ్యచారిత్ర కోపయుగ్బాహ్యభంగ
మఖిలాన్యమతజాతహరణమూల
మేమంత్రమాహాత్మ్య మింద్రాబ్జభవముఖ
బృందారకానీకవినుతిపాత్ర

తే. మతఁడు గొనియాడఁ దగు మిహికాచలేంద్ర
సంఘనావల్లభనియోగసకలమర్త్య
పానార్థమాదాఖ్యసత్పత్ని మాద
మాంబికాగర్భజుఁడు బసవార్యవరుఁడు. 92

సీ. సతతంబుగురులింగచరసమర్చలెకాని యితరార్చనంబుల నేవగించు
జంగమతీర్థప్రసాదసేవయెకాని యితరంబు రుచిగొన నేవగించు
మాహేశ్వరవ్రాతమాహాత్మ్యమేకానియితరంబువినుటకు నేవగించు
సతతగణాధీశసద్విలాసమెకాని యితరంబు గనుఁగొన నేవగించు

తే. నెంతసజ్జనుఁ డీధన్యుఁ డెంతధీరుఁ
డెంతమహిమాఢ్యుఁ డని జను లెన్నుకొనఁగ
రాజ్యభారంబు శివభక్తి రాజ్యభార
మెలమిఁ బాలించె శ్రీబసవేశ్వరుండు. 93

తే. అనుదినము లక్షతొంబదియాఱువేల
జంగమంబుల కిష్టాన్నసమితి యొసఁగి
మిండజంగములకుఁ బంద్రెండువేల
కనుచు వేశ్యాగృహంబున కట్టిపగిది. 94

క. అచలితతత్త్వైంకర్య, ప్రచురశ్రవణానుమోదభరసకలదిశా
నిచయసమాగతశరణుల, ఖచరజ్యేష్ఠునకు వశమె గణుతింపంగన్.

సీ. సుజ్ఞానశీలురు సూనృతవాక్యులు త్రిభువనపూజ్యులు ధీరమతులు
వేదాంతవేదులు వీరశైవాచారసంగ్రహకర్తలు శాంతిసహితు
లష్టవిధాంగయోగానందపరవశు లసదృశలింగలీనాత్మవర్గు
లంతకదూరు లత్యంతక కరుణాసముద్రులు నిరుపమభద్రగుణులు

తే. సత్ప్రసాదాంగు లకుటిలస్వాంతరంగు
లతులభవదూరు లన్యదుర్మతవిదూరు
లచలదాసోహమతులు భక్తాధిపతులు
శర్వపదపద్మభృంగముల్ జంగమములు. 96

క. పరవికచాబ్జేక్షణ సో
దరి ముక్తి సతీలలామ దారకశుకు బం
గరువెంచు రణము గరళము
కరుణయ పూన్కిగ నటంచు గణసింహంబుల్. 97

తే. నిండి కళ్యాణపురము పంద్రెండుయోజ
నముల నెల్లెడ నెడలేక నమితు లగుచుఁ
గాలకంధరువరభద్రగజము లనఁగ
నతిముదంబున వసియించి రంచితముగ. 98

చ. వినయవివేకభక్తిగుణవిశ్రుతుఁ డాబసవేశ్వరుండు చూ
ననయము తద్గణాధిపుల కందఱి కీప్సిత వస్తుజాత మిం

పొనరఁగ నిచ్చుచున్ భ్రమద మొంది సుధామయతత్ప్రసాదమున్
వననిధిఁ దేలుచున్ మహిమ వర్ధిలఁజేయుచు నున్నయత్తఱిన్. 99

కక్కయ్యగారి కథ.

శా. దృక్కర్ణేశకలాపమూర్తి సువధాత్రీజప్రభాకీర్తియు
గ్ధిక్కాలప్రకరుండు కామముఖవిద్విట్సంహారుం డాశ్రిత
ప్రాక్కర్మాంబుధిబాడబానలుఁడు భాస్వత్తేజుఁ డాపోలిలోఁ
గక్కాఖ్యుం డొకభక్తసత్తముఁడు శ్లాఘ్యఖ్యాతి వర్తిల్లఁగన్. 100

తే. బసవదండాధినాథుండు భక్తితోడఁ
దద్గణాధిపవరు ప్రసాదంబుఁ గొనఁగఁ
దలఁచి పండ్రెండువత్సరంబులు మహాప్ర
యత్న మొనరించి యంతట నబ్బకున్న. 101

మ. కమనీయామలతత్త్వయుక్తుఁ డగునాకక్కయ్యదివ్యప్రసా
దము నేఁ గాంచఁగ నేరనైతి నకటా! తద్భాగ్య మేతీరునన్
సమకూరున్ నను బోలువాని కనుచున్ స్వాంతంబులో నెంచి యు
త్తమమై యొప్పు తదీయమందిరము చెంతం జేరి యచ్చోటునన్.

ఉ. అంగణసీమ నల్గడల నంతట నింతట నిల్చి కాంచుచున్
ముంగల నొక్కచీమ కొనముక్కున నొక్కకణంబు పట్టి యే
గం గని జ్ఞాని గ న నిది కక్కయగారిమహాప్రసాద మె
బ్బంగి నసంశయం బనుచు భావమునందుఁ దలంచి వేడుకన్. 103

చ. భవములఁ బాసితి న్నిగుల భాగ్యముఁ జెందితిఁ గోరుకోర్కి చేఁ
దవిలె సమస్తసద్గుణవితానములోపల వన్నె గాంచితిన్
భువనసుతాభిరామగుణపూజ్యుఁడు కక్కయసత్ప్రసాద మీ
భువిఁ గనుఁగొంటి మంటి నతిపుణ్యచరిత్రుఁడ నైతి రూఢిగన్. 104

క అనయముగురుసంగయదేవునిగొలిచినయట్టిఫలము పొందుగ గణప
ద్వనజములుపూజగావించిన ఫలమునుదోడుతోడఁ జేకూరెబలే.

తే. అనుచు ముద మంది యప్పు డయ్యనఘమూర్తి
చీమనోటిప్రసాదంబు చేకొనంగ
నొకయుపాయంబు గని యట నున్న యిసుక
జగతిపై ముష్టిమాత్రంబు చల్లుటయును. 106

క. అక్కజముగ నవ్వాలుక, చక్కెరపాడియైనఁ దత్ప్రసాదకణంబుల్
లెక్కగొన కప్పిపీలిక, యక్కడ నిడి పంచదారకై యరుగుటయున్.
క. ఆనంద మంది బసవఁడు, దా నాకణ మాత్మహస్తతలమున నిడి ఙల్
దీనునకు నిధియు వాడిన, చేనికి వర్షంబుపగిదిఁ జేకుఱె నాకున్.108
ఆ. ఈమహాప్రసాద మిష్టలింగార్చన
చేసికాని కొనఁగఁ జెల్ల దనుచుఁ
బోలుపుమీఱి తనదుతలఁపాఁగకొంగున
విడకయుండ ముడియవేసి యంత, 109
వ. భక్తాగ్రగణ్యుం డైనకక్కయ్యగారి యంతర్గృహంబునకుం జని ప్రసాదోపభోగానంతరంబున సుఖగోష్ఠి నున్న యతనిం గాంచి వినయభక్తిప్రమోదంబులు ముప్పిరిగొనఁగ సాష్టాంగవందనం బాచరించి కరంబులు మొగిచి దేవా! బహుకాలంబుననుండి కాంక్షించుచున్న నాకు మద్భాగ్యంబు పిపీలికారూపం బై భగవత్ప్రసాదంబు గొనితెచ్చి యిచ్చె నేటికిఁ గృతార్థుండ నైతి ననిన నప్పరమపురుషుండు విస్మయం బంది గురుకటాక్షలబ్ధు లగువారి కెయ్యది యసాధ్యం బని తలంచి యతనితో ని ట్లనియె. 110
చ. అనవరతాఖిలాంచితనిశాధిపభూషణసుప్రసాదభా
జనరసనాంచలుం డనఁగఁ జాలిన నీకు మదీయకర్త యై
జననుతి గాంచు చెన్న యప్రసాదము సంభవమౌట! చోద్యమే
నను నొకపెద్దసేయుటకు న్యాయమె నీకు వివేకభూషణా! 111
చ. అని సరసంబుగాఁ బలికి యంపిన బండరితత్ప్రసాదముం
గొనుతమి నాత్మగేహమునకుం జనుచో నెదు రేగుదెంచి పా
వనసుగుణాభిరామ శివభక్తిలలామ దయాబ్ధిసీమ యా
ననఁ దగు నక్కనాగమ సమంచితసంభ్రమ మొప్ప ని ట్లనున్ 112
ఆ. ఎచట కేగి తయ్య యిష్టలింగార్చన
సమయ మయ్యె వేగ స్నానవిధులు
సలుపు మనినఁ దనదు తలపాఁగ యొక్కచో
నునిచి తడుపు గట్టుకొని రయమున. 113
క. జలకం బాడఁగ నేగిన, నలినీదళనేత్ర యక్క నాగాంబిక యా

తలపాగకొంగుముడిఁగని, దలమగు సంశయము తన యెదం జనియింపన్.

క. నాముద్దుతమ్ముఁ డెన్నం, డేమియుఁ దామూటఁగట్టి నెఱుఁగఁ డిదేమో
యీముడుపుఁ జూడవలెనని, ప్రామినకుతుకమున ముల్లెవదలిచి కాంచెన్.

ఉ. కాంచి గణప్రసాద మగుఁ గా యని సంతస మంది పుల్లనే
త్రాంచలమోదబాష్పయుత యై బసవండు గణాలయంబులన్
సంచితభక్తి వారలప్రసాదము గోరికదీఱ మెక్కి యొ
క్కించుక దెచ్చె నా కొసఁగ నెంతయుఁ గూరిమి గల్గుఁ గావునన్.

ఆ. ఈప్రసాదమహిమ యెంచి వర్ణింపఁగ
నలవి యగునె తమ్మిమొలక కైనఁ
గలుషవిరులతేనిఁ దలమానికము గాఁగఁ
దాల్చినట్టి దొకనిఁ దప్ప జగతి. 117

సీ. ప్రబలారివర్గద్విపప్రతాపంబున కంకుశం బగు నిమ్మహాప్రసాద
మతులితదుర్విషయావనీధరముల కశనిరూపం బిమ్మహాప్రసాద
మత్యుగ్రతాపత్రయాంభోదములకుఁ జంఝానిలం బగు నిమ్మహాప్రసాద
మచలితమాయాబలాటవీస్థలమున కనలతేజం బిమ్మహాప్రసాద

తే. మఖిలవేదాంతవేద్యమహాహరునిభక్తి
కాస్పదం బయి తగు నిమ్మహాప్రసాద
మలఘుతరనాదబిందుకళాత్మకంబు
తలఁపఁగా నిమ్మహాప్రసాదంబు జగతి. 118

క. అని కొనియాడుచు మోదం, బునఁ దద్దివ్యప్రసాదమున కతులితవం
దనము లొనరించి వేగం, బున లింగార్పితముఁ జేసి భుజియించెనటన్.

తే. బసవదండేశుఁ డామోదకుసుమవారి
స్నాన మొనరించి ధౌతవస్త్రములు దాల్చి
లీలఁ జెన్నొందు లింగార్చనాలయంబుఁ
జేరి చిత్రాసనమున నాసీనుఁ డగుచు. 120

తే. భూతి రుద్రాక్షమాలికల్ పొసఁగఁ దాల్చి
కరతలంబున నిష్టలింగంబుఁ బూని
సద్గురుఁ దలంచి తనయగ్రజాతఁ బిలిచి
నిరుపమానందభరితహృత్సరసుఁ డగుచు. 121

క. అక్కా! పాగాకొంగున
కక్కయ్యమహాప్రసాదము మున్నిది నే
మక్కున మెక్కఁగనలయును
జక్కఁగ కొని తెమ్మటన్న సతి యిటు పలికెన్. 122

క. పాగాకొంగునఁ బ్రసాద, మేఁ గని నా కొఱకు తెచ్చి తీఁగని కడకం
బేగ భుజించితి నన విని,తా గుండెగుభిల్లు మనఁగఁ దలపోసెమఁదిన్.

ఉ. అకటా! నా కిపు డేల గల్గు? నిజచిత్తాంభోజపీఠస్థితాం
తకసంహారసదావిలీనరణోచ్యత్కృత్యకక్కాఖ్యభ
క్తకలాపప్రథితప్రసాదకసుధాకల్లోలినీసౌఖ్య మిాఁ
గను సౌరభ్యము చేకుఱం గలదె లోకంబందు వీక్షింపఁగన్. 124

సీ. కారణజన్ముఁడౌ కక్కయ్యసత్ప్రసాదము గొన నెమ్మదిఁ దలఁప నేల?
తలఁచి పండ్రెండువత్సరములుపొంచ నాతోంటిపుణ్యంబునదొరక నేల?
దొరికిన నచట సంతోషినై మెక్కక తలపాగకొంగున దాఁచ నేల?
దాఁచిన నాగాంబ తత్ప్రసాదముఁ గని తోడరి నన్నడుగక కుడువ

తే. కుడువ నేర్పరి మాయక్క కుమతి నేను [నేఁ
డేల నైనట్టి నాకోఁటి కేల గల్గు!
సంగమేశ్వరుకరుణ యీచాయ నుండె
నెంత చింత యొనర్చిన నేమి గలదు!. 125

క. నేమరు నిటు వలపోసిన, పామరునకు ముక్తిగలదె పామాడినచో
కామితభోగులు చేకొనె,నీమహిలోన నెడుమాట యేనిజమయ్యెన్.

క. అని యిట్లు నాగమాంబా, వనజాతాస్యప్రకృష్టభాగ్యంబునకుం
దన యెఱుక లేమి కెంతయు,మనమునఁదర్కించుచుండె నామాటికినంతన్.

ఉ. భోగివిభూషణాజ్ఞ మెయి భూమికి వచ్చు మయూరవాహనుం
డాగమవేద్యసర్వమహిమాకరకక్కయసత్ప్రసాద నే
వామహిమంబున న్మిగులఁ బావనమై కనుపట్టె నిప్పు డీ
నాగమగర్భసీమ యిఁక నాదుమనోరథసిద్ధి గాంచితిన్. 128

క. ఈసుదతీమణికడుపున, భాసురముగఁ బుట్టి కీర్తిఁ బ్రబలెద నని యు
ల్లాసమునఁ గార్తికేయుం, డాసతి గర్భప్రవేశమై చెలువొందెన్,

క. జలజాయతాక్షిగర్భ
స్థలమందుఁ గుమారమూర్తి తగ నిల్చినచోఁ
బలమగుచు గర్భచిహ్నం
బులు గానఁగ నయ్యె జనులు ముక్కుమ్ముడువఁగన్. 130

మ. ఇది యేమో విపరీత మంచుఁ దనుఁ దా నేవంబునుం జెందు మఱి
మఱలోఁ సిగ్గున నెవ్వరిం గనక యానాగాంబ యున్నంత నా
సుచరిత్ర ముచోప్పు గాంచి బసవేశుం డెంతయుం జింతచేఁ
జెదరం బాఱెఁడు చిత్తమందుఁ దలపోసెన్ బెక్కుచందంబులన్.

క. అవివాహ పుణ్యచారిణి, ప్రవిమలసద్భక్తియుక్తభావంబుజ యీ
ధవళాక్షి యిట్టిసింపం, బవులఁ దలసెన్ విధాతతల పేమందున్.

క. కలలోన నైనపురుషుని, దెలియం జూడనికళావతీతిలకము తె
క్కలిగర్భముదాల్చెనె యని,నలుగురువినినింద చేసి నవ్వఁగవలసెన్.

క. ఏమని యూఱడియుండుదు,నీమహిఁజనులాడుకొనెడుహీనోక్తులు నే
నేమని చెప్పలం జొనుపుదు, నామది నరిలేనిచింత నాటఁగనలసెన్.

ఆ. లోకనిందఁ బాపి నాకు సద్గతిఁ జూపి
యనయు మిట్టితఱి మహానుభావ!
నీవె దిక్కుసుమ్ము దేవ! సంగయదేవ!
యనుచు గురునిఁ దలఁచునవసరమున. 135

సీ. బాగైనతగటంచు పాగలోఁ జెక్కిన
కమ్మపువ్వులబంతి యెమ్మె గులుక
నిమిరాఱఁ బైఁ జల్లెవాటుగా వైచిన
జిలుగురెంటెపుడాలు చెలువు మెఱయ
డాకాఁ దవిలించు డంబైనరతనాల
కడియంబు రవలచే ఘల్లు రనఁగ
మేయినిండ నలఁదిన మెఱుఁగు గంధపుఁదావి
మించి నల్దిక్కులు ముంచికొనఁగఁ

తే. గేల నందంబు గలబొంగెకోల దనర
నుదుట యెఱుపైనబూది సంపదలు నింప

వెడఁదయుగమున లింగంపు వేటు గనర
సంగమేశ్వరుఁ డోకమింటజంగ మగుచు. 136

తే. నెదుట నిల్చినఁ గని బసవేశ్వరుండు
జంగమాంఘ్రిద్వయమునకుఁ జాఁగి మ్రొక్కి
వేదసూక్తుల నెంతయు వినుతిఁ జేసి
సముచితాసనమున నుంచి సంభ్రమమున. 137

తే. అర్ఘ్యపాద్యాదు లిచ్చి యయ్యనఘమూర్తి
పార్శ్వతలమున నంజలిఁ బట్టి భయము
భక్తియును నాత్మలోపలఁ బాదుకొనఁగ
వినయమున నున్న శిష్యుని( గని గురుండు. 138

తే. బసవ! నీపేరు వెలవెలఁబాఱె యున్న
దేమి కత మని యడుగ నోస్వామి! యొకటి
విన్నవించెదఁ దోఁబుట్టువెలఁదికతన
యొక్కబలునింద సంభవ మొందె ననిన. 139

క. చింతలను నింద్యకై యా, వంతయు నీమనసుతోన యంగన యితర
భ్రాంతివహించు నెగర్భో, దంతమునకు వేఱె యొకకతముగలదనఘా.

తే. అంబ పులిననితంబ దయావలంబ
వృజినగిరిశంబ ముఖవిజితేందుబింబ
చికురపరిభూతరోలంబ శ్రీవిడంబ
డంబుగా నొకనాఁడు ముదంబుతోడ. 141

ఉ. రాజతశైలకూటనవరత్నమయాంచితసౌధమధ్యవి
భ్రాజితరత్నపీఠమున వాణిశచీప్రముఖాదితేయనీ
రేజవిలోచనల్ గొలువ శ్రీ దళుకొత్తఁగ నున్నవేళఁ దే
జోజితకోటిసూర్యుఁ డగుచున్ శరజన్ముఁడు వచ్చెఁ జెచ్చెరన్. 142

ఆ. వచ్చి సుతునిఁ జూచి వాంచి కేల్గవ సాఁచి
నాథనంబుకుప్ప నాదుహంస
నన్నుఁ గన్నతండ్రి నాపట్టి నాచిల్క
రార యన్న యనుచు గారవమున. 143

శా. తా ముద్దాడుచుఁ గౌఁగిలించుకొని మూర్ధఘ్రాణముం జేసి బ
ల్యావ్యామోహంబున నంకమం దిడి తదీయాలాపముల్ ప్రేమచే
నెమేమీ యని మాటిమాటి కరుదై యింపొంద నగ్గింపుచుం
గామారిప్రియభామ తోష మొనవంగా నన్నచో నత్తఱిన్. 144

క. నాగేంద్రగమన యన మిహి
కాగతనూభవకుఁ బ్రియవయస్య యపుడు త
ద్రాగంబుఁ గాంచి యొకసఖి
తోఁ గేల్గొను మందబుద్ధి దోఁపఁగఁ బలికెన్. 145

చ. అరయఁగ నాత్మగర్భజాని యట్టుల నీశరజన్ము వేడ్కఁ మీఁ
దరయక గాంచువారు తను నాలము సేయుదు రంచు నెన్న వే
గిరికరజాతముద్దు దిలకింపఁగ లాలన మాచరించె నో
కరివరయాన! యీమె యెడఁ గాంచితి మెందున లేనిచోద్యమున్.

క. అని సెలవిఁ బొఱనవ్విన, వనితం దిలకించి కోపవహ్నికణంబుల్
కనుగొనలఁ జాఱఁగా ని, ట్లనియెఁ మిహికాధరాధరాత్మజ పెలుచన్.

ఉ. దైవతసంచయాధిప సుధాకరశేఖర వీర్యజన్ముఁ డా
నావరపుత్త్రుఁ గన్గొని మనంబున నోర్వఁజాల కిట్లు పా
పావహవాక్యముల్ సుదతి యాడఁగఁ గూడునె మేలుమేలు నీ
భావము గాన నయ్యె నికఁ బల్కులు నేయును నేల మాటికిన్.

క. ప్రేరితనముఁన నిటు నిం, దారోపము లాడి నవ్వి తిటు గావున న
బ్భూలోకంబున నిందల, కాలయమై జననమందు మంబుజవదనా.

మ. అని యీతీరున శాప మిచ్చిన నవశ్యాయాద్రిజానవ్యాప
ద్వనజాతంబులపై నొరంగి మసిలో దైన్యంబు రెట్టింపఁగా
ననిమె న్నాగణయాన తల్లి యిటు నాయం దొక్కయో గ్గించఁగాఁ
జనునే? నవ్వుచు నాడినట్టిపలుకుల్ సత్యంబుగాఁ గొందురే!. 150

ఉ. దాపుననుండనీక వసుధాస్థలి సంభవమందు మంచు బల్
శాప మొసంగ నీ కగునె? జన్మము నొంచఁగఁ జాలఁ దత్క్రియం
బాపఁగదే యటంచు బహుభంగుల వేఁడిన గౌరి నెమ్మదిం
గోప మొకింత డిందుపడఁ గోమలి కిట్లనియెఁ బ్రియంబునన్.

సీ. తరుణి నాశాపంబు దప్పదు గావున
ధరణీతలమున నుద్భవము నొంది
పరిణయరహిత వై భక్తభుక్త్యవశేష
మాహాత్మ్యమున గర్భ మమరఁ దాల్చి
ప్రజ లెల్ల నింపింపఁ బండ్రెండువర్షముల్
భరియించి పుట్టెడుపట్టి వలన
లోకాపవాదంబుఁ బోకార్చి సద్భక్తి
చర్యచేఁ గొన్ని వత్సరము లుండి
తే. మరలి యిటు వమ్ము నాపుడు మగువ మ్రొక్కి
దేవి! నీయాజ్ఞ జనన మొందెదను గాని
యిక్కుమారుఁ గుమారుఁగా ని మ్మటన్న
నట్లయగాఁ గాక యని గౌరి యానతిచ్చె. 152

క. నాగారిగమనయానతి, నాగాంతకవాహుఁడ య్యనందనుఁడనుచున్
నాగేంద్రగమన ముదమున, నాగమయై జగతిపావనంబుగఁబుట్టెన్.

క. కావున నీతోఁబుట్టువు, పావనగుణశీల దీనిభామము దెలియం
గా వశమె యేరికైనను, నీ విం కిటఁజింతిలకుము నిరుపమచరితా.

సీ. ఘనభక్తవర్యుఁడౌ కక్కయ్యసత్ప్రసా
దంబు గైకొనుమహత్త్వంబువలన
దరలాక్షి గర్భంబుఁ దాల్చి తద్గర్భస్థుఁ
డై యున్నవాఁడు షడాననాఖ్యుఁ
డిటమీఁదఁ బదియు రెండేండ్లకు బిడ్డలు
సభ సర్వజనులు నాశ్చర్య మొంద
జననిదక్షిణకర్ణమునఁ బుత్త్రుఁ డుదయించు
ద్వాదశవత్సరబాలుఁ డగుచు
తే. నాతనికిఁ జెన్నబసవఁడౌ జనెడునామ
మెలమి గావింపు మని వృత్త మెల్లఁ దెలిపి
సంగమేశుఁ డంతర్ధానసరణిఁ దాల్చె
బసవఁ డంతట లింగదర్పణమునందు. 155

సీ. పద్మాసనస్థుఁ డై పరమేశ్వరునకు హృ
త్పద్మంబు నెలవుగాఁ బరగువానిఁ
బశ్చిమనాళసంభవఘంటికారవ
పరవశభావుఁ డై పఱలువానిఁ
గడు నధోముఖము లౌ కమలంబు లాఱును
నూర్ధ్వముఖములుగా నొనరువాని
శశిరథస్యందనశర్మనిర్మలసుధా
స్వీకారవృత్తిచేఁ జెలఁగువాని
తే. నమలబిందుకళాతీతుఁ డైనవాని
నయుతసూర్యప్రభాభాసుఁ డైనవాని
నాత్మసోదరిగర్భమునందుఁ గాంచి
యాపె కెఱిఁగించి సంతోష మంది యుండె. 156
తే. ద్వాదశాబ్దంబు లంతట పఱియరాఁగ
నెలమితో నొకనాఁడు మహీశుఁ జేరి
గూఢచారుఁ డొకండు దాఁ గొంకి కొంకి
పలికె జోహా రొనర్చుచు భయము మిగుల. 157
క. జననాథ! నేఁడు ప్రోలం, జనియించిన వార్త లిపుడు సర్వముఁ దెలియ
న్వినివచ్చినాఁడఁ దెలుప, న్మనమున శంకింతు ననిన మను జేశుఁ డనున్.
చ. మనమున భీతి దక్క మనుమానముఁ జెందకు మెట్టివార్త లై
నను వినుపింపుమా యనిన నాథునితో డుత గూఢచారుఁ డి
ట్లనుఁ బురిలో విధూజనము లంతట నింతట గుంపు గుంపులై
మనబసవన్నఁ బేరుకొని మాటికి ని ట్లనసాగి రెంతయున్. 159
క. బండారితో డఁబుట్టువు, నిండిన యశ మెల్ల వరదనీటఁ గలిపి తా
పెండిలిగాకటమున్నే, యుండె న్గర్భమున లజ్జ నొందెదుమదితోన్.
మ. బసవామాత్యుఁడు శైలజారమణసద్భక్తాగ్రగణ్యుండ ని
వ్వసుధ న్నా కెదు రెందు నెవ్వరను గర్వస్ఫూర్తినో తోడఁబు
ట్టు సరోజానన పీడఁ జాలక యొ మూఢుండై మనోవీథి సా
ధ్వసముం జెందక రంకు గల్పుకొనె నెంత ట్పుట్టెనివ్వీటిలోన్. 161
ఉ. ఏమనవచ్చు నింక నని యింతులు కొందఱు వక్క నంతలో

తామరసాయతాక్షులు విదగ్ధులు వారి నదల్చి తాళరే
యేమిటి కీకఠోరపరిహేళనవాక్యము లయ్యమాత్యుఁడే
భూమిపరుండు గాన మనబోఁటికి నేఁటికి? మాటి కిట్లనన్. 162
తే. అనుచుఁ బెక్కువిధంబుల నాడుకొనఁగ
విని తెలుపవచ్చినాఁడ నుర్వీకళత్ర !
యనిన నౌఁ గాక యని వాని ననిచి నృపతి
తనమనంబున నిట్లని తలఁచె నపుడు. 163
ఆ. బసవఁ డిట్టికలుషబద్ధుఁడై యుండుట
తెలిసి యూరకునికి వలనుగాదు
వసుధలోన సకలవర్ణాశ్రమాచార
సరణు లెల్లఁ జనవు వరుసతోడ. 164
క. సాలమెఱుఁగు 'రాజా రాష్ట్రకృతంపాపం'బటంచుఁజదువులుభువిలోఁ
బ్రకటింపఁదెలసి నేనూరకయుండుటచను నెయనుచురభసముతోడన్.
ఉ. కంచుకి నొక్కనిం బిలిచి గ్రక్కున నేగి ప్రధానుఁ దోడితె
మ్మంచు ననుజ్ఞయిచ్చినఁ దదాజ్ఞ శిరంబునఁ దాల్చి వేగ యే
తెంచి వినమ్రుఁడై బసవధీమణి! సద్వినయంబు దెల్ప రా
జంచితలీల నిన్బిలువ నంపిన వచ్చితి నంచుఁ జెప్పినన్. 166
క. ఘనుఁడగు నబ్బసవాగ్రణి,తనపరివారంబుగొలువఁ దగుఠీవి మెయిన్
జనిధరణీనాథుఁగనుం,గొనియుచితాసనమునందుఁగూర్చున్న మొదన్.
చ. కనుగవ కెంపు నింప నలుకన్ బసవేశునిఁ జూచి బిజ్జలుం
డనియెఁ బ్రధానశేఖరుఁడవై నుతిగాంచుట వన్నె కెక్కి యి
ట్లనుచితవృత్తికిం దగిలి యగ్రజచీఁకటితప్పు నైనఁ గూ
డునె కులశీలమానములు డొంకి చనన్ ధరణీతలంబునన్. 168
క. బలయుతులముమాకేమని,నలుగురిలో నిందఁజెందనాయ్యమెమిమ్ముం
గలసి వసించుటమాకుం,జలకనయగుఁగన్నె కెట్లుచూలయ్యె? ననన్.
మ. ధరణీకాంతునిఁ జూచి యిట్లనియె శాంతస్వాంతుఁడై కల్మషా
కరవాక్యంబుల లాభమే మిటకు నాకంజాక్షి వచ్చింతు దు
ర్భరగర్భస్థితి దానినే యడుగుఁ డేర్పాటయ్యెడు స్మీకు నం
చు రయంబొప్పఁగ బిజ్జలానుమతిచేఁ జోద్యంబుగా నత్తఱిన్. 170

చ. తన కగు నాప్తు నొక్కరునిఁ దా దరిఁ జేరఁగఁ బిల్చి నీవు వే
చని యుట కక్కనాగమను జయ్యనఁ దోడ్కొని ర మ్మటన్న న
య్యనఘచరిత్రుఁ డేగి సతియంఘ్రులకుం ధరఁ జాఁగి మ్రొక్కి మీ
యనుజుఁడు భూవనీపతి సభాంతరమందున నుండి చెచ్చెరన్ 171

చ. అచటికి నిన్నుఁ దోడ్కొని రయమ్మున ర మ్మని పంప వచ్చితిన్
ఓకీలగంధి! యంచు సభవృత్తము లెల్ల నెఱుంగఁ జెప్పఁగా
నచలితచిత్తయై గురుపదాబ్జము లాత్మ ఘటించి మ్రొక్కి భ
క్తచయదయాకటాక్షమునఁ దార్కొను వేగ శుభంబులం చొగిన్.

క. మేలగు సన్మణిఖచితాం, దోలికలో నెక్కి సఖులు తో నడువఁగ న
బ్బాలామణి బిజ్జలుని స, భాలయ మటుచేరి యంతికావని నుండెన్.

క. అప్పుడు గోత్రాకాంతుం, డప్పావనిఁజూచి యజ్ఞుఁడై యాహా!యీ
యొప్పులకుప్పకుఁ జెప్పఁగఁ,జొప్పడని గుణంబు పుట్టె క్షోణీస్థలిపై.

ఉ. పాపపుబ్రహ్మవ్రాత నగుపద్ధతి వప్ప దటంచు నెంచి యా
భూపపురందరుం డనియెఁ బోల్తుక! సెండిలి లేనియట్టి నీ
వేపగిదిన్ సగర్భ వయి తేర్పడఁ జెప్పు మటన్న భూమిభృ
చ్చాపపసంబు లాత్మ నిడి సాధ్వి ధ రాధిపుతోడ ని ట్లనున్. 175

క. ఏకర్మం బెఱుఁగని నే, నేకైవడిఁ దెలుప నేర్తు? నీగర్భస్థుం
డా కొమరుసింగులు శిశువుం,బ్రాకటముగనడుగనాత్మపద్ధతిఁ దెలుపున్.

చ. అన విని విస్మయాన్వితహృదంబుజుఁ డై ధరణీశుఁ డెన్నఁడున్
వినని యపూర్వవాక్యములు వింటిమి యీసతిపల్కు లెట్టులై
నను గనుఁగొంద మంచుఁ జెలున వ్వాలయన్ సభవార లబ్బురం
బని వినుచుండ ని ట్లనియె నప్పుడు పెద్దయెలుంగున న్వడిన్. 177

వ. తద్గర్భాంతరార్భకు నుద్దేశించి. 178

ఉ. ఓహో! యీసతిగర్భదేశమున నేయోజం బ్రవేశించి తీ
వ్యాహారంబు వినంగ నీసభజనుల్ వాంఛించియున్నా రనన్
నీహారాచలకన్యకారమణపన్నీ రేజభక్తుండు కో
ధాహంకారమదాదిదూరుఁడగు కక్కయ్యాఖ్యభాస్వత్కృపన్. 179

క. ఈనాగాంబ గ్రహించిన, మానితదివ్యప్రసాదమహిమమువలనన్
నేనంగకలనఁ జెందితి, భూనాథ!యటంచు శిశువుపాలుపుగఁదెలుపన్.

చ. విని సభవార లెల్ల నతివిస్మయ మందఁగ రాజు నెమ్మనం
బున నభవాంశజాతుఁ డని బుద్ధి నెఱింగియు డింభకాసలో
కనకుతుకంబుచే నమరి క్రమ్మఱ నిట్లని మెచ్చి త్వదీయన
ర్తన మొనరింప మా కిపుడు చాలఁగఁ వేడుక యయ్యెఁ గావునన్.

## చెన్నబసవేశ్వరావతారఘట్టము.

ఉ. తావకదర్శనం బొసఁగి ధన్యులఁ జేయు మటంచు వేఁడ న
బ్భావరవాక్యముల్ విని యపూర్వమహామహిమంబుఁ జూపఁగం
భావమునం దలంచి హరుపాదము లాత్మ ఘటించి నాగమాం
బావరగర్భసంగతకుమారుఁడు భూరిగుణాఢ్యుఁ డయ్యెడన్. 182

ఆ. తల్లికంటె నితరదైవంబు లేదని, సకలవేదసమితి చాటుఁ గాన
నట్టితల్లిఁ బ్రసవనాయాస మొందింపఁ, దగదనుచు నొకయుపాయ మెంచి.

చ. సురుచిరలీలదేహ మతిసూక్ష్మముగా నొనరించి దూషకో
త్కరముల వాక్ప్రబంధములు గాఁగ మెఱుఁగువిధంబునం దిగం
తరగతతేజుఁడై జననిదక్షిణకర్ణము నిర్గమించి సుం
దరతను వొప్పఁగా నిలిచె ధారుణినాథునియంతికంబునన్. 184

క. అలరుల సోనలు గురిసెఁ, దెలివిం జెలువొంది సకలదిక్కులు వలమై
నెలకొనుచు దేవదుందుభు, లొలసెను నాగాంబికాత్మభవయవేళన్.

ఆ. అపుడు తత్కుమారుఁ డంబికాంఘ్రులకు న
మస్కరించి తదనుమతిని బసవ
దండనాయకునిపదంబుల కెఱఁగిన
దేవసత్తి కౌఁగిలించుకొన్న. 186

తే. ఫాలమున భూతి ధరియించి ప్రణవసహిత
శైవపంచాక్షరము కర్ణశష్కులికను
జొనిపి వరదివ్యలింగయుక్తునిగఁ జేసి
శిష్యునిఁగ జేయుకతన రోచిష్ణుఁ డగుచు. 187

తే. పదియు రెం డేండ్లబాలుఁడై యెదుర నిలిచి
వెలయు డింభకుఁ గాంచి యుర్వీవిభుండు
నిరుపమాద్భుతమందాత్మభరితుఁ డగుచు
నాత్మలోపల నపు డిట్లు లనుచుఁ దలఁచె, 188

చ. కుఱుచదనంబు వచ్చు నని కొంకు వహింపక నిర్మలాత్ముఁ డై
వఱలినయట్టి శ్రీబసవవల్లభుసన్మహిమంబు ముందుగా
నెఱిఁగి యెఱింగి యుండి యిపు డేటికిఁ గానిపరీక్ష చేసితిక్?
గొఱవిని నెత్తి గోకికొనుసహాళలభంగి వివేకహీనతన్. 189

క. ఇప్పరమపవిత్రులకుక్, జొప్పడు నే యొక్క యఘము క్షోణీస్థలిపై
నెప్పాట నైనఁ జూడఁగ, నిప్పునఁ జెదలంట నేర్చునే వివరింపన్.

చ. అనుకొని సంగనాథుఁ గని యాదొర యిట్లను నీవు సత్కృపం
గనినఁ దృణంబు మేరు వగుఁ గా దనినం దృణమౌను మేరు వో
యనఘ! నుతింప శక్య మగునయ్య? భవన్మహిమంబు లంచు హొ
చ్చిన మృదుభాషల స్తుతి చేసె జనావళి చోద్య మందఁగన్. 191

మ. కమనీయామలరత్నభూషణములక్ గాఢరత్నాంబరోజ్జ్వల
త్సుమహార్చేలము లిచ్చి గాఢతరసంతోషాత్ముఁ డై యక్కనా
యములక్ శ్రీబసవాదినాథునకు లోకవ్యాప్తి సత్కీర్తిసం
గమొన ర్చించిన యర్ఘకోత్తమునకుక్ గల్యోత్సవం బొప్పఁగన్.192

క. అంతట నాగాంబామణి, కాంతాసంఘంబు గొలువ ఘనసంతోషా
క్రాంతస్వాంతాంబుజయై, వింతగనిజభవనమునకును విజయము చేసెన్.

సీ. బసవేశుఁ డానందభరితాంతరంగుఁ డై
రాజానుమతి చే విరాజమాన
దంతావళంబుపైఁ దనయల్లు నెక్కించి
తానును దో నెక్కి ధవళచామ
రాతపత్రంబు లనల్పంబు లై యొప్ప
భేరీమృదంగముల్ బోరుకొనఁగ
గణికాంగనానృత్యగానముల్ చెలఁగంగ
వందిమాగధులు కైవార మొసఁగఁ

తే. వఱచు చతురంగబలము క్రిక్కిరిసి నడువ
వేత్రహస్తసాహోరవవితతి దనర
నమితమంగళాలంకృతం బైనపురము
రాజవీథుల నరిగె విభ్రాజితముగ. 194

చ. ఘనబసవేశు నర్భకుని గన్గొనఁ బౌరనికాయ మప్డు శో
భనసహజాకృతిస్ఫురణపాటితశక్రతనూజకాములన్
వనరుహసంభవాదిసురవర్ణితదివ్యగుణాభిరాములన్
ధనదసఖాంఘ్రిసేవకహితప్రదనాములఁ గీర్తిధాములన్. 195

చ. ఎడనెడఁ గామినీమణులు హేమమయోన్నతసౌధవీథులన్
గడు ముద మొప్పఁగా నిలిచి నవ్యసుమాక్షతభవ్యలాజలిం
పడరఁగఁ జల్లి సంతసపు వృషాధిపుపై మఱి నాగమాంబికా
జడజముఖీతనూజుపయి సర్వజనాళి చోద్య మందఁగన్. 196

తే. జన్నిగట్టును త్రైమసల్ జతల జతల
నిలిచి యాడాడఁ బుత్తడితళుకుఁబళ్లె
రములతో మంగళారతుల్ ప్రమద మెసఁగఁ
బట్టి యిచ్చిరి యమ్మహాభాగులకును. 197

క. విలసితమణిమయసౌధ, స్థలములపై నుండిచూచు తామరసాక్షుల్
తెలియఁగనొండొరుతోడన్, బలికిరి పికకలనినాదపద్ధతి నిటులన్.

సీ. నలినాక్షి! యీతఁడే నాగాంబికాకర్ణసంభవుం డైనట్టి డింభకుండు
ఘనవేణి! యీతఁడే గర్భంబులోపలఁబడియు రెండేండ్లున్న బాలకుండు
మానిని! యీతఁడే మారటరుద్రుఁడై యవతారమెత్తినయర్భకుండు
చంద్రాస్య! యీతఁడే జనని నింవలఁ బాసి, పతి చేతమున్న నవడయుకుఱ్ఱ
తే. కంటిమిగ దమ్మకన్నులకఱవుదీఱఁ, బుట్టువులు నేఁడు సఫలతఁ బొందెఁగా దె
యనుచు నీరీతిఁ బురజనులందు నిందు, వినుతి సేయుచు నుండిరి వివి
వ. మఱియును. [ధగతులఁ.

సీ. ద్వాదశాబ్దంబులు తల్లిగర్భములోన నుండు టేయాశ్చర్యము విదలార
యుండెఁబో తనుఁబిల్వ మంగలేశుని సభఁ బలుకుటంతకువింత భామలార
పలికెఁబో యంతలోఁ బడఁతికర్ణమునందుఁ బుట్టుట చిత్రంబు పొలఁతులార
పుట్టెఁబో తనతల్లి పొట్టనుండేండ్లతో నిలుచుట చోద్యంబు నెలఁతలార
ఆ. యీజనానుమోదుఁ డీభానుసిభతేజుఁ, డీదయాసముద్రుఁ డీశుభాంగుఁ
డీప్రసాదజనితుఁ డెంతపుణ్యాత్ముఁడో, యెన్న నేరిశక్య మింతులార!

మ. కలికీ! శంకరుభక్తులెల్లఁ బ్రమథుల్గాకున్న నీవింత ము
న్కలనైనన్ గనుఁగొంటివే ! యిపుడు కక్కాఖ్యప్రసాదంబుచే

సొలపెఁ గర్భము నాగమాంబమణి కాముగ్ధ స్వీకరింప నే
తలఁపుం జెంద నెఱుంగనట్టి యబలం దప్పించుటే తప్పగున్. 202

చ. పరమపవిత్ర యైనసతిభావ మెఱుంగక కానిచేష్టలం
బరగెను నాగమాంబ యని పల్కుట యెయ్యది! మున్ను నింపగా
దురితము వచ్చె నీయఘము ద్రోల్పఁగఁ జేసెదు మార్గ మెయ్యదో
హరహర! తెల్పిమాలిన జనావళి కెక్కుడిసత్యవాక్యముల్!. 203

చ. అసమశిఖీముఖాంతకమదాపహమూర్త్యపరావతారమా
బసవనితోడఁబుట్టు నట భక్తవరేణ్యపదాబ్జలగ్నమా
నస యఁట సర్వపావనగుణంబులఁ బొల్చు నఁట యట్టిసాధ్వికిన్
వసుమతిలోన వేఱ యొకవాంఛ జనించునె? యెంచిచూచినన్. 204

క. తెలియక యాడిన క్రింపటి, పలుకులవలనన్ ఘటించుపాతకమిపు డీ
యలఘుమహాత్ములఁ గనుటన్, దొలఁగెన్ సమసూరు ముక్తితుది మన [కరయన్.

చ. ఇటు వినుతింపుచున్ గరము లెత్తి నమస్క్రియ లొప్పఁ జేయుచున్
బటుహాథమామికాముర జబంధురనాదము లాలకింపుచున్
స్ఫుటనటనాదిచోద్యములు చూచుచు నచ్చెరువొందుచుండి ర
క్కటకనివాసు లన్యోఢ వికాసమనోవలీనాభిరాము లై. 206

క. ఈచందంబునఁ బురజన, లోచనపర్వంబుగాఁ గలుగుచుం బ్రభులై
యాచకవాంఛిత మొసఁగుచు, ఖేచరుఁ డద్భుతమునొందికీర్తింపంగన్.

ఆ. రాజ్యలక్ష్మినివాసమై ప్రణుతికెక్కు
నిజగృహమునకుఁ జనుదెంచి నిరుపమాన
భద్రదంతావళము డిగ్గి భాగినేయు
కరము చేఁబట్టి బసవఁ డక్కజము మిగుల. 208

క. కంచుకులుపాయఁ ద్రోలఁగుమ, టంచుఁ బురోవీథినడువ హర్షముతోడం
గాంచనసింహద్వారం, బంచితగతిఁ జొచ్చి యరిగి యచ్చటరహిఁ జేన్.

ఉ. భర్మమణీసమంచితసభాభవనాంతరరత్నపీఠిపై
నిర్మలభావుఁడై న భగినీసుతు నుండగఁ జేసి భూమిభృ
ద్ధర్మసమానమూర్తియగు తానును నందె వసించి కొంతసే
పర్మిలి సర్వచోద్యనివహమ్ములుఁ జూచుచు నుండి యంతటన్. 210

చ. నిరుపమకాంచనాంబరమణీమయభూషణసంతతిం గవీ
శ్వర బుధవర్య మౌరజిక వాంశిక వైణిక నర్తకాదులన్
సిరి దొలుకాడఁ దృప్తులుగఁ జేసి ముదంబున వారి నెల్ల మం
దిరముల కన్పి యబ్బసవధీమణి లోపలి కేగి వేడుకన్. 211

ఆ. గంగమాంబికాదికాంతసీమణులకు, భాగినేయుచేతఁ బ్రణుతిసల్పఁ
బనిచియప్పుడుచితపరివారయుక్తుఁడై, యొనరియిష్టగోష్ఠినున్న వేళ.

సీ. ఘీరలంటినభవిఁ జీరి క్రమ్మఱవాని నసుయుక్తుఁజేయుమాచయ్యగారు
పసదు చేపట్టి మేల్పసిఁడిగాఁ జేసి ప్రఖ్యాతి కెక్కిన కలకేతపరుఁడు
శరణపదాంబువుల్ చల్లి కట్టెలు పైఁడిఁ జేయు మోళిగమార శేఖరుండు
మృదుని చేఁబల్కించిమిత్తిపాలగుగొల్లప్రాణ మిచ్చినకిన్నరయ్యగారు

తే. వసుధలోపల నేడునూర్వత్సరములు
వేదమితి మీఱి వర్తించుమాదిరాజు
మొదలుగాఁగల జంగమంబులు మనోజ్ఞ
భరితసంతోషులై వచ్చి రురుతరముగ. 213

ఉ. వచ్చినఁ గాంచి యబ్బసవవల్లభుఁ డండదత్ కర్థి మ్రొక్కి తో
డ్తెచ్చి సుఖాసనంబుల నతిప్రమదంబున నుంచి యల్లునిన్
మచ్చిక మీఱ వారికి నమస్కరణంబులు సల్పఁబంచి దా
హెచ్చినభక్తి నున్నెడ గణేశ్వరు లిట్లని రయ్యమాత్యుతోన్. 214

సీ. బసవ! నీమహిమంబు బ్రహ్మాదులకునైన వర్ణింపనలవియే? వసుధలోనఁ
దఱవచ్చినపుడు ప్రత్యయములుగాస్ప్రింపనీకె చెల్లెనుగాదె నిత్యసత్య!
నీతోడఁబుట్టువై ఖ్యాతికెక్కిననాగమాంబికమహిమ యేమనఁగవచ్చు
తత్కర్ణముననద్భుతంబుగఁ బుట్టినయిక్కుమారుని నుతియింపఁ దరమె

తే. యొరపురత్నము లన్నియు నొక్కచోటఁ
దెచ్చి కూర్చినయీశ్వరు మెచ్చవలదె
యనుచు నుతియించి మఱియు నయ్యర్ఘకేంద్రు
నెలమి నుద్దేశ మొనరించి యిట్టు లనిరి. 215

ఉ. ఈసుచరిత్ర మీవినయ మీయుచితజ్ఞత యీమనోజ్ఞభా
షాసముదాయ మీయచలజంగమపాదపయోజభక్తి యీ
భాసురశాంతియుం బసవభావమునందుఁ దలంచి చూచినన్

ద్రాసున జెట్టి తూఁచినవిధంబున నీసరి వచ్చు మెచ్చఁగాన్. 216

సీ. శ్రీకరశివభక్తలోకచకోరంబుల కేధన్యచరితుండు మాధవుండు
జంగమసముదయజాతకాండజముల కేయనఘాత్ముండు తోయదుండు
శరణసముచ్చయచక్రవాకంబుల కేకృతార్థుండు ప్రభాకరుండు
కలితమాహేశ్వరగణచకోరంబుల కేసత్యసంధుండు హిమమయూఖుఁ [డుఁ

తే. డట్టి యాదివ్యపురుషుని నభినుతింపఁ
గన్నులంగనంగ భాగ్యంబు గలిగెఁ గాదె!
యితని దర్శించుమాత్ర ముక్తిభయాన
వలచి పైకొనదే యెట్టివారినైన. 217

క. ఈవిధమున సకలావనిఁ, బావనముగఁ జేయ దుష్టపరమతశిక్ష
గావించి భక్తిఁ బ్రోవఁగ, నావిష్కృతమొందు నీమహాత్ముఁడు బసవా.

సీ. ప్రబలభక్తిజ్ఞానవైరాగ్యనిష్ఠల నీసరి గానని నిర్మలాత్ము
లీపేరఁ బిలచుట నిఖిలభక్తాభీష్ట మైయున్న దనుచు మాచయ్యముఖ్యు
లనవుడు నాకేఁ డట్లగుఁ గాక మద్దేశికాజ్ఞయు నీగతి యయ్యెఁ గానఁ
గరుణమీఱలు నామకరణంబు సేయుఁడు నావుడు వారలంచఁలును సమ్మ

తే. దాత్ములై చెన్నబసవఁడా జనుచు నుడువ
బసవఁ డత్యంతసంతోషభరితుఁ డగుచుఁ
జెలువు మీఱంగ జంగమంబులకు భూతి
వీడ్యములు వస్త్రభూషణవితతు లొసఁగి. 219

ఆ. దళితపాపులైన యలభక్తవర్యులుఁ
దాను నెలమితోడఁ దత్త్వగోష్ఠి
సలుపుచున్న యట్టి సమయంబునం దొక్క
ద్వారపాలకుండు వచ్చి మ్రొక్కి. 220

శా. దేవా! యొక్కవిచిత్ర మిప్పు డతిదేదీప్యప్రభారమ్యము
క్తావైడూర్యపురంగరాశ్మముఖరత్నస్వర్ణసంయుక్తభూ
షావిద్యోతితహస్తయుగ్మమున భాస్వత్సత్వరాయాతమై
భావాశ్చర్యముగాఁ బడెక్ పడి బహిర్ద్వారప్రదేశంబునన్. 221

క. ఆకలితభూషణావళు, లాకరములు గనినశ్రీకరాకృతి దోఁచెక్
మా కెల్ల ననుడు బసవం, డాకాంక్షఁ దదీయవీక్షణారంభుండై.

ఉ. అచ్చట నున్న భక్తసమూహంబును దానును సత్వరంబుగా
వచ్చి యపూర్వశోభలఁ గనంబడు హస్తయుగంబుఁ గాంచి లో
నచ్చెరు వంది యవ్వితిరయంబులు నెచ్చటనుండి వచ్చెనో
యిప్పటికన్నఁ జూడ నొకఁ డిట్లని పల్కె నమస్కరింపుచున్. 223

చిత్రకన్యకథ.

తే. అధిప! బిజ్జలుతోఁ బుట్టు వైనచిత్ర
కన్య యనునది మదనవికార మొదవ
గుఱ్ఱముల కాఁపరిని గూడెఁ గులము నీతి
శీలమును మాన మెంచక సిగ్గుమాలి. 224

క. పెఱవారి ననుజ గూడిన, తెఱఁ గాపుడు బిజ్జలుఁడు దెలిసినచో న
క్రొవ్విగాసి మాట చెవులసఁ, గోపించఁ జొచ్చెనటులైనఁ గుంచెడుపుడితోన్.

క. ఏమియుఁ బలుకఁగఁ దోచక, భామిఁ గనుంగొనుచుఁ గొంతప్రొద్దుండి విభుం
డా ధన్యసితో ననునా, హా! మానిని యెంతసాహసాత్మక యయ్యెన్.

చ. సకలుషమై విప్రుఁ విడిచి సాధ్వసమర్మము లుజ్జగించి బం
ధుకులము విస్మఁ దన్ను వెలిద్రోయు నటన్న భయంబు మాని యీ
సఖి యొకయన్యమానవుని సఖ్య మొసర్చెఁ గదే పయోజజా
తకృతముఁ బాయఁగా దనమె ధారుణిలోపల నెట్టివారికిన్. 227

చ. అని మఱి యిట్లు పల్కు బసవాధిపుసోదరి నేనునింపచే
సినఫల మూరకే చనక చేరుటు నా కిఁకఁ దోడుతోడునన్
స్మనసిజవైరికాంత కెన నాఁ జనుతత్సఖి నట్లు పల్కఁ గాఁ
జనునె యెటుంగనైతి. గడచన్నపనుల్ నుడువంగ నేటికిన్. 228

చ. నలుగురు నింద చేసినను నవ్వఁగ నేకరణిన్ సహింతు న
క్కలుషమనస్కమో మెటులఁ గన్గొనఁ జాలుదు నంచుఁ గోప మ
గ్గలముగఁ బూని గుఱ్ఱములకాఁపరిఁ గొట్టిన నేయఁ బంచి లో
పలికి నయంబు మీఱఁ జని భావము గొల్వ వసించు చెల్లెలిన్. 229

చ. కనుఁగొని మోమునన్ వెనుక గానఁగనీయక నాతి యుందు ర
మ్మని సఖి నేకతంబ భవనాంతరసీమను మెల్లమెల్లఁ దో
డ్కొని చని దాను మున్నట నిరూఢత నిల్పిన నిల్చునారెకుల్
గనుకని మ్రొక్కె భూధవుఁడు కామిని వారికిఁ జూపి యిట్లనున్.

క. ఈవనితం గొనిచని విపి,నావనితలమందు నొక్కయసియంత్రముపై
వైవ్రేఁడు తుత్తునియలుగా, నావుడునే గాకయనుచు సతులైనంతన్.

చ. చెలియలిదిక్కు గన్గొనక చెచ్చెర నవ్వలి కాతఁ డేగినన్
బలవరు లంతటం బరుణి బవ్వలకుం గొనిపోయి చంపఁగాఁ
దలఁచి తదీయరూపమును దైన్యమునుం గని సంహరింపఁ జే
తులు వెస రాక యిట్లనిరి దుఃఖితమానసు లౌచు నొండొరుల్. 232

సీ. అక్కటా! శుద్ధాంతమందు నుండెడుతన్వికి శ్వపాలకుసఖ్య మబ్బె నెట్లు
కట్టనూ: జెల్లెలఁ బట్టిచంపు మనంగ నాలుక యెట్లాడె నరవరునకు
మిగులసౌఖ్యాన్వితయగు రాజసుందరికీగతిపర మేష్ఠి యెచట వ్రాసె
నబలఁ జంపంగఁ గూడదనరాజుతోఁ దెల్పమతిమంతు లెవ్వరు మాన్పరైరి

తే. దైవ మిటు తప్పఁజూచినతఱి మఱెవ్వ
రెంత చింత యొనర్చిన నేమిగలదు
కఠినుఁడగు రాజుఁ గొలిచినకతన నిట్లు
గోరి వధియింపఁగా నియ్యకొనఁగవలసె. 233

క. అని పగచిపగచివిభుపం, పొనరింపక తీరదనుచు నొకయసియంత్రం
బునపై చిచసిరి చెలితు, త్తునియలగుచునపనిమిఁబడొరుఁగఁగనంతన్.

క. మారుతరయమునదత్కర, వారిజములువచ్చియిచటవ్రాలెనటంచున్
జారుఁడు దెల్పిన బసవఁడ, వారితవిస్మయనియుక్తభావుం డయ్యెన్.

ఉ. అప్పుడు మింటజంగమము లచ్చెరువందు చయారె చేతులే
యిప్పగిదిం వసించె మఱి యీకరముల్ గలయింతిరూప మే
చొప్పున నుండునో యిపుడు చూడఁగనొఁ గద యంచుఁ గోరికల్
విప్పు దలిర్పఁగా బసవవీరునిఁ గన్గొని పల్కి రంతటన్. 236

మ. బసవాధీశ్వర! యీకరద్వయమునన్ భాసిల్లుపద్మాక్షినాం
పెసఁగం జూడఁగ వాంఛ చెందినది మాయిష్టంబు చేకూర్చి త
ద్బిసజాతానన నెవ్విధిన్ ననిచి ప్రీతిం జూపవే యిప్పుడో
యసమాస్త్రామితగర్వనిర్దళనపాదాబ్జాతపుష్పంధయా! 237

చ. వలచినవాంఛితం బొసఁగి వారవధూజనతామనోజ్ఞలీ
లలఁ జరియింపఁబంచి మము లాలనసేయుట కెల్ల మూలమై
యలరుగదయ్య మామనవి యాత్మఘటింపుచు నీప్రయోజనం

బెలిమి నొనర్చితేసి యని పొచ్చగుపేడ్కల వేడునంతటన్. 238
సీ. భక్తు లెయ్యది వేడఁ బ్రత్యుత్తరంబీక
యొసఁగు నేమము గాన బసవమంత్రి
తనకోడ మున్నుఁ జెల్వినచారుఁ బిల్చి నీ
పరిగి వేసంబ తదంగనాంగ
శకలంబు లన్నియు సమకూర్చి కొనిరమ్ము
నావుడుఁ జని విపినంబులోన
నాడాడఁ బడియున్న యత్తునక లన్నియు
జతఁ జేసికొని వచ్చి సచివమౌళి
తే. యెదుట నుంచిన చారుని యిష్ట మొసఁగి
శరణసందోహమున కెల్లఁ జాఁగి మ్రొక్కి
సంగమేశ్వరు మదిలోన సంస్మరించి
యతులలింగనసాయతహస్తుఁ డగుచు. 239
తే. వెలఁదితనుఖండచయములు వేఱువేఱ
నేర్చి యంగాంగములు జతఁగూర్చి యచటి
భక్తపాదాంబువులు దానిపైనిఁ జల్లి
యించుక విభూతిఁ గొని చిలికించుటయును. 240
తే. తత్పదాంభోజజలము సంధానకరణి
పావనంబగు తద్భూతి జీవకరణి
యైన నిద్దుర మేల్కొను నట్లుగాఁగఁ
జిత్రకన్యక యపుడ సజీవ యయ్యె. 241
ఉ. మారుని మేల్కటారి వెలమావినిగుఱ్ఱొనుకొమ్మ మేటిబం
గారు మెఱుంగుతీవ రతికామినికేలవసించుచిల్క సిం
గారపుఁగ్రొవిరత్న పుజాకాటపుబొమ్మ యనంగ నప్పడా
వారిజగంధి నిల్చె బసవప్రభుమౌళి విలాసధుర్యయై. 242
వ. ఆసమయంబున. 243
ఉ. అక్కడ నున్నమర్త్యనివహం బతివిస్మయసంగతాత్మమై
యెక్కడ నైనఁ జూచితిమె యిట్టివిచిత్రము చేదితంబులై
యక్కడ నక్కడం బడినయట్టి కళేబరఖండముల్ భళీ

మ్రొక్కుటఁ గూర్చి యీబసవఁ డొప్పుగఁ జేసె సతిన్ సతీవఁగాన్.

చ. ఇతనిప్రభావముల్ గనిన నీశ్వరుఁడే యగుఁగాక మర్త్యుఁ డన్
మతి గనఁ బోలునే యనుచు మాటికి సన్నుతి సేయుచుండఁ ద
త్సతి బసవేశ్వరాంఘ్రిజలజంబులపైఁ బడి మ్రొక్కి పల్కె న
న్నతులభవత్కృపామృతరసాంబుధిఁ దేల్చి పునీతఁ జేయవే. 245

ఉ. నీకరజాత నోఁ నతినిష్ఠురపాపభయం బణంచితిన్
బ్రాకటసౌఖ్యసంపదకుఁ బాల్పడి యుంటిని గాన నేక్రియం
జేకొని నన్నుఁ బ్రోచెదవొ నిర్మలచిత్త నొనర్చి ప్రోవవే
లోకనుతప్రభావ! యని లోలవిలోచన వేఁడునంతటన్. 246

తే. బసవనామాత్యచంద్రుండు ప్రమద మెసఁగఁ
గ్రమముగా నూర్ధ్వరేతయ్యగారిచేత
లింగధారణ మప్పు డొనర్పంగఁ జేసి
విమలసుజ్ఞానఁ గావించు వీని విభవ. 247

సీ. అక్కల్కి-క్రమ్మఱ మ్రొక్కుచు నిట్లను బసవేశ నావిన్నపంబు వినుఁడు
ధరణిపై నెవ్వరనేమతముయిష్టదైవాభిధానంబుల నమరియుంట
జనవేద్యమే కాదె! సకలవిధంబుల నావేల్పు వరయంగ నీవె కాన
భవదీయనామసంప్రాప్తగా నన్నుఁ జేసి యవనిఁ గీర్తిలఁ జేయు మనినబసవఁ

ఆ. డఖిలలోకనరలయాననంబులు గాంచి, నన్వ్వ చూరనున్న నగవరాస
భక్తు లతనిభావపద్ధతి బసవయ్యంచు నామమిడిరి యబల కపుడు.

మ. అతిలీలాగతిమై ధరం బరగునయ్యంభోజపత్రేక్షణాం
చితశోభాకలనాభిరూప్యవిలసచ్ఛృంగారకముల్ గాంచి య
ద్భుత మొప్పన్ వడి మించజంగమవరుల్ పుష్పాంబకోత్సృచ్ఛరా
తతవైశ్వానరహేతికానిచయసంతప్తాత్మచేతస్కులై. 249

ఉ. అంగజకేళిఁ దేల ప్రార్థనంబులఁ గోరినవారి వాంఛితం
బంగద కూర్పఁబూని బసవాధిపుఁ డాజలజాక్షిఁ బిల్చి యా
జంగమమూర్తులన్ గుసుమసాయకక్రీడలోన నేలుమా
మ్మంగన! యన్న మ్రొక్కి జలజాసితవేణి రచించె నీగతిన్. 250

క. క్షితితలమున నొకసతి కొక, పతియుండిన యోగ్యమగుచు భాసిలుఁ గాకే
గతివలఁప నొక్కయువతికిఁ, బతిబాహుళ్యంబుయుక్తపద్ధతియగునే.

క. మితిలేనిజంగమావళి, మతివాంఛలు తీర్పఁగా సమర్థుఁడ నాకీ
గతి కల్పింపక కరుణా, న్వితిచే మీఁదాసిచేసి ననుఁ బ్రోవఁగదే.

చ. అన బసవేశుఁ డిట్లనియె నంబుజపత్రవిశాలనేత్ర! యి
ట్లనఁ బనిలేదు భక్తనివహమ్ములఁ గామసుఖాభిలాష లిం
పెనయఁగఁ దీర్ప నిన్ను సృజియించె శివుం డటుగానఁ జింతలం
జనకు మదీయసత్కరుణసత్త్వసమర్థత గల్గు నీ కికన్. 253

తే. పొమ్ము వారియధీనవు గమ్ము నిన్నుఁ
గ్రమ్ముకలుషమ్ములను విసర్జిమ్ము మదిని
నమ్ము నామాట మేలు చేకొమ్ము సుస్థి
రమ్ముగను ముక్తి దొరకు నిజమ్ము సుమ్ము. 254

చ. అని నవలా నొసంబఱచి యాత్మల నువ్విళులూరుమిండభ
క్తనిచయముల్ ముదం బలరఁ గన్గొని మీరలు వేడ్క నీశుభా
ననవలనన్ మనోబ్జముల నాటినకోరిక లెల్లఁ దీర్చికొం
డని యనుపన్ వడిం జనిరి యంగనఁ దోడ్కొని వార లందఱున్.

క. ఈకరణి వారలేఁగఁ గృ, పాకరుఁడగు బసవమంత్రి యద్భుతమహిమం
బాకాంక్షం గొనియాడుచుఁ, బ్రాకటమహిమాఢ్యమానిరాజప్రముఖుల్.

తే. నాగమాంబావలోకనమునకు హృష్టులై
యంతిపురికి వేగ నరుగువారి
నమ్మృగాక్షి చూచి హర్షంబు సద్భక్తి
దొలుక వందనములు సలుపునంత. 257

క. వనజాక్షిభక్తివైరా, గ్యనియమమాహాత్మ్యనిష్ఠ లాత్మకు ముదం
బొనరింపఁ బెక్కువిధుల, న్వినుతింపుచు నొక్కహర్మ్యమం దంత మునున్.

చ. బసవనితో సమస్తశివభక్తనికాయ మతిప్రమోదహృ
ద్బిసరుహయుక్తమై మహిమయిం పెసఁగన్ సభఁ దీర్చియుండె నిం
పెసఁగ హిమావనీధరసుతేశ్వరసంగతమై నిరంతరో
ల్లసనము నొందు నా ప్రమథులం బురుణించి విలాససంపదన్. 259

వ. అని చెప్పినఁ గుంభసంభవుం డవ్వలికథ యెఱింగింపు మనుటయు.

మ. మిహికాపార్యసమానధైర్య! మధురామేయాబ్జసౌందర్య! పూ
ర్వహరిద్రాజితధైర్య! శౌర్యఘనపారావారగాంభీర్య! దు

స్పృహా తేజోజితసూర్య! భాసురమనీషా దేవతాచార్య! వే
దవహాయాంఘ్రిద్వయసంతతార్చనకళాతాత్పర్య! వీరోన్నతా!. 261

క. లబ్ధనికాయవిహారా!, యబ్ధిసమగభీర వైరిహరణవిచారా!
లబ్ధశివాచారా! ప్రా, రబ్ధసుకృతభవశరీర! రమ్యాకారా! 262

తోటకవృత్తము. శ్రీకరబంధువశీకరచర్యా!, ప్రాకటభూపరిపాలనధుర్యా!
లోకనుతాశ్రితలోకచ్ఛయధైర్యా!, భీకరశత్రువిభేదనశౌర్యా!. 263

గద్య. ఇది శ్రీమచ్చెన్నమల్లికార్జునకరుణాకటాక్ష లబ్ధకవితామాధురీ
ధురీణ కౌశికగోత్రపవిత్రకవిజనస్తుత్య పాపయామాత్యప్రణీతంబైన
చెన్నబసవపురాణంబను మహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము



# ద్వితీయాశ్వాసము.





మచ్ఛ్రీమదరాంబాహృ
త్తామరసవిహారషట్పదన్మల్లైక
స్వామికృపాలబ్ధశుభ
స్తోమా శ్రీయమృతలింగశోభననామా. 1

వ. అవధరింపు మయ్యగస్త్యమునీంద్రునకు రేణుకగణాధీశ్వరుండు తరు
వాతివృత్తాంతం బి ట్లని చెప్పందొడంగె. 2

చ. అటు వసియించు భక్తనిచయంబులు జంగమసత్ప్రసాదవి
స్ఫుటమహిమల్ వినం దివిరి భూరథమూర్తి దిగంతపూరితో
త్కటనిజకీర్తియై వెలసి ధన్యతఁ జెందిన మాదిరాజు హృ
జ్జటిలముఖంబునం గని రసస్ఫురితోక్తులఁ బల్కె నీగతిన్. 3

మ. అనఘా! శైవరహస్యముల్ భవదభివ్యక్తంబులై యుండుఁ గా
వున శ్రీజంగమసత్ప్రసాదమహిమంబుల్ దెల్పి రక్షింపవే!
యన నాథస్వ్యుఁడు మున్ను మీకరుణ నాద్యంబైన భక్తాళిచే
వినిన ట్లే వచియింతు నంచుఁ బలికెన్ విస్పష్ట మౌనట్లుగాన్. 4

తే. అమృతసంధాయకంబయి యప్సరఃప్ర, పూర్ణమై మత్తసారంగకీర్ణమై చ
రన్మరుద్వరగంధర్వరాజమగుచు, నతిశయిల్లె శ్రీజీమూతమవనియందు.

వ. తద్గిరీంద్రంబున. 6

మ. అకలంకోజ్జ్వలమల్లికార్జునసుతివ్యాహారయుక్సారికా
శుకముఖ్యాండజనాథసంస్తుతిముదస్తోకప్రరోమాంచకం
చుకదేవర్షినివాసదేశవిలసచ్ఛోభావహచ్ఛాయద
ప్రకటాహ్లాదిమహీజమా కదళికారణ్యంబునం దొక్కచోన్. 7

## గంధర్వునికథ.

క. కమలాధివాసవిలస, త్కమలాసవపాయిభసలకమనీయంబుల్
గమలీకకిరణకీతల, కమలంబగు నొక్కకొలనుగడు వెలుఁగొందున్.
క. తత్తీరంబున గంధ,ర్వోత్తముఁ డచలుండునై మహాత్మతురంగుం
జిత్తమునం దిడినుడమని, సత్తములగ్గింపఁ దపముసల్పుచునుండెన్. 9
ఉ. అంతట నొక్కనాఁడు నిటలాక్షపదార్చకు లాజవంజవ
భ్రాంతివిదూరు లంతరచరద్రిపుదూరులు యోగమార్గవి
శ్రాంతులు పంచవర్ణమనుజాధిపమూర్తులు నైనశాంతుఁ డే
కాంతుఁ డనంగ నిద్దఱుమహాత్ములు శ్రీగిరి సంచరించుచున్. 10
తే. అచటఁ జంగమదివ్యగేహంబులందు
మాధుకరభిక్షఁగొని శివారాధనంబుఁ
జేసి భుజియింత మనుచు విలాస మలరఁ
దత్సరోవరతీరంబు దఱియ నేగి. 11
సీ. విమలవస్త్రాన్వితచోళ్ర వేశించి తత్పక్తమంబులఁగడిగిపాత్రంబులందు
నించియోంకారయుక్పంచాక్షరీమంత్రపూజితలోపేతభూతిఁ జల్లి
యిష్టలింగార్చన నెలమితోనొనరించి యర్పితంబగు తన్మహాప్రసాద
మొనరకడికడికగపఱచుచుభుజింపుచు లింగయోగవిస్ఫూర్తినున్న
తే. వారలను దత్సమీపనివాసమందుఁ
దపము సల్పుచునున్న గంధర్వవిభుఁడు
వీక్షణము చేసి తచ్ఛుష్క వెగటు దోఁప
నిట్టు లని పల్కె నజ్ఞానహృదయుఁ డగుచు. 12
చ. శివు ధరియించి సంతతము శ్రీపరబాణునిఁ బూన్చి యాత్మసం
భవహరుఁ జిత్తమందు నిడి ఫాలవిలోచనలాంఛనంబులే
యవిరళభక్తిఁ దాల్చి ఘను లౌ నన వర్తిలు మీర లీగతిన్
రవనవిరోధి కెంగిలిప్రసాదము కొంకక యిచ్చు టొప్పునే. 13
క. నరులెవ్వరైన మీగతి, హరునకు నిటుభుక్తశేష మర్పించుట యీ
ధరణీతలమునఁగలదే, దురితాత్మకులారయనుచుదూషించుటయున్.
మ. విని కోపజ్వలనావృతాత్ముఁ డగుచున్ వేగంబ గంధర్వునిం
గని యోమూఢ! మహాప్రసాద మెఱుఁగంగా లేక యుచ్ఛిష్టభా

వన దూషించితి గాన నీయఘము పోవం జాలఁ దేవెంట నీ
ఘనతేజం బఱ గ్రామసూకరపుమేన్ గైకొమ్ము పొమ్మింకిటన్. 15
చ. అనవుడు భీతి నొంది వినయంబున నిట్లనుఁ గేలు మోడ్చి యో
యనఘతరాత్ములార! తెలియంగనకే మీము నాడినట్టి దు
ర్వినయవచఃఫలం బనుభవింపక తీఱునె యింక శాపమో
చన మెటు లబ్బెడున్ దెలిపి సంతస మందఁగఁ జేయరే! యనన్. 16
ఉ. కోపము మాని యిట్లనిరి కొన్ని దినంబులు ధారుణీస్థలిం
బ్రాపితపోత్రిరూపమునఁ బర్యటనం బొనరింపుచుండి రు
ద్రాపరమూర్తియైన శరణాగ్రణి డించుప్రసాదసేవఁ ద
చ్ఛాపము వీడి హేమగిరిచాపునిప్రాపునఁ జేరె దెట్లనన్. 17
తే. అమృతసంపాదకంబుఘోరాఘమోచ, నాదికారణమైనదివ్యప్రసాద
మేవగింపఁగవచ్చినయేనయంతర, గతిఁ జెడదుతత్ప్రసాదభోగమునఁగాని.
క. అని జంగమవరులాసఁగిన, ఘనశాపాక్రాంతుఁడగుచుగంధర్వుఁడుశో
భనసిజరూపముఁగోల్పడి, కొనియెం దత్క్షణమ గ్రామకోలమురూపున్.
చ. కొఱకొఱ లాడుచుం బుడమి గ్రుచ్చుచు బల్వఱతోడ నోరగాఁ
బిఱిఁదికిఁ జూచుచున్ గడుపువేఁగున సంకరగాఁగఁ బోవుచున్
గఱకఱ పండ్లు గీటుచు నెగంబడి ముట్టెను దుంగముత్తైలం
దెఱలిచి మేయుచున్ బొదలతీఁగల డాఁగుచు నేగె జాగునన్. 20
క. ఈకరణిం జనిచని యా, సూకర మూరూరఁ దిరుగుచుం జనుచును శో
భాకలన ధరిత్రి లస, న్నాకంబగు విజయవాటినగరము చేరెన్. 21
తే. ఆపురంబున నెపుడుండుఁ గాపురంబు
నెఱుకకులమున జనియించుఁ బెరుకుపుంద్ర
పామరుం డనఁ గలఁ డాకపామరుండు
సకలకర్మసుగుణరాశి సత్యరాశి. 22
వ. వానిపేరు బండంగి యనునది. 23

బండంగి కథ.

సీ. సంబెతెంగినవొంగ సాటెనగొట్టు పిసాసి దిమ్మరి జెరజముబటాని
తచ్చనగొండి పోతరకత్తె కల్లరి వల్లింత మాయలబెల్లి కటికి

నక్కచిక్కులమారి పెక్కురరూపిదూబరదిండిబోంకులచాన మొండి
బోజుఁగులాఁడిలడారి బిల్లిపల్లాకిజూదరియబ్బైరాసిగాతలకొటారు

ఆ. మగనికంటికెరుసు పగలాఁడి శివసత్తి
బలుగయాళి జారుగుపాలిజాలి
మందులాఁడి చెడుగుమానిసి బూతంబు
పసిఁడి బిచ్చగాండ్ర వెన్నుగుఱియ. 24

ఆ. అట్టివారి యింట నఱుతగా నున్నట్టి
పెరటిపంచలోన గుఱుకు లిడుచు
నచటు నచటఁ దిరిగి యల పంపె యలపంపి
పండియున్నఁ బుండ్రపామరుండు. 25

చ. కని సతిఁ బిల్చి యిక్కట్టిసి గాసిసి చూచితె యెన్న! డిప్పురిక్షా
గనుఁగొను పంపగా దిది దినంబును గంజియుఁ గాటఁ బోసి పెం
చిననిటనుండు నంచుఁ బతి చెప్పిన సంతసమంపిదాని నో
య్యనఁ దరిఁ జేరఁ బిల్చి పులియంబలి యించుక వోసె మూఁకుటన్.

ఆ. అంబకళము ద్రావి యది మొద లాపంది
యెచటి కరుగఁబోక యెఱుకుసింట
గంజికడుగుచేతఁ గడుపు నింపుచుఁ గొంత
కాలముండె జాతిగతుల నంత. 27

సీ. శివరాత్రికతిభక్తి శ్రీశైల నల్లభుఁ గను వేడ్కవృద్ధజంగమ మొకండు
చనిచని బెజవాడ సాయంతనమునకుఁ జేరి పేరాఁకటిచిచ్చు చేతఁ
బడలేక భిక్షుకై భవభక్తభవనంబు లెచ్చోటఁ గల వని వచ్చివచ్చి
యెఱుఁగఁజాలక యిది కఱకంఠభక్తమందిర మని పుండ్రపామరుని [యింటి

తే. కరిగి తద్ద్వారదేశమునందు నిల్చి
ఘంటవాయించి తోడ శంఖంబు నొత్తి
భిక్ష యనవుడు బండంగి విని యడంప
రాసికోపంబునను మందిరంబు వెడలి. 28

సీ. కనుఁగొనె వళులఁ గ్రమ్మినమేను వ్రాలిన
కనుబొమల్ లోఁతులౌ కనులదోయి

వణఁకెడుశిరమును బెణఁకెడు గమనంబు
భగ్నదంతావళి పక్కకంతి
జొల్లుగారెడు నోరు తెల్లసిగడ్డంబు
తెగనిశ్లేష్మంబుచేఁ దగులుమాట
వెన్నంటు పొక్కయు సన్నపుఁ జేగోల
పొడివగ్గు కాకిమూఁపులును మఱియు
తే. జడలు కఱుపాల గోఁచుగు జీర్ణపుగంత
చెవులఁ దగులుబడఁగ చింపిగోఁచి
యెదను శివనిసెజ్జ రుదురాకలును బూది
యమరు ముసలిజంగమయ్య నపుడు. 29

చ. కనుఁగొని డాయ వచ్చి శునకంబువిధంబునఁ గక్కరించి యి
ట్లను నను నొంటి నుంటి ? గని యద్దమరాతిరికాడ బిచ్చముం
గొనుటెవ్వ మూని వేఱొకటి గోరిటు వచ్చినజాడ దోఁచె నా
పెనిమిటిఁ గన్న నిన్నిడుమ పెట్టక యూరక పోవనిచ్చునే?. 30

ఉ. కల్లరులైన యాపొరుగుకాంత లెఱింగిన గేలి సేయుచుం
డొల్లిటివైర మెంచి పతితో వినుపింపక పోవ రంతతోఁ
జెల్లును నాదుకాఁపురము చిక్కిన నీకును భంగపాటగుం
దెల్లముగాఁగ నింక నిట డ్రిమ్మరఁ గూడదు పొమ్ము క్రమ్మఱన్. 31

క. అనియది యాడినమాటలు, విని జంగమమూర్తిమదిని వెగటుగఁ దోఁపం
గని శివాయనిర్ణము, లనుగగములఁ జేర్చి చనికలంబడియనిటులనెన్.

ఉ. అక్కట! యిట్టు లాడఁ దగునమ్మ? సర్వ్వతఁ గామచారియా
లెక్కలికాసి నాడుపగిదిన్; సిరిగట్టునివాసుఁ గొల్వఁ బె
న్మక్కువ నేగుచో జనసమాజము సుంకఁగ లేక యాఁకటన్
జిక్కటచేత భిక్షుకయి చేరితి నీగృహసీమ కోమలీ!. 33

ఉ. కాలము సర్వముం గడచి కార్శ్యము మేనునఁ బండి వృద్ధుఁనై
కాలు కదల్పలేని ననుఁ గామవికారి వటన్న నవ్వరే ?
యేల ప్రథాకుణాపముల నేచఁగ బిచ్చము తెచ్చి పెట్టినం
జాలు మఱేమియున్ వలదు నాపుడుఁ గోపముతోడ నిట్లనున్. 34

క. ముని మని చప్పెనో పైత్యము
పెరిగెనో యటుగాక యిమ్మెత కాయ నమలితో
మదనారభక్తవర్యుల
సదనములకుఁ గాక యిటకుఁ జనుదే నగునే?. 35

వ. అనిన నతం డిట్లనియె. 36

తే. కాలకంఠ! నీ వనుమాటలే నిజముగాని
మాకుఁ గల ద్రాక్షవ్రత మేరి యుండికమున
ముదుపు వేడితి నచటన గొనఁగఁ జలయుఁ
గాన నగుభిక్షు పెట్టుము గడప వలదు. 37

క. నాప్రభుఁడు గామినియిట్లను, మావంగడమందు జంగమములకు బిచ్చం
బానంత పెట్టనొప్పదు, నీవెత్తితనంబు మాని నిలువక చనుమా. 38

ఆ. అనిన జంగమయ్య యనియె మోదొల్లిటివారి, చర్య లెల్ల నూరసాని మొదలు
శైవవరులు పూజసేయుటచేఁ గాదె?, యిహపరార్థసిద్ధు లెల్లఁ గనిరి.

క. కావున జంగమవర్యుల, సేవించుటకంటె నధిక మెదు చెందుట గలదే?
కేవలపాపపువాక్యము, లీపిధి జను లెవ్వరైన సిల నవఁ గలరే? 40

చ. అన విని క్రోధఘూర్ణితనిజాననయై శివభక్తికై వడిన్
జిన వెగటైన పల్కు లివియే యన నేటికి? వారిచాడ్పునన్
ఘనమగు కొల్పుగావియలు గల్గినవారము గాము నిన్న కే
చను మింక నిల్చితేని వెలుచన్ నినుఁ గొట్టక మాన గట్టిగన్. 41

ఆ. అంకమునుబోఁజాలవే సంపాదింటు, గంటతో కట్టుగా నుంచికదుపునిండఁ
గుడుచుమిచ్చుటనీడ్లిఁబడి తెలారు, దాఁకనోరలినఁగలుగదు దుష్కృత్యము [సిన

చ. అడిగినచోట భిక్షఁ గొనునట్టివ్రతంబున నొందుచోట నే
నడుగఁగఁబోదునే! తగినయట్టు లొసంగకపోవరా వనన్
బెడఁగుమిసాని బల్లుదియ చేకొని జంగమసామ్మటంచుఁ బె
న్వడిఁ గదియంగఁ బోవుతఱి నాతిమగం డరుదెంచి చెచ్చెరన్. 43

ఉ. కోమలి! యేల భిక్షుకుని గొట్టఁగఁ బోయెద నన్న నాథుతోఁ
గామిని పల్కునట్టి తరి గా దనిన న్వినిపోక భిక్షుకై
గాను తెలంగుననన్ దగితే? గావునఁ గొట్టక మాన నన్న న
వ్వామరుఁ డాలితో నిటులఁ బల్కె దయారసముపేతచిత్తుఁడై. 44

ఆ. వృద్ధు వేళగానివేళ నాఁకట డస్సి, వచ్చినాఁడు గాన వలదు గడుపఁ
గలుగుకొలఁది పెట్టుమలుక యేమిటికిటు, లనినవిభునిపల్కు లరుచిదోఁప.

ఉ. ఈనదుపీనుఁ గెక్కడ మఱెవ్వరిఁ గానక వచ్చె నంచుఁ గో
పానన యాచు నెక్కడివ్యయం బయ దెంచె నటంచు నాథు లో
లోన గొణంగి తిట్టుచు విలోలతఁ దోఁచక సంచరించుచుఁ
దా నిటు కొంతప్రొద్దుఁ గడుతల్లడ మంది యొకింత కిన్కతోన్.

ఆ. తనదుప్రాఁతమగఁడు మనిన నాఁటి కొమ్మూల
దొంతిసందలోన దొంగతనము
పనఁ దాఁచినట్టి తమిదెపిండి యొకింత
పెట్టి పొమ్మటన్న భిక్షుకుండు. 47

సీ. అఖిలంబు నెఱుఁగ 'క్షుధాతురాణాం న రు
చి ర్న పక్వం' బనఁ జెల్లుఁ గాన
నాఁకటిపెల్లున నప్పిండియంతయు
నతివేగమునఁ గొని యాత్మలింగ
మునకు నివేదనం బొనరించి యుంచుక
యారగింపం బోడియగుటఁ గుతుక
కడ్డమై యవ్వలి కరుగక యున్న నూ
ర్పెడలమిఁ గేల నెత్తడఁచి కొనుచు

తే. చిల్లపసి యిలపై బోరగిల్లి కొంత
తడవునకు లేచి కూర్చుండి కరిన నిల్చి
నెలుకుజవ్వాలిఁ గనుఁగొని మొలుగ రాక
సన్నముగ నిట్టు లని యోఁ వజ్జంగముండు 48

క. కనుఁగొనిన మగికసహ్యత, కనికెడియీపాకతసున్ని తగ నాకై దాఁ
చినదాన వెచాలుసుమా, యని గిలిన వచటనునిచియతఁ డేగె వెసన్.

చ. అనఘతరాత్ముఁ డిట్లరుగ నంతట నక్కలుషాత్మ యార్తయై
తనచెడికాంతలం బిలిచి తామరసాయతనేత్రులార! నా
పెనిమిటి సేయుదండుగము వింటిరె! తా నొక పెద్దదాత నం
చును స్పృహ మెల్లపారడి చెడఁ దలపోసె వివేకహీనుఁడై. 50

ఉ. ఎక్కడనుండి వచ్చెనొకొ యీ ముదిజంగము వానివాయిలో

చిక్కి తరాలనుండి యొకచీమకుఁ బోవఁగ నీక డాఁచునా
చక్కని పండి నన్నడిగి సర్వముఁ బెట్టఁగఁ బంచె నింక నే
నెక్కడఁ జనికి పనింతు మరు లెత్తి ప్రియం బొనరించువానితోన్. 51
క. అప్పిండియుఁ బులగముపైఁ, జప్పగఁ దిని నైపకతఁడు పాఱఁగఁ జల్లెం
దప్పొనరించితి నేఁ జటునో, తప్పఁ జేసినవానిమీఁద దయదలఁచుదురే.
ఆ. ఏన నేకపతుల నెనసి కాఁపురముంటి, గాని యింత బెరుకువాని నెఱుఁగ
జంగమయ్యతోడ జరుపుఁ గాఁపురము దా, నింకననుచు నువిదయిల్లు వెడ
ఉ. తోసన నేఁగి పామరుఁడు తొయ్యలిఁ జక్కఁగఁ బట్టి నాతి! నిక్క [లె.
నీడి సిమేషమేనియును నే పసియింపఁగ నేర నిట్టులం
గూడు నె చాపఁబుం బెలుచఁ గోపము సేయక తప్పు సైఁచి న
న్నేఁడకుఁ బాయె పంచుఁ దనయింటికిఁ దోడ్కొనివచ్చెఁ గ్రమ్మఱన్.
చ. అటు చనుదెంచుముక్కఁ దపసి యచ్చుటఁ డించుప్రసాద మప్పుడ
క్కటి భుజియింపఁ గాంచి కడుఁ గేరుచు సొమ్మున సొమ్ముఁ జెందె మే
లిటు పసియింపఁగా వలువదే! మహభాగ్యములంచు నత్తఱిన్
పటుకున నిల్లుఁ జొచ్చి ప్రమదంబున నిద్దురఁ జెంది రిద్దఱున్. 55
తే. అంత నపొప్పత్రిభక్తిసిశాంతజంగ, మప్రసాదోపభోగసన్మహిమఁ గలన
విమలసుజ్ఞానమాత్మఁ బర్వినగిరీశ, భక్తులిచ్చినశాపంబువాసె ననుచు.
వ. ప్రమోదంబు నొంది యప్పుడ తద్దేహంబు విడనాడి గంధర్వరూపంబు
వహించి ఈశ్వరపదంబు నొందం దలంచియు నంతలోన తన
మనంబున. 57
ఆ. ఇక్కిఁ గాతపర్య నింట నుండుట సుఖ, మైతి సత్ప్రసాదమబ్బె శాప
ముజ్జగింప గంటి నొక్కమేలైన నీ, తనికిఁ బూర్వమున్నఁ దప్పు గాదె
క. కావునఁ బ్రత్యుపకారము, గావించినపిదప ముక్తిఁ గైకొనఁ దగు నే
నేవిధి నంతటిదాఁక, భూవలయమునందు నిల్తుఁ బోత్రాకృతిచేన్.
వ. అని తలంచి యచ్చటు వాసిచని యొక్క శివాలయప్రాంతంబున
నిజజన్మవర్తనంబులు మాని యీశ్వరపదధ్యానం బొనరింపుచు
నుండె నిచట. 60
క. తెలవాఱుటయు గిరాతుం, డలసతి మేల్కాంచి యాలయప్రాంగణభూ
తలమునఁ గిటిఁ గానకము నెం, గలవలమందుచును దుర్వికారాకృతులై.

ఆ. పెఱడు సిరుగు పొరుగు మఱి వాడవాడలు
పురము బయలు వెదకి సరవిఁ బందిఁ
గనక ముసలి జంగమయ్య గైకొనిపోవ
వలయు నింత నిక్కువంబు దలఁప. 62

తే. బత్తుఁడని వచ్చి యెంతటి కెత్తుకొనియె
బడుగుజంగము కూళుఁడు కుడుచునింటి
కెగ్గు చేసిన దుష్కర్మి కేటిగతియొ
యనుచుఁ జింతించి యటఁ గొన్ని దినము లరుగ. 63

క. శరవికసనంబు నిర్మల, శరసరసీభాస్వదబ్జసముదయమగు నా
శరదాగమమున మాధవ, శరదేవ్యర్చనములు చనుదే నంతన్.

క. నిండినవేడుక ధరణీ, మండలపతి చండికకు సమర్పణసేయన్
బండుగ వేఁటలు వేగొని, తెండసి తలవరులఁ బంప దృఢగతివారల్.

చ. పురిఁ గలచోటులన్ వెదకి పూర్వ మొసంగెడిచోట్ల మేష కా
సర కిటి తామ్రచూడములఁ జయ్యనఁ గైకొని యంత ఛంద్రపా
మరుఁ గని యోరి పామర! యుమాసతి పండువు గాన నీదుమం
దిరమున నిచ్చువచ్చు కిటిఁ దెమ్ము రయమ్మున నాతఁ డయ్యెడన్. 66

క. మందిరమున వసియించెడి, పంది యెటకొ తప్పిచని యేఁబండువకీక నే
చందమునఁ దెత్తునని డో, లాందోళనచిత్తుఁడగుచు నతఁడుండుతఱిన్.

చ. వనజశిలీముఖాంతకనివాసమునన్ వసియించె సూకరం
బని యొకరుండు దెల్పిన రయంబున నచ్చటి కేగి దాని బం
ధన మొనరించి తెచ్చి నరనాథుని సన్నిధి నుంచి చెంచుఁ డాఁ
జనినతదీయపోత్రిఁ గని సమ్మద మొందెఁ; మహీశుఁ డంతటన్. 68

క. ఎవ్వరు గొట్టఁగఁ జనఁ డీ, క్రొవ్వినకిటిఁ బట్టి నేన కొట్టెద నని చే
రివ్వన నసిగొని వ్రేసిన, యవ్వరఖడ్గంబు భస్మమై కనుపట్టెన్. 69

మ. నరనాథుం డతివిస్మయాన్వితమనోనాళీకుఁ డై మంత్రిశే
ఖరు రావించి విచిత్ర మయ్యెడుఁ గిటిం గన్గొమ్ముఖడ్గంబు బం
గరువై కన్పడె దీని పోఁకి యిటు లోకంబందునం గంటిమే
కిరిమాత్రం బని చూడరా దనుచు లెక్కింపంగ నమ్మంత్రియున్. 70

క. అరుదఁ దదిదేశమున నిజ, పురమునఁ గలయినుము దెచ్చి పోత్రివరకళే

బసముదగిల్చినఁ జామీ, కసమై యొకపర్వతంబునకై పడి నుండెన్.

వ. అంతటఁ దద్గ్రామవరాహం బాత్మశరీరంబు వీడుకొని గంధర్వుండై తత్సమయాగతధర్మరత్నాంచితదివ్యవిమానం బధిరోహించి జంగమప్రసాదోపభోగంబునం జేసి శాపమోచనం బందితి సుఖి నైతి నని సంతసింపుచు శివపురి కరిగెఁ దత్కోలాంగం బతివిమలశాతకుంభంబై వెలుంగుచుండె నంతయుం గని రాజపురందరుండు విస్మయం బంది యయ్యాటవికు రావించి నీ కీ వరాహం బెట్లు దొరికె నని యడిగిన వాఁ డిట్లనియె. 72

సీ. నరనాథ! విను మొకనాఁడు మాగృహమున
కెచ్చోటనుండియో యేగుదెంచి
గంజికడుగు ద్రావి కసలక యున్నంతఁ
గొంత కాలమునకుఁ గుధరభక్తి
భోజులింపఁ బోవుచు నడుగు జంగముఁ డొకఁ
డద్దమరేయి మాయాలయమున
కశనార్థియై చేర నతని కించుక చోటు
నున్ని పెట్టిన నది చొరక కొంత
తే. డించి చన నది యిక్కటికి గాంచి నమలె
నదియ మొకనాఁ డిల్లు వెడలి శివాంగణమున
నున్న యాజాడఁ దెలిసి నేఁ డుత్సవమున
కీశ్వరికిఁ బ్రీతిగాఁ దెచ్చి తిటకు ననుడు. 73

పంచచామరము. రసాతలాధినాథుఁ డబ్బురంబు నొంది జంగమ
ప్రసాదసన్మహత్త్వ మెంచఁ బంకజాతసూతికిన్
వసంబె యంచు సన్నుతించి వస్త్రభూషణాదివ
స్తుసంతతిన్ ముదం బొనర్చి తోలెఁ జెంచు నంతటన్. 74

వ. ఇట్లయ్యవనీశ్వరుచేత బహుమానాన్వితుం డై శబరాన్వయభూషణుం డాత్మగతంబున నిప్పందివలనం గాదె రాజుమెప్పంది లెక్కలేనిధనంపుఁగుప్పం దిలకింపఁగంటి మత్పూర్వజన్మసుకృతఫలం బివ్వరాహరూపంబై వచ్చి నాయింటఁ గష్టంబున కోర్చియుండి యంతంబున నన్నింతభాగ్యవంతునిఁ జేసె నయ్యనంతాకాంతునకు సంతత

సం బొనఁగూర్చి తనువు వీడ్కొని చనియెం గాని కేవలసూతకంబు
గాదని ప్రమోదంబు నొందుచు నిజగృహంబున కరుగునవసరంబున.

చ. సిరిమలతేనిఁ గాంచి నిజసీమకుఁ గ్రమ్మఱఁ బోవునట్టియా
శరణునిరర్థ్యుఁ గన్గొని ససంభ్రముఁడై శబరుండు వచ్చి భూ
వరునకు మ్రొక్కి నాఁటిగణవర్యుఁ డిదే చనుదెంచె నన్న సు
స్థిరతరసమ్మదాంబునిధిఁ దేలి మహీతలనాథుఁ డియ్యెడన్. 76

శా. ధీరామాత్యులఁ బంచి జంగమునిఁ దోడ్తెప్పించి మాణిక్యపీ
ఠారూఢుం దగఁ జేసి యర్ఘ్యమును బాద్యం బిచ్చి శశ్వన్నమ
స్కారపాత్రితము సన్నుతుల్ సలిపి లోకస్తుత్య! ప్రాంచత్కృపన్
మీ రిచ్చోటికి వచ్చుటన్ మిగుల నెమ్మిం జెందె మాభాగ్యముల్.

శా. స్వామీ! తావకభుక్తశేషము భుజించం గల్గి కోటం బయ
స్స్వామగ్రిం గనకం బొనర్చి పిదపన్ సద్రూపగంధర్వుఁడై
హేమస్ఫారవిమాన మెక్కి సురమానీశాదు లగ్గింపఁగా
సోమార్ధాంకితజూటుపీటి కరిగెన్ జోద్యంబు రెట్టింపఁగన్. 78

ఉ. కావున నీమహామహిమ గన్గొన శక్యమె యంచు నెంచున
బ్భూపరువాక్యము ల్వినయపూర్వకసారస ముప్పతిల్లఁగా
భూజవైరితుల్యుఁ డగుభక్తవరేణ్యుఁడు పల్కె నోర నీ
భావము గాననయ్యెఁ గులపావనమూర్తివి రాజశేఖరా! 79

క. భువి జంగమప్రసాదము, భవరోగౌషధము గానఁ బార్థివ! నీ కే
వివరింతుఁ దన్మహత్త్వము, ప్రవిమలమతివినుమటంచుఁ బలుకఁదొడం
[గెన్.

చ. కలఁ డొకభక్తుఁ డబ్జశరఘస్మరపాదపయోజషట్పదుం
డలఘుతరప్రభావుఁ డతఁ డక్కడ నక్కడ శైవమందిరం
బులఁ దగుభిక్ష మెత్తి జలపూర్ణతటాకసమీపధారుణీ
తలమునఁ జేరి యచ్చటఁ సుధాకరశేఖరుపూజ సల్పుచున్. 81

తే. తత్ప్రసాదంబు భోజనాంతరమునందు
నుంచి లింగార్పితంబు గావించి యార
గించి యాభాజనం బప్డు కెడతటాక
జలములో వైచి చరమూర్తి చనినయంత. 82

వ. అట్లు నీటన్ వైచినతరియం దొక్కకణం బుండి రాలిన. 83

చ. అతులితపూర్వజన్మసుకృతాతిశయంబునఁ దజ్జలాంతర
స్థితశరణప్రసాద మతితీవ్రత నొక్కఁ ఝషంబు మ్రింగి వ
ర్ధితసుపవిత్రాంగమై యట చరించుచు నుండినకొన్నినాళ్ల క
ద్భుతముగఁ జెంచొకం డడవి దూరపు వేఁటకు నేగి వచ్చుచోన్. 84

సీ. ఆ యుప్పునీరముఁ గనుఁగొని, తఱుచుగఁ గలవిచట మీలు భక్ష్యమనుచు న
న్వ్యాళకపుఁడు సంతసంబున, మెఱయుచు వలవైచి తిగిచె మక్కువతో [డన్.
తే. జాలమునఁ జిక్కి వచ్చిన మీలతోడ
సత్ప్రసాదోపభోగి ఝషంబు దగులఁ
గాంచి సంతసమున మెయి పెంచి చెంచు
చిక్కమున వైచికొని గృహసీమ కరిగి. 85

చ. తనసతిఁ జేరఁ బిల్చి వనితా! యిది చూచితె మంచిచాయమీ
న్గొని చనుదెంచినాఁడ యిది గొబ్బునఁ గూరఁగ వండి తెమ్ము నీ
వనవుడు నట్ల చేసి యది యన్నము పెట్టెఁగఁ దట్టఁ బెట్టినం
దినె శబరాన్వయోద్భవుఁడు తేపకుఁ దన్రుచు నుగ్గడింపుచున్. 87

చ. ఇది మొదలా కిరాతపతి యందఱు మేలన హింస సేయుటల్
వదలి గిరీశ్వరాంఘ్రులు దలంచుచు నెమ్మది నుండి సంతఁ గొ
న్ని దినము లేగ శీకరవనీకిటి యొక్కటి పక్కణంబులో
మకమునఁ జొచ్చి యందుఁ గల మానవులం గలగుండు సేయుచున్.

క. చనుదెంచి యాశబరుఁ గన్గొని వడి దంష్ట్రావిటంకకోటినఁ బడఁ జి
మ్మినవిగతప్రాణుఁడై య, య్యనఘుఁడు భువినొరఁగె వజ్రహతగిరివోలెన్.

ఉ. వానిఁ బరేతరాజభటవర్గము నారకబాధఁ జేయఁగాఁ
బూని కఠోరచర్యఁ గొనిపోవఁగ వచ్చిన నీశదూత లో
హో! నిలువుం డితండు మహిమోన్నతజంగమసత్ప్రసాదభు
ఙ్మీనచరప్రభావమున మేలగు పుణ్యశరీరి గావునన్. 90

చ. యమనిలయంబుఁ జేరఁగ ననర్హుఁడు పొందని కల్పభూజసూ
నమయవిమాన మాతని మనఃప్రమదంబున నెక్కఁబంచి ది
వ్యమునులు సన్నుతింపఁ బ్రమథాధిపలోకముఁ జేర్ప నాతఁ డం
దమితసుఖానుభూతిఁ గని యంచితలీల వసించెఁ గావునన్. 91

క. శరణప్రసాదమహిమము
ధరణీశ్వర! యిట్టిదని యుపం బిగురొత్తన్
జరమూర్తి తన్మహత్త్వము
చిరముగఁ దెలుపుటయు వసుమతీపతి యంతన్. 92

ఉ. క్రమ్మఱ మ్రొక్కి యోశరణరత్నమ! జంగమసత్ప్రసాదసా
ఖ్య మ్మొనరించి నన్ విమలకాయునిఁ జేయు మటన్న మంగళా
స మ్మిగురొత్త నిట్లనియె శాంకరసంశయసుధాబ్ధిరాజ! నీ
కెమ్మెయిఁ దివ్యభూతి ధరణీశ్వర! కల్గఁగ నేర్చు? చెప్పుమా!. 93

తే. భస్మరుద్రాక్షధారియై పంచవర్ణ
మంత్రపఠనం బొనర్చుచు మహితనిష్ఠ
లింగమును దాల్చి గురుభక్తిసంగుఁ డైనఁ
గాక దివ్యప్రసాదంబు గలుగు నెట్లు?. 94

చ. అనుడు మహీశుఁ డిట్లనియె నయ్య! తదీయమహత్త్వముల్ క్రమం
బున నెఱిఁగింపు నాపుడు విభూతిమహామహిమంబు దెల్పెదన్
వినుము వసుంధరారమణ! నిశ్చలచిత్తముతోడ నంచు న
య్యనఘుఁడు చెప్పఁగాఁ దొడఁగె నాత్మ దయారస ముప్పతిల్లఁగన్.

విభూతిమహిమ.

సీ. ఉడురాజధరుపశ్చిమోత్తరగతిణ
పూర్వాభిముఖములఁ బుట్టెఁ బెంగ
భాసితధవళధూమ్రారుణవర్ణంబు
లను నంరభద్రసురభిసుశీల
సుమన యన్నామభేదముల గోవులు వాని
వలన విభూతియు భసితభస్మ
మును క్షారరక్షలు జనియించె నబ్భూతి
గావించు నట్టిమార్గములు నాల్గు
తే. గలవు కల్పానుకల్పోపకల్పములను
గల్పమును నన నందులోఁ గల్పభూతి
యుత్తమం బది దొరకక యుండెనేని
తక్కినవి మూఁడుఁ జేయంగఁ దగు మహీశ!. 96

సీ. క్షితి నిభూతి యొనర్చుగతి విను ముత్తమం
బగు గోమయము భూమి నంటసీక
యంభోజపత్రంబునందు సద్యోజాత
వరమంత్రమునఁబట్టి వామదేవ
మునఁ బిండములు సేయుచును దత్పురుషమున
నారంగ నిడుచు నఘోరమున శి
వాగ్నిలో నర్చింప నగు; కల్ప మడవి నెం
తినగోమయముఁబొడి మునుపు చెప్పు
తే. కరణిఁ గాల్చిన నగు ననుకల్ప మయ్యెఁ;
దాని నాల్గింటిభూతి యస్త్రమున భూళి
తంబుగాఁ జేసి గోమూత్రమునఁ జేయు
కరుడు గాల్చిన నదియును సంకల్ప మయ్యె. 97

వ. ఇట్లుగాక తక్కినయది యకల్పంబని యొప్పె నీ యేతద్విభూతి కాలా
గ్నిరుద్రోపనిషదాదిశాస్త్రోక్తమార్గంబున సతతంబు నుత్తమాం
గప్రముఖాంగంబులఁ దివుండ్ర ధారణం బొనర్చునది. 98

క. ఇట్టివిభూతి ధరించిన, యట్టిమహామహుఁడు జగతినవయవయుతుఁడై
గట్టువిలుతుండె యగు నె, ప్పట్టున సంశయము లేదు పార్థివతిలకా!.

సీ. శ్రీకరమోక్షలక్ష్మీవశీకరణకృత్యాంకితశివఖ్యాతి భూతి
యత్యంతఘోరమహాపాతకౌఘమహీధ్రమదవన హేతి భూతి
కాలోరగత్రాణకంకణసద్వశీకరవిలేపనప్రీతి భూతి
ఫాలతలాంభోజభవపూర్వవిలిఖితపాతకాక్షరతమోజ్యోతి భూతి
తే. సతతాత్మీయమానసాసక్తభక్తిభావనాధరిమానవపాత్రనిరుప
మైహికాముష్మికోదివ్యప్రభావ, పూర్ణకాఘకారుణ్యభూతి భూతి.

వ. ఇవ్విభూతిమాహాత్మ్యంబున నొక్కయితిహాసంబు గల దెట్లనిన
నొక్కపాపాత్ముం డత్యంతరోగబాధితుం డై యెందేనిం జనిచని
ప్రాణాంతసమయంబున నొక్కపట్టణబాహ్యాంతరదేశశ్మశానవాటికా
సమీపంబునఁ గళలంజాలక పడియున్న నొక్కసారమేయం బచ్చ
టిశ్మశానభస్మసంగతపాదయై వచ్చి యప్పాపాత్ముపాపకలంబు ద్రొ
క్కి చనినకొంతవడి కతండు మృతిఁ జెందిన కింకరు లతనిం గొనిచను

వైవస్వతాంతికంబున నిల్పినకృతాంతుం డతనిప్రాణాంతసమయంబునం
దైనభస్మధారణమహత్త్వంబువలనం గల్మషంబులుఁదొలంగి పుణ్యా
త్ముం డయ్యె నితండు మదీయదండనంబున కనర్హుం డనిన బహుమా
నంబుగా నతని శివలోకంబున కనిచెం గావున భస్మధారణమాహా
త్మ్యం బిట్టిదని మఱియు ని ట్లనియె. 101

వ. ఒకచో దేవుఁడు ఘోరపాపకర్ముఁడై యుండంగఁ దద్బాంధవ
ప్రకరం బాతనిదుష్కృతంబులు సహింపన్ లేక వెల్వెట్టినన్
సకలంబున్ విడిపోయి ఘోరవిపినస్థానంబునన్ బల్కారా
తకదేశంబునఁ జేరి యందు నతిక్లేశం బంది వర్తింపఁగన్. 102

తే. అతఁడు ఘోరాఘమహిమ మంత యనుభవింప
పలయు ననుమాట జనులకుఁ దెలియునట్లు
లమ్మహీసురుదేహంబునందుఁ గుష్ఠ
రోగము జనించె నొరులకు రోఁత దనర. 103

తే. ఒడలు చూచిన జను లెల్ల నోకిలింప
గాలిచే దూరమునకు దుర్గంధ మొదవ
నడు గిడఁగ శక్తి యించు కంతైన లేక
పట్టుదెగిపడు మేనుచేఁ బాటుఁ డుండి. 104

క. ఒకనాఁ డా కటఁ బడ నో,పక తత్పక్కణసమీపవనిఁ దిరుగుచు నం
తకమున్ను దవానలద,గ్ధకుజామితభస్మ మచట గనుఁగొనియందున్.

తే. మండి చల్లాఱినట్టిగోమయపుఁగరడు
గాంచి యాఁకట డస్సినకతన వేగఁ
బుచ్చుకొని తిని యబ్బూదిప్రోవునందుఁ
బడియె నడువంగ లేక యాబ్రాహ్మణుండు. 106

చ. అటు పడియున్నతీవ్రగహనానలదగ్ధమహీజలోష్మతన్
బటపట మేను వ్రక్కలయి పాఱునిదేహము వీడ నత్తఱిన్
గుటిలభయంకరాకృతులు ఘోరగదాయుధపాణులై సము
ద్భటగతి వచ్చి కింకరులు దట్టుచు వే గొనిపోయి యాతనిన్. 107

ఉ. కాలునిమ్రోల నిల్ప నతికంపితదేహముతోడ దూతలన్
దూలఁగఁ బల్కి యాతఁ డతిదుష్టవిచేష్టితుఁడైననేనియుం

గాలము సేయు వేళ భవనాశకభస్మము మెక్కి పూయుటన్
దాలిచె శైవతేజ మిటు దా వసియింప ననర్హు డెమ్మెయిన్. 108

క. అని వైవస్వతు డాతని, ఘనతరపుష్పకవిమానగతు జేసి ముదం
బున సుర లచ్చెరువందగ, ధనదప్రియనగరి కతిహితంబుగ ననిచెన్.

క. కావున నిట్టిది త్రిజగ, త్పావనభసితప్రసిద్ధి పార్థివ! యిక స
ద్భావమున వినుము దెల్పెద, గేవలరుద్రాక్షఫలముకృతభవహారమున్.

ఉ. రాక్షసదంశనాయకపురంబులు గూల్పు దలంచి సూటిగా
వీక్షణ మొప్ప జేయుపృథివీరథులోచనకంకణోత్కరం
బీక్షితి రాలి భూజనుల నెల్ల బవిత్రుల జేయ బూని రు
ద్రాక్షనగంబులై జనన మందె మహామహిమంబు మీఱగన్. 111

రుద్రాక్షమహిమ.

చ. అకలుషసోమపావకమిహిరాంశసమిద్ధశివాక్షసన్నిభుల్
శికితలచుట్టి కర్ణయుగళిన్ గళవక్షములందు గక్షబా
హుకరతలాంతికంబుల సమున్నతిచే ముఖసంఖ్య లేర్పడన్
బ్రకటితభక్తి దాల్చిన నృపాలక! చంద్రధరుం డతం డగున్. 112

సీ. ఒకకిరాతకు డుమహేశాగ్రాటవికి వేటలాడంగ జనిచని యందునొకస
రోవరతటమున రుద్రాక్షగని దాని సారమేయముకంధరమున వేడ్క
గీలించి మాఘోటకృత్యతనుండంగ ఘనవనక్రోడంబు గాంచి శునక
సహితంబుగా వాని జంపిన నంతట నీశ్వరకింకరు లేగుదెంచి

తే. హస్తివారిరుహమున రుద్రాక్షముట్టి
నట్టిఫల మబ్బె నీకని యతనివాని
జాగిలంబును జేర్చిరి శర్వపురికి
గాన రుద్రాక్షఫలమిది మానవేంద్ర! 113

క. అని మఱియు బంచాక్షరీమాహాత్మ్యం బిట్లని చెప్పందొడంగె. 114

పంచాక్షరీమహిమ.

ఉ. శ్రీతుహినాద్రిజాత్మసరసీజశిలీముఖు డర్కపావకా
బ్జాతవిలోచనుండు సురసంయమిపూజితపాదపద్ముడు
ద్ద్యోతితదేవదానవగజసముద్ధతగర్వవిదారియై లస
త్ఖ్యాతి వహించి మించె మనుజాధిప పంచముఖుండు లీలచేన్. 115

తే. అట్టి శ్రీమన్మహేశుపంచాననముల
వలనఁ బంచాక్షరము లుద్భవంబు నొందె
వరుసఁ బంచాక్షరి యనంగ వన్నె గాంచె
నదియు వేర్వేఱవి వరింతు నాలకింపు. 116

సీ. వరుస సద్యోజాత వామదేవాఘోరతత్పురుషేశానతత్ముఖములఁ
గలిత నకార మకార శికార వాకార యకారముల్ క్రమము జనించె
నవి పోఁగుపడి పంచాక్షరంబన నొప్పనా మంత్రరాజమైయలరె జగతి
తన్మంత్రమాతసత్ప్రణవయుక్తంబుగా జపియించినను షడక్షరియునయ్యె
తే. సతతపంచాక్షరీమంత్రజపవిధాన
వేది యరయ సాక్షాత్పరశివరథుండు
గాని కేవలుఁ డగుజనుఁ డనఁగవలదు
శంక యించుక లేక రసాతలేంద్ర! 117

క. పంచాక్షరి సురధేనువు, పంచాక్షరి కల్పకంబు పరికింపంగాఁ
బంచాక్షరి చింతామణి, పంచాక్షరిఁ బోలఁ జగతి ఫలదము గలదే.

తే. మఱచియును నొకమాఱు నమశ్శివాయ
యనినమాత్రాన బ్రహ్మహత్యాదిపాత
కావళులు దూఱంగు ననిన నిత్యంబు సలుపు
జపఫలం బెన్న నలువకు శక్య మగునె? 119

వ. ఇప్పంచాక్షరీమాహాత్మ్యంబున నొకయితిహాసంబు గల దెట్లనిన దొల్లి దాశార్హమహీవల్లభాఖండలుండు కాశీరాజతనయయగు కళావతిం బెండిలియాడి ప్రథమసమాగమదినంబున నఖిలమంగళాభరణాలంకృతసౌందర్యగాత్ర యగుచు విచిత్రం బయిన కేళికామందిరంబునఁ దనపజ్జ వసియించుదానిం గని మదనప్రదరవిదళితహృదయుం డై యుపగూహనం బొనరింపంబోయిన నచ్చపలాక్షి మున్ను కన్నియ యై పిన్నతనంబునఁ గన్నవారింట నున్నసమయంబునఁ దన చేసినయుపచారంబునకు మెచ్చి భర్గసమానుం డగుగర్గుఁ డను సంయమి పంచాక్షరీమంత్రోపదేశ [illegible] త్రంబు గల యది కావున నపరిగృహీతమంత్రుం డగు [illegible] గాత్రుం గదియ నొల్లక శివమంత్రోపదేశంబు గనినప్పుడే మదియ సంభోగం బనుభవింపు

మని పెక్కుభంగుల వారించిన వినక పుడమిఱేఁడు కామాతు రుండై పయిం బడఁబోయిన నమ్ముద్దియమేను కాలినయినుపము ద్దకన్నఁ దద్దయు వేఁడిమిగ్రయై పొడచూప వెఱచి దూరంబున నిలిచి హరమంత్రప్రభావం బిట్టిద యని తలంచి యప్పుడప్పతి యనుమ తంబున గర్గాశ్రమంబునకుఁ జని యతనిచే శైవపంచాక్షరీమంత్రో పదేశంబుఁ గైకొనునంతలోనన పశ్వజ్ఞనులు విస్మయంబు నొందఁ బూర్వజన్మఫలంబులు కాకంబులై పక్షుంబులుగ మఱి నిజదేహంబు వలన వెడలి పడుటయు నారాజశేఖరుం డానందకంపళితహృదయా రవిందుం డై యాచార్యున కిష్టవస్తువు లొసంగి వీడ్కొని తనకు సద్గతి చూపుటకు భార్యఁ బెక్కుభంగుల నుపలాలించి తజ్జలదాలక వలన నిష్టోపభోగంబు లనుభవింపుచు నుండెఁ గావునఁ బంచాక్షరీ మాహాత్మ్యం బిట్టిదని తెల్పి యోగిపుంగవుం డద్ధరావరునితో మఱి యు నిట్లనియె. 120

మ. అతిథీ! మద్గురుభావసంభవము వేదాతీత మత్యుత్తమం
బతులం బవ్యయ మప్రమేయ మగమం బానందకందంబు న
క్షత మాద్యంతవిహీన మై పరగు లింగంబుల్ మహాభక్తిసం
గతుఁ డై దాల్చినవాఁడు ముక్తివనితాకాముండు గాకుండునే! 121

ఉ. ఇట్టిపరాత్పరుల్ శివు మహేశ్వరు నవ్యయు భావమందునన్
బుట్టఁగఁ జేసి సంతతముఁ బూజ లొనర్పఁగ శిష్యుచేతిలోఁ
బెట్టి షడక్షరం బనఁగఁ బెంపు వహించెడిమంత్రముం జెవిం
దొట్టఁగఁ జేయుసద్గురినితో నొరులన్ సరిసేయవచ్చునే? 122

క. గురుఁడే తల్లియుఁ దండ్రియు
గురుఁడే దైవంబు దాత గురుఁడ సకలమున్
గురుఁ డనఁగ హరుఁ డనంగాఁ
బరికింపఁగ వేఱె కలదె? పార్థివతిలకా. 123

సీ. ఆచార్యసత్కరుణాలోకనము సేవ
కాజ్ఞానతిమిరం బడంచుజ్యోత్స్న
గురుహస్తవత్తభాసురభసిదాదాన
భక్తి మహారాజ్యపట్టకలన

యుపదేష్టృభక్తపాదోదకంబులు శిష్య
కల్మషదావాగ్ని కమలవృష్టి
వరదేశికేంద్రదివ్యప్రసాదామృతం
బాశ్రితజన్మరోగౌషధంబు
తే. ధ్యానమూలంబు గురుపురంధరునిమూర్తి
మూల మగుఁ బూజలకు గురుముఖ్యపదము
మంత్రమూలంబు గురుచర్యమాట మఱియు
మూల మగు సద్గురునికృప ముక్తి కనఘ! 124
క. గురుపాదభక్తిపరులకుఁ, బరికింపఁగ నంపరానిపదవులు గలవే?
నరవర తత్ప్రతిబింబిత, శరణమహత్త్వంబు నుడువ శక్యం బగునే.
చ. శరణుల కర్థి మ్రొక్కి యుపచారము సేయఁ దదీయసద్గుణో
త్కరము నుతింపఁ దత్పదముఁ గన్గొన వారలసచ్చరిత్రముల్
వరుస వినంగఁ బాల్పడినవానివశీర్ష కరాబ్జజిహ్వకా
పరనయనశ్రుతుల్ మనుజవల్లభ యిట్టుల గాని వేటికిన్? 126
క. జంగమవర్య దయారస, సంగతమగునేని యట్టిజంతువును దినల్
గంగాధరుకృపగనునృపపుంగవయితిహాస మొకటిపాలుపుగవినుమా.
ఉ. ఆగమవేదియైన శరణాగ్రణి యొక్కఁడు భక్తియుక్తుఁడై
శ్రీగిరిమల్లికార్జును భజింపఁగఁ బోవుచు నెండకాఁకచే
డాఁగఁ దలంగలేక యొకతావున నిల్చి జనాళి మించె నే
నేగతి నేగువాఁడఁ బరమేశ్వర యంచు. దలంచుచుండఁగన్. 128
మ. ఒకభేరుండము శాల్మలీస్తబక మయ్యుర్వీస్థలిన్ గాలిచే
శకలంబై పడియున్నఁ గాంచి యది మాంస మ్మంచు నెందేని బో
వక మింట న్నిల దానిచాయ మెయిఁ బర్వన్ వేగ నత్తర్తి కాం
చి కడుం దెప్పిరి మస్త మూచి యతఁ డక్షిణప్రమోదంబునన్.
మ. అహాహా! యీపతగాధినాథుఁడు మదీయంబైన తాపంబు పెం
పు హరించెన్ ఘటియించె నాకుఁ ద్రిజగత్పూతాపగాదిష్యవా
ర్గహరీసంతతఖేలనోత్సుకరమారాజేషురతోల్లస
ద్గ్రహాశృంగాగ్రణినూతనాంకపటదేదీప్యప్రభాలోకమున్. 130
చ. ఇతఁడు మదీయమిత్రుఁ డని యెంచి కులాయముఁ గన్గొనంగ నో

పతగసరేణ్యా! మాయయసుఁ బాత్రుఁడ వైతివి గాన మీఁదటన్
క్షితితలమందు నీవుహిమశైలమరాయుఁ డనంగ రాజసం
తతి నలయు వృష్టి భూభరణపేద్దుఁడ వై తుదిఁ జెందు మీశ్వరున్.
చ. అని యిటు లానతిచ్చి శరణాగ్రణి శ్రీగిరి కేగి మల్లికా
ర్జునపదముల్ భజింపుచు మహల్లలనాకరచామరౌఘవీ
జనభవవాతలోలవిలసచ్ఛ్రిమరన్భ్రమరన్ సదా మనం
బున సిడి కొల్చుచున్ భవనపూజితుఁ డచ్చట నుండె సంతతన్. 132
శా. శేషం డాండజ మంతఁ గొన్ని సమముల్ పృథ్వీతలంబందు సం
చారం బొప్పఁగఁ జేసి యంతరమునన్ సత్పాలసూఫీశపూ
జారాజఁ గని క్రమ్మఱం భువిని భాస్వద్రాజసంశోంబునన్
సిరాగేసరి చేరమాధిపతి నా విఖ్యాతి సంజాతుఁ డై. 133
ఉ. వైరుల సంహరించి పరవాదులయే పణఁగించి యిష్టలిం
గారవ మొప్పఁ బెంచి శితికంఠునిదేహమునన్ ధరించి ప్ర
జ్ఞారతి మించి లింగగురుజంగమభక్తి వహించి దిక్కులం
దోరపు గీర్తి నించి పరితోషమతిన్ ధర యేలె నెంచఁగన్. 134
శా. ఈరీతిన్ వివిధేష్టభోగములచే నేకాతపత్రాసనీ
భారం బొప్పఁగ దాల్చి దేవతలు సంభావింప నంతంబునన్
శ్రీరాజార్ధకిరీటిపీఠి కరిగెన్ జెన్నొందుభక్తప్రభా
వారూఢిన్ వినుతింప శక్య మగునే జ్యాలోకరత్నామణీ. 135
క. అని తెల్పినజంగమప, ద్వనజములకు జాగి మ్రొక్కి వసుధావరుఁ డి
ట్లని యెన్న టులంగాదే, నను ముక్తునిజేయు మనుచు నమ్మితిసన్నున్.
క. కావునదీక్ష యొసంగుము, దేవా యనుటయు వదీయధృతిమతులనుఁ దా
భావమున నలరిసీ కిష్టావాప్తి ఘటింతుననుచు హర్షముతోడన్. 137
సీ. స్నానసంధ్యాదులు సల్పఁగా నియమించి
తతభూతిరుద్రాక్షధారిఁ జేసి
శ్రుతిహితంబుగ బరంజ్యోతిరాకారలిం
గము ధరియించి మోదమునఁ బ్రణవ
సహితపంచాక్షరీసన్మంత్ర ముపదేశ
మొనరించి సద్భక్తిచిత్తునిగఁ జేసి.

చరణాబ్జతీర్థప్రసాదముల్ కృపచేసి
నిజశిష్యుఁగాఁగ మన్నించి యంత
తే. వీరశైవరహస్యముల్ వెలయఁదెలిపి
తన్మహీవరుచేత సత్కార మంది
భూజనులు తన్నుఁ గొనియాడ నైజదేశ
మునకు వేంచేసె జంగమముఖ్యుఁ డంత. 138
క• ఘనముగ నచ్చున నొ త్తిన
యనువున నాశరణుబోధ మాత్మ వహింపన్
జనపతి సతతము త్రివిధా
ర్చనములు సల్పుచును దనదుస్వాంతమునందున్. 139
క. నాయేలు భూమిలోపలఁ, గాయజహరభక్తుఁడొకఁడు గానఁగఁబడఁడ
య్యో! యెటులనైనఁ బరగుజను, లాయతదుష్పాపభాజ లయ్యెదరు గదే!•
ఉ. హా రొనరించుపాతక మవశ్యము నాకు ఘటించుఁ గాన నే
నూరక చూచుచుండు టది యుక్తము గా దని యెంచి యప్పుడే
చారుల నంపి యందఱ వెసం దనయొద్దికిఁ బిల్వఁబంచి యా
భూరమణుండు భక్తిరతి పుట్టఁగ శైవమతాధికత్వమున్. 141
ఉ• గౌరవ మొప్పఁ జెప్పి తిరుగంబడువారి కమేయవస్తుసం
భారము లిచ్చి దృష్టములు భావము రంజిలఁ జూపి లింగసం
స్కారులఁ జేసి పూర్ణముగ స్వాస్థ్యము లచ్చెరువందఁ జేసినన్
వారలు సంతతప్రమదవారిధిఁ దేలి వచించి రీగతిన్. 142
ఉ. ఔరా! యెంతటిభాగ్య మబ్బెఁ గడు మేలౌ నిత్యము క్తిక్రియా
పారీణత్వము సంభవించెఁ బటుదుష్పాపౌఘ మెల్లన్ మహా
దూరంబై చనె నిమ్మహీశువలనన్ దోషంబుగా బిడ్డలం
జేరఁ దైవ్వెట్టెద నింత రాజుసరి రూపింపంగ లే రెచ్చటన్. 143
తే. కొల్లలవలె నని చెంపలు గొట్టి తల్లి
బాలురకుఁ బాలు ద్రావించుపగిది మనలఁ
బెక్కుభంగుల శిక్షించి యక్కజముగఁ
బుణ్యమార్గంబుఁ జూపె నిప్పుడమిఱేఁడు: 144
క, అని యెండొరులాడుచున్న, జ్జనపతి యనుమతిని నాత్మసదనంబులకున్

జని సంతతభర్గారా, ధనరతి వసియించి రతిముదం బిగురొత్తన్.

వ. కావునఁ బ్రసాదమాహాత్మ్యం బిట్టి దని తెలిపి చూచి దేవాదిగణం బులతో సకలేశ్వరమాదిరాజయ్య యేతత్ప్రసాదమాహాత్మ్యం బిం కను వినుమని యి ట్లనియె. 146

సీ. రాజితకాంచనరత్నసిర్మితసౌధగోపురావరణసందీపితంబు
కమలినీకహ్లారకుముదనిర్మలనీరకలితకాసారవికాసితంబు
నిర్జరకామినీదుర్జయశృంగారవిభ్రమాబ్జాననావిశ్రుతంబు
సంతతసముచితజాత్యనుగుణమార్గపథకచాతుర్వర్ణ్యసంపన్నంబు

తే. భవ్యచతురంగబలచయభ్రాజితంబు
నిరుపమోద్యానవాటికాసురుచిరంబు
దేవతాగారసందోహభావితంబు
పుణ్యనిలయంబు సింహాద్రిపురవరంబు. 147

వేదపితామహుని కథ.

ఉ. ఆనగరంబునందు ఫణిహారపదాంబుజభక్తుఁ డంతర
జ్ఞాని త్రిలోకపూజితుఁడు షట్ప్రతిపక్షవిదారణుండు భ
క్త్యానుగుణప్రబోధ యపహాయుఁడు వేదపితామహుండు నాఁ
గా నొకభక్తపుంగవుఁ డఖండితశైవమతప్రచారుఁ డై. 148

క. నివసించు నతనిశిష్యుఁడు
ప్రవిమలతరభక్తిపరుఁడు బంధువిదూరుం
డవితథవాక్యధురీణుఁడు
భువి వామనుఁ డనఁగ నొక్క పుణ్యుఁడు వెలయున్. 149

తే. ఆతఁ డనిశంబు గురుపదాబ్జాతములకు
సేవసేయుచుఁ దద్భుక్తశేషసుధ ము
దమునఁ గాంచుచు నొకసంయమున నతని
తోడ నొకనాఁడు వినయంబుతోడఁ బలికె. 150

తే. అమరగణములలో నెవ్వఁ డధికుఁ డెట్టి
చందమున మోక్ష మబ్బు నిజ్జగమునందు
నేమతం బుత్తమం బగు నెత్తెఱంగుఁ
దెలియ నానతి యిమ్ము సందియము దీఱ. 151

చ. అని యిటు పల్కుశిష్యువినయంబున కాత్మ ముదంబు నొంది యో
ఘనతరపుణ్య! నీదుమదిఁ గల్గినసంశయ మెల్లఁ దీర్తు నం
చనఘుఁడు లింగజంగమమహామహిమంబులు సత్ప్రసాద సే
వనఫలముల్ దయారసము పర్వఁగఁ జెప్పఁదొడంగె న త్తఱిన్.

సీ. బ్రహ్మాదిదేవతాభర్త జగత్కర్త
శంబరదానవశత్రుహర్త
యనితతాపసనేత యఖిలభక్తత్రాత
యత్యంతబలపురదైత్యజేత
శూలసంగతకేలి భవవిభంజనశీలి
భాసురానంతవిలాసశాలి
కుముదబాంధవధారి యమమదసంహారి
గ్రావరాజసుతామనోవిహారి

తే. యవ్యయుం డచ్యుతుండు సర్వాత్మకుండు
భావనాతీతుఁ డగుమహాదేవుఁ డెందు
దేవుఁ డగుఁగాని తక్కినదేవతలను
దైవ మని కొల్వవల దిది తథ్య మనఘ!. 153

ఉ. భూవిదితంబు లోకచయపూజితమాతతఘోరపాపసం
ఘావనధుర్య మీశ్వరపదప్రతిపాదక ముత్తమోత్తమం
బావృతపాశబంధహరణాకరమై వెలుఁగొందునట్టి యీ
శైవమతంబుతోడ నెన సల్పఁగ వేఱెమతంబు గల్గునే. 154

ఉ. ఇట్టిది శైవ మిందుఁ గడు నొచ్చగుచుత్తరశైవ మర్థిఁ జే
పట్టినపుణ్యమూర్తి సుమబాణవిరోధి యనంగవచ్చు నే
పట్టున సంశయింపకుము భర్గుఁడె భక్తుఁడు భక్తుఁ డీశుఁడౌ
గట్టిగ నీశభక్తులకుఁ గల్గదు భేద మొకించుకేనియున్. 155

తే. పుడమి నొక్కొకభక్తుఁడు నడుచుచర్య
లహహా! యెబ్భంగి లెక్కసేయంగవచ్చు
వారిమాహాత్మ్య మంబికాధారుఁ డెఱుఁగుఁ
గానఁ దదధీనుఁ డై యుండు మాన కెపుడు. 156

క. చరలింగార్చన సేయక, గురులింగార్చనలు సేయఁబోఁడదు విను త

ద్గురులింగంబులకింటెను, జరుఁడేయధికుఁడని పల్కు సకలశ్రుతులున్.

సీ. భక్తుండు గురుఁ డుమాపతిశిష్యుఁ డనుటకు
గుఱుతుగా గణపాలకుండు సాక్షి
భక్తుండు తండ్రి శ్రీపతిబాణుఁ డాత్మజుఁ
డనుటకు భల్లాణఘనుఁడె సాక్షి
భక్తుండు వేఱ బంటు భవుఁ డని యనుటకు
దూషిగా బాణాసురుండె సాక్షి
భక్తుండు కొల్వరి పరమేశు డోటరి
యనుటకు శ్వేతవాహనుఁడె సాక్షి

తే. తాను గోరినవస్తు వేమైన గాని, భక్తులీయకగతి లేదు భవుని కెందు
శరణనష్కాసిసత్కటాక్షంబు దేవ, భూజమాణిక్యధేనువుల్ పుట్టినిల్లు.

సీ. కాలారిగణపాదధూళి మై సోఁకిన మర్త్యునిదురితముల్ మ్రగ్గిచనవె
ధూర్జటిభక్తులుద్రొక్కినదారిపు ఱుఁబారలు వాఁడఘతతుల్ పోవవె
శర్వభృత్యులతనుచ్ఛాయమైబొలసిన నరుఁడు కల్మషములబోరిగొనండె
హరశరణస్నానశరకుండతలపంక మంటిన జనుఁడు నిర్మలుఁడుగాఁడె

తే. పరమపావనజంగమప్రతతితోడ
సమరకిన్నరయక్షవిద్యాధరాహి
సాధ్యగంధర్వమునిసిద్ధసారసార్ష్ట
చంద్రముఖ్యగ్రహాదులు సాటియగునె? 159

తే. శ్వపచుఁ డైనను హరలింగసహితుఁ డేని
యవనిలో నుత్తమోత్తముఁ డనఁగఁ బరగు
నట్లు గావున శరణదివ్యప్రసాద
సేవనము లేక ముక్తిసి జెంద నరిమె. 160

క. ఏవిధమున నైనను మోహావహ శరణప్రసాద మానఁగవలయున్
బావనసద్బ్రహ్మాంతస్థం, బావంతయు దారకెనేని యమృతముఁ జెందున్.

క. అని తెల్పిన దేశికసద్వనజములకుఁ జాఁగి మ్రొక్కి వామనుఁడు ముదం
బునఁ దేలెనన్నుఁగరుణం గనెగురుఁడని యంతకొంతకాలము చనఁగన్.

ఉ. ఆపురిలోన నుండుగొడగవ్వ యన న్నొకభక్తురాలు రు
ద్రాపరమూర్తులైనశరణాఢ్యులపాలిటివాలుమేలు దు

ష్వాపవుఁగొండప్రోవునకుఁ బొకనిషూదను చేతివాలు చి
ద్వ్యాప్యపితవాక్యసంచయసుధారస మానఁగ జాలు లేఁడనన్. 165

క. ఆవేలఁది ప్రసాదముగొనఁగా వేదపితామహుండు కాంక్షించిమది
న్నే విప్రకులుఁడ జననిం, దా వాప్పుఁడ నగుదునచటికనుగుదు నేనిన్.

క. నింపకు లోఁబడియుండినఁ, జెంపదు తత్సాప్రసాపసేవ గొనక నే
నిందుధరుఁ జెందు టెటులీ, బొందివిడ పిపే తబొందిపొందికొని యెదన్.

చ. అని యిటు లాత్మలోఁ దలఁచి యంత ఆ శిష్యుఁడు దాను నిచ్చలం
జని మఱికొన్ని నాళ్లకు సశాకరశేఖరతుల్యుఁ డైనయ
య్యనఘుఁడు గంగలో జలకమాడి మఠంబున కేగుచుండి దా
శునకకళేబరం బొకటి చూచె మఠంబునఁ బ్రాణహీనమున్. 166

తే. చూచి దీనిశరీరంబుఁ జొచ్చి మఱుఁగు
దనర గొడగవ్యాసత్ప్రసాదంబు గొందు
ననుచు సంతోషపూరితుం డగుచు హృదయ
పంకజంబున నొక్కయుపాయ మపుడు. 167

చ. కనుఁగొని తత్సమీపమున క్ష్మాజముచెంతలఁ జేరి శిష్యుతో
నని యెముహూర్తమాత్ర మిట నాతపవహ్నినివారణార్థమై
యనువుగ విశ్రమింత మని యాతఁడు దానును దానిఁ జడ
ల్లనిపవమానమందున నిలఁ వసియించిరి మోదచిత్తులై. 168

ఉ. అటు వసియించి యాత్మకృత మాతని కేర్పడనీక శిష్య నే
నిట నిదురింపఁగావలయు నీ వతిజాగ్రతతోడ నుండు మె
చ్చుటకిఁ జనంగఁబోకు మని ఛాత్రునియూరువు మేల్తలాడఁగాఁ
గుటిలపు నిద్రఁ జెందె మదిఁ గొంకక తద్గురుపర్యుఁ డత్తఱిన్. 169

తే. అసమ మైనట్టి యితరకాయప్రవేశ
విద్య తనయందుఁ గల్గుట చోద్య మలర
నాత్మదేహంబు వెడలి తదంతికస్థ
శునకదేహంబుఁ జొచ్చి గ్రక్కునను లేచి. 170

ఉ. నాలుకఁ బైట వేయుచు ఘనంబుగ రోఁజుచు నావులించుచున్
నేలనుమూరకొంచుఁ గడునిక్కుచుఁ బొర్లుచుఁ జొంగ రాల్చుచున్
వాలముఁ ద్రిప్పుచున్ శిరము వాల్చుచుఁ గర్ణములన్ విదల్చుచున్

మూలుగుచున్ వెసం జనుచు మోఁగ యొకించుక మీఁదికెత్తుచున్.

మ. చని తత్పట్టణబాహ్యదేశగతమౌ చండాలవాటిన్ వసిం
చినదానిం గొడగఃవ్వ భక్తసహితం జేరంగ నేతెంచి యా
వనితామాళికి భక్తి మ్రొక్కుచుఁ బురోభాగంబునన్ నిల్చినం
గని దివ్యేక్షణసంగతిం దెలిసి యుగ్రస్వాంతయై యిట్లనున్ 172

మ. స్వకులభ్రాంతిని వీడఁజాలక విశిష్టంబైన తజ్జంగమా
ధికవేషంబు పరిత్యజించి శుని వై తే మేలు మే లౌర జీ
వికి భావింపఁ గులం బొకండు గలదే! వింతయ్యె నీమందబు
ద్ధికి సద్భక్తులు నవ్వరే! తెలియరాదే భక్తిమార్గంబులన్. 173

క. ఎంపటియోనిఁ బుట్టితి, వెంపఱచను బొలుఁద్రావి తెన్ని కులములం
బొందుగ వసియించితివి ప్రపంచమె విప్రుండననియహంకృతిఁ జెందన్.

తే. పెద్ద లెల్లఁ బ్రతిష్ఠించు శివలింగ
మూర్తి యగుఁగాని శిల యను మొఱకు గలఁడె?
యట్టిగతి దివ్యలింగాంగి యైనవాని
జాతిభేదంబు లెంచుట నీతి యగునె.? 175

క. అని పల్కి కుక్క! యిటు ర
మ్మని పెంచుకలోన సింత యన్నము వైవం
దనభాగ్య మింతె యౌ నని
కొని యతివకు మ్రొక్కి యతఁడు గుందుచుఁ జనియెన్. 176

చ. చని యొకచోట నాశునకసంహననంబును వీడి నిద్రమే
ల్కనుగతి లేచి కన్నులు కరంబుల నుల్చుచు బిట్టు నీల్గుచున్
దనప్రియశిష్యుఁ జూచి సదనంబునకుం బదమౌ యటన్న వా
మనుఁడు గురుం డొనర్చు బలుమాయ లెఱింగి సభక్తియై యనెన్.

చ. నను విడనాడి మీరు శుభానాగతి నాగొడగవ్వమందిరం
బునను బ్రసాదముం గొనఁగఁ బోలునె? దేశిక తావకీనభా
జనగతసుప్రసాద మనిశంబు భుజింపుచు నేఁడు మిన్న కే
యునువున నుండువాఁడ నిఁక యబ్బుఁ లెల్లు భవత్ప్రసాదముల్.

ఉ. ఇత్తఱియైన నాకు సెఁ వీఁదగు నచ్చటి కేగి వేగమే
నత్తు రనన్ గురూద్వహుఁడు వామన! లోకు లెఱుంగఁ బోవరా

న త్తరళాక్షి నన్నుఁ గనినట్టుల యాఁగ్మృతకాంగికైన నీ
వె త్తెఱఁగొప్పనే గనవొ యేగిప్రసాదము గొమ్ము నావుడున్. 179
చ. గురువరపాదపద్మములకుం బ్రణమిల్లి మహాత్మ! జంగమో
త్కరముల పెంచఁగా నసి హితంబుగ మీరలు చెప్ప వించు నె
ప్పరుసున లోకసింహలకు భాగమునందు భయంబు నొందనే
శరణవరప్రసాదఫలసౌఖ్యము గాంచుట లెట్టు లెంచఁగన్. 180
క. కావున సహజాకృతిచే, నావనితామణిఁ యింటి కరిగెద నసి స
ద్భావమునగురుసియసుమతి,భూవిదితముగాగనతఁడుపోవగుచుండున్.
ఉ. శిష్యుని మేలిబుద్ధి నసుఁ జెందక పోక స్మృతీతిహాసన
దృష్టప్యము లెన్ని యేని సతతంబు గ్రహించియు భక్తిమార్గపై
దుష్యము గాన నైతి మఁ రొట్టినమంచత లోకు లెల్ల నన్
మాష్యము నేతు దగ్ భయముతోఁజరియించితి మీ పెఱుంగమిన్.
క. అనిదగలపెగలఁబొగులుచుఁ,దనమదమునకేగెనంతతచ్ఛిష్యుఁడుప్రా
క్తనసుకృతమహిమవలనన్,జనియాగొడగవ్విదిచ్యాసదనముగాంచెన్.
తే. కాంచి లోపలి కేగి యక్కాంతయడుగుఁ
దమ్ములకుఁ జాఁగి మ్రొక్కి యోయమ్మ! నీమ
హాప్రసాదంబు మద్గురుఁ డారగించు
పాత్రమం దిడి కరుణించి పంపు మనిన. 184
తే. ఎంతదాసోహపరుఁ డితం డెంతధీరుఁ
డెంతగురుభక్తినిష్ఠాత్ముఁ డెంతధన్యుఁ
డెంతసాహసుఁ డని యెంచి యింత యతఁడు
వేఁడుమాడ్కిఁ బ్రసాదంబు పెట్టుటయును. 185
క. పరమామృతమనివామనుఁ,డరుదందుచుగుడిచి లేచినంతట నెదుటన్
సులవకానియక్షువిద్యా,ధరగరుడోరగులుగొలువదయమదిబొందన్.
సీ. ఘనవృషభేంద్రుండుగాలిమేపరిసిండుపాజిగాభూషణరాజిగాఁగ
గట్టులదొరచూలుకడిది బెబ్బులితోలు నాలుగాఁబలుపన్నె శాలుగాగ
గడలిఁబుట్టువిషంబు కాముబ్భసితంబు మేఁతగా నెమ్మేనిపూఁతగాఁగఁ
బావకజ్వాలంబుబలుపైననసూలంబు బొట్టుగాగడుపోటుముట్టుగాఁగ
రమ్యతరవసుంధరాధరాధరములు, తేరు గాఁగ వింటితీరు గాఁగ

దనరునట్టి శ్రీసుధాకరశేఖరుం, డభవుం డచట నిల్చె హర్ష మలర.
తే. ఇట్లు ప్రత్యక్షమైనసర్వేశ్వరునకు, వామనుండప్డు సాష్టాంగవందనంబు
లాచరించియమందమోదాత్ముఁడగుచు, విమలసద్భక్తినిట్లని వినుతిచేసె.
సరోజస్రగ్లఘుగీత.—
శరనిధిశయనశర! శరకరవహనర, జనకరనయన! కరిదితిజహరణ! గర
గళ! సకలయతితతినతికలితచరణ!, ధనదసఖ! క్షితిరథ! రజతనగశరణ!
చ. అని నుతియించువామను దయాపతిఁ గన్గొని యోకుమార నీ
యనితరపుణ్యభావమున కిచ్చెరువందితిఁ గాన మానికే
తనమగు రౌప్యభూధరము దార్చెద రమ్మని పల్క నంత న
య్యనఘుఁడువిన్నవించె వినయంబునఁ గ్రమ్మఱభక్తి మ్రొక్కుచున్.
ఉ. ఓపరమేశ! యోవరద! యోబుధవత్సల! యోమహేశ! మీ
రీపగిదిక్ష వచింపఁ దగునే నను ధన్యునిఁ జేయుమద్ధరుం
బాపవిదూర! మున్ను నిరపాయభవత్పురిఁ జేర్చి వెన్క న
న్నీ పదమందఁజేయు టది మేలగునట్టుల చిత్తగింపవే. 191
వ. అనిన విని పరమేశ్వరుం డాత్మగతంబున వేదపితామహుండు భక్తభు
క్తశేషోపభోగప్రభావంబున నిజపదప్రాప్తుండని యెఱింగియుఁ జంగ
మకులభేదనం బొనర్చుటవలన హీనజన్మంబగునని లోకులకెఱుకపఱు
పను, శిష్యునిమనం బరయనుం దలంచి వామనుం గనుంగొని. 192
మ. అనఘుం డీతఁ డనంగ వన్నెగనుమీయాచార్యవర్యుండు పా
వనసద్భక్తిపథం బెఱుంగక జనవ్రాతంబుఁ గ్గించునో
యని చిత్తంబునఁ గొంకి దా శునకదేహం బందఁ గాంక్షించె గ్రా
వున నీమీఁదిభవంబు కుక్కయగుచుం బుట్టంగ నర్హుం డనన్. 193
సీ. బిట్టుల్కి వామనుండిట్టులపల్కె మద్గురునిరాహీనకుక్కరభవంబు
జగములఁబుట్టింప నెగడింప నణగింప శక్తులౌ మీరలీసమయమందు
వేదపితామహు వెల్తిసేయక భవ త్సదనంబుఁ జేర్పంగఁ జాలవయ్యు
ఁబదిగాకయేరూపమేనిపూనియు భక్తి భుక్తశేషముగాంచి పుణ్యుఁ [డయ్యె
తే. నతని విడనాడి యేవచ్చు టర్హమగునె?
గాన నాతనితోఁ గూడ ఘనత మెఱయ

నన్నుఁ గొసపొమ్ము నావుడు నంది వాహుఁ
డాత్మలోపల సంతోష మాంపిల్ల. 194
క. నీభక్తిపలనఁ జిక్కితి, శోభితగతి నీకు వేఁడు చొప్పున నడుతుఁ
వైభవమున గురు దోడ్కొని, నాథ నమ్మునకు పమ్ము నయగుణశీలా.
క. అనితద్గురుశిష్యుల నా, త్మనికేతనమునకు సురసమూహముపొగడఁ
ఘనపుష్పవిమానమునం, గొనిపో సుకేఫ్రుండుచిగురుకొనుభయతోడన్.
వ. కావున బ్రసాదమాహాత్మ్యంబిట్టిదని తెల్పి మాచిదేవాదులతో మాది
రాజయ్య మఱియు నిట్లని చెప్పం దొడంగె. 197

బిల్లమరాజు కథ.

తే. రాజగురుబుధకవులచే దేజమెసఁగి, భాసమానసుధర్మాధివాసమగుచుఁ
బ్రబలజిష్ణుప్రభూత్తమపాలితమయి, నాక మన నొప్పు గరిడిగి యను
ఉ. ఆపుర మేలుకత్నకటకాంచిత సాదుఁడు ఘోరఖడ్గస [పురంబు.
దీపితుఁ డాత్మగుండతలనిర్మలరాంకపభాసమానుఁడ
స్థాపనసాహసాగుఁడు విశంకటవర్తికవాపినీచయ
వ్యాపితుఁ డొర మేలన ధరాధిపుఁ డొక్కఁడు బిల్లమాఖ్యచేన్. 199
మ. అసమానోత్తరశైవతద్విదుఁను సువ్యద్దేశికాధీశప
ద్విసజాతాలయమానసుండు సతతార్థివ్రాతసంపోషకుం
డసమాస్త్రాంచితరూపవంతుఁడచలేంద్రాతీతధైర్యంబునన్
వసుధామండలమేలె నాతఁడుజనానందంబుగా నెప్పుడున్. 200
క. జాతీశుఁడనఁగధరబ్ర, ఖ్యాతినినరదేశికాగ్రగణ్యాకృపావి
ద్యోతితశివలింగధరుం,డై తోకపుభక్తినలరెయనిశముఁబ్రీతిన్. 201
ఉ. భోజన లేప నాంబర విభూషణ వాహన నృత్త గీతికా
వాజి గజాధిరోహణ శివప్రకసత్కృతిముఖ్యముల్ ప్రాగం
భోజ మెలర్ప సద్గురుఁడు ముందుగఁ గైకొన కేను గో నటం
బాజగతీశ చంద్రుఁడు మహనీయమం బొనరించె మించుగన్. 202
క. మఱిముఖ్యబ్రాతకాలము, తఱిగురుదర్శనము సేతుకప్పక యని యే
డ్తెఱివ్రతముఁబూనియాగతి, జఱిపెం గాలంబుకొంతసద్భక్తిమెయిన్.
సీ. అంతటఁజామయ్య యనుదొమ్మరీలమేఁతరితనవీడును చానుఁగదలి
మనకతిత్తులుతుంగకసపుచాపలుపసిగొయ్యలుజనపమోకులును పలల

వా రమణీయవేషముల వచ్చి వసించినవారు దొమ్మరుల్. 211
క. అనవుడు దరహసితాననుఁ,డనఘుఁడు మునిజనపరీతుఁడు రాజసభా
ఘనులగుటవారు దేవర,యనుకంపకు యోగ్యులగుదురనినఁ దనియుచున్.
సీ. భూమీశుఁ డనుమంత్రిపుంగవ? యే విలా
సములైన నస్మదాచార్యుఁ దెలిసి
మున్నుగాఁ గనకయే కన్నులఁ జూడ నే
వ్రతము పూనితిఁ గాన వారి నచటి
కనుపంగఁ దగునన నౌఁగాక యని చారు
చేనత్తెఱంగెల్లఁ జెప్పి పనుప
వాఁడు సత్వరమున వచ్చి సంపడి పెను
బొబ్బలుడోళ్లు చప్పుడును సణఁపి
తే. పెద్దయగుచాను దేవరఁ బిలిచి మనుజ
పతినియోగంబు దెల్పినఁ బరమహర్ష
మెసఁగఁ దనవారు దాను జాతీశుఁ డున్న
రాజితోద్యాన మపుడు చేరంగఁబోయి. 213
మ. కనియెం దొమ్మరిమేదరీఁడు విలసత్కంజాశుగాప్తాగన
త్యనిశాంతాయితచూతభూజఫలసారాస్వాదనాశాలస
ద్ఘనకీలోద్భటరావసంచరితపాంథవ్రాతఘూర్ణాపనో
దనదక్షానిలసంచలత్కదళికాతండంబు నుద్యానమున్. 214
వ. కని యొండొరులతోడ. 215
మ. వనమొప్పెన్ ఘనమై స్వకీయసితభాస్వచ్ఛాయతో నేకమా
కనకాశోకతమాలముఖ్యసుమనశ్కాంతీంద్రచాపంబుతో
జనితామోదలతాంతవిశ్రుతరసాసారంబుతోఁ బన్నగా
శనశారీశుకముఖ్యనీడజరవాంచద్గర్జతో నెంతయున్. 216
క. అనియాతీరునఁ బల్కుచు, వనజాతాకరవిలాసవసతులు గనుచున్
ననలలరులుగోయుచులో,చనపర్వంబులుగ వారుచనిచనియెదుటన్.
శా. హీరోదారకవాటబంధురము రాత్రీశాశ్మకుడ్యంబు లై
త్యారాతీశ్వరనీలకుట్టిమము ముక్తాంచద్వితానంబు న

దుర్భరి స్తంభము రత్నతోరణమునై పొల్పొందుభాస్వచ్ఛతు
ర్ద్వారాగారకము గాంచి రత్తఱి సముద్యన్మోదచేతస్కులై. 218

వ. తదీయమధ్యప్రదేశంబున. 219

సీ. కేవలశాంతిచేఁ గృష్ణాజినంబునఁ బద్మాసనస్థుఁడై పరగువాని
మస్తకముఖ్యసమస్తాంగముల భసితోగ్రాక్షధారియై యొప్పువాని
శమదమాద్యాసననిశ్చలచిత్తవృత్తి సదానందకలితుఁడై యలరువానిఁ
గరతలన్యస్తలింగధ్యానపరవశవృత్తి నితరంబెల్ల మఱచువానిఁ
తే. గాంచి మ్రొక్కి వరాఖ్య భూకాంతుఁ డనుప
వచ్చినారము దేవరవారిసముఖ
మందు మా నేర్చువిద్య లింపొందఁ జూప
నవధరింపుము గురువర్య! యచలధైర్య!. 220

క. అనిపల్కుచుఁ దోడ్తోడన, ఘనధిధ్వానముగ డోళ్లువాయింపుచు ఘ
ల్లన బొబ్బలిడి భుజాస్ఫాలనములు గావించి మదిఁ జెలంగుచు నంతన్.

ఆ. గడలు నిల్పి నాల్గుగడల పగ్గంబులు, గట్టి మ్రొక్కి పుడమి మట్టి దిగిచి
ఫాలములను నలంది పైఁ జల్లుకొని విద్యలాడఁ దొడఁగి రప్పుడతిముదమున.

క. పలువురు బిల్లమెరంబులు
తిరుగుడు లంతరమునందుఁ ద్రిమ్మరుటలు దు
ర్భరమత్స్యపుటము లొండొరు
లురువడి నరిఁ బెనఁగుటలు జనోత్సుకమయ్యెన్. 223

క. కత్తులబోనులు దూరుచుఁ, గుత్తిగఁ బెక్కండ్ర నొకటికొని మోయుచును
వ్రేత్తునఁ బంటను దూలము, లెత్తుచు మఱికొందఱాడి రెలమివహింపన్.

ఉ. మూఁపున రాసభంబులను మోచుచు దండెపుఁ దోలు మోకుపై
నేపున జంకులేక యెదురేగి శరీరము లంటనీక కాల్
చాఁపుచుఁ దప్పరించి పదిలంబుగ నొండొరు లీవలావలై
చూపఱు లాత్మ మెచ్చఁ జనుచుం నటియించిరి కొందఱందులోన్.

క. వాయునిరోధముఁ జేసి వి,హాయసమధ్యంబునందు నసియంత్రముపైఁ
గాయము నిల్పెను జను లా,హా యన నందోకసరోరుహానన చులకన్.

సీ. తలఁ గొన్ని దొంతికుండలు నిల్పి తలఁకక
గడ యెక్కి నటియించెఁ బడఁతి యొర్తు

నాభియం దమ్ము మొనను నాటి చక్రంబు
కైవడిఁ దిరిగెను గాంత యోర్తు
చివర వెన్నున మోపి యవలీల మ్రొగ్గుగా
వ్రాలెఁ జలింపక బాల యోర్తు
కా లడ్డమైయున్న కఱ్ఱకుఁ దవిలించి
తలక్రిందుగా వ్రేలెఁ దరుణి యోర్తు
ఆ. పదయుగంబునందుఁ బాదుకల్ దవిలించి
మోకు వెంటఁ దిగియె ముదిత యోర్తు
మీఁదనుండి పిల్లి మొగములు వేయుచు
వచ్చి పుడమి నిల్చె వనిత యోర్తు. 227
ఉ. ఈపగిదిన్ సమస్తమను జేక్షణపర్వముగా నటించి ని
ష్ఠాపరిపూర్ణులై యలరు సద్గురుసన్నిధి నిల్చి మ్రొక్కి దే
వా! పొలుపొందు మీఁదయకుఁ బాత్రుల మింతి మెకాని యిట్టివి
ద్యా? పరికింపఁ గారణము ధారుణి మిమ్ముల మెచ్చఁ జేయఁగన్?.
క. అనియంతఁ జొక్కమొగిఁ ద, న్వినుతించినపల్కు లతఁడు వినక కనక పా
వనలింగలీనవీతా, జనితామోదమున నున్న చామయ పగచెన్. 229
చ. కటకట మీర లాడు పెనుకష్టపువిద్దెలు చూడఁడాయె ము
చ్చటనుఁ బనేమి పోద మని చామయ పల్కినఁ దత్తనూజ మా
రట సురవేశ్యయో యనఁగ రాజిలుచుండెడి చెన్నసాని నీ
విటు వగఁజెంద నేమిటికి నే గుట్టెఁ జెప్పెద నంచు నిట్లనున్. 230
ఉ. ఉల్లములోన నుంచు సమయోచితభంగి దలిర్ప గట్టురా
జల్లునిఁ జూచు నీగురుమహాత్ముని నెవ్విధినైనఁ దమ్మిచూ
డల్లునిబారిఁ ద్రోచి హృదయంబు గలంగ నొనర్చి రేపె నీ
యల్లునిఁ జేసి తెచ్చెద రయంబున నేఁ గనుగీటి వీటికిన్. 231
క. అని పల్కి యవ్విలాసిని,జనకుని యొడఁబఱచి తిరుగఁజను దెంచుతలం
పునఁ దనవారునుఁదానును,మునువిడిసినపీటికరిగి ముదముదలిర్పన్.
సీ. చిత్రదుకూలంబు చెలువుమీఱఁగఁగట్టి రవపైఁడిమొగ్గల రవికదొడిగి
సొగసుగా నుదుటఁ గస్తురిరేఖగీలించి పూలదండలు సిక వ్రేలఁజుట్టి

కన్నుల సన్నముగాఁ గజ్జలముదీర్చి లీలాసరోజంబు కేల నునిచి ప్రి
యగరుగంధము చెక్కులను బల్చగనలంది యెదలింగ పేటికకుదురుకొ
తే. యాకుమడుచు పోక చెలి యివ్వ నందికొనుచు
వీణఁ గైకొని యొకసఖి వెంట రాఁగ
వీరమోహినికైవడి వీడు వెడలె
సిరుల వెదచల్లు వగఁ బూసి చెన్నసాని. 233
క. ఇవ్విధమున నాజవ్వని, పువ్వులవిలుకానిదంతిపోలు పమరునడల్
నివ్వటిల మొగమునునుజిఱునవ్వొలయఁగఁ గురునియు పవనస్థలిఁ జెంచెన్.
సీ. అటు చని తద్దివ్యకాంతిస్థలమున
నాసీనయై సరోజాయతాక్షి
చెలిచేతివీణియ చే నంది గవిసెన
సడలించి సారెలు చక్కనొత్తి
త్రొవ్వాఁడిగోళ్లఁ దంత్రులు మీటి యొంపొంట
జత మేళవింపంగ శ్రుతు లమర్చి
విరచితాత్మీయకంఠరవమ్ము హస్తవి
పంచికాస్వనములోపల మెలంగ
తే. రమ్యతరధృతమధ్యవిలంబితములఁ
దాళమానక్రమంబులు దప్పనీక
లలితమంద్రమధ్యతారములు మెఱయఁ
గ్రమము మీఱంగ సప్తస్వరములు చెలఁగ. 235
ఉ. భైరవి నాట తోడి సిరిపాళి దిశాదిశి దేశి మారువా
గౌరి బిళావురీ లలిత కన్నడ గౌళ ముఖారి దేవగాం
ధారి వర శ్రీమోహన ధనాసరి ఘూర్జరి పూరి బేగడా
యారభి రామకల్లి మొదలై తగురాగము లింపుమీఱఁగన్. 236
క. మొరడులుచిగురింపఁగరాల్గరఁగఁగఁజిత్తరువుబొమ్మకదులఁదలలూఁచఁగ
దెఱువలతలమానిక యే, తెఱఁ బాడుచు వీణపై జతిం బలికించెన్.
క. అంతట లింగగతధ్యా, నాంతం బగుటయును దేశికాగ్రణికరయు
క్కంతువిదారుని పేటిక, సంతనగాఁగుదురుకొల్వసమయమునందున్.
క. ప్రమదాళినీస్వనంబునఁ, బ్రమదారత్నంబు పాడుపాటలు చెవికిన్

భ్రమకంబెనయింపనికిఁ, భ్రమకనహాగమూర్తిచలితభావుండగుచున్.

మ. కనియెం గట్టెదుటన్ మనోజ్ఞశశభృత్ఖండాలికన్ మేఘవా
హానసీలోపలనీలకైశికసుమోద్యన్మాలికన్ భవ్యయా
వనగంధానిలధూతకామిజనభాస్వద్ధీరతాతూలికన్
వనజాతాంబకహస్తకీలితమణీపాంచాలికన్ బాలికన్. 240

చ. కనుఁగొనునంతలోన సుమకార్ముకుఁ డాత్మవిరోధికల్పునిన్
ఘనుని మదిం గలంచుఁ బటి గన్పడెనంచుఁ గుతూహలాత్ముఁడై
కనుఁగలవింటఁ దమ్మిసెలకట్టియ లెక్కిడి చక్కఁగా నుర
మ్మున గుఱిచేసి వేసిన సముత్కటమోహము నిల్పఁజాలమిన్. 241

సీ. ఘనపురాతనభక్తకథలు విన్వీనుల
వెలఁది లేఁబల్కులు వినఁగఁ గోరు
గురుచరేశ్వరుల మక్కువఁ బూన్చు కరముల
నంగనకుచయుగం బంటఁ దివురుఁ
గరతలన్యస్తలింగముఁ గనుకన్నుల
సుదతిచక్కఁదనంబుఁ జూడ నెంచుఁ
ద్రివిధప్రసాదముల్ చవిఁగొనుజిహ్వచే
నతివసుధారసం బానఁ దలఁచుఁ

తే. గలితనిర్మాల్యవాసనల్ గాంచు నాస
చెలియనెమ్మేనితావులఁ జెందఁగోరు
నట్లు పంచేంద్రియవ్యవహార మెల్ల
నంబుజాతాక్షియందున హత్తుకొల్పె. 242

క. ఇటులుండి కొంతవడి కా, కుటిలాలకపలుకు వినెడి కుతుకంబునఁ బె
జ్జటియిటులపల్కె నత్తఱిఁ, బటుతరమోహాతిరేకభావుం డగుచున్.

క. ఎవ్వరిదానవు? జవ్వని!, యివ్వని కేకతమ వచ్చు టేమని? మదిలో
నువ్విళులూరుచుఁ బల్కిన, నవ్వారణయానయట్టులనియెనతనితోన్.

ఉ. దేవ! మహానుభావ! భవదీయపదాంబుజదర్శనేచ్ఛ ధా
త్రీవరమౌళి యంప నరుదెంచితి దొమ్మరివీటి మేతరిఁ
డై విలసిల్లుచామయకు నాత్మజఁ జెన్నకపేరుదాన వి
ద్యావిభవంబు గాంచి కరుణామృతదృష్టిఁ గృతార్థఁ జేయవే. 245

క. అన విని వనితాతనునూ,తనయౌవనఘనతఁ గని ముదమునొందినయ
స్మునియప్పలుకుల కెంతయు, ననురాగమునొందెయిట్టులని యావనితతోన్.

చ. కలితభవద్వయోగరిమ కన్నుల కింపుగఁ గాంచినంతనే
తలిరులవింటిజోదు బెడిదంబుగ నీకడగంటివాఁడిచూ
పుల బలునారసంబులుగఁ బూని యెదం గుఱిచేసి యేయ నో
చిలుకలకొల్కి! నాహృదయసీమ చలింపఁగఁ జొచ్చె హెచ్చుగన్.

క. కల తెఱఁగుదాఁచ నేటికిఁ, జెలియా! నీ యెడలవాంఛ చెందినయదియ
వ్వలరాజుబారిఁ ద్రోయం, దలఁపక రతినేలు మతిముదం బిగురొత్తన్.

ఉ. కూరిమిశిష్యుఁడై వినుతిఁగొన్న మహాత్ముఁడు గాన వేడ్క నా
కోరిక దీర్పఁగాఁ బుడమికొమ్మమగం డిటు నిన్నుఁ బంపె నో
వారిజగంధి! నీచిగురువాతెర తేనియఁ గ్రోల నిచ్చి య
మ్మారునితాపవేదనలు మాన్పఁగదే యిదె నిన్ను వేఁడెదన్. 249

ఉ. నావుడుఁ జెన్నసాని వదనంబున లేనగ వంకురింపఁగా
నావలఁ జిక్కె మేటిద్విజనాయకుఁ డంచు మదిం దలంచుచుఞ
ధీవర! యిట్టు లాడఁదగునే? మిముబోఁటిమహాత్ము లైనవా
రీవిధి కిచ్చఁ జేతురె? గణింతురె? కంతుభవానురాగమున్. 250

ఉ. కామముఖారిసంచయముగం డడఁగించి మహేశదివ్యనా
మామృతపానతృప్తిఁ దనరారి కరస్థలలింగలీఢపీ
యూషమతి నాజపంబున సుఖం బెడఁ గోరక రాజయోగని
ష్ఠామయు లైనవారి కకటా! తగునే యిటువంటిమోహముల్. 251

చ. అని యిటు పల్క విన్నఁదన మానసమందునఁ గానుపింప ని
ట్లను ననఁబోఁడి! నీ విటుల నారడిపల్కులు పెక్కుపల్కి చు
ల్కన నను పీడనాడి చనఁగాఁ దగునే? సొగసైన నీదుచ
న్నొనల నురమ్మునం బిగియ నొత్తి కవుంగిటఁ జేర్చు మిత్తఱిన్. 252

తే. మున్నొడయనంబిముఖ్యులు మోహవృత్తి
వాసి గోల్పోయిరే యెందు? వారికంటె
నేను ఘనుఁడనె మరుమాట లేల లీలఁ
బూవువిలుకానికేళి నన్నేలు బాల!. 253

చ. అనవుడుఁ గేలుమోడ్చి వినయంబున నిట్లని విన్నవించె స
జ్జనసుత! తావకీనతనుసంగతి నేఁ గడు ధన్య నౌదు మీ
యనఘతపోబలంబునకు హాని ఘటించు నటంచుఁ గొంకి తిం
పెనయఁగ మీయభీష్ట మిఁకఁ బెట్టుల యట్టుల చిత్తగింపవే. 254

తే. అనిన నమ్మాట కర్ణరసాయనముగఁ
జెవులు సోఁకినయంత దేశికవరేణ్యుఁ
డార కోరినకోర్కి చేకూఱె ననుచు
నాత్మ సంతసమందు నయ్యవసరమున. 255

ఉ. వారిజమిత్రసింహము దివస్పతిదిగ్గిరి నిర్గమించి దై
త్యారిపదాటవీస్థలి దినాఖ్యమదేభము వెంటనంటి త
త్సారమదంబునం జరమశైలతటంబునఁ జెంది సక్తర
క్తారుణదేహమై యరిగె నగ్గిరిమాటుననుక్ రయంబునన్. 256

చ. వనరుహమిత్రుఁ డస్తగిరివాఃస్థలితజ్జగవ వీడుఁజక్కవల్
ఘనతరశోక మంది గని కాంతుఁడు నల్గపయంగరా మనం
బునఁ గడుసైఁపలేక నివి పొక్కఁ బనేమి యటంచు వారుణీ
ఘనకచ వానిబల్కినుకఁ గన్గొనె నా నెఱ దోఁచెఁ బద్దిశన్. 257

చ. పనిగొని కాలమాంత్రికుఁడు పాంథవిదారణ రాత్రిశక్తి నే
ఫున సృజియింపఁగాఁ జరమభూధరవేదిక సాంధ్యరాగవ
హ్ని నిలిపి పద్మబాంధవఘృతస్ఫుటపల్లవరాజి వేల్వ హె
చ్చినసితధూమముల్ దెసలఁ జెందె నినాదము నొప్పె నెల్లెడన్.

మ. చటులధ్వాంతగజాధినాథుపయి నాచ్ఛాదింపఁగా నొప్పు వి
స్ఫుటతారాపథనీలపట్టవసనాభోగంబునం జిత్రితో
త్కటపాండుప్రసరంబులో యనఁగ దిక్కాండంబులం గాంతి మి
క్కుటమై పర్వఁగఁ దారకావళులు గన్గొనయ్యె నప్పట్టునన్. 259

ఉ. ఖ్యాతమహీధ్రసంగతపవాగ్నులు నారతిదీపముల్ చకో
రీతతి పేరఁటాండ్రు దివిరిక్కలు నీలపుఁబాత్ర నేసఁబ్రా
లాతతరాత్రి యన్సరసిజాక్షి వరింప గజాధిరోహణం
బై తనరారె నాఁగ నుదయాద్రిపయిన్ శశి దోఁచె వింతగన్. 260

చ. తొవ వికసించెఁ దేఁటిగమి తోయజగేహములఁ న్వసించెఁ బ

క్షివితతి నీడ సంయమునిఁ జేరి సుషుప్తి సుఖంబుఁ గాంచె న
ర్ణవములమ్రోఁత మించె వలరాజు ముదంబు వహించెఁ జక్రముల్
కవవిడి సంచరించె శశికాంతశిలల్ ప్రవహించె నీరమై. 261

ఉ. ఆసమయంబునన్ గువలయాంబకబాణము లిందుపావని
న్యాసము లంగవేదన మొనర్పఁగఁ దాలిమి నిల్పలేక త
ద్వాసవరత్నవేణికరతామరసగ్రహణం బొనర్చి దా
భాసురసూనయుక్త మగుపాన్పునఁ దార్చి గురుండు వేడుకన్. 262

మ. సరసాలాపనఖక్షతాధరసుధాస్వాదార్చితాంబూలదో
స్ఫురితాలింగనచుంబనాదికములన్ రంజిల్లుకందర్పసం
గరకేళిన్ రసవార్ధిఁ దేలి మలయాగస్పర్శనాంకూరకో
త్కరముల్ పర్వఁగఁ గొంతప్రొద్దుసుఖనిద్రం జెందె నవ్వేసుపన్.

చ. సతి గురునాథు మేల్కొలిపి స్వామి! భవత్కరుణాకటాక్షసం
గతిఁ గడుధన్య నైతిఁ జనఁగావలె వీటి కనుజ్ఞసేయుఁ డీ
గతిఁ జెలవాఱ నన్నిచటఁ గన్గొని కిన్క వహింపకుండునే ?
క్షితిపతి మీకు లాఘవముఁ జెందకపోవ దటన్న నిట్లనున్. 264

చ. ఘననిభవేణి! యొక్కత్రుటికాలము నిన్నెడఁబాసి నిల్వనే
ర్తునె? విరహాంబురాశి ననుఁ ద్రోచి చనం జరణంబు లాడునే ?
పనిగొని నీవు నావయినభాగ్యమునం జనుదెంచి తిప్పుడ
జ్జనపతి యాజ్ఞసేయు నని సాధ్వస మేటికి? నేను గల్గఁగన్. 265

ఉ. నావుడు మీరు పల్కువచనంబులు సత్యము గాని నే వినన్
భూవిభుఁ గానఁ బోవలయుఁ బొమ్మనినం జని రాజుచేత సం
భావన లంది వేగ యిట వచ్చెద నేఁ జనకున్నఁ జంద్రికిన్
భావమునందు వేరె యొకపద్ధతి దోఁచు ననుజ్ఞ యీఁగదే!. 266

చ. అనవుడు దేశికుండు కమలాసన! భూపతిఁ గానఁ బోవుటల్
ధనమునకై కదా? వలయుద్రవ్యము లిచ్చెదఁ గొమ్మటంచుఁ గాం
చనమణిభూషణావళు లసంఖ్య మొసంగిన సంభ్రమంబునం
గొని వినయంబుతోఁ బలికెఁ గోకిలవాణి నమస్కరించుచున్. 267

ఉ. కన్నది యాది మజ్జననికన్నఁ బ్రియంబున గారవించు మా
యన్న యొకప్పుడుం దరియ నన్నముపొత్తున నాకు ముద్దలీ

కున్న భుజింపఁ డట్లగుట నొద్దికఁ బొద్దటిచద్దివేళ దా
రొక్కన్నది కాచియుండు జనకుం డదె వేగమె పోయివచ్చెదన్. 268

క. అనవుడు నెన్నివిధంబులఁ, జనవలెనను వాంఛ నీదుస్వాంతములోనన్
జననం బయ్యెను గావునఁ, జని వేగమ మరలి రమ్ము సరసిజనయనా!

తే. ఈవు వచ్చినదనుక నాప్యాయయ మెందు
నొంద వని కన్నుఁ గవబాష్పబిందు లురల
నబ్బిచనుగుబ్బ లెస నంటఁ గౌఁగిలించి
సెల వొసఁగి పంప నంత నచ్చిగురుఁబోఁడి. 270

ఉ. అచ్చట వానియాత్మ ముప మందుచుఁ గ్రక్కున పీడఁ జేరఁగా
వచ్చి నిజక్రమంబు తమవారల కంతయుఁ జెప్పి సద్గురుం
డిచ్చిన వస్తుభూషణము లెల్లను దండ్రి కొసంగ మెచ్చి లో
నచ్చెరువంది కూఁతుఁ గొనియాడుచు వేడుకనుండు నత్తఱిన్. 271

మ. ఘనమం దేహనిశాచరు ల్బఁటని బిగ్గం బట్టనే లెంతురో
యని పూర్వాచలదుర్గసీమ జలజాధ్యక్షాజ్ఞఁ దత్పూతనూ
తనసేనాపతి వెల్లుకై నిలుపు చంద్రజ్యోతియో నాఁగ మిం
చిన తేజంబున వేగుచుక్క యుదయించెన్ జంద్రుతో నుద్ధియై. 272

ఉ. వాసిగఁ గర్మసాక్షి యిదె వచ్చె నుపస్సమయోచితక్రియా
ధ్యాసులు గాక యిప్పు డనయంబున నిద్దురఁ జెందఁ జెల్ల దో
భూసురులార! మీ కనుచుఁ బోధ మొనర్చినమాడ్కి వేమవన్
గూసెఁ బదాయుధప్రతతి కో యని కాల మెఱుంగుఁగావునన్. 273

చ. తెలతెలవాఱవచ్చె నలుదిక్కులు చీఁకటిఁ బుచ్చె నండజం
బుల రొద హెచ్చెఁ బన్నగసమూహము పుట్టలఁ జొచ్చెఁ గైరవం
బులమది నొచ్చె జక్కవలు పొందుగ మెచ్చె మనోభవుండు పూ
విలు రతిచేతి కిచ్చె నరవిందదళంబులు విచ్చె నచ్చుగన్. 274

సీ. అంధకారాతి బలాపహారుఁడవౌట బద్ధాప్తసంజ్ఞచేఁ బరిఢవిలుట
జనసుతంబగు త్రయీతనుత వర్తిల్లుట సంతతనాకసంచారి వగుటఁ
కువలయోల్లాససంభవకీర్తియుతుఁడౌట చిత్రభానుఖ్యాతి ధాత్రిఁ గనుటఁ
బలుపలాశులపెంపుభగ్నంబు సేయుటఁ దారకాంచత్ప్రభాహారి వగుట

తే. నీవ శివుఁడవు హరి విధు లీవ వజ్రి
నీవ చంద్రాగ్నులును వాయు వీవ గుహుఁడ
వీవ యని భక్తిచే జను లెల్ల మ్రొక్కఁ
బూర్వదిగ్భూధరంబునఁ బొడిచె నినుఁడు. 275

తే. అపుడు చెన్నక నిత్యకృత్యములు దీర్చి
తండ్రి యనుమతిఁ గైకొని ధరణినాథ
దర్శనం బొనరింపఁగఁ దగినవేష
మొకటి నెమ్మది నూహించి యొరుపు దనర. 276

చ. పద కటి నేత్ర హస్త గళ ఫాల శిరంబుల నొప్పఁ బన్నగాం
గద కరిచర్మ శూల గరగంధవ హాస్త జటాలి యొక్కెడన్
గుదురుగ నిల్పి మున్నె తనకుం గలయట్టి యలంక్రియల్ శుభా
స్పదముగ నొందువైపునఁ బొసంగ నెసంగువిలాస మేర్పడన్. 277

క. తరుణి యిటు లర్ధనారీశ్వరవేషము దాల్చి యాప్తజనములతో నా
గరికు లరుదంద ధరణీశ్వరునాస్థానంబుఁ జేరవచ్చి ముదమునన్. 278

చ. ప్రకటమృదంగతాళఘనరావము లుప్పతిలంగ నిల్వ నం
తకమును దేశికప్రవరదర్శనకృత్య మొనర్చి సింహపీ
ఠిక వసియించు భూపతి వడిం గని దిగ్గున లేచి నిల్చి హ
స్తకమలముల్ మొగిడ్చి మదిఁ దాల్చె శివాధవుఁ డన్న భావమున్.

తే. ఇటుల భావించి యపు డమ్మహీతలేంద్రుఁ
డీశ్వరాకృతిఁ దాల్చిన యింతిప్రజ్ఞ
కద్భుతం బంది మితి మీఱునట్టివస్తు
వాహనాంబరభూషణావళు లొసంగె. 280

ఉ. ఇచ్చిన వేడ్కఁ గైకొని మహీతలనాథుననుజ్ఞ గాంచి ము
న్నెచ్చట నెవ్వ రిప్పగిది నీప్సిత మిచ్చిరె! యంచు నాత్మలో
నచ్చెరువందుచున్ మరలి యంగజితోఁ దమవీడు చేరఁగా
వచ్చి వినోదలీలలఁ బ్రవర్తిలుచుం జెలి యుండె నచ్చటన్. 281

మ. సతి తర్కజాల మొనర్చి చన్న మొద లాజాతీశుఁ డత్యంతమో
హితుఁడై వేగము వత్తు నంచుఁ జని యాయేణాంకబింబాస్య స
న్మతి నూహింపక యుండె నిప్పు డహహా! నాభాగ్య మిట్లుండెనే

గతి వేగింతు నటంచుఁ గ్రీష్మినమహాకామాంధకారంబునన్. 282

సీ. కొమ్మకై చిగురాకుఁ గొరికి కోయిల గూయ
నబల పల్కె నటంచు నాలకించుఁ
గొలఁకులకై యంచకొదమ రాఁ గనుఁగొని
ముదిత వచ్చెన యని కదియఁ దివురు
సుమగుచ్ఛముల వ్రాలి భ్రమరి ఝుంకారింపఁ
జెలివీణపల్కని చెవులఁ జొనుపుఁ
గలికిగంధపుగట్టుగాడ్పు మైసోఁ బొలయంగ
సకిమేనివల పని సంతసించు

తే. నాత్మసంభవహస్తవిన్యస్తసూన, చాపనిర్ముక్తఘోరకశరనికాయ
మాతరిశ్వావకీలాసమాజకృచ్ఛ్రభాజనాత్మీయమానసాంభోజుఁడగుచు.

చ. కలవల మందుఁ గుందుఁ గడగన్నుల నీరము హెచ్చు దెచ్చు లో
నలమటమూరు దూరు! జెలియా! యిటు రమ్మని పిల్చు నిల్చు మిం
క్కిలి వెత జిక్కు స్రుక్కు వలకేల నొసల్ గదియించు మించి చ
వలగొనుతాపవేదనల వాసి దొలంగి గురుండు దీనుఁడై. 284

చ. జలచరకేతనాబ్జపికచంద్రనశైలసమీరహంసముల్
వలగొని తన్ను నొంపఁ దల వంచుచు హా! శిఖనేత్ర! హా! సము
జ్జ్వలశశిభూష! హా! ధరణిజాధవసేవితపాద! హా! యధో
నిలయవిభూష! హా! శరదనీలగళా! యని పేర్కొనుఁ శివున్. 285

క. ఈరీతి వగలఁ బొగులుచు, నారీమణియందు మిగుల నాటినమదిచే
నీరము నన్నము ముట్టక, భారముగా నొక్కగతి దివస మెడలించన్.

ఆ. తరణిగ్రుంకెఘోరతమమునల్దిక్కులఁ, గ్రమ్మెఁ జీరు రాలరవము లెసఁగె
జారచోరనికరసంచారములుమీఱె,విరహిజనులనొంపవెడ లెమరుఁడు.

క. అత్తటి మత్తిలుచిత్తజు, కత్తులచే మొత్తఁబడి ప్రకంపితతనుఁడై
హత్తినయుత్తలమున నా, బిత్తరిఁ గనుత త్తరంబు పెంపెసలారన్

క. శివపూజోపకరణములు, భవనంబున నొక్కచోటఁ బడిలపఱచి శి
ష్యవితానముకునఁ జెప్పక, శివమెత్తినవానిపగిది శ్రీగురుఁ డంతన్.

చ. జనపతి విన్న నొ మ్మనుచు జంగమభక్తు లెఱుంగఁ జుల్కగాఁ
గనియె రన్నకొంకు మదిఁ గానక పౌరులు చూచి రేన్నిఁ ద

స్వైనుకొని గేలి సేతు రని వెల్వెలఁ బోవక లజ్జమాని ప
ర్వినతమి నేగె వీటికయి వేగమ తా మును విన్న జాడలన్. 290

క. ఈలీలఁ 'గాముకన్య సు,తో లజ్జా' యనెడుమాట ధ్రువముగ నపుడ
బ్బాలామణినా వాసపు,టాలయమరయంగఁజనుచు నంధతమము చేన్.

సీ. దామెన మోసులు దగిలించుక మొగ్గి
గడలుపగ్గము లూఁతగా నిలుచుచుఁ
గ్రొత్తయకా తనుఁ గని కుక్కలు గుఱపెట్టి
కఱచునో యని దవ్వుగా నడుగుచుఁ
జిరుగువెల్లుఁలను గొంచెము దారి గనుపింప
వెసఁ జను చవి యొంటు పెస ఁరయుచు
నెడనెడ గుడిసెలఁ బడఁతులనుడువులు
విని చెన్ని మాటలో యని తలఁచుచు |కన్నెటిలఁగ

తే. నంధకారంబు గాఢమోహాంధకార, మొక్క మొగివెలిలోఁ గ్రమ్మిపి
రేవుదప్పి చరించెడి నావకరణి, వీడు కలయంగఁదిరుగుచు వేసరిలఁగ.

క. ఇట్టిమహాత్ముని కాహా!, పుట్టెఁ గదా చెడ్డవేతలు పొలఁతుక నిఁకఁ గ
న్పట్టఁగఁ జేయుదు నని దయఁ, జట్టుల పగవానిదెస సిశాపతిదోఁచెన్.

తే. అట్టితఱి బండువెన్నెల పట్టపగటి
పరణి గాయంగ నందలిజనము లతని
గాంచి జాతీశుగా నిశ్చయించి పలికి
రొండొరులతోడ నగుచు హాస్యోక్తు లలర. 294

క. ఓహెూ! చూచితిరే యీ, మోహాదివికారదూరు మునిచర్యబుధ
స్నేహార్జనరతుయువతీ, వ్యూహవిముఖుస్థైర్యచిత్తునుత్తమచరితున్.

తే. అతను గురుధర్మగుణకాండ యుతున కిప్పు
డతను గురుధర్మగుణకాండహతులు నమరె
వీటిలో రాజముఖులు సేవింప నింక
వీటిలో రాజముఖులను వెదకవచ్చె.

ఉ. ఎక్కడ బోయెనో సియమపు మెందున డాగెనో మానివృత్తి యే
దిక్కున నుండెనో తపను ద్వేశికుఁ డన్నియు నుజ్జగించి మా

చక్కెరబొమ్మకై యిటు నిశాసమయంబున నేగుదెంచెన
మ్మక్క కనంగ నయ్యె నొరపై యిపు డీతని విద్దె యంతయున్. 297

చ. అనవుడు నొక్కచేడియ మహాత్ముని మీ రిటు లాడఁ గూడునే ?
యని యదలించి చెన్నక గృహాం బిదె చూపెద రమ్మటంచుఁ దో
డ్కొని చని నిద్ర చెందుసుమకోమలి లేపి గురుండు పీఁడె వ
చ్చె నసిన నుల్కి లేచి వెఱ జెన్నె దురేగి నమస్కరింపుచున్. 298

శా. స్వామీ! నాయెడ జాలతప్పు గల దేచందంబునన్ వచ్చెదో
యే మీ రంపిన వచ్చి చద్ది దిని భూమీశాఢ్యుచే గామిత
స్తోమంబుల్ గొని పీఁడఁ జేరి సిల నిచ్చోకార్య మే మన్యహా
సీషం జేరుద వఁంచు నయ్యె యనినన్ సేవింప రాకుండితిన్. 299

చ. అనుచుఁ గరంబు పట్టి వినయంబునఁ దోడ్కొనిపోయి శయ్యపై
నునిచి మనోజకేళి ముద మొంద నొనర్చి నెలంత కొంత సే
పున కిటు పల్కె నాదయినపుణ్యమునం నిను గూడఁ గంటి ని
ట్లనిశము బాయకుండునటు లబ్బకపోయె నిఁకేమి సేయుదున్. 300

ఆ. పీడుదరలిపోవు వేళయా మాఱిక, సెలవొసంగి మీరు శీఘ్ర మేగుఁ
డనిపతి ప్రభాతమైన మిమ్మర్చింప, వచ్చు నప్పుడుండ పలయునచట.

క. నను జిత్తంబున మఱవకుఁ, డని తక్కిడిపగల లోచనాంబువులురుల
న్వనితామణి కౌఁగిట జేర్చిన గుండెభిగుల్లుమనఁగ శ్రీగురుఁడనియెన్.

ఉ. కువలయపత్రనేత్ర! నిను గూడి సుఖింపక యున్న నాకు భూ
ధవునిసపర్య యేల? మణిధామము లేల? సమస్తభోగ్యవ
స్తువితతు లేల నీ వరుగఁ దోఁ జనుదెంచెద నీకటాక్షమే
యవిరళవాంఛితార్థముల కన్నిటికిం గురు కాదె నాపుడున్. 302

క. దొమ్మరికొమ్మఁ దగుల్కొని, క్రిమ్మరె నను లోకనింద క్రెళ్లకు మిడెళీ
ఘ్రమ్మేను మరలి నత్తుని, జమ్ముగ నామాట నమ్మి చనుమని యనుడున్.

సీ. జలజాక్షి! పెక్కుమాటల పనియేమి సిందాస్తుతు లాత్మకుఁ దగుల నేర
వటుగాపున ననిత్యమగు దేహమున నంటు సింధకు వెఱవసీవిందు దిరిగి
వచ్చునంతకు నిలువఁగ నేర్తునే! నిను గలసి రా నీశుండు తలపుపుట్టఁ
జేసె నిశ్చయము సిద్ధము పలదని మానిచి తేని మాయాన సిక్క

తే. మనుడు నేమియు నన నేర కయ్యగారి
చిత్త మని సమ్మతించి యా చిగురుఁబోఁడి
తండ్రిఁ బిలిపించి వార్త యంతయును దెలిపి
వీడు వరలింపు మప్పుడ వీడ ననిన. 304

క. వీటిజనములకుఁ బయనము, చాటఁబనిచి సకలవస్తుసహితముగా న
చ్చోటు వెడలిరప్పుడ వే, హాటకనగచాపుభక్తుఁ డరుదేఁదోడన్. 305

మ. చని కాశీనగరంబుఁ జేర నచటన్ సర్వాంసహాభర్త వే
గిన గాలోచితకృత్యముల్ సలిపి రక్తిన్ దేశికాధీశుద
ర్శనవాంఛం జనుదెంచి తన్మణిగృహస్థానంబునం దాతనిం
గన కెచ్చో వసియించెనో యనుచు దా నల్దిక్కు లీక్షించుచున్. 306

ఉ. అచ్చటనచ్చటం దిరిగి యాతనిశిష్యులఁ గాంచి దేశికుం
డెచ్చట నున్నవాఁ? డన మహీధవ! సన్నటనుండి కాన లే
దెచ్చటి కేగెనో యెఱుగ మే మని గుందుచుఁ బల్క వారితో
జెచ్చెర నవ్వనస్థల మశేషముగాఁ గని యందు లేమికిన్. 307

ఉ. నమ్మినచారులం బిలిచి నాగురుఁ డెచ్చట నున్నవాఁడొ శీ
ఘ్రమ్మున గాంచి రండు మణికాంచనవస్త్రము లిత్తు నన్న వా
రమ్మనుజేశ్వరాజ్ఞ బుర మంతయు నారసి యంద ఱొక్కటై
క్రమ్మఱ వచ్చి యం దతనిఁ గానఁగ లేదని తెల్ప నార్తుఁ డై. 308

చ. హా! యను సన్మనోబ్జమిహిరా యను నన్ విడి పోవ నీకుఁ జ
న్నే యను నాయెడన్ మిగుల నేరము గల్గిన శిక్ష సేయరా
దే యను నింతవింత గలదే యను నేగతిఁ దాళు డింక స్వా
మీ!యను నెవ్వ రింక గృప నేలఁగఁజాలుదు రయ్యయో!యనున్

చ. ఇది గురులింగజంగమమహిష్ఠపదాంబుజసేవనాపథం
బిది నిరపాయముక్తిరజనీశముఖీపరిలబ్ధిసాధనం
బిది నగజామనోహరగణేశమహత్త్వ మటంచు నెప్పుడున్
విదితము గాఁగఁ దెల్పి కరుణించు గుహేశ్వర! యెందు డాగెనో.

క. ఇటు లరుగుదు వని తెలిసిన, నెటుబోవక నీపదంబులే పూన్చుచు ని
చ్చటనిల్తు మోసమందితి, గటకటనను విడిచిపోవఁగాళ్లెటులాడెన్.

ఉ. తల్లియుఁ దండ్రియున్ సఖుఁడు దాతయు దైవము నీవె యంచు నా

యుల్లమునం దలంచి పరమోత్సుకవృత్తి భజింపుచుండు నా
కెల్లెడ నెవ్వరుం బడసియట్టి మనోవ్యథసంఘటించెఁ బో
చెల్లునె రాజసఖ్యము లిసీ యని రోసితివో? దయాకరా!. 312

క. అని వగలఁ బొగులు జననా
థునిఁ గని యొకమంత్రి పలుకుఁ దోఁచక దుఃఖం
ప నగునె తెలియనివాఁడవె
విను మొక్కయుపాయ మిపుడు వినుపింతు నృపా!. 313

క. గురులింగజంగమంబులు, పరికింపఁగ నొక్కఁ డగుటఁ బరమేశ్వరు ద
ద్గురుఁడని పూన్పుము జాతీ, శ్వరునర్చింపఁ ఫలంబు సమకూరుననన్.

క. మఱియొకఁడు పల్కె మున్నొక
యెఱుకఁ ముని యొసఁగుమంత్రమే కాదె తుదిఁ
దరిఁ జేర్చె! నతఁడు చెప్పిన
నెఱమంత్రముచేత ముక్తి నిత్యత గనుమా. 315

క. అనవుడు నానియమం బెఱుఁ
గనివారలువోలె పల్కఁగా వగనె? యా
ఘనునిఁ గనుఁగొనినతుది భో
జన మొనరుతు నంచు బల్కు సమయమునందున్. 316

తే. చారుఁ డొకఁ డేగుదెంచి జోహారు చేసి
నేటిప్రొద్దున దొమ్మకవీటితోడ
గాశికాపురి కరుగంగఁ గాంచినాఁడ
ననఘ! జాతీశు నను డు నయ్యావనివిభుఁడు. 317

ఉ. సంతస మందివానికి ససంఖ్యధనంబు లొసంగి భూతలం
బంతయు మంత్రిశేఖరున కప్పనసేసి మితాప్తవర్గుఁడై
భ్రాంతదరీఝరీసరిదరణ్యమృగంబుల నెన్న కాతఁ డ
త్యంతరయంబునం జనియె నార్తి గురూత్తముఁ డేగుజాడలన్. 318

క. చని కనియె నెదుటఁ గాశిఁ, ఘనకల్మషభేకనికరగంధవహాశిఁ
మునిసేవ్యతీర్థరాశిఁ, వినతాశ్రితభక్తలోకవిబుధవరాశిన్. 319

క. చని పురలక్ష్మీహారం, బన దగుగంగానదీతటాంతికమున ని [న్.
ల్చినవీడుఁ జొచ్చి జాతీ, శునిగానరె యనుచు నడుగుచుండఁ జని యొకచో

ఉ. చామయయిల్లు గన్గొని రసావరుఁ డచ్చట చెన్నసానితో
సామెత గాఁగ నొక్కతళియన్ భుజియించుచునున్న దేశిక
స్వామిని గాంచి మంటి భవసాగరముం దరియింపఁగంటి నీ
వే మహితప్రసాద మని యెంతయుభక్తి నమస్కరింపుచున్. 321

క. దగ్గఱి కర మొగ్గిన నపు, డగ్గురుఁ డచ్చెరువు గదుర నవనతముఖుఁడై
సిగ్గున నూరకయుండిన, నగ్గని ధృతి సతియునని యె ధరణీపతితోన్.

ఉ. ఈయన నన్నుఁ గూడి వసియించుటకై చనుదెంచి నెమ్మదిం
బాయని ప్రేమ నేకమగు భాజనమందు భుజింపుచుండ నీ
వీ కౌతుకఁ గాంచియుం గొంకవేని ప్రసాదముఁ గొమ్ము నావు డ
బ్జాయతనేత్ర కిట్లను ధరాధిపుఁ డెంతయు భక్తి నెక్కొనన్. 323

క. లింగశరీరపు దేశిక, పుంగవుదివ్యప్రసాదభోక్త్రివి నీ వీ
భంగిమదిసంశయించుట, కంగన గణియింపఁజాల! నచ్చెరువయ్యెన్.

క. నామదిఁ దెలియక పలికెదు, కామిత మిబ్భంగి దేశికస్వామిప్రసా
దామృతముఁ గొనక చనననియామానవపతిగురునకు హస్తముసాచెన్.

క. కరమొగ్గినధరణీశ్వరుఁ, గరుణామృతవృష్టిఁ జూచి కైవల్యపదా[మిన్.
గరసత్ప్రసాద మొసఁగిన, బరమామృతమనుచుఁ గొని యెఁ బార్థివుఁ డెల

క. ఆసమయంబున శైలశ, రాసనుఁ డవనీశుభక్తి కత్యంతసము
ల్లాసంబు నొందినలినజ, వాసవముఖసురలఁ గొలువవాత్సల్యమునన్.

చ. అరుణజటాలి పల్లవము లబ్జవిరోధి ఫలంబు పన్నగో
త్కరము లతావళుల్ గరళకాంతి శిలీముఖరాజి భూమిభృ
ద్వరసుత చేగ మౌనితతి పక్షిసమాజము గా ధరిత్రికిన్
సురతరుభాతి దోఁపఁ బొడఁజూపెఁ బదతికసీమ నయ్యెడన్. 328

తే. ఇట్లు ప్రత్యక్షమైన సర్వేశ్వరునకు
బుడమి జాఁగిలి మ్రొక్కి యాభూమిభర్త
ఫాలతలమున కెంగేలు కీలుగొల్పి
భక్తి యొలుకంగ నిట్లని ప్రస్తుతించె. 329

లయగ్రాహి. దండధరదోర్మదవిఖండన! పయోజరిపు
ఖండధర! పక్షివిభుకాండవరకాండా!

కాండపరశోషఘన! కాండజశరాపహార
భండ! శిఖినేత్ర! ఫణికుండల! ధరిత్రీ
మండలరథాంగ! మునిమండలమనోనిలయ!
పాండురశరీర! గణకాండ! భవమేఘో
ద్దండపవమాన! కరమండితకరోట! ఖల
తుండిపలశాశిజయ! ఖండనవిహారా!. 330
ఆ. అనుచు సన్నుతించుజనపతిఁ గని శర్వుఁ
డాదరించి నీప్రసాదనిష్ఠ
కలరినాఁడ దివ్యయాన మెక్కుము రాజి
తాచలమున కిప్డుఁ డరుగవలయు. 331
ఉ. నావుడు దేవదేవ! గురునాథుకతంబునఁగాదె? నీదుసం
భావన గాంచి తీయెడల భాగ్యమె యీఘనుఁ బాసి రా ననఘ
భూవర! వీని నిన్నుఁ గొనిపోయెద నాఁగ గురుండు చెన్నకఘ
నే విడలే నటన్న నగి నీలగళుం డటు సమ్మతించినన్. 332
తే. ఆసతీమణి యిటు పల్కు నాస పూని
నన్నుఁ గనిపెట్టియున్న మాయన్న యమ్మ
మొదలుగున వీటిజనముల వదలివచ్చు
టుచితమే! యన దరహాస మొనర హరుఁడు. 333
క. గురు రాజ చెన్నకం ద, త్పరసిజముఖినీటిజనుల స్వర్ణవిమానో
త్కరములనిడికొని చనెనీ,శ్వరుఁడరుదుగరజతశైలసదనంబునకున్.
వ. కావునఁ బ్రసాదమాహాత్మ్యం బిట్టిదని మాచిదేవాదిగణంబులతో
సకలేశ్వరమాదిరాజయ్య వివరించుటయు నందఱు నత్యాశ్చర్యంబున!
నతనిఁ బెక్కుభంగులం గొనియాడి నాగమాంబికచే ననుజ్ఞాతులై!
తమతమనివాసంబులకుం జని రని తెల్పిన నగస్త్యుం డవ్వలికథ యె
ట్లయ్యె నని యడిగిన. 335
శా. విశ్వత్రాణపరాయణప్రవణ రిపురపృథ్వీజాతభాస్వన్నభ
స్వద్వాహాంకకళాకిరీటపదపూజాశాలి! మాహేశ్వరో
ద్యద్వాక్యశ్రవణానురంజితనిజాత్మాంభోజవిఖ్యాత! సిం
హద్వారాంగణవేదికాఖిలనరేశామాత్యజాతాంచితా!. 336

క. ఉద్వాధిపముఖీమన్మథ!, రాడ్వల్లభ రాష్ట్రదుర్గరక్షణదక్షా!
 షడ్వర్ణమంత్రవసన! సు, రేడ్వైభవ! పద్మభూమహితవాగ్విభవా!.

పంచచామరము. ప్రభాతిశంబరప్రభూతబంధుకల్పభాకరా!
 శుభావహవ్రతప్రతాన! సూరిహృత్సరశీకరా!
 విభావరీశ ఖేచరేంద్ర సృక్షుదానభూసురా!
 ప్రభూతసమ్మదోరుచిత్తపాలితాప్తభాసురా!. 338

గద్యము. ఇది శ్రీమచ్చెన్నమల్లికార్జునకృపాకటాక్షలబ్ధ కవితామాధురీధురీణ కౌశికగోత్రపవిత్ర సుకవిజనస్తుత్య పాపయామాత్యప్రణీతంబైన చెన్నబసవపురాణం బనుమహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.



# తృతీయాశ్వాసము.





మద్గౌరారాధ్యశి
ఖామణ్యుపదిష్టమంత్రగతపవపర్ణ
స్తోమజప్రకరణరసనా
సీమా! యమ్మృత్యేశనామసేవితసోమా!. 1

వ. అవధరింపుము కుంభసంభవునకు రేణుకుండు తదనంతరవృత్తాంతం బిట్లని చెప్పందొడంగె. 2

ఉ. ఆగ్రహదూరుఁ డన్యసమయప్రవిదారణశూరుఁ డాత్మవిద్యా
గ్రహణప్రచారుఁ డఖిలామరలోకవిహారుఁ డంబికా
విగ్రహభక్త్యుదారుఁడు వివేకవిచారుఁడు సిద్ధరామయో
గ్యగ్రణి సొన్నలాపురమునందు విలాసగతిన్ వసించుచున్. 3

మ. ఫలకృద్దేశికపాదపంకరుహషట్పాదుండు వేదోక్తషట్
స్థలవిజ్ఞానవిశారదుండు శిఖిగంధర్వాఽతారుండు ని
ర్మలకీర్తిద్యుతినిర్జితాద్రిరిపుసారంగాయుధుం డంచు భ
క్తులు సెప్ప న్విని నాగమాత్మజునిఁ గ న్గోర్కుల్మదిం బర్వఁగాన్.

ఉ. అణిమమాదియష్ట మలము లన్ని యడంచుచు శాతకుంభముం
గాణపరాటకంబు సరిగాఁ గనుచున్ జరియించు సింధురా
ట్త్రాణపదాబ్జసేవకులతో నెడ మించుక లేకయుండు క
ల్యాణపురంబుఁ జేరి హృదయాద్భుత మొప్పఁగఁ జూచి మెచ్చుచున్. 5

తే. అరిగి చెన్నవృషేశుమందిరము గలిసి
ద్వారపాలకుచేఁ దనవార్తఁ జెప్పి
పనుపఁ జని సిద్ధరామయ్య యనునొకండు
వచ్చె దేవరదర్శనవాంఛ ననిన. 6

ద్య మ్మింపొంద మహాత్మ ! రామయకు మీాయందే గురుత్వంబు హృ
ద్యమ్మై యున్నది గాన మాయనుమతిం దద్వాంఛ చేసార్చి వై
శొమ్మా యన్న గణాజ్ఞ మౌళి నిడియెం గోటీరభావంబునన్. 21

శా. ఈలీలన్ గణశేఖరాజ్ఞ గొని నీయిష్టంబు చేకూర్తు ర
మ్మా లింగార్చన సేయఁగావలయు లెమ్మా యంచు మున్నట్టు ల
వ్వేళం దీర్పనొనర్చి దీక్ష గొన రేపే వంచి దంచు న్నిమో
గ్యాళిన్ గేహ మలంకరింపఁ బనుపన్ హర్షించి చోద్యంబుగాన్.

సీ. సౌరభం బీనుకస్తూరి గేహముఁలల్కి ముత్తియంబుల దేలిముగ్గుదీర్చి
గోడలుసొగసుగాఁగుంకుమచేఁ బూసిబహువిధచిత్ర రూపములవ్రాసి
పొందుగా వెలిపట్టుచందు వాలమరించినపరత్న మయతోరణములుగట్టి
కదళికా స్తంభముల్ పొదిక్కీల్లనమరించి కేతువులందందు గీలుకొల్పి

తే. మఱియు నివ్విధమునఁ బెక్కు తెఱఁగు లమర
మంగళప్రదలీలచే మందిరము ల
లంకరించినఁ గని మెచ్చి శాంకరేష్ట
గోష్ఠి నవ్వేళఁ గడపి వేగుటయు నంత. 23

వ. చెన్నబసవేశ్వరుం డరుణోదయంబున మేల్కాంచి నిత్యకృత్యంబులు దీర్చి సమస్తభక్తసంఘపరివృతుం డై దీక్షాగేహంబునకుం జని తన్మధ్యంబున శాతకుంభచతుస్స్తంభగుంభితంబును బ్రవాళప్రసూనమంజరీఫలముక్తాదామాభిరామోల్లాభశోభితంబును నానావిధపరిమళోపేతధూపధూపితంబును గర్పూరదీపదీపితంబును నగుమంటపంబు గదియం జని యందుఁ బంచవర్ణచూర్ణంబులచే గౌరీతిలకం బనురంగవల్లి రచియింపం జేసి తచ్చతుర్దిఙ్మధ్యస్థలంబుల శాలితండులంబులఁబోయించి వానియందుఁ బానీయపూర్ణకలశపంచకంబు నిలిపి తత్పశ్చిమప్రదేశంబునఁ దానుదివ్యసింహాసనంబున నాసీనుండై చతుర్దేశికులఁ జతుర్గకలశంబులయొద్ద నధికారు లయియుండునట్లుగా నియమించి తక్కినభక్తానీకంబుల నుచితాసనంబుల నునిచి మధ్యకలశంబుగాఁ గొని వారునుం దానును దత్కలశంబుల గంధపుష్పోదకంబులం బూజించి తదుపరి నూతనవస్త్రావరణంబుగావించి కాంచనరత్నంబులు వానియం దిడి చూతప్రవాళతాంబూలదళంబులు తన్ముఖంబున

నిలిపి మైదుకలశంబులకుఁ జుట్టి తంతువేష్టనం బొనరించి తత్కలశం బులుపంచాక్షరీపంచబ్రహ్మమంత్రంబులనభిమంత్రించిధూపదీపాదు లొసంగి యచ్చటనున్న భక్తపుంగవుల విభూతితాంబూలపూర్వకం బుగానారాధించి వారిచేదీక్ష యొనరింప ననుజ్ఞాతుండై భేరీవేణువీణా దివాద్యంబులు చెలంగ నంతకమున్న సుస్నాతుండై భస్మరుద్రాక్షధా రణం బొనరించి మంటపపూజానంతరంబునవచ్చి యచ్చటవసియించి సిద్ధరామయ్య గారాయం బిలిచిన నతండు పరమాత్మైక్యంబున నరుగు దెంచి భక్తసమూహంబునకు సాష్టాంగదండప్రణామంబు లాచ రించి తదనుజ్ఞఁగాంచి గురుపదంబుల కెరఁగి ముకుళీకృతకరుండైయు న్నఁగృపావలోకనమాత్రఁదత్పాపిక్తనకర్మంబుఁజించి మంటపప్రదేశం బున శిష్యుంబూర్వాభిముఖుంగాఁగూర్చుండంజేసి, తాను నుత్తరా భిముఖుండై తత్కలశోదకంబుల నభిషేచనం బొనరించి శైవసం స్కారుంజేసి వీరశైవదీక్షావిధానంబునఁ దప్పనీక ఘంటసంగతదుర్లక్షి లక్షణంగునట్లుగా భూతిపట్టంబు గట్టి నిజహస్తస్పర్శనంబునఁ దత్తనుగ తపంచభూతవికారం బుడిపి పంచాక్షరీమంత్రోపదేశంబుఁ గావించి మాయామోహాంధకారాదిగుణశిక్షితుం జేసి బ్రహ్మంబును బ్రహ్మేంద్రాదిలోచనాగోచరుండును సర్వగతుండును నగుపరశివ మూర్తి నదయదరహితంబును జ్యోతిర్మయాకారంబును సకలమూ ర్త్యతీతంబును నగులింగమూర్తిగా నియమించి షడ్వర్గపూరకంబు గాఁగాంచి యాలింగంబునకుఁ బంచామృతస్నపనంబుగావించిసర్వో పచారంబులనర్పించి శిష్యమస్తకస్థితకళభావానుగతంబుగాఁగనియా కర్షించి లింగంబునందు మంత్రోక్తంబుగాఁ బ్రతిష్ఠించి యాలింగం బాత్మచ్ఛాత్రనికరంబునం దుంచి వీని నెడఁబాయకుండుమని యద్దే వుం బ్రార్థించి శిష్యుం గాంచి లింగమూర్తిం బ్రాణపదంబుగా ధరి యింపుము ప్రమాదంబుఁజెందెనేని దేహపరిత్యాగం బర్హం బని తెలిపి లింగాంగైక్యక్రియానిపుణుం గావించి ప్రసాదాంగుంజేసి వా యుప్రాణసంబంధం బెడలించి లింగప్రాణుఁ గావించి జీవన్ముక్తిహేతు వీరశైవరహస్యంబు లన్నియుం దెలిపి తీర్థప్రసాదోపభోగుం గావిం చిన సిద్ధరామవిభుండు పరమానందకందళితహృదయారవిందుం డై

నిత్యనిర్గుణానుపమానంద మయాద్యంతరహితబ్రహ్మాంబగు లింగ
మూర్తి నొసంగు గురుమూర్తి యైనచెన్నబసవేశ్వరపదంబులకుఁ
కెరఁగి దేవా! భవదీయకరుణావశంబున గురుచరేశ్వరులసపర్య
లొనరింపం గంటి మీప్రసాదంబున కర్హుండ నైతి భక్తగణంబుల
లో సన్నుతి కెక్కితి నని పెక్కుభంగులం గొనియాడుచుండు
సమయంబున నచ్చటిగణంబులు. 24

క. జలజాసనాదిసురలకుఁ, దెలియంగానలవిగాని దివ్యామృతముం
జలపట్టి కాంచి తెచ్చా!, భళిరా! శ్రీసిద్ధరామ! పావననామా!. [నం

ఆ. మలయజమునఁబుష్పమానికంబునదీప,మమృతమందుఁజేగహాటకము
బరిమళముచెఱకునఁ బండుచిత్తరువున, జీవమిట్లునిన్నుఁ జెందెదీక్ష.

చ. అని వినుతింప వారు బసవాధిపుఁ డిట్లను నయ్యలార! యీ
యనఘుఁడు చిన్ననాఁడె మది కంపని శ్రీగిరినాథు మల్లికా
ర్జునుఁ గొని తెచ్చి యాత్మపురిఁ జోద్యతరంబుగ నిల్పెఁగాదె యీ
తనిచరితంబు లెక్కయిడఁ దామరచూలికి నైన శక్యమే!. 27

క. అనవుడు నత్యాశ్చర్యం, బున వారలు చెన్నబసవపుంగవుఁ గని యే
యనువున శ్రీగిరినాథుని, గొని తెచ్చెనువినఁగమాకుఁగోర్కిజనించెన్.

ఉ. ఆవిధ మానతీవలయు నన్నఁ గరంబులుమోడ్చి పల్కె నో
ధీవరులార! తత్క్రమము దెల్పెద నెప్పుడు సొన్నలాపురిం
దా విహరించు ముద్దయ యనఘ భవపావపయోజభక్తుఁ డా
పావనుఁ డీతనిం గనియె భర్గజయాప్తి శుభాంగి యందునన్. 29

తే. కాంచి యల్లారుముద్దుగాఁ బెంచుచున్న
నాఁడునాఁటికిఁ దనయీడుజోడువారిఁ
గూడి వేడుక నాడుచుఁ గొన్నినాళ్లు
శైశవక్రీడ లెల్లను జఱుపు చుండి. [ముం

క. తలిదండ్రులయనుమతి దూఁ, డలఁగాయఁగఁ బూనిగోరుపడమ చల్లడ
దలచీరకోలకిఱుచె, ప్పులుచిల్లసగ్రోవి యమరఁబోఁ ము దిరుగుచున్.

ఉ. శ్రీగిరినాథుదర్శనము సేయఁగ నేగెడునట్టి సర్వదే
శాగతమర్త్యకోటిఁ గని యచ్చెరువందుచు నంద ఱీగతిం

బ్రోగులు గూడి యచ్చటికిఁ బోయెదరో యని యెంచి యందు వే
దాగమవేదియైన శరణాగ్రణి నొక్కరిఁ జేరి యి ట్లనున్. 32

ఉ. కావటిబొట్టె లేదు సొరకాయలు బుఱ్ఱలు కంట్లపెద్దులు
న్మోవఁగ వెక్కసం బయినమూటలు మున్నగువానిఁ గొంచు మీ
రీవిధి నెందుఁ బోయెదరొ యేర్పడ నా కెఱుఁగంగఁ దెల్పవే
నావుడు మందహాసవదనంబున నిట్లని పల్కె వానితోన్. 33

చ. మునులకుఁ జెంకి భక్తులకు ముంగిటిపెన్నిధి తీర్థకోటికిన్
జననపుఠావు సర్వసురసంతతినిల్కడపట్టు ముక్తిభా
మినికి నివాసభూమి ఘనమేచకకంఠువిహారదేశమై
ఘనత వహించు శ్రీనగముఁ గన్గొనఁ బోయెద మన్న నిట్లనున్. 34

ఉ. అంచలు గుంపులై చనఁగ నచ్చట నెప్పని గల్గెఁ బెండ్లికో
బందుగు లున్నవారొ తెల. బల్కుము నావుడు వత్స! తన్నగం
బందు సమస్తదేవనిచయాధిపుఁడై తగుమల్లికార్జునా
ఖ్యేందుకిరీటిఁ గన్గొనుట కేగెద మంచు వచింపఁ గ్రమ్మఱన్. 35

తే. అనియె గిరిమల్లికార్జునుఁ డనఁగ మునియొ
దెవ్వఁడో నేలఱేఁడొ య ట్టెఱుఁగు దెలియఁ
జెప్పవే యని పల్కినఁ జిఱుతవాని
మాటఁ బోఁ ద్రోయఁజాలక మగుడ ననియె. 36

తే. తాపసుండును గాఁడు భూధవుఁడుఁ గాఁడు
దేవతాధీశుఁ డగు మహాదేవుఁ డనిన
సామి! యాసామిరూప మేచందమొక్కొ
యెఱుఁగుదేఁ దేటపడఁ జెప్పు మిప్పు డనిన. 37

ఉ. కేలను బోటువాలు దులకింపఁ దలం దొగమేలు మేనిసోఁ
బాలున నాలు కెంజెడలపట్టునఁ దొన్కసలాడుచుండుపె
న్గాలు పిఱుంద గబ్బిపొదచారలవన్నె మెకంబుతోలు డా
కాలున గంటపెండెపుఁజొకారపుడాలును గల్గు సామికిన్. 38

ఆ. నంది యెక్కిగిత్త నాగులు సొమ్ములు
చేదు మెడను బునుక చేరు బూది

నుదుట సరులుగొన్న రుదురాక లెదఁ గల్గు
నయ్య యొకవు చెలుప నలవి యగునె? 39

క. అనుటయు నాజేజేవారఁ, గనుఁగొనఁగామనసుపుట్టఁ గావున నీప
జ్జనరునకు దెంతుసనుఁదో,డ్కొని చని కాన్పింపుమనినఁగుట్టునికనియెన్.

చ. అడవులఁ గొండల న్నడిచి యన్నము వేళకు లేక యెండలన్
బడలికఁ జెంద లేవు పసిబాలుఁడ వాపులఁ దల్లిదండ్రులన్
విడి చనుదేర నీ కగునె? వీఱిఁడిబుద్ధులు మాను మీడ నేఁ
వడవు వసించినన్ వయస దప్పగు నేగెద నన్న నిట్లనున్. 41

ఉ. కూడదు దారి కష్ట మని కొంకు జనింపఁగఁ జెప్పకయ్య నా
యీడగుకుఱ్ఱలీవరుస నెందఱు లే రటు చూడు వారితో
జోడుగ నీపిలుంగ నగుచుం జనుదెంచెదఁ దల్లిదండ్రులన్
వీడఁగఁజాలు సంతబలువేలుపుఁ గన్గొనుభాగ్య మబ్బినన్. 42

చ. అన విని వీని రమ్మనుట కర్హము గా దిది మాన్పఁ గూడ దె
ట్లని మది సంశయించి శరణాగ్రణి యూరక పోవుచుండి ద
న్వెనుకొని వచ్చుబాలుఁ గని వీఁ డెటుల న్విడఁ డంచు నెంచి తో
డ్కొని యలయంగనీక సిరికొండకు వేడుకఁ బోయి యచ్చటన్. 43

వ. తదీయమహిమవిశేషంబు లిట్లని చెప్పందొడంగె. 44

సీ. ఇది తీర్థసందోహ మిదికుండసంఘాత మిదిమంటపవ్రాత మిది వనాళి
యిది గోపురానీక మివినందు లివి భృంగు లివి శిఖావళి యివివనంబు
లివి నవీనవజాల మిదిసాల మిదిగంగ యిదిమూలికోత్కరంబివిసరంబు
లివిమునిస్థానంబు లిది పరిఘావార మివి చిత్రకంబులు నివి రథంబు
తే. లివి మహాశక్తు లివి జోతు లివి మఠంబు
లివియ మణిమయపుదంతు లివి కుళంబు
లివి సువర్ణాశ్మసముదయం బివి తటంబు
లనుచు వేర్వేఱఁ జూపుచు నరిగి యంత. 45

సీ. కలితవజ్రోపలకల్పితకుడ్యంబు శాతకుంభస్తంభసంభృతంబు
వైడూర్యరజతకవాటసందీప్తంబు శక్రాశ్మజాలకసముదయంబు
ఘనధూపపరిమళాక్రాంతదిగంతంబు ప్రాజ్యకర్పూరదీపావృతంబు
నానాదిశాగతమానవాకీర్ణంబు వేత్రహస్తార్భటావిశ్రుతంబు

తే. పటుచతుర్విధవాద్యవి భ్రాజితంబు, వేదవేదాంతపాఠక విలసితంబు
రమ్యవారాంగనాలాస్యరంజితంబు, నైన శ్రీమల్లికార్జునాలయ ముగదిసి.
చ. పదిలము గాఁగ రమ్మనుచు బాలకుహస్తము పట్టి యబ్జభృ
త్సదనము జొచ్చి యందుఁ గలసంపడి మెల్లన యోసరింపుచు
న్సదమున నేగి యీశ్వరునిముందట మ్రొక్కుచు నిల్చి యీతఁడే
సదయుఁడు మల్లికార్జునుఁడు చక్కఁగఁ జూడుకుమార! నావుడున్.
మ. ఇతఁడా? శ్రీగిరిమల్లికార్జునుఁడు! సామీ! నెన్న బాగాయె నీ
మతిలో నేమి తలంచి దైవ మని సంభావించి కొన్పింపఁ జూ
చితి? నే వెఱ్ఱిని గాను వేలువు నిదర్శింపంగ; నాతోడనా
చతురత్వంబులు? చాలు దేవు నిఁక దాఁచంబోక కాన్పింపవే. 48
వ. అనిన. 49
శా. ఏమేమీ? కి వెడమాట లాడెదవు వారిచ్చ స్వీకారించ కే
స్వామీ! స్వామి యితండు గాఁ డనుట యేచందంబు? గాకున్నచో
నీమర్త్యావళు లెల్ల భక్తిరతులై యేతెంచి వాంఛాఫల
స్తోమావేక్షులఁ గొల్వ నేమిటికి? నీతోఁ జేతునా? మేలమున్. 50
తే. అనినఁ జిఱునవ్వు నవ్వి యోయయ్య! తలఁప
కేరడంబున కిఁక వేఱె దారి గలదె
బెల్ల మని చోళపిండి చేఁ బెట్టినట్టి
చంద మయ్యెను నీవాఁడు చూడఁజూడ. 51
తే. ఏది? వినుజాలు మొనవాలు నిఱ్ఱికేలు
నేది? తోల్చీర మెడచాలు యెముకకోల
యేది? నెలకూన సామేన నిడినచాన
యితఁడు జేజేలదొర యని యెటుల నందు?. 52
చ. అనవు డితండు సావయవుఁ డైనతటిఁ ధరియించుచిన్నె లీ
యనవున నన్ను నీ వడుగినట్లు విభావనఁ గాసి కర్మదృ
ష్టిని గనరాదు గాన మసిఁ జేర్పకు సంశయ మీశుఁ డీతఁడే
వినుతి యొనర్పు మ్రొక్కు పద వెఱ్ఱితనంబులు మాని క్రమ్మఱన్.
వ. అనిన నచ్చిఱుతం డి ట్లనియె. 54
చ. హరుఁడు మదిం దలంప నొకయాకృతిఁ గన్పడుఁ గర్మదృష్టిచే 54

నరసిన వేతెఱంతిఁ దగునంచు వచించితిపయ్య మున్న యీ
దరమున మీఁగ లాడునుడి దప్పఁగఁ గూడునె? నన్ను మీఱ లి
వ్వరుసునఁ బిన్నగాఁ దలఁచి పల్కులఁ జిక్కులఁ బెట్టఁ బాడియే?.

వ. నావుడుఁ దజ్జంగమవరుం డతనితోడ. 56

చ. హరుఁ డెటువంటి వాఁడనిన నాకృతిఁ జెప్పితిఁ జెప్పినట్ల యీ
స్మరహరుఁ గానుపింపఁ దరమా? మముబోఁటికి ధ్యానగమ్యుఁడై
పరగు నతండె యాత్మ దయ పర్వఁగ సన్నిధియైనఁ గాక యీ
ధరజను లెల్లఁ గొల్చుపరతత్త్వ మిదే యిఁక లేదు కావునన్. 57

ఆ. భక్తితోడ మ్రొక్కు పరస క్రమ్మఱిపోవు, చున్న దీడ సింకనునికిగాదు
పోదమూరికిపుడు వాదు లేమిటికిర, మ్మనినసిద్ధరాముఁ డతనికనియె.

చ. పయ జనియించి యాతని కతం డిటు రావలె గాని నీవు ని
ర్ణయముగఁ జూపలేవు గద? నాఁ కట రాఁ బని యేమి? మీరు పొం
డయినను నేను వచ్చి జను లారడి సేయఁగ సిగ్గుఁ జెందనా?
యయుతసమంబు లైన శివు నారసి క్రమ్మఱ వత్తు నావుడున్. 59

చ. కలఁగుచు జంగమయ్య కసుగందును దుర్గమసీమ డించి యే
కొలఁదిఁ జనంగవచ్చు? ననుకూరిమి మీఱఁగ బుజ్జగించి య
గ్గలముగ మంపలించి కొఱగా దసి బిట్టపలంచి యెన్నిభం
గులఁ దనతోడ రామికి నెగుల్కొను నంచని యేగె నంతటన్. 60

చ. ఇటు తనుఁ బాసి యాశరణుఁ డేగినపిమ్మట సిద్ధరాముఁ డు
త్కటముగ మూర్ఛఁ జెంది బెడిదంబుగఁ గన్నుల నశ్రుబిందువుల్
పొటపొట రాల నేలపయిఁ బొర్లుచు లేచుచు నుస్సు రంచు ది
క్తటములు చూచి బెగ్గిలుచుఁ గ్రిమ్మినశోకముతోడ నాత్మలోన్. 61

ఉ. శర్వునిఁ గానుపింతు నని జంగమవర్యుఁడు నన్నుఁ దెచ్చి యీ
యుర్వర డించిపోయె నయయో! యిఁక నెవ్వరు? దిక్కటంచు లోఁ
బర్వినచింత రాముఁ డటఁ బాసి గనుంగొనువారి నెల్ల వే
దార్వునిఁ జూపలేరుగద! యాదరణంబున నంచు నార్తుఁడై. 62

ఆ. గిరులఁ జఱుల ఝరులపేరులఁ దగు,తరుల సిరులపఱులుదరులఁ బరుల
హరులఁ గరులసరులఁ బరగినవనముల, శరధిశరధి పరుస నరసియరసి.

సీ. శ్రీకంఠ! కానవే? శారదాంబుదవర్ణ మన్మథ! కానవే? మన్మథారి

శాండిల్య! కానవే? శాండిల్యనుతపాదు బాటల! కానవే? పాటలజటి
వారణ! కానవే? వారణాజినచేలు నమృతంబ! కానవే? యమృతదేహు
స్యందన! కానవే? స్యందనాయితధరు నభయంబ! కానవే? యభయ
తే. రాజవృక్షమ! కానవే? రాజధరుని [హస్తు
బాణభూజమ! కానవే? బాణవరదు
నందివర్ధన! కానవే? నందితురగు
ననుచుఁ గుజముల శివుజాడ లరసి మఱియు. 64
తే. ఘనుని శ్రీగిరిమల్లికార్జునుని మీరు
గనరె? శ్రీగిరిమల్లికార్జునములార!
యతులఖర్జూరశిఖరిప్రియాళుఁ గనరె?
యతులఖర్జూరశిఖరిప్రియాళులార!. 65
వ. అని యడుగుచు. 66
క. తిరిగినచోటులెతిరుగుచు,నరసినతృణగుల్మలతలెయరయఁగఁజనుచుఁ
జొరఁబాఱుగుహలె చొచ్చుచు,సిరిగిరిపతిఁ గానలేక చింతిలియంతన్.
ఆ. నడవలేక చిక్కువడి మేనఁ జమటలు
గ్రమ్మఁ బెదవు లెండఁ గంప మడర
నాదరించి జడియ కను వారిసిం గాన
కుండి యొక్కచోటఁ గూరుచుండి. 68
ఉ. అక్కట! జంగమయ్య యరు దందఁగఁ జెల్పిననీదురూప మే
నెక్కడఁ గాననైతిఁ బరమేశ్వర! న న్నలయింపఁ బూని యే
దిక్కున డాఁగితో యడవి ద్రిమ్మరి వేసరినాఁడ నాఁకటం
జిక్కితి దప్పి స్రుక్కితిని నే నొకవ ల్కెఁక నైనఁ బల్కవే!. 69
చ. కరుణ దలిర్ప నీవె పొడగట్టెద వంచు వచించె మున్న యా
శరణుఁడు నేను జాలిఁబడి సందుల గొందులఁ జట్టు మెట్టలం
దిరిగియు నెల్లచోటులను దేవరరూపము గాన నైతి నీ
వరవుడ నయ్యెదఁ నెనరు పాఱఁగ నీ విఁక నైన రాఁగదే!. 70
చ. కటికితనంబునం బసులకాఁపరికుఱ్ఱఁడు నీఁ డటంచు న
న్నిటువలె గాసిఁ బెట్టఁజను నే? తలిదండ్రులఁ బాసి నన్ను మ
న్నుటకు గురుండ నీవె యని చొచ్చితి నీయిలు గాన నింక నే

సట పడనీక నాకనులు చల్లఁగ ని స్సనఁజేయు మ్రొక్కెదన్. 71

చ. నను వెతఁ బెట్టకిప్పుడు కనంబడితేని రయంబు మీఱ నే
నినుఁ గొనిపోయి మాకుఁ గలనెయ్యుల బంధులఁ దల్లిదండ్రులం
బనుపడ వేఁటలాల సిరిఁ బాయనియిందులనొడ్డిమంచలం
దనియఁగఁ జూపెద న్నుడువు దప్ప బిరాలున నీవు రాఁగదే. 72

చ. తడయక రమ్ము నిన్నతిముదంబునఁ దోడ్కొనిపోయి పాలు మీఁ
గడ నెయి వెన్న జున్ను పులఖండము గొబ్బరిపప్పు నానఁబ్రా
లడుకులు తేనె పండు లోడియంబులు పానక మూరుగాయ ల
ప్పడములు జీటిలా పెరుఁగు పాశము కజ్జము నీకొసంగెదన్. 73

తే. అనుచు నీరీతి సిద్ధరామయ్య తన్నుఁ
దలఁచి ముగ్ధానులాపముల్ పలుకునట్టి
సమయమున మల్లికార్జునస్వామి నెనరు
దవుల నొకజంగమై వానిఁ దఱియ వచ్చి. 74

ఉ. ఎవ్వఁడ వీవు? కాడుపడి యేకత మేటికి సంచరించె? దీ
విప్వనసింహగండకమదేభము లాదిమృగంబు లెల్లెడం
గ్రొవ్వి యనేకముల్ తిరుగుచుఁ గ్రుమ్మరు సి స్నిట డించి పోవువా
రెవ్వరు? మాకుఁ దెల్పు మిపు డేప్పడ బాలక! యన్న నిట్లనున్.

ఉ. సొన్నలయూరు ముద్దయకు సూనుఁడ దూడలఁ గాయుచుండఁగా
న న్నొకజంగమయ్య గిరినాథుసిఁ జూపెద నంచుఁ దెచ్చి ము
న్నెన్నినవానిఁ జూపెడక యిచ్చట న స్వడనాడి యేగె నే
తెన్నునఁ గాంతు సామి నని త్రిమ్మరి డస్సితి నెందుఁ గానమిన్. 76

తే. అయ్య! నీవైన నెఱిఁగిన నాతఁ డుండు
చోటుఁ జూపింపు వేలుపుఁ జూపినపుడె
యెలమి నాపయిగోర్పడ మిత్తు నీకు
నమ్ము మనుటయుఁ జిఱునవ్వు నవ్వి హరుఁడు. 77

చ. జడియకు మేల యేడ్చెదవు? జంగమసర్యుఁడు చెప్పినట్టి యా
మృడునిఁ గనంగఁ జేతుఁ గడు మేలగు రాగ కుమార! యన్న న
బ్బుడుతఁడు నెన్నొసల్ పుడమిఁ బొందఁగఁ జాఁగిలి మ్రొక్కి వేడుకల్
వడసితినయ్య! మిమ్ముఁ నెడ బాయక వచ్చెద సామిఁ జూపవే! 78

క. అను దబ్బాలునిఁ దోడ్కొని, చని మల్లేశ్వరమనోజ్ఞసదనసమీపం
బున నిలిచి లోన వసియిం, చినవాఁ డదె చూడు రాజశేఖరుఁడనినన్

క. మును జంగమమర్త్యుఁడు చూ, పినతలమే యిచట లేఁడు వేల్పాతనిలా
గున నన్నుఁ గానిఁ బెట్టక, చెనమల్లేశ్వరుని వెంటఁ జెప్పంగవదే! 80

ఉ. నావు డలీకజంగమము నమ్మము నావచనంబు తప్ప దీ
తావునఁ నే చరించు కనుఁ దమ్ము లోకించుక మూసి విప్పు మా
దేవుఁడు కానుపించు నని తెల్పి యదృశ్యతఁ జెంద బాలకుం డా
విధ మాచరించి ప్రియ మందుచుఁ గ్రమ్మఱఁ జేతి చూచినన్. 81

మ. అనఘుం డవ్యయుఁ డప్రమేయుఁ డచలుం డాద్యంతశూన్యుం డనూ
తనుఁ డానందమయుం డగమ్యుఁ డఖిలాధ్యక్షుం డచింత్యుం డవా
మనుఁ డద్వంద్వుఁ డనామయుం డచ్యుతుఁ డనూత్మజ్యోతి రాకారుఁ డా
ఘనుఁ డాభక్తుఁడు చెప్పినట్ల సగుణాకారంబు సంధిల్లఁగాన్. 82

క. కనుపట్టె సిద్ధరామయ, యనుపమమోదమున నీతఁడయ్య! యెఱుఁగఁజె
ప్పినవేల్పని సాఁగిలి వం, దన మొనరిచి యిట్టులనె యొఁ వద్దేవునితోన్.

ఉ. ఎక్కడ డాఁగి ? తింతవడ వెయ్యెడ నారసి కానవైతి నీ
విక్కడి కింతలో మరలి యెప్పుడు వచ్చితివయ్య! కానలోఁ
జిక్కి యొకండ నే వెతలఁ జెందఁగ నాదగుపుణ్యమూర్తివై
యిక్కరుణాకరుం డభయ మిచ్చెటు రమ్మని చూపె మిమ్ములన్. 84

క. కాకున్న నేమి గతి యగు,నో కదయని తిరిగి యటఁగనుంగొన గణవ
ర్యాకృతి యచ్చటనగాఁక,రానుండినవతఁడుత త్తఱంబగుమదితోన్.

చ. కటకట! మోసపోతిఁ గదె! కన్నులు మూయు మటన్న మూసిన
న్నిట పరిఁ జేర్చు భక్తవరుఁ డెచ్చటికేగెనొ యేమి సేతు నే
నెటు గనుఁగొందు నింక భ్రమియించి వెసం జననీక గట్టిగాఁ
జిటుకునఁ బట్టనైతి నని చింతిలుచుండ దయానురక్తిచేన్. 86

సీ. చిఱుతనిఁ జేరంగఁ జీరి కౌఁగిటఁ జేర్చి
తొడలపై నిడుకొని యొడలు నిమిరి
కూఁకటి పుడికి వైకుంఠాస్త్రుఁ డిట్లనుఁ
దనయుని ముగ్ధత్వమునకు మెచ్చి

వచ్చె నిన్నిట దోడి తెచ్చుట కై యల
భక్తు నీకడకు నేఁ బంపినాఁడ
నతఁ డగపడఁ డని యడలకు మని వాని
పైఁ గప్పుకొనుగోరుపటము వజ్ర
తే. కవచముగఁ జేసి యోగవేగములు ఫాల
నయనమును మఱి స్పర్శవేదియు నొసంగి
యింటి కేగుదు గాని నీ యీప్సితార్థ
మింక వలసినయది గోరు మిత్తు ననిన. 87
శా. గౌరీవల్లభ ! వాంఛితం బొకటి నేఁ గాంక్షించెద న్నిన్ను నీ
వీరూపంబున నీశుభాలయముతో నీవేళ నావెంబడిక్
మావా రందఱు సంతసంబునఁ గన న్మాయూరి కేతెంచి బ
ల్కారుణ్యంబున నెల్లకాల మట సౌఖ్యం బొప్పఁగా నిల్వవే !. 88
క. ఇది దప్ప వేఱె వాంఛిత, మది లేదన నీశుఁ డనియె నాగలి నీ విం
పొదవఁగఁగోరినకోరిక,లొదవఁగఁ జేయఁ దగుఁగాననొక్కటివినుమా.
తే. లోకమునకుఁ జూడ నీకు ముక్తజంగమ,వరుఁడుచూపినట్టిపగిది నిల్తు
నీకుఁ జూడనట్టి యాకృతి నుండెద, ననిన సమ్మతించి యర్భకుండు.
వ. గౌరీశ్వరానుగ్రహంబున నసాధారణమేధాయుతుం డై యద్దేవు ని
ట్లని స్తుతియించె. 91
ఉ. ఫాలకృశానుకీల! భవపాశవిమోచనశీల! మానివా
ల్లోల! దయాలవాల! హితలోకసుధాశనసాల! కంఠకా
కోల! విధూతకాల! శతకోటిధరాదిసురాళిపాల! స
ల్లీల! శివానుకూల! వినుతించెద నిన్నిదె మల్లికార్జునా !. 92
ఉ. శారదకంద కాదవ తుషార పటీర మృగేంద్ర కుంద ఖ
ర్జూర మరాళ వారిజ మరుద్గజ పారద హార హీర మం
దార సమీక జేమన సుధాకర చంద్ర సురేశ్వరాశ్వ భా
షారమణీశరాభనిజసంహననాంచిత ! మల్లికార్జునా ! 93
చ. అని వినుతించునాతనిఁ బ్రియంబునఁ గన్గొని చెన్నమల్లికా
ర్జునుఁ డను వత్స! నీ కెదురుచూతురు నీతలిదండ్రు లొప్పు లో
క్కనిముష మెండఁ గాఁగ నటు గొవ్వునఁ బోధ ఘటించుఁ దత్క్షణం

బున నిజపాదసేవకసమూహవిహారిణి పొన్నలాపురిన్. 94
చ. కనకమణీమయాలయము కల్పనచేసి తదంతరోర్విపై నూ
తనఘనలింగరూపమునఁ దా వసియించి యమేయభక్తిభా
జనమగు సిద్ధరామవరు సన్నిధి నుంచి జగజ్జనానురం
జన మొనరింపుచు న్నిలిచె శర్వుఁడు శ్రీగిరినుండువాడ్పునన్. 95
చ. అటు కనిపెట్టి పౌరజను లంపలు గన్గొని యద్భుతాత్ములై
యిటు మును పెన్నఁ డిప్పగిది నీమణిధామము గాన లేదు ని
క్కటమగు కాంతి నల్దెసలఁ గప్పుచు నున్నది చూడుఁ డంచు నొ
క్కట ప్రమదం బెలర్ప గుమిగా గుడిఁ జేరఁగ నేగి యందునన్.
చ. అనుపమలింగమూర్తిఁ గని యందలిభక్తి వసించు సిద్ధరా
మునిఁ దిలకించి యద్భుతము మోదము స్వాంతములందు నొక్కటం
బెనఁగొన నందుఁ గొందఱతివేగము ముద్దయఁ జేరఁ బోయి నీ
తనయుఁడు వచ్చినాఁ డనినఁ దక్షణమాత్ర వధూసమేతుఁడై. 97
క. భవనము వెలువడి తజ్జన,నివహముఁ జూపించుదారి నేసని యెదుటన్
నవరత్నఖచితమైతగు,భవగేహముఁ గాంచిచొచ్చి ప్రబలినతమిచేన్.
క. రెండవరుద్రుసికైవడి,నుండుతనయుఁ జేరి జపమహాత్మ్యకుఁడై యా
తండు జననీజనకపద,కాండజముల కెరఁగి నిలువఁ గదునేడుకతోన్.
సీ. జనకుఁడు గూరిమితనయుఁ గౌఁగిటఁ జేర్చి
నాకులపావనా! నాయశంబ!
నాపెన్నిధానమ! నాతండ్రి! నాపట్టి!
నాతపఃఫలమ! యిన్నాళ్లు నన్ను
నెడఁబాసి యెచ్చటి కేగితి? విచ్చటి
కెప్పుడు వచ్చితి? వీగు డేమి?
యీలింగ మెక్కడి? దింతయు నేర్పడ
నెఱిఁగింపు మనుటయుఁ జెలుత తాను
తే. వరుసతోఁ గూడి శ్రీగిరి కరుగునాఁడు
మొదలు నగరప్రవేశంబు తుదిగ జరుగు
తనదువృత్తాంత మంతయు వినఁగఁ జెల్ప
నెల్లవారలు సంతోషహృదయులగుచు. 100

తే. భళిర! జితకామ! శాంభవభక్తిధామ!
కమలసుఖధామ! సమదృష్టకాచహేమ!
భువనసుతనామ! పరిపంథిసివహాభీమ!
సేవకావలిరామ! శ్రీసిద్ధరామ!. 101

క. బాలుఁడవై యుండియు నీ
లీల మహామహుఁడ వగుట లేశము తెలియం
జాల మయితి నింక నీ సరి
యేలోకమునందు నైన నెన్నం గలదే?. 102

వ. అని యత్తెఱంగునఁ గొనియాడి యేతల్లింగమూర్త్యభిధానం బెద్ది?
యని యంవలు విచారించి సిద్ధరాముని చేఁ గొనితేఁబడు మల్లికార్జు
నమూర్తి గావున సిద్ధమల్లేశ్వరాభిధానం బిడి షోడశోపచారంబులం
బూజించి గీతవాద్యాదులఁ గొంతప్రొద్దు వినోదంబు సలిపి తదనం
తరంబ యబ్బాలుం దోడ్కొని తదీయనివాసంబునకుం జని ముద్దా
ఖ్యదత్తోచితాసనంబుల నాసీనులై భూతిపీఠ్యంబులు గైకొని యొం
డొరులు తమలోన. 103

మ. ఘనగిరిమల్లికార్జునుని గన్గొని తత్కృపఁ గాంచి యిందుఁ దో
డ్కొని చనుదెంచు వీనిజనకుం డగుముద్దయభాగ్యవృత్తి చె
ప్ప నగునె? పొన్నలాపురి శుభంబు వహించెఁ బురంబులోని యీ
జనులు నిరంతరం బతులసౌఖ్యముఁ జెందుదు రింకమీఁదటన్. 104

తే. ధీరుఁ డైనట్టిపోడ్డలదేవు బాచి
రాజు సౌరాష్ట్రమునునుండి రాజమార్గ
వచ్చెఁ గళ్యాణమునకు మందిరముతోడ
వచ్చె నీతనిభక్తికి మెచ్చి హరుఁడు. 105

వ. అదియునుంగాక. 106

క. శ్రీ మెఱయ మున్ను మైధున, రాముఁడు సిటలాక్షుపాదరాజీవార్చా
కాముఁడునగపతినిటుతన,ధామమునకుఁదెచ్చెఁదద్విధం బెటులన్నన్.

## మైథునరామునికథ.

క. హైమప్రాసాదచర, తోమమాస్యాకచవిరాజసుమనస్సుమన
స్తోమాయితనక్షత్రము,భీమావతి యనెడుపురముపృథివిఁదనర్చున్.

వ. తత్పురంబున. 109

ఉ. ప్రాకటనైజవంశజలరాశివిధుం డ్రోకసోమయాజి ని
ష్ఠాకలితాత్ముడై తపము సల్పి కులాంగనయందు బుత్రశో
భాకరుఁ గాంచె నీశ్వరపదప్రపారతి మైథునరామనాము మై
నాకుని దొల్లి శీతనగనాథుఁడు గాంచినరీతిఁ బ్రీతిగాన్. 110

తే. కని మనోరథ మీడేరె ననుచు సతియుఁ
దాను సంతోషకలన చేదనరె బంధు
రాజి కొనియాడఁ దత్సోమయాజి ఘనత
లక్షసౌఖ్యాప్తి కొంతకాలంబు జరికి. 111

ఉ. అక్షయు నవ్యయాత్ముఁ బ్రమథాధిపు ధ్యానతఁ గంటిఁ గాని ప్ర
త్యక్షము గాఁగ దివ్యవిమలాకృతిఁ గాంచఁగ నైతి నింకఁ బ
త్ర్యక్షునిఁ జూడఁగావలె నటంచు ముదంబున నేగి యామహా
సాక్షిముఖామరాభినుతమౌ శివలోకముఁ జెందె సంతటన్. 112

క. జనకుఁడు పరమేశ్వరుఁ జెం, దినపిమ్మటఁ దల్లిఁ బెనుప దినదినమును మై
ఘనరాముఁడు ప్రబలుచు హా, యనసత్తక మైనకిరవ నంబపనువునన్.

మ. ఒకనాఁ డాటలకుఱ్ఱలం గలిసి తా నుద్దండకాంతారఘూ
మికిఁ బర్ణేంధనసంగ్రహార్థమయి తాల్మిం బోయి యందొక్కచో
సకలాండోద్భవసన్నివేశవటవృక్షచ్ఛాయయం దాత్మను
త్సుకలీలన్ వసియించువేళ సహవర్తుల్ వేడుకల్ మీఱఁగాన్. 114

క. ఒండొరులతోడ దివ్వెల
పండుగ యిదె వచ్చె నింకఁ బదికినములకున్
వండుదు రరిసెలు గజ్జపు
టుండలు మాయింట ననుచు నొక్కఁడు పలికెన్. 115

క. మఱియొకఁడు పలుకుసన్నపు, నెఱవగుదుప్పటులుపూలు నేసినయంగి
లోఱపుగలుగుతలపాగలు, నఱిముఱిగొని తెచ్చునాటికయ్యాయటంచున్.

క. మాయక్కలమాబావలఁ, దోయంబులవారినెల్లఁ దోడ్తేరఁగ నే
నాయత్తపడఁగవలెఁ జుం, డో యని వేఱొకఁడు పల్కె నుత్సుకలీలన్.

ఉ. అప్పుడు రాముఁ డిట్టు లను నంవఱిఁ గాంచి కుమారులార! మా
యప్పను బావనుం బిలిచి యప్పనుపండువునాఁడు పాశముం.

బప్పులు కుప్పతెప్పలుగ బంతిని వారలతో భుజింతుఁ బై
గప్పుఁగఁ గట్టి నిత్తు నెనకంబున వారికి సన్నపుట్టముల్. 118

మ. అనినం బక్కున నవ్వి బాలకులు చోద్యం బయ్యె రామయ్య! నీ
వనువాక్యంబులు నూఱులేని పొలిమే రన్నట్లు నచ్చ త్రిష్ఠాచా
రిని నా కిందఱు బిడ్డ లన్న గతి నోరీ! నీకుఁ దోఁబుట్టువే
విన మేకై పడి బావ గల్గెఁ? జెపుమా! వింధాము నిక్కంబుగాన్. 119

ఉ. అంతటితోడ పంతుకొఱ కక్కను బావను దెత్తు నంటి వీ
రిందఱు నమ్మియుండి రిపు డెక్కడనుం డిట వచ్చినారు? మీ
చందము ము న్నెఱుంగరు మృషావచనంబులు వింతవారికిఁ
బొందెడుఁ గాక మాకు విన యోగ్యముగా దటులైనఁ దెల్పుమా 120

సీ. మీయక్క యెవ్వరు? మీ బావపే రేమి? వారిదే యూరు? దవ్వా సమీప
మా? కలిగినవారొ? లేక దరిద్రులో? వారిచుట్టంబు లెవ్వారు? వారి
కెందఱు సంతానమే ప్రత్తిఁ జరియింతు? రెన్నఁడు మీయింటి కేగుదెంచి
రెవ్వరు మీబావ కిష్టు? లాతఁడు చదు వేపాటి చదివె? నీ విపుడు మాకు

తే. నెఱుఁగఁ జెప్పు మటంచు నందఱును నవ్వ
లెసఁగ గుమిగూడి డాయంగ నేగుదెంచి
మాటమీఁద నె మాటగా మఱియు మఱియు
నుడుగ క త్తఱిఁ దఱిమి త న్నడుగుటయును. 121

చ. వెలవెలఁబాఱి బాలకుఁడు వీఱిఁడి యై మఱుమాట లేమియుం
బలుకక వారి నెల్ల నెడఁబాసి కనుంగవ బాష్పబిందువుల్
దొలుకఁగ నింటి కేగుచు నెదుర్కొను తల్లిని గాంచి శోక మ
గ్గలముగ నేడ్చినం బెదరి గ్రక్కున నాత్మజుఁ గౌఁగిలించుచున్. 122

ఆ. వీఁపు చఱచి కనుల వెడలునీరము తన
పైఁటకొంగుచేతఁ బాయఁ దుడిచి
నాకుమార! యన్న! నాతండ్రి! నాకుట్టి!
యేల యేడ్చెదయ్య? యింత వెక్కి. 123

క. అడవిని మృగములఁ గనుఁగొని, జడిసితివో యయ్య! లేక సహచరులటని
న్నడిచి తమ రేగుదెంచిరొ!, పడుచులతో నేలనిన్నుఁ బంపితిఁ దండ్రీ!.

క. ఒడలెఱుఁగక మార్గంబునఁ, జెడుగులు నిన్నెవ్వరెనిఁ జెనకిరొ! వారిం
దడయక నేశిక్షించెదఁ, గొడుకా!కలతెఱఁగునాకుఁ గొంకక చెపుమా.

చ. అనినఁ గుమారుఁ డిట్లనియె నమ్మ! సహాయులు నే నరణ్యమే
దిని గుమిఁగూడి యాడునెడ దివ్వెల కక్కల బావగార్గర
మ్మనిమెవ మంచు నంద ఊన నట్లన నేఁ బలుకంగ లేసివా
రి నెటులఁ జెత్తు వంచుఁ జెలరేఁగి వికావిక నవ్వి రత్తఱిన్. 126

క. అని యతఁ డాడినమాటలు
విని నెమ్మదిఁ జింత నొంది పీని నెటుల నో
దన ముడుపుదు నని యపు డొక
యనువు విచారించి పల్కె నాత్మజుతోడన్. 127

తే. అన్న! ప్రేరితనమున నడవి పడుగు
లాడుమాటలకీ వింత యడలెదేల!
తెలియ కాఱడి యైన సందియము దీఱ
వార లడిగినక్రమ మెల్ల నేరుపఱతు. 128

సీ. మీయక్క భ్రమరాంబ మీబావ మల్లన్న
వారలయునికి శ్రీపర్వతమున
నతిదూర మచటికి నష్టైశ్వర్యసంపత్తి
గలవారు బంధువర్గంబు హిమవ
దాదులు సుతులు గణాధిపప్రముఖులు
సకలలోకాధ్యులై జరుగు వృత్తి
లేమిచేఁ బిలుచుటలే దెన్నఁ డిటు వారి
శ్రీదుఁడు మీబావచెలిమికాఁడు [చుట్ట

తే. ప్రజ్ఞ వివరింప నేల! సర్వజ్ఞమూర్తి, యరయ నాయల్లునంత వేత్తైన
మేఁడినిను గేలిచేసినహీనవిప్ర, బాలకులకన్న సంతోషభరితుఁడగుచు.

ఉ. బాలకుఁ డిట్లు పల్కె నిదె పండువు డాయఁగ వచ్చెఁ దల్లి! నీ
వేల తనూజ దానిమ్మ్రుదయేశ్వరుఁ బిల్వఁగఁ బంప? విట్టులం
బోలునె? క్రిందటం బిలువఁ బోవమియే కదుఁ దప్పు పంపినన్
లీలను నేను వారిఁ దరలించుకవచ్చెద నత్వరంబుగాన్. 130

తే. వసుమతిని నల్లుఁ దోడ్కొని వచ్చినట్టి
పండుగ శుభాస్పదం బగు పరగు నెందు
నట్ల సేయకయున్న హీం యనుచు నగరె?
పలుచఁగాఁ జూచి మనసాటిబంధుకోటి. 131

చ. జనవృదుఁ వల్లి యి ట్లనియె నన్న! కుమారక! నిన్నుఁ గాంచి నీ
జనకుఁడు చన్నపిమ్మట విచారముచే నికతంబుఁ దోఁచ కె
వ్వని నటుఁ బంపలే వతఁడు వచ్చుట లేదు తొలంగి నిన్నుఁ బో
ష్మని యెటు సైతు? స్త్రీలు చనునట్టవి గావుగదా! పరాపనుల్. 132

సీ. అది గాక మీబాప కతులితసంపదల్
గల వట నిట కేల కదలివచ్చు?
నొకవేళ వచ్చినా యొంటిరాఁ డతనితోఁ
బరివార మరుదెంచు బహుళ మగుచు
నంపజె కేరీతి విందు సేయఁగఁ గల
విప్పాటఁ గుడుచుట కింట లేదు
సాటికిఁ జెవులు వెంపఁగవచ్చుఁగాని పోఁ
గులు పెట్టఁగలరె? భూపలయమందుఁ

తే. బూని మున్నాటియఱువదిపుట్ల తండు
లములు వానికిఁ దగువ్యంజనములు గూర్చి
పాక మొనరించి పెట్టి మీబాపచేత
మెప్పుగనెఁ గరికాలుండు మిగులఁ దొల్లి. 133

ఆ. కాన భాగ్యవంతు లైనవారలతోడ, నెట్లు సాటివత్తు? మీఁపు పెద్ద
వాఁడవై గణించవచ్చినప్పుడువారిఁ, దోడితెత్తుగానికూడదిపుడు. 134

వ. అని పల్కిన జననిపల్కులు వెడవెడయూఁకొని తన్ను గేలిసేయువిప్ర కుమారులమాటలుమనంబుననాటుటయునేగతినైనభగినీభావుకులఁ దోడితెచ్చి పండువు సేయదుంగాక యని తలంచి యొకతీరున నద్దినం బు గడపి మఱునాఁ డరుణోదయంబున లేచి యెవ్వరితోడం జెప్పక మరు లెత్తినకైవడిఁ బురంబు వెలువడి. 135

చ. కరి చమరీ తరక్షు వృక తండక భల్లుక పుండరీక కే

సరి కిటి భూరిమాయు శశ శల్య వలీముఖ కృష్ణసార కా
సర శర భాఖుభు గ్గవయ శార్వర రోహిష రామ ఋశ్య శం
బరముఖసర్వదుష్టమృగబంధురకాననభూమి ధీరుఁడై. 136
క. ఒక్కఁడుఁ డపరక బెదరక, యెక్కుడుపైనములుచనుచు నెంతటివారో
యిక్కడికి శ్రీనగంబని, యక్కడియక్కడిజనాళి నడుగుచుఁజని యెన్.
మ. చని కాంచెన్ ధరణీసుతాత్మజుఁడు భాస్వత్ఖ్యాతి శ్రీశైలమున్
ఘనపాపాటవికీలమున్ వరదివౌకస్త్రీకామినీఖేలమున్
మునిగేయాఖిలతీర్థజాలము సదామోక్షోత్సుకై కాలమున్
జనితాభీష్టసకల్పసాలము మనోజాతారిసుస్థాలమున్. 138
తే. కాంచి సంతోషపులకితగాత్రుఁ డగుచు
నమ్మహీధరశిఖరాగ్ర మధిగమించి
యెచట నుండునో మాబావ యిపుడు వెదకి
వెంటఁ గొనిపోదుఁగాక మాయింటి కనుచు. 139
సీ. రాజతశిఖరేశ్వరంబందు వీక్షించి హాటకేశ్వరుని గేహంబుఁ గాంచి
గణపతిస్థానంబుఁ గలయంగ నిలకించి పంచమఠంబులపజ్జ వెదకి
కలితపాతాళగంగాప్రతీరముఁ జూచి కుండికానివహంబుదండ నెమకి
కోటిలింగాకారకుంభినిఁ గనుఁగొని చంద్రగుప్తనగంబుచాయ నరసి
తే. రమ్యతరశంఖ చక్ర వరాహ బిందు
నారసింహ సరస్వతీ నామతీర్థ
రాజిఁ బరికించి కాంచనరత్నసాల
గోపురంబులు గ్రుమ్మరి పాపఁ డంత. 140
వ. మఱియుఁ ద్రిపురాంతక కాలంపురీబాలబ్రహ్మేశ్వర సిద్ధమాహేశ్వర
వీరేశ్వర స్కాంధసోమేశ్వరప్రసూనాచలసంగమేశ్వరంబు లనుచతు
ర్ద్వారోపద్వారమధ్యంబునం గలతీర్థంబులం బరామర్శించి ప్రాకారం
బుం బఱియం జొచ్చి యంతటం గలయం దిరిగి మల్లికార్జునుం డెచ్చ
ట నున్నవాఁ డని కనుపడుజనంబుల నడిగి వారివలన నిక్కువంబు
దెలిసి తదీయాలయంబు చేరంబోయి యచ్చట లింగాకారంబు గాంచి
యన్యదాభపురకాగారం బిదియ యని చెప్పి రిచ్చట లేఁ డిదేమొకో

యని చింతించి దూరపథశ్రమంబు నొందినవాఁడు గావున నొక్క
యెడఁ గూరుచుండి యద్దేవు నుద్దేశించి. 141

ఉ. నిండినవేడ్క దివ్వెలకు నిన్గొనిపోవఁగ బుద్ధి పుట్టి నే
నెండకు వానకుం దలఁక కేచ్చుట నీకుఁ దోడుకూడి నా
దండ వసించుబాలుకకు దవ్వయి తల్లినిఁ గన్గొలంగి యీ
కొండకు వచ్చి నద్దెసలు గ్రుమ్మరితిన్ నినుఁ గాంచువాంఛచేన్. 142

ఉ. ప్రొద్దునఁ జద్దిబువ్వ జిని పుస్తకముల్ పడకింటఁ జాటుగా
మిద్దియమీఁద డాఁచి కడిమిన్ బడి కేగక యొక్కగుండ నే
నిద్దెస కేగుదెంచితి నిఁ కేమియుఁ బల్కక యవ్వ నీవు నన్
ముద్దొనరించి రం డిపుడ మోదముతోడుత మల్లికార్జునా!. 143

ఉ. మానరివారు దివ్వెలయమాసకు నల్లుర నాఁడుబిడ్డలన్
వాసి యెసంగఁ దోకొనుచు వచ్చుచునుండిరి గాన నీవు ను
ల్లాసముతోడ నమ్ము వదిలక్కు లొసంగుట నీవు రాక న
న్నాసి యొనర్పఁబోకు కసుగం దని చూడకు మల్లికార్జునా! 144

ఉ. తాను వసించునట్టి పురిదండకు దూరపుఁజుట్టమైన రా
వారిఁ దోడితెచ్చి కుడువంగ నొనర్చి బహూకరింతు రె
వ్వారలు నట్లు గాదు ప్రియబంధుఁడ నింటికి వచ్చినాఁడ నన్
గూరిమిఁ గాంచి పల్క విటు గూడునె? శ్రీగిరిమల్లికార్జునా!. 145

క. ఇన్నాళ్లనుండి పిలువక, న న్నిప్పుడు పిలువ వచ్చినాఁడని నాపైఁ
గ న్నెట్టిసేసినాఁడవొ,గున్నలపైఁ గినుక సేయఁగూడునె? బావా!.

క. మాతల్లి కూఁతు నల్లుని, నే తెఱఁగునఁజూతునను చు నెప్పుడుగడువాం
ఛాతత్పరయై యున్నది, ప్రీతి యెలర్పంగ రమ్ము ప్రియులకు బావా!.

చ. ప్రియమె గణింతు గాని నిలువేవ లటంచుఁ దలంచఁబోకు నీ
దయను సమస్తవస్తువులు తక్కువ గావు మదాలయంబునన్
రయమున రమ్ము నీ వటకు రాకకుఁ దీఱ దటంటివేని ని
శ్చయముగ నిన్ను నే వదల జాగువ నేమని వెక్కుభంగులన్.

ఉ. భూసురవర్యనందనుఁడు బుద్ధికిఁ దోఁచినయట్లు పల్కి ది
గ్వాసుఁడు కానరామికిని గాడ్పడి దిక్కులు చూచి బావ నా

వాని యెఱుంగఁడాయెఁ వనవాసముఁ జేరినఁ జూడఁ డాయె నేఁ
జేసిన నేర మేమి? యని చింతిలి యంబఁ దలంచి యిట్లనున్. 149

ఉ. తల్లిని నన్ను బంధుల ముదంబునఁ జూడఁగవచ్చు కోర్కి నీ
యుల్లములో జనింపదె? ప్రియుం డెటు లట్టుల నీవు చేయఁగాఁ
జెల్లునె! యత్తవారి గృహసీమల సంపద యెన్ని గల్గినన్
ఫుల్లసరోజలోచనలు పుట్టినయిండ్ల కాసఁ జెందరే?. 150

క. ఓయప్పా! నీవు బావయుఁ, బాయక నాతోడ దివెలపండుగ కిటు ర
మ్మా యనుచుఁ బెక్కుభంగులఁ, జానోడక పిలిచిపిలిచి వారలు పనకున్.

క. పొడచూపకయుండిన న, బ్బుడుతఁడు నే నింటి కెటుల పోఁదగు వీరిం
బొడకాని యేగక నాసరి, పడుచులు నను గేలిచేసి పకపకనగఁగాన్.

క. సరివారు తన్నుఁ గనుఁగొని, పరిహాసము చేయువారి పలుపురి నటమన్
ధర బ్రదికియుండుకం టెన్, మరణంబే మేలటంచు మది నిశ్చలుఁడై .153

చ. అలశిఖరాగ్ర మెక్కి తనయప్పను బావను నెమ్మనంబులో
నిలిపి సహాయబంధుజననీగృహపట్టణవాంఛ లేమియుం
దలఁపక నిల్చి మొక్కి బెదిరంపుజటిం బరికించి చూచి ని
శ్చలమతి వానిలో నురుగ శంకరుఁ డంబయు నంతలోపలన్. 154

క. శ్రమ గౌరికి నిలిచి పంచలు, కరములుఁ బట్టుచుఁ యుఁ బిరిగికములాంకముఖీ
పురుషులనిరువురఁ గనుఁగొని, పరమాశ్చర్యంబునొందిబాలకుఁ డనియెన్.

ఉ. ఎక్కడనుండి వచ్చితిరి? యెవ్వరు మీరలు నన్నుఁ బట్టి? మా
యక్కయు బావయే కరుణ యాత్మఁ దలంచినవారు కారు నెం
తెక్కినకూర్మి మాకు జనియింపఁ బనేమి? విడుండు ప్రాణముల్
గక్కొనంగ నేని నిటు తప్పక నే నన నవ్వ వానితోన్. 156

సీ. పరమానరంబున గిరిజ యిట్లని పల్కె
మాముద్దుతమ్ముఁడ! మేము నీకుఁ
బరులమా? నీయక్క భ్రమరాంబ నేను మీ
బావ యాతం డిదె కావు మాకుఁ
బృథివి నీవు జనించినదప ని న్నెన్నఁడుఁ
జూడలే దటు గాన నేఁడు గుఱుతు

తెలియంగఁజాలమైతిమి సోమయాజిపు
త్రుండు భీమానదినుండి వచ్చి
తే. నాఁడు నేఁ డన విని చిన్నవాఁడు బ్రిమసి
యెంటి నెక్కడఁ దిరుగుచు నున్నవాఁడొ
యనుచు నీకొఱ కంతంత నరసికొనుచు
వచ్చి కనుఁగొంటి మిచ్చట వత్స! నిన్ను. 157
చ. అన విననంతలోనఁ బ్రమదాంబుధిఁ దేలి కుమారుఁ డంబర
ధ్వజయుగంబుమీఁదఁ దనఫాలము సోఁకఁగ వ్రాలి నర్వ్వదుల్
నెనరున గ్రుచ్చి యెత్తి ధరణీధరసంభవ నీదుబావకుల్
వినుతి యొనర్పు తండ్రి! యన నీలగళుం గని సాఁగి మ్రొక్కినన్.
ఉ. నవ్వుచుఁ గౌఁగిలించి కరుణారస ముప్పతిలంగఁ గూఁకటిం
దువ్వుచు జెక్కు గీటుచుఁ గుతూహల మొప్పఁగఁ బల్కె నన్న మీ
యవ్వకుఁ జెప్పి వచ్చితివొ యూరెఱుంగఁగనీక వచ్చితో
యెవ్వఁడుఁ దోడు లేక భయమేది యొకండవు రాఁగఁ జెల్లునే? 159
ఉ. వచ్చితి మేలు చేసితివి వారె కనుంగొను మేనయల్లు రా
వచ్చుచు నున్నవారు గణపాలకముఖ్యులు వారిఁ దండలన్
వచ్చెడుమూఁక పారిషదవర్గము మత్ప్రియకోటి నీవు మ
మ్మిచ్చ దలఁర్పఁ జూచితి గదే! మదిలోనికొఱంత తీఱఁగాన్. 160
క. దుర్గమకంటకకక్ష్యల, మార్గశ్రమ మెఱుఁ నిల్వుమా మత్సుతసం
సర్గుఁడవై యిచ్చట సుఖ,వర్గంబులఁ జెందికొన్ని వాసరము లనన్. 161
చ. చిలుతఁడు పల్కు నిచ్చట వసింపఁగ వచ్చితినయ్య? మిమ్ము నం
దఱ మనివేడ్కఁ జండవవెనంబునకుం గొనిపోవ వచ్చితిన్
గలుచగ నన్నుఁ గన్కొనక కోమలి నీవు దనూజు లాప్తు లి
త్తఱిఁ బయనంబుగండు ప్రమదంబున మామకరాజధానికిన్. 162
క. మాదాయాదులు బంధువు, లాదివ్వేల కాత్మసుతల నల్లుంద్రను స
మ్మోదమునఁ దోడితెత్తురు, కావున కటుమీఁరురండుగ్రక్కున ననినన్.
క. ఎడలేదు దివెల నడుమనె, గడుచు స్మీపురముఁ జేరఁగాలే మీయేఁ
డుడుగుముఁ గొనిపోయెడు పండువ, కెడవక మాటకేగు వెంతు విఁంపఱమనినన్.
చ. విని బెగ డొంది బాలకుఁడు వీరలఁ దోడ్కొని వత్తు నంచు నేఁ

బనిగొనివచ్చి యా మునిని బంధువు లెల్లను గేలి సేయఁగాఁ
జను టుచితంబె? యంచు హరిసాయకపాతములందు వ్రాలి మి
మ్ము నెటులనైనఁ దోడికొని పోవక మాన నటన్న నవ్వుచున్. 165

ఆ. అట్టులైన నీమహావాంఛ యూరక, తెలుప నేల నిమ్ము చిఱుత! ప్రమథ
సమితిమత్కుమారసముదయమే నను, నత్తమునికిఁ గరుణ వఱలనిచట.

చ. తనసుతు లోఁగిట న్వెదకి తల్లి దిగుల్కొని పల్లికూటమం
దునఁ బిలకించి బాలకులతోఁ జని యాడుచు నుండెనేమొ రాఁ
డని చని వాడవాడల భయాకుల యై కనుఁగొన్న వారి నా
తనయుని గానరే? యనుచుఁ దప్పక వేఁడుచుఁ గాన కార్తయై. 167

చ. కనుఁగవ నశ్రుబిందువులు గ్రమ్మఁగ బాహుయుగంబు వోత్రిఁ జం
దనువునఁ జెమ్మట ల్వొడమ దాఁకినఁ దూలుచు వ్రాలి లేచి నా
ఘనధనరాశి! పుత్ర! చనఁ గారణ మే? మని వెల్చి పిల్చి మా
నిని దనయింటి కేగి మది నిండినదుఃఖముతోడ నెంతయున్. 168

వ. అన్నపానంబులు విసర్జించి దినదినం బొక యుగంబుగాఁ గడుపుచు
నుండి యొక్కనాఁడు తనమనంబున గిరీశ్వరుం దలంచి. 169

ఉ. పోరుడుపంగ నేఁ బలుకుబోటికి మెల్ల సిబద్ధిఁ జేసి యే
దారిని బోయెనో సుతుఁడు దాఁ పగ నాఁకట నెంత సోలెనో
ఘోరవనీ మృగాళిఁ గని కుఱ్ఱఁడు నెమ్మది నెంత జంకెనో
నేరక మోసపోతిఁ గరుణింపుము శ్రీగిరిమల్లికార్జునా! 170

చ. నినుఁ దనబావఁగాఁ దలఁచి నేస్తులతోఁ గడుఁ బంతగించి నా
తనయుఁ డమాసపండువకు దంపతుల న్నిముఁ దోడితెత్తు నం
చనుకొని వచ్చెనేమొ కరుణాకర! శ్రీగిరినాథ! వాఁడె నీ
యనుఁగుమఱంది వానికి దయామతితోఁ బొడచూపవే వెసన్. 171

ఆ. ప్రియునిఁ బాసి చాలపేదఱికంబునఁ, దగిలి వీఁడె పెన్నిధాన మనుచు
సంతసించియుంటి సకలదుఃఖంబులు, మఱచి వాఁడు వెతలమఱుగవలసె.

ఉ. దీనశరణ్య! నాదుకులదీపకుఁ గ్రమ్మఱఁ గానుపించి నా
మానసశోకవేదనలు మానపవే యని కన్ను మోడ్చి లో
ధ్యానము సేయఁ దత్సతి కత్తఱి స్వప్నమువోలె భ్రామరీ
మానినితోడఁ గూడి గిరిమందిరుఁ డద్భుతరంగమాకృతిన్. 173

క. సాక్షాత్కరించి సతి నీ, విక్షేపము మాన్పుకొఱకు విచ్చేసితి నే
దక్షమఖశిక్షకుఁడ నీ, ఋక్షేశ్వరవదన భ్రామరీరమణి సుమీ. 174

చ. సొలఁతుక! నీవు పుత్త్రునకుఁ బూర్వము చెప్పినరీతి నప్ప బా
వల మని యేము గన్పడినవారము వానికి నేతదాకృతిన్
వలనుగ వానితో నిరుకు పత్త్రము రేపె యటంచుఁ బల్కఁ గ
న్గలువలు విచ్చి వారి నట గానక విస్మయమందె యాత్మలోన్. 175

ఉ. ఎంతకృతార్థ నైతిఁ బరమేశ్వరదర్శన మబ్బె నేఁడు నా
చింతలు దీఱె నింక శశిశేఖరుఁ డెప్పుడు వచ్చునంచుఁ ద
ద్భ్రాంతిన యుండె నచ్చట ధరాధరచాపుఁడు బాలుఁ గాంచి య
త్యంతకుతూహలంబునఁ గరంబు కరంబునఁ జేర్చి చెచ్చెరన్. 176

క. మీపగుపట్టణమున కిదె, పోక యనుచుఁ బలికి ప్రమథపుంగవసుతభా
ర్యాదులతో నప్పుడు కా, కోదరభూషణుఁడు సత్కృపోన్నతమతియై.

ఆ. మాయనియ్యకొలిపి మదిలోనసంశయం, బొదవనీక వానియూరుఁ జేర్చి
కన్ను గలిపి మీరలున్న తావి దెకదా, యన్న నిదియె నావుడభవుఁడలరి.

క. పదపడ ముందర నసి చే, వదలిన వేగమున నేగి బాలకుఁ డంబా
పదయుగమున కెఱఁగినన, మ్మదవతి యాశ్చర్యమోదమానస యగుచున్.

చ. కనుఁగొని గ్రుచ్చియెత్తి తనుసంభవ! నాకులదీప! వచ్చితే
యన గుడిలోనఁ జూడు మదె యప్పయు బాయియు వచ్చి రంచుఁ బ
ల్కిన సుతుమాట కర్ణములఁ గీల్కొనునంతనె మేను పొంగ నేఁ
గనుకల సిక్క మయ్యెఁ గఱకంఠుసఁ జూచెద నంచుఁ జెచ్చెరన్.

చ. ఎదురుగ నేగి శంకరగిరీంద్రసుతాదులఁ గాంచి భక్తి నం
పొదవఁగ నాత్మ మ్రొక్కి వినయోక్తు లెలర్పఁగఁ దోడితెచ్చి త
త్పదమలదృష్టిఁ బ్రథనసంపద లచ్చెరు వందఁ జేయ న
మ్మదవతి నైజభర్మ్యమణిమంజిరమం దొకచక్కి మక్కువన్. 181

సీ. అందఱ నుచితాసనాసీనులుగఁ జేసి యర్ఘ్యపాద్యము లిచ్చి యంబికేశ్వ
రాదుల కతిభక్తి నభ్యంజన మొనర్చి నలుగులు నలిపించి జలకమార్చి
ధౌతవస్త్రంబు లాదటఁ గట్టఁగా నిచ్చి రాజవదుపచారరాజిఁ బూన్చి
పంచభక్ష్యంబులు పాయసాన్నాదికంబులు షడ్రసోపేతముగ సుభర్మ్య

తే. పాత్రములు నించి యారగింపఁగ నొనర్చి

గంధ కర్పూర తాంబూల కనకరత్న
భూషణాంబరముఖవస్తుపుంజ మొసఁగి
సంతసం బందుచుండు నాసమయమందు. 182

వ. తొల్లి కాననంబున రాముని నేలిసేయు విప్రబాలకు లవ్వేళ యతం
డింటికి కరుదెంచుట కర్ణాకర్ణికగా విని నేఁడు పండుగకు మీ యక్క
బావలఁ దోడి తెచ్చితివే? యని పంపఁగాంత మని యంతట గుమిగూ
డి వారియింటికిం జనుదెంచి కమనీయకనకరత్న మయసౌధతోరణవితర్ది
కాదుల నవలోకించి లోపల ననేకజనసంకులం బాకర్ణించి బహిర్ద్వా
రకవాటంబులు మూసియుంట నచ్చోటి కరుగు నుపాయంబు లేక తిరు
గం జనుదెంచి తద్వృత్తాంతం బంతయు నిజపితృబంధుసఖాదులకె
ఱింగించిన వారు నచ్చోటికి వచ్చి నిజంబుగాఁ గని యుబ్బి యొకకతం
బో కేవలదరిద్రుల కిట్టిభాగ్యం బబ్బెనని సందేహంబు నొందుచుండు
నవసరంబునఁ ద్రికాలవేది యగు నొక్కయోగిపుంగవుఁ డారామ
య్య బాలకతోఁ బంతగించి భ్రమరాంబామల్లికార్జునుల నప్పబా
లసుదోడి తెచ్చి విందువెట్టుటయుఁ బ్రమథసుతాదులతో నప్పుడు
వారియింట నీశ్వరుం డుండుటయుం జెప్పిన నత్యాశ్చర్యప్రమోద
మానసులై యయ్యుమామహేశ్వరులకు ధ్యానపూర్వకంబుగా
నమస్కరించి నిజనివాసంబులకుం జనిరి తదనంతరంబ 183

ఉ. ఆ త్తరలాక్షి గాఢపులకాంకురసమ్మదబాష్పనేత్రయై
చిత్తజవైరిపాదసరసీజములం బ్రణమిల్లి యాత్మలోఁ
జొత్తిలుభక్తిచే మృదువచోగరిమం బమరంగఁ బల్కె లో
కోత్తర! వామదేవ! శివ! యోగిహృదాలయ! మల్లికార్జునా!. 184

చ. పురహర! యెంతభక్తసులభుండవు బాలుఁడు గోరునంత నా
కరయఁగ నేఁడు నీ వనుఁగుటల్లుఁడ వైతివి లోకమాత భ్రా
మరి వరపుత్రి యయ్యెఁ దరమా యిఁక మత్సుకృతంబు లెన్నఁగా
సురలకునైన నిట్లు పొడచూపుట చోద్యము గాదె? శంకరా! 185

చ. అని వినుతించుచున్నఁ గమలారిశిఖామణి యాపృతిక్ష దయా
వననిధిఁ దేల్చి భక్తగణవర్యుఁడు మైథునఁ మనోజ్ఞుఁడుక్
జననుతశీల నీవు ద్విజవ్రజ మక్కజ మందె చూడ నీ

తనువుఁ తోఁడ సంపద సుఖదాయకమత్సవమందుఁ జేరఁగాన్. 186

క. జా గింక నేల పుష్పక, మాగతమై యున్న చెక్కుఁ జని వారి న్నే
వేఁ గొనిచని మెఁ వత్పురి, కాగమవేద్యుండు జగముల చ్చెరువందన్.

త్రే. పవిత్రకరితంబగు మైథునరాము చరిత, మెలమిఁ జదివినవినినవారలకు మల్లి
కార్జునస్వామి కరుణాకటాక్షకలన, నైహికాముష్మికఫలంబులంబడఁగలు

తే. అనుచు మైథునరాముని యద్భుతంపుఁ [గు.
జరిత చెప్పఁగ వినఁబడు సకలమనుజ
రాజ తిలకింప నీసిద్ధరాముఁ డిపుడు
మల్లికార్జును దేఁ గంటి ముల్ల మలర. 189

వ. అని యతనిప్రభావంబు గొనియాడి ముద్దయ్యచేత ననుజ్ఞాతులై భ
క్తపుంగవులు నిజనివాసంబుల కరిగిరి గావున సిద్ధరామయ్య మహ
త్త్వం బిట్టిదని చెన్నబసవేశ్వరుండు చెప్పినఁ బత్సభాసదు లత్యంత
సంతోషాబ్ధిఁ దేలుచుండి రయ్యవసరంబున రామయ్య నిజదేశికపాద
పద్మంబులకుఁ గ్రమ్మఱఁ జాఁగిమ్రొక్కి దేవా! యిష్టలింగప్రభావం
బానతీవలయు నని వేఁడిన యచ్చటిశరణులయనుమతిం గాంచి శిష్యు
నకు నాగమాంబాత్మజుం డిట్లని చెప్పందొడంగె. 190

## మడివాలు మాచయ్యకథ.

సీ. భూరమణీశిరోభూషణం బన ఖ్యాతిఁ
బరగు హెబ్బురిగె యన్పురవరంబు
నప్పురంబునఁ గళాధరజూటపదలగ్న
మానసుం డతులసన్మార్గవర్తి
యారూఢవీరభద్రావతారుం డయో
నిజుఁ డింద్రియవ్రజనిగ్రహుండు
భవిజనదూరుండు పండితనుతభక్తి
మహితుండు మడివాలుమాచిదేవుఁ

తే. డతులలింగధారణావాప్తికై కోరి, కళ్లినాథుఁ డనెడుఘనునిఁ జేరి
భక్తితోడ మ్రొక్కి పరమాత్మ! మద్గురుస్వామి! దీక్ష సేయవలయునాకు.

ఆ. అనిన నతనిభక్తి కలరి దేశికవర్యు, డట్లసేతుఁగాక యనిన మ్రొక్కి
స్వామిమస్థూలమైన శాంభవలింగంబు, నిమ్మునాపు డతఁడు సమ్మతించి.

గోసతెచ్చుచో భవిమనుజుఁ డొక్కఁ
డంట రేవము గుమ్మి యాకసంబునఁ కెగఁ
జిమ్మిన నవార్వ్ర క్షితితలేశ్వ
రుఁడు విని కోపంబు వొడమ వాని వధింపుఁ
డని మావతుఁ బంప సరిగి మత్త
కరి సీక్తాలుప దాసి ఖండించి యాదోర
ణులఁ బంప భీతి బిజ్జలుఁడు బసవ
తే. సచివప్రప్రేషణంబున శరణ మడుగఁ
దరిని భవి మావతుఁ బ్రదుకంగఁజేసి
చాల వృత్తాంతములు దెల్పి సచివవర్యు
విమలమానసయుతునిఁ గావించి యంత. 201
తే. ఆలఘుఁ డేకనాఁడు గొల్లకియట్ల యేగి
లింగ మెప్పటిపొద నుంచి లీలఁ గాయ
కంబు సేయుచునుండఁగాఁ గష్టకర్మ
చిత్తు లొకకొంద ఱది చూచి చెలఁగి నగుచు. 202
చ. తిరుగటిబోయి ప్రాణమగు దేవుఁ డటంచు ధరించి మోయఁగా
బరువని వేఱె యుంచి సరిబత్తులు గాంచిరయేని యొగ్గుసే
తు రనుచుఁ బ్రాడు గట్టె నిది దుస్సిన నేమగునొక్కో? నాకి యు
న్ప్రసనున నంచు హేళనపుఁబల్కులు పల్కి దురాత్ము లుత్తటిన్.
చ. మఱుగుపొంగుజబ్బుజములమాటునఁ దారి స్వకార్య మిావునుం
జెఱుగిసె యుండ సూత్రమున యేతరలై తెగఁ గోయ నెత్తురు
ల్వఱుగులువాఱె నీశరణవల్లభుఁ డప్పుడ చాకిబండపై
నొఱగి గతాసుఁడై శివనియోజితమానసుఁ డయ్యె లీలచేన్. 204
ఉ. అట్లగుటఁ దురాత్ములు భయాకులులై వెనఁ బాఱ నప్పు డా
చుట్టున నాల మేఘపశుచుల్ గని యద్భుత మంది యిచ్చటం
బుట్టనిచింత పుట్టె నని భావన నేగి నృపేశునన్నిధిం
గట్టలు గాఁగ నిల్చి యనుకంప జనింప వచించి రీగతిన్. 205
తే. అయ్యా! మడివాలు మాచిదేవయ్య యిపుడు
బట్ట లుదుకుచు నున్నచో బాామొ గామొ

తెవులో యేమాయమో మదిఁ దెలియ దహహా!
యేమి సోఁకెనో జీవంబు నోటుపడియె. 206

చ. అని వినిపింప బిట్టులికి హా! మడివాలుమహాప్రతాప! స
జ్జనుత! భక్తిసంచరణ! సంయమదేవ! భవత్పదార్చకున్
నను విడనాడ నీకుఁ దగునా? కటకంటునిఁ జెంద నంచు లో
చనముల బాష్పముల్ దొరుఁగఁ జాలవగ న్విలపించుచున్ వడిన్. 207

ఉ. అచ్చట లేచి భక్తనివహంబులు దుఃఖము నొంది తోడ రాఁ
జెచ్చెర నేగుదెంచి గతజీవితుడౌ మడివాలుఁ గాంచి యీ
సచ్చరితాఢ్యుఁ డిట్లు గతసంజ్ఞవహింపఁగ నేమిహేతువో
యిచ్చఁ దలంపరా దనుచు నీవల నావలఁ జూడ నొక్కచోన్ 208

తే. తెగినసూత్రంబు పొద లింగదేవు వఱద
పాఱురక్తప్రవాహంబుఁ దేఱి చూచి
యద్భుతం బంది యచట నున్నట్టిభక్త
వరులతో నిట్టు లనియె నబ్బసవవిభుఁడు. 209

ఉ. జీవము లింగమందుఁ దనుచేష్టలు భక్తసపర్యలందు సం
భావన చేసి యంశుకసమాజము భావన మాచరించుచో
నూ వినయంత నాత్మకరిణోన్నతతఃఖము దాఁకి నొచ్చునో
దేవర యంచు గుల్మవసతిన్ సవరించి పృథాంతరంగుఁడై. 210

క. గాత్రమునకులింగమునకు, సూత్రముదగిలించియున్నచోఁ ఖలుఁడెవ్వం
డో త్రెవ్వనడచెఁ దచ్చివ, సూత్రంబటుగాన శితఁడసువులఁ దుఁబాసెన్.

క. దేహము లింగము సూత్రం
బూహింపఁగ నొక్కటగుట యురి త్రెవ్వటయున్
దేహం బారక్తంబు ప్ర
వాహంబుగ వెడలెఁ ద్రాటికిలన భయదమై. 212

ఆ. ఇట్టులుండవలయునిష్టలింగానుసంధాన మనుచు మరలఁ దద్గుణంబు
గలయఁ బేర్చి మదనఘస్మరభక్తాంఘ్రి, జలము భూతిపై నిఁజల్లునంత.

క. బిట్టుల్కి నిదుర తెప్పిఱి, నట్టులవడి లేచి నెదుటఁ హాకారములలోఁ
దొట్టినమునమునగనుఁగొని, చట్టనమాచయ్యనతులుఁనలుపుచు నసలోన్.

క. దివసమున నెన్నఁడునిద్దుర, దవులుటునే నెఱుఁగనిట్టిజేస్మృతిచెడి యి

ఖ్ఖువినొరు గు తేటి హోతువా, శివశిసయనితలంచివారిఁ జేరిచచించెన్.
క. మీాకంచటిచ్చటికిరాఁ, గారణమే? మెచటికైన గమనోన్ముఖులై
కారుణ్యంబున నను గన, నీ రేవ్రున కిపుడు వూని యేతెంచితిరో!. 216
సీ. అనవుడు బసవేశుఁ డాదియా సద్భక్తు లేకవాక్యంబుగా నిట్టులనిరి
మాచయ్య! ఖలులుసీమహిమగానకలింగసూత్రంబుగోసినధాత్రి నీవు
ద్రెల్లుట విని వచ్చి నీభక్తు కృపఁగ్రమ్మఱ బ్రతుకుని నంటిమనఘ!
నీకు నీవే సరి గాక లోకంబున మాబోంటిభక్తుల మహిమ యెంత
ఆ. యనుచుఁ బెక్కువిధులఁ గొనియాడి యవనత
వదనుఁ డైనమాచయ్యఁడు దారు
సకలసంభ్రమముల సదనంబులకు వచ్చి
యుక్తభక్తిరక్తి నుండి రెలమి. 217
క. మడివాలుమాచిదేవుని, నడిసన్న చరిత్ర వినిన చదివినవారల్
జగజాతసంభవాదులఁ, బడయంగా రానిముక్తిఁబడయదు రెలమిన్.
వ అంతియునుంగాక. 219

## హాళికమారన్న కథ.

మ. అకలంకోజ్జ్వలలింగమార్చనరతుం డంహోవిదూరుండు శ
ర్వకథాసారనిమగ్నచిత్తుఁ డచలేంద్రాతీతధైర్యుండు స
ర్వకళాపారగుఁ డాత్మలింగగురుచర్యాయుక్తుఁ డార్యుండు హా
ళికమారన్న యనంగ భక్తహితసల్లీలాఢ్యుఁ డొప్పున్ ధరిత్రిన్. 220
శా. ఆసద్భావనిధి భక్తిమార్గరతిఁ గల్యాణంబునం దుండి లిం
గానందంబుగ దండనాథకృషి కధ్యక్షత్వముం బూని స
స్యానీకంబు ఫలింపఁజేయు నొకనాఁ డంభోజబంధూదయం
బౌనవ్వేళఁ బొలంబుఁ జేరి చతురాశాన్వేషియై యత్తటిన్. 221
ఆ. నడిమినుంచెనెక్కి యొడిసెలఁ బాల్గొన, చుట్టువాలునట్టిపిట్టగముల
విసరవేసియబాహువిన్యస్తలింగమ్ము, వస్త్రయుతముగాఁగవదలిపడియె.
క. శివలింగము ధరఁదొరఁగిన, భవదూరుం డతఁడు మున్నె ప్రాణంబులుత
ద్భవునం జేర్చెఁ గావున, బవిహతగిరివోలె మంచెపైఁబడెనంతన్.
చ. తనపతిరాక జాగయినఁ దత్ప్రియదామణి చింతచే శివా
ర్చనసమయంబు వచ్చెఁ బతిజాడ కనంబడ దయ్యె నంచు వే

చని పొలిమేర చేనినడుమ చక్క వసించినమంచెపై గతా
సునిఁ బతిఁ గాంచి యప్పుడె వసుంధరఁ ద్రెళ్ళె విహీనజీవ యై. 224

వ. అంత. 225

ఉ. అచ్చుటిఁ జేనికాఁపరులయం దొకఁ డంతయుఁ గాంచి చెచ్చెరన్
వచ్చి విలాసగోష్ఠి గణవర్యులతోఁ గొలువిచ్చియున్న భా
స్వచ్చరితుం గృతజ్ఞు బసవప్రభుఁ గాంచి నమస్కరించి వా
క్రుచ్చఁగలేక కొంతవడిఁ గొంకుచుఁ గొంకుచు నెట్టకేలకున్. 226

ఉ. కట్టుల పక్కి దేవ! బసవేశ్వర! మారన నేఁటిప్రొద్దునన్
చిట్టులఁ దోల మంచెపయి నిల్చిన నిల్వునఁ ద్రెళ్ళి చచ్చె న
ప్పట్టున వాసియు నటకు వచ్చి కనుంగొని ధాత్రిఁ గూలె నే
నిట్టిమహాద్భుతం బెచట నెన్నఁడుఁ జూడఁగ లేదు నాప్రభున్. 227

చ. విని బసవేశ్వరుండు కడు విహ్వలతన్ సభ నున్నభక్తులం
గనుఁగొని యన్నఁ డిట్టిగతిఁ గంటిమె! వింటిమె! యంచు వారితోఁ
జని పడియున్న దంపతులచందముఁ గాంచి మనం గుంగి లో
చనముల బాష్పముల్ దొరుఁగ సంగయదేవుని సంస్మరించుచున్.

క. తనతోడం జను దెంచిన, ఘనభక్తులయాననములు గని వీరలు తి
ట్టినఁ బడుచాడ్పునమృతిఁ జెం, దినకత మేమొకొ యన్నఁ దెలియక వారల్.

క. గా మడఁచలేదు పాపపుఁ
బా మంటెను గాదు కాదు పటురోగగుణం
బీమాడ్కిఁ జంపె నని యెడు
సాములఁ గని యపుడు మిండసంగయ యసియెన్. [ను నే?

క. ఈమహితలింగదేహులఁ, గామంటు నె? దుష్టపన్నగము మూరొక్క
యామయముఁ జెంద నేర్చునె?, యేమియుఁగాక నొక్కటేర్పడ వినుఁడీ!.

సీ. అనఘుఁ డీతండు ప్రాణానిలి లింగంబునందుఁ గూరిచి శివానందలీల
గాయకం బీరీతిఁ గల్పించుకొనియుండె నిప్పుడీతనిలింగ మెడలిపోయె
దానితోఁ బ్రాణముల్ దలఁగెఁ దత్సతితనజీవంబు ప్రియునంద చేర్చిపడియె
నింతయు నిజ మని యేర్పడ సంగయ్య పలికిన నచ్చటిభక్తుఁ డొకఁడు

తే. కదియ నేతెంచి మారన్న కంఠమందు
లింగమూర్తిని గాన కబ్బంగి భక్త

పరులతోఁ జెప్పి తానును వారు మంచె
చుట్టి వెదకిన నందొక్కచోట నంత. 232

తే. ముడిచినలువస్త్రమున లింగమూర్తిఁ గాంచి
బసవదండేశముఖులు సమ్మదము దొలుకఁ
దెచ్చి మారన్నగారిసంచిటిని గట్ట
నంతలో నిద్ర తెప్పిఱినట్లు లేచె. 233

క. తాన సతి లేచె లేచి గ,ణానీకముఁ గాంచి యిరువు రద్భుతమతులై
యీనెలవున కింపలు నిట,రా నే? మని తలఁచి బసవరాజున కంతన్.

ఉ. మారన మ్రొక్కి యిట్టు లను మాయెడఁ గూరిమిఁ జేసుఁజూడఁగా
మీ రిట వచ్చుట న్మదికి మిక్కిలి సంతస మయ్యె సామి! నా
నేరిచినట్లు గాచితి ననీమృగ చోర పతంగబాధలం
జేరఁగ నీక యన్నఁ బ్రహసించి యమాత్యవరేణ్యుఁ డి ట్లనున్. 235

చ. వరతరపుణ్య! యిచ్చటికి వచ్చుట చే నరయంగఁ గాదు నీ
తరుణియు నీవుఁ ద్రెళ్లినవిధం బిపుడే విని వచ్చి చూచి యీ
శ్వరగతజీవుఁ డతఁ డని సంగయ తెల్పిన జాతిపద్దిశం
కరుని భవచ్ఛరీరమునఁ గట్ట సజీవుఁడ వైతి వంతటన్. 236

తే. ఇన్ని దినములు నీసత్త్వ మెఱుఁగ నైతి
శరణసంతతిలో వన్నెఁ బరగి తౌర!
యనుచు వినుతించి యఖిలభక్తాళిఁ గాంచి
బసవనామాత్యచంద్రుండుఁ బ్రమద మెసఁగ. 237

మ. పలికెక్ బాపురె! మారయాఖ్యునిమహత్త్వ మ్మాతఁ డిష్టంబుగక్
దొలఁగక్ జీవముతోన పాసె మరల న్నాలొ్కల్ప జీవించె భూ
తలమం దెచ్చటఁ గల్గునే? యిటుల తత్తన్వీవ్రతంసంబు ని
శ్చలభక్తానుగచర్య లెక్కయిడ శక్యం బౌనె? వాగ్జానికిన్. 238

సీ. అనవుడు మాడిరాజయ్య యిట్లను బస
వాధిప! లింగంబునందుఁ బ్రాణ
ములు చేర్చు టఖిలభక్తులకు నైజమె వీని
భామినీచర్య చెప్ప నగుఁ గాక
విగతజీవుం డైనమగనిఁ గాంచినమాత్ర

సిద్ధరామో రో॰మో కొండ్రవేయ
వంశమో యని మదిఁ దా నించుకేనియు
సంశయింపక యసుసమితి విభుని
తే. యందు సంధించి పేమ్మృతిఁ జెందె నహహా!
యట్టిపరమపవిత్ర యిం కెందుఁ గలుగు!
నన్న బసవన్న యాతఁడు మాకన్న బుద్ధి
నెన్న నీకన్న మహిమాఢ్యు లున్నవారె?. 239
తే. అనిన నమ్మాట మంచసంగయ్యగారు
విని బసవరాజుఁ గని యిట్టు లనియె మాది
రాజు పల్కినపల్కుల రాజ! ధరఁ బ
తివ్రతాధర్మ మిందు సందియము లేదు. 240
క. ఇమ్మార్గ మిష్టలింగులు, క్రమ్మదు రెటులన్న మారగణపూజ్యం డి
ష్టమ్మునకై పాశిలమ్మరె,యిమ్మానినియేలచచ్చె?ఇష్టను గలుగన్. 241
తే. అనిన బసవయ్య విస్మయం బంది ధర్మ
సూక్ష్మములఁ దెల్ప సంగ! నీసామ్మ యయ్యె
నాగురుస్వామి సంగయ్య వే గణింప
నిన్నుఁ గొనియాడ నేజాడ నేర్చువాఁడ. 242
క. అని యాతని వినుతింపఁగ,నినిమాచయ భక్తవరుల వీక్షించుచు నూ
తనమేయీతనిచరితం,బనిశము బసవేశుఁ డెఱుఁగఁడా రెనెమును తాన్.
తే. నావు డంబొకశరణుండు దేవ! సంగ
మయ్యచరిత మ దెట్టిది? యానతీయ
వలయు ననవుడుఁ దద్భక్తవరుని గాంచి
చిత్రముగ మాచిదేవయ్య చెప్పఁదొడఁగె. 244
ఉ. శ్రీతుహినాద్రిజారమణసేవకపాదసమర్చనారతుం
డీతఁడు యాహ్వానంబున మహిష్ఠమహేశ్వరభక్తి సల్పుచుణ్
భూతలమందు భక్తిగతిపోషణ మొప్పఁగఁ బుట్టి లోకవి
ఖ్యాతి నెసంగునట్టి బసవాధిపుఁ గన్గొనువాంఛ చెందినన్. 245
తే. అనఘ! కల్యాణపురిఁ జేర నరుగునంత
సంగమేశ్వరునందు నా సంగమేశు

రాక బసవేశ్వరుండు దర్శన మొనర్చి
యెదురుగాఁ జని యడుగుల కెరఁగి భక్తి. 246

ఉ. ఇంటికిఁ దోడి తెచ్చి మణిహేమమయాసనమందు నుంచి ము
క్కంటినిబోలెఁ బూన్చి సుమశార్మకసంహరతుల్య! నేఁడు నీ
వంటిమహాత్మునిచ్చటికి వచ్చుటచే శుభముల్ ఘటిల్లె నే
మంటి నటంచుఁ బల్కి పిని మానసమందు ముదంబెలర్పఁగాన్. 247

తే. ఖ్యాతియో లేక భక్తిసమేతుఁడో ప
రీక్ష సేయంగవలె నని వృషభమూర్తి
గాంచి దరహాసితాననకమలుఁ డగుచు
నంతటను విన మిండసంగయ్య యనియె. 248

చ. బసవమహాప్రధాన! శివభక్తినిధాన! కళావధాన! సం
తసమున వారకుంచరవనానుంతానుభవాప్తిఁ గోర మా
నస మటు నిష్టలింగభజనం బొనరించుచు నున్నప్రొద్దు లే
డెసకము మీఱఁగేళి నటియింపఁగ మా కటుఁగానఁ జెప్పెరన్. 249

శా. నాలింగం బిపు డీవు చేకొని మహానందంబు మీఱంగ ప
ట్కాలం బర్చన లిచ్చి యేమఱక వెంటం దత్ప్రసాదంబు త
త్కాలాతీతము గాకయుండ నతిసౌఖ్యం బొప్ప నా కవ్వవే
పాలో మీవరముఖ్య దేవనుతచిద్వ్యాపారపారంగతా!. 250

చ. అనిశము లింగమూర్తిఁ దనువందు ధరించుట గాక పీడఁగాఁ
జనునె? యటంచు నీమదిని సంశయ ముంచకు మేడ నున్న నా
మనసు మహీశ నేమఱదు మర్కట మెందు నటించు చుండనక్క
దనుఁ దనపట్టి వీడనివిధంబున నాశ్రితలోకపాలకా!. 251

తే. కనుఁగొనఁగ నింద్రియములకుఁ గారణంబు
మానసం బింద్రియము లెటు మలయు నేమి!
మనసు లింగమునందుఁ జెందనిసపర్య
యోటిభాండంబులో వారియోజఁ గాదె?. 252

చ. అన బసవండు మ్రొక్కి వినయంబున ధీనిధి! మీయభీష్ట మే
యనువున నుండు నట్ల యగు నన్న గళస్థితలింగమూర్తి నా
తనిగళమందు నుంచి ప్రమదంబున సంగయ యేగునంతఁ దా

తే. యసి తలఁచి మ్రొక్కి పరిచారు నపుడు పిలిచి
పోసఁగ దిప్పుడు లింగంబు పూజ సేయఁ
బంచభక్ష్యాన్నములు వేగ కొంచుఁబోయి
యిట్లు చెల్వక సంగయ్య కిచ్చి రమ్ము. 260
క. అని యచటిభక్తు ర్యలు, విని ఒల్కి నన తఁడు నగుచు వేగ మెదొరచె
ప్పిన గతినర్పితాన్నము,గొనిచని సంగయ్య కెదుటఁగొంకక పిలువన్.
చ. కని తల యూఁచి యాతఁడు మొగిం బటుత్రిప్ప యనర్పితాన్నముం
దిను మని పంచె నే? బసవధీమణి యంచు వచించి తోన మే
దిని గతజీవుఁడై పడ మది న్వెఱఁగందుచు వేగ గ్రమ్మఱం
జని పరిచారుఁ డాక్రమము సర్వ మమాత్యునితోడఁ జెల్పినన్.
శా. ఆమాట ల్వివి మున్ను తద్ధనుసి నిందాలాపముల్ పల్కు వా
రేమీ? యింతటిమాట పుట్టె ననుచుఁ హృత్ఖేదులై విస్మయో
ద్దామవ్రీడలు గ్రమ్మ శ్రీబసవదండాధిపుం గాంచి భ
క్తామర్త్యాగమసంగమేశ్వరునిమాహాత్మ్యంబు నిం తయ్యెడిన్. 263
క. కాలము దప్పఁగ నియ్యక
నీలగళుప్రసాద మూను నియమము గానన్
వాలె దినకరుఁడు నియమం
బాలక యగునో యటంచు నసువులఁ బాసెన్. 264
చ. ఇంతమహాత్ముఁ డోట మును వెన్నఁ దెఱుంగమిఁ జేసి యింద్రియ
భ్రాంతుఁ డటంచు నింద్యముగఁ బల్కితి మీకలుషంబు వాయ దా
నంతయుఁ బాయ దేమి గతి యీ నిఃక మా కని మ్రొక్కి గంగమా
కాంతుఁడు పల్కెఁ దద్గణనికాయముతో వినయం బెలర్పఁగాన్.265
చ. అలఘుకృపాత్ములార! వినుఁ డాతనిభావము తేట తెల్ల గాఁ
దెలిసియు నన్ను వంచనకుఁ జెప్పుట కై యిటులంటి రైన ని
ప్పలుకుల కేమి యిప్పు డలభక్తుసిలింగముఁ బూన్చి కాలమ
గ్గల మరుగంగనీక కటికంటుఁ బ్రసాదముఁ గొంచు భక్తిచేన్. 266
ఉ. అందఱు మాతఁ డున్న వెలయాలిగృహంబున కేగి వేఁడినం
బొందిని బ్రాణము ల్నిలుచు భోగ్యతరంబుగఁ దత్ప్రసాద మిం
పొంద గ్రహించు నంచు శరణౌఘము సమ్మతి నొందఁజేసి యా

చంపమునక్ సభక్తుఁడయి సంగయలింగముఁ పూని చెచ్చెరన్. 267

తే. తత్ప్రసాదంబు భర్మపాత్రమునఁ గొంచు
భక్తసంఘంబు దానును బసవవర్యుఁ
డరిగి గతజీవుఁ డైనసంగయ్యఁ గాంచి
విస్మయానందములు మది వెలయుచుండ. 268

శా. ఔరా! యెంత మహాత్ముఁ డీతఁ డని డాయం బోయి కేలొడ్డి దే
వా! రక్షింపుము సంగమేశ్వర! కృపావర్ధిష్ణుభావంబుచే
నేరంబుల్ సయిరించుమంచుఁ దనుఁ దా నిందించుకొంచున్ సుధా
ధారం బైనమహాప్రసాదము గణాధ్యక్షాజ్ఞచే నత్తఱిన్. 269

ఉ. ఆతనియంకమం దునుచునంతనె దెప్పరి లేచి భక్తరా
జాతము గాంచి యచ్చెరువు సంభ్రమ మొప్ప నమస్కరించి కా
లాతిగమంబు గాక మును పొందుప్రసాదసుఖంబు నొంది వా
క్చాతురిఁ బల్కెఁ దత్కుసుమసాయకసంహరభక్తరాజితోన్. 270

చ. అనఘతరాత్ములార! వెలయాలిగృహమ్మున కిట్లు మిమ్ముఁ బో
లినఘను లేగుదెంచు టిది లెస్సగునే? మముబోటిదౌష్ట్యభా
జనులకుఁ గాక యంచు నెకసక్కెము లాడిన లజ్జ నొంది భ
క్తనిచయ మెల్ల నొక్కనుడిగాఁ బలికెన్ గురుభక్తియుక్తమై. 271

ఉ. సంగ! దయాంతరంగ! విలసద్గురుపాదపయోజభృంగ! మా
తంగనిశాటనాహితమతక్రమవర్ధనచంగ! సత్ప్రసా
దాంగ! సభానుషంగ! సమదాదితిభంగ! సమస్తభక్తరా
ట్తుంగ! యశోవినిర్జితవిధుత్రినగాగభుజంగ! పుంగవా!. 272

క. త్రైకాలికవిజ్ఞప్తియుఁ బ్రాకటలింగానుయోగపద్ధతి గణని
ష్ఠాకలన యెంచిచూడఁగ మీకే తగు మిండసంగ! మృదుగుణసంగా!.

ఉ. సీమహిమావళుల్ దెలియనేరక నోరుకొలందిఁ బల్కు మా
తామసవాక్యముల్ సయిఁచి దాపునఁ జేర్చి కృపాబ్ధిఁ దేల్చి వే
కామవికారదూర! యని క్రమ్మిన వేడ్క నుతింపఁ దద్గణ
స్తోమముఁ గాంచి భక్తి మిగిఁ దొల్కఁగ సంగయ పల్కె మెల్లువన్.

ఉ. పావనులార! మీచరణభక్తుని నన్నొకపెద్దఁ జేసి మీ
రీవిధిఁ బల్కఁగాఁ దగునె? యెందును భృత్యులు తప్పఁ ద్రొక్కినం

గోవిదు లైనవార లిది కూడనిత్రో వని శిక్ష చేసి త
ద్భావము భక్తికిం జొనిపి దాపుగఁ దీయుట ధర్మమేకదా!. 275

వ. కావున భవదీయపాదసేవకుండ నైననన్నుఁ గరుణాకటాక్షవీక్షణంబు లంగాంచి కృతార్థుం జేయుం డని నమస్కారపూర్వకంబుగా విభూతి తాంబూలంబు లొసంగి బసవేశ్వరునిభక్తినిష్ఠల కలరి యతనిం బెక్కుభంగులం గొనియాడి యంవఱవీడ్కొల్పి తొల్లిటియట్ల యను పమ విలాసంబున నుండెఁ గావున ఖండసంగయ్యమహిమం బిట్టి దని మాచిదేవుండు వినుపించుటయు నచ్చట నున్నశరణపుంగవు ల త్యంత సంతోషితస్వాంతు లై యతనిం బేర్కొని యగ్గించుచు మారన్నచే ననుజ్ఞాతు లై బసవేశ్వరసహితంబుగా నిజనివాసంబుల కరిగి యెప్పటియట్ల సుఖం బుండిరి. 276

క. హాలికమారనచరిత త్రి, కాలము పఠియించునట్టిమనుజుఁడు దహానదృ
గ్ఫాలునికృప గనుఁ గాలం, గాలునిరూపమున బొమ్మగట్టి ధరిత్రిన్.

కమలవ్వ కథ.

వ. అదియునుంగాక. 278

సీ. కడు నొప్పునీపురిఁ గమలవ్వ యన లింగ
సన్నిహితప్రాణ సదయహృదయ
భవిపరాఙ్ముఖ భక్తపాదార్చనాసక్త
సవయ నిర్మలశీల సరసవచన
వేశ్యాకులోద్భవ విజ్ఞాననిధి రూప
లావణ్యసీమ యంభోజవిరామ
యనుచు వన్నియ కెక్కు ననిశంబు బసవేశ్వ
రాదులతోఁ బ్రసాదామృతాబ్ధిఁ

తే. దేలుచును దత్త్వగోష్ఠిఁ బ్రార్థించి దినుచుఁ
ద్రివిధలింగార్చనాసక్తిఁ దేజరిలుచు
సతత మంగవికారదూరత వెలయుచు
యుక్తవర్తనఁ జరియించుచుండె నంత. 279

తే. ఆర్యనుత యైననూయింతిచర్య లెల్ల
నరసి కొంకెదమంచయ్య యవనినాథుఁ

జేరి బిజ్జలభూపాల! చిత్తగింపు
మనుచు నేకాంతమునఁ దెలియంగఁ బలికె. 280

మ. ఒకవేశ్యాంగన బత్తి సెత్తుకొని యాయూరందు లింగాంగియై
యికమీఁదం దనకెవ్వ రీ డనుచు దండేశాదిభక్తాలితో
నొకటై యున్నది తద్గణాధిపులు జాత్యానంబు నావంత యెం
చక యబ్బాలికతోడఁ బంక్తిని భుజించన్ సాగి రేకాలమున్. 281

ఆ. జాతినీతు లెన్నఁజాల రించుక యెట్టి
జాతులైన లింగసహితులేని
కలయ రోయ రవని గడు నిందకోడరును
దామె ఘనుల మనుచుఁ దలఁతు రెపుడు. 282

చ. అని తెలుపన్ విభుండు కుపితాత్ముఁడు నై బసవేశుఁ బిల్వనం
పినఁ జని యాత్మయోగ్యమణిపీఠి వసించినఁ గాంచి బిజ్జలుం
డనెఁ గను లెఱ్ఱఁజేసి సచివాగ్రణి! తావకభక్తి లోకముల్
ఘనముగ నిందె మిమ్ము ననఁగాఁ బనిలే దిఁక మాటిమాటికిన్. 283

చ. కులము జలంబులం గలిపి కూడినసద్యశ మెల్ల దూరమై
తొలఁగఁగ లజ్జఁ బోవిడిచి తోరపునిందల కాలయంబవై
నలుగురు నవ్వ నొక్కవెలనాతికి లింగము గట్టి దానితోఁ
గలిసి భుజించి మీకు సరిగా బహుమానము సేయఁ బాడియే!. 284

సీ. ఎడపక యావుపా లెంత పోసిన నైన
విడుచునే? సర్పంబు విస మొకింత
పుల్లతేనియ యెంతపోసి నూరిన వేప
నాకుఁ దియ్యఁదనంబు గలదె?
తేటనీరున నెన్ని తెలుఁగుల నుదికిన
నెలుఁగుచర్మమునకుఁ దెలుపు గలదె?
స్రోతోజలంబులలోపల నాన్చిన
బలుగుఱాతికి మెత్తఁ బడుట గలదె?

ఆ. యరయ లింగదేహ మైనంత వెలనాతి
పూతభావ మెట్లు పొందనేర్చు?
తెలిసియుండి యిట్లు భ్రమ్మరఁ గూడునే?

యనిన బసవఁ డాగ్రహంబు నొంది. 285

చ. ధరణితలేంద్ర! యిట్టు లన ధర్మమె? శైవమతప్రవర్తనం
బరయక వార్ధిఁ జొచ్చునది లక్ష్మియు వేఱయి యుంట గల్గునే ?
గురుకరజాతులౌ నరుల గోత్రకులంబుల నెంచఁగూడునే?
హరమత ముత్తమంబు సమయంబుల కన్నిటి కం చెఱుంగవే.? 286

ఆ. శూలిభక్తి లేని సోమయాజియు హీన
జనుఁడు గాని చూడ ఘనుఁడుగాఁడు
శూలిభక్తిగల్గు మాలవాఁ డైనను
శూలిసముఁడు గాని మాల గాఁడు. 287

చ. హరపదభక్తియుక్తకమలవ్వప్రభావ మెఱుంగ లేక యి
ప్పురుసున దూష్యభావమునఁ బల్కఁగఁగూడునె? తన్మహత్త్వమీ
వరయఁగఁ గోరితేని వెస నారయు మెవ్విధి నైన నన్న నా
ధరణిపుఁ డట్లు కాక యని తామస మించుక మాని యత్తఱిన్.288

చ. బసవనిఁ బోవఁగాఁ బనిచి పార్థివవల్లభుఁ డొక్కయుక్తి మా
నసమున నెంచి తస్కరజనంబులఁ బిల్వఁగఁ బంచి పల్కె దు
ర్వ్యసనము మీఱ మీరు కమలవ్వగృహంబున కేగి తచ్ఛివు
వెసఁ గొని తెండు పొం డనుచు వీడియముల్ దయచేసి క్రమ్మఱన్.

తే. ఎప్పగిది నైన భ్రమయించి యింతిలింగ
మూర్తిఁ గొని తెండు మీ కతిముద మొనర్తు
ననిన జోహారు లొనరించి యవనిభర్త
యాజ్ఞఁ గైకొని తస్కరు లరిగి రంత. 290

క. హరభక్తులమాహాత్మ్యం, బరయకదుష్కృత మొనర్చెనవనిపుఁడింకనీ
దురితాత్ముఁజూడఁగాదని, యరిగినగతినినుఁడు పశ్చిమాద్రినిజేరెన్.

క. శైవమతద్వేషం బగు, భూవల్లభుఘోరకలుషపుంజము బ్రహ్మాం
డావళినిండినగతి ధ్వాం, తావృతమై తనరె దశదిశాంతర మంతన్.

వ. ఆసమయంబున. 293

ఉ. కత్తియు నీలిచీరయును గంకటిరజ్జువు నారసంబు ముల్
గత్తియు వాటురాలిసుము గొంకియు నతుత లొల్కిబ్బాదియుం
గత్తెరకావికప్పడము కాటుకయుం జెలగోల చీరయుం

గు_త్తపుటట్టి నంబుప్రులు కుక్కలకట్టును బిండిబల్పమున్. 294
క. మొదలగు సాధనములుగొని, మఱిగొంకకగాఢతరతమంబునఁజొరల్
గుడికొనికమలప్వమణీ, సదనముఁ జేరంగ నరిగి సైఁగల నంతన్. 295
ఉ. కన్నము ద్రవ్వి క్రోవి నిడి గైకొనివచ్చిన తెక్కపుష్వలక్ష
మున్నుగ దీపమార్చి యొక్కుచ్చుపదంబులు మున్ను సాఁచి యా
కన్నము చొచ్చి యొయ్యఁ దపగారములోపలి కేగి తెల్వగాఁ
గన్నుల సర్వవస్తువులు గన్పడుకాటుకఁ బూసి య_త్తఱిన్. 296
తే. కనకమయసూత్రపేటికాకలితలింగ
మూ_ర్తి విద్రుమఖట్వాంగమునఁ దగిల్చి
యోగనిద్రాసమాస_క్తి నొడలు మఱచి
ప_వ్వళించిన యాకమలవ్వఁ గాంచి. 297
సీ. దరి కేగి నిల్చి యా తెఱవలింగము గొనఁ
జేతులాడక కొంత సేపు నిలిచి
నరపతియాజ్ఞ నొనర్పక గాదని
నప్పుడు జ్యోతిర్మయంపులింగ
మూ_ర్తి యున్నట్టి తత్కా_ర్తస్వరపుఁబేటిఁ
గొని తాను జతవారు గూడి పోయి
పృథివీశుచేతిలో నిడి తారు దెచ్చిన
గతి యెల్లఁ దెలుప నద్భుతము నొంది
తే. దొంగలను వీడుకొలిపి యాలింగమూ_ర్తి
జతనముగ డాఁచి యంత బిజ్జలుఁడు దీన
నేమి పుట్టునో యని భీతహృదయుఁ డగుచుఁ
గడపె నారాత్రి నిద్దుర గానలేక. 298
వ. అంత. 299
క. హారవ్రూజాకుసుమంబులు, కరిగెడుభక్తులకుఁగాలమనుభృత్యుఁడుదాఁ
గరమునఁబట్టినదీపిక, కరణి నపుడువేగుచుక్క గానఁగ నయ్యెన్. 300
క. కమలవ్వభ_క్తిగతి లో, కములఁ బ్రకాశంబునొందు క్రమమున నాశా
సముదయమున నెల్లెడలం, గ్రమమున స్వచ్ఛతతనర్చె రాజితలీలన్.
తే. ఆత్మ సఖ్యభిధానధా జకట! యెంత

చేసె నని కోపమున మోము జేవురింప
వచ్చెనో యన లోహితవర్ణయుక్తుఁ
డగుచు నుదయించె నినుఁడు పూర్వాద్రియందు. 302

ఉ. అంతకమున్న బిజ్జలుఁ డహర్ముఖకృత్యము లెల్లఁ దీర్చి య
త్యంతవసీమ వెల్వడి నిజాప్తులతో సభఁ జేరఁబోవఁగా
నంతటిలోనఁ జారుఁ డొకఁ డయ్యెడ కల్లన నేగుదెంచి భూ
కాంతుని గాంచి పల్కెఁ గిటకంబునఁ బుట్టినవార్త నమ్రుఁడై. 303

చ. అవనిప! యొక్కవేశ్య కమలాఖ్య యనం గల దిప్పురంబునన్
శివపదభక్తియుక్త యలచేడియలింగము దొంగబంట్లు త
ద్భవనము కన్నమేసి దురితంబున కోడక కొంచుఁబోవఁ దో
సె విడిచె జీవముల్ సుదతి సన్నుటిరేయి మహాత్వ మేర్పడన్. 304

ఉ. ఇంత మహాత్మురాలి కిటు లెగ్గొనరించినకర్మి యెవ్వఁడో
యంతకుఁ జూచు వేగ మని యంతట నంతటఁ బ్రోలిలో జనం
బంతయు నాడుచుండె నిది యద్భుతకార్య మటంచుఁ దెల్పినన్
స్వాంతము చంచలింప జనవల్లభుఁ డేమియుఁ దోఁచ కత్తఁటిన్.

చ. ఘనుఁ డగుమంత్రివర్యు నొక కంచుకిచేఁ బిలిపించి పల్కె నో
యనఘ! మహాత్మురాలైన కమలవ్వదిటం బరయంగఁ గోరి నే
ననియతిఁ జోరులం బనిచి యాసతిలింగము దెమ్మటన్న వా
రు నటులఁ జేయ బిట్టువడె గ్రుంకె లతాంగి యిఁకేమి సేయుదున్ ?

తే. కుడిచి కూర్చుండి యిపు డిట్టి బెడద దెచ్చు
కొంటి స్త్రీహత్యయును జనకోటివలన
నిందయును రాజ్యదూరత నొంపవలసె
నింత వచ్చుట మున్ను నే నెఱుఁగనైతి. [గంధి

తే. ఇంతకాలంబు గాపాడితిపుడు నన్నుఁ, బాపమొందక యుండ నప్పద్మ
జీవసంగతిఁ జేసి రక్షింపవయ్య, యనిన నృపుతోడఁ బసవేశుఁ డనియె నిట్లు.

ఉ. అక్కట! యిట్లు సేయఁ దగునయ్య? ననర్హతరప్రయోజనం
బక్కమలాంబనిర్మలమహత్త్వముల న్నెఱుఁగంగఁ జెప్పినం
దెక్కలిచాడిమాటలె మదిం బదిలంబుగ నమ్మి మిత్తిచేఁ
జిక్కితి వేమి సేయఁదగుఁ జెందినదుర్దశ మాన్పవచ్చునే?. 308

తే. చోళరాయండు వేగివసుంధరావి
ఘండు నుదయేశుఁ డాదియౌ భూమిపతులు
కొందఱీశ్వరభక్తులఁ గోదుఁ జేసి
తాము చెడుట యెఱుంగవే? ధరణినాథ! 310

క. నీ వెఱుఁగఁగ మాహేశ్వరులఁ, శైవుల కపకారు లగుచు సమసిరి కావే?
కావున నెంత దిగులొక్కఁగాఁ బలికిన కార్యమెల్లఁ గాకతఁ లగునే?

చ. అనవుడు బిజ్జలుండు బసవాధిప! నే నిను నమ్మియుంట పా
పనునిగఁ జేసి కల్మషముఁ బాపి యశం బొనఁగూర్చి సద్గతిం
గనుపడఁ జేయువాఁడ వని కాదె? దయానిధి! యట్లు గాన నీ
యనువున మందబుద్ధి నగు నట్టి ననున్ బుధమాన్యుఁ జేయవే! 312

సీ. అనుచు దీనత దోఁప నాడిన బసవండు మోదమునఁ జిఱునవ్వు మొలక లెత్త
నాలింగమూర్తిఁ దెమ్మని కేల నిడికొని భక్తులు దానును బార్థివుండు
కమలవ్వగారి గేహమునకుఁ జని గతజీవయై పడియున్న చెలియఁ గాంచి
యచ్చెరువంది పూర్వాచార్యచే భక్తపుంగవాజ్ఞ వడసి యలింగమూర్తి

తే. నప్పుడు ధరియింపఁగాఁ జేయు నంతలోన
నిద్ర దెప్పిఱినటు లేచి నిఖిలభక్త
సమితిఁ గని మ్రొక్కి నిలిచిన సచివుఁ గువిడ
పాదపద్మములకు మ్రొక్కిఁ బ్రస్తుతించె. 313

క. బిజ్జలుఁ డంతట సాధ్వస, లజ్జాదరభక్తిమార్గలంపటుఁ డగుచున్
సజ్జలదాలకపదములు, పజ్జం దర జాఁగి మ్రొక్కి బడి వినుతించెన్ 314

క. కమలవ్వా! నీదువిలస, త్కమలాంకకలాపభక్తిగతి యిజ్జగతిన్
గమలాధవ కమలోద్భవ, కమలాధిపముఖుల కైనఁ గానఁగ వశమే?

క. నే నజ్ఞానమనస్కుఁడ, నైన నీ కెగ్గొంచినాఁడ నటు గావున నా
హీనగుణంబులు నీమది, నూనకుమని వేఁడుకొనె నృపోత్తముఁ డంతన్.

క. హృత్కమలకర్ణికాస్థిత, సత్కాంతకళావతంసచరణాంబుజయౌ
తత్కాంతకరుణఁ గనిసం, పత్కమనీయాత్మగృహము పటుగతిఁ జెందెన్.

క. తద్భక్తతతియు బసవఁడు, హృద్భరితానందు లగుచు నేగిరి నిజభా
స్వద్భవనములకు నతిఃలో, కాద్భుతసద్భక్తిఁ దొంటియట్లు వసించెన్.

## టంగుటూరి మాచయ్యగారి కథ.

వ. అదియునుంగాక. 319

తే. మఱియు టంగుటూరిమాచయ్యనా నొక, భక్తపుంగవుండు శివపాదదాహి
రాజరాజరాజరాజేష్టసత్కథా, రాజవమలకీర్తిరాజితుండు. 320

శా. అద్వైతద్వాంబురుహద్విషచ్ఛకలభూషార్చాసమాసక్తుఁడు
ద్యద్వాగీశపముఖాదితేయనికురుంబాలభ్యముక్త్యంగనా
హృద్వాంఛాపరిపూర్తికృద్గణకటాక్షేక్షాపృతాంగుండు కృ
ష్ణద్వైపాయనముఖ్యయోగినుతనిష్ఠాశాలి యొప్పున్ భువిన్. 321

క. ఆలింగభక్తవర్యుం, డాలియు సుతయుగము: దాను నగచాపగుణా
ర్చాలి స్థిరస్వాంచకస్థితిఁ, జాలఁగనొనరింపుచునురసాస్థలి వెలసెన్. 322

వ. అంత నొక్కనాఁడు. 323

చ. చిఱుతకుమారుఁ డాటతమిచేఁ దనయీడగువారిఁ గూడి మే
నెఱుఁగక యాడుచుండఁగ మహీస్థలి లింగము జాఱిపడ్డయ
త్తఱిఁ గని బాలుఁ డొక్కఁ డది తాఁ బదిలంబుగ డాఁచి వానిముం
దఱ కరుదెంచి నీగళమునన్ శివుఁ డేఁడి? యటంచుఁ బల్కెనన్. 324

చ. కరమున రొమ్ము పుణ్కి శివుఁ గానక తోనె గతాసుఁ డై ధరం
దొరఁగిన గాంచి భీతిలుచుఁ దోడికుమారకు లెల్ల నొండొరుల్
పరు లెవరైన మీఁదఁబడి పట్టుట కొట్టుట గాన మూరకే
మరణముఁ జెందె నీతఁడు ప్రమాదము వచ్చెను మూఁకకంతకున్

మ. తలిదండ్రుల్ విని యీడ నున్నమనపైఁ దప్పెంచి భూమీశుతోఁ
దెలియం జెప్పకపోరు చెప్పినపుడే తెప్పించి చూపంగఁ గొ
ఱ్ఱల వేయించకపోవఁ డింకఱ నిఁకేతోవంచు నాడంగ వా
రలతో లింగము డాఁచువాఁడు వెఱపూరం బల్కె నప్పట్టునన్.

మ. వినుఁడీ బాలకులార! యాటతమిచే వీఁ డుండుచో లింగ ము
ర్విని జాఱం గని యేను డాఁచి తెలుప న్వీశాసుఁ డై కూలెఁ ?
పునఁ దల్లింగము గ్రమ్మఱం దనువునం బొందింపఁ బ్రాణంబు వ
చ్చునొ యం చందఱు చోద్య మంద నపు డీశున్మానిసంధించిన

ఉ. తోడనె మేనఁ బ్రాణములు తొల్లిటియట్లన చేరఁ గాంచి తోఁ
గూడి వసించుబాలకులు కో యని యార్చుచు నెంత వింతరా

చూడుఁ డటంచు నిందతెనిఁ జుట్టినగండము దప్పె నంచుఁ జె
ల్లాడుచు నాతనిం గదిసి యక్కునఁ జేర్చుచు నుండున త్తఱిన్. 328
తే. అతనియగ్రజుఁ డరుదెంచి యచటివారి
పలనఁ దద్వృత్త మరసి శైవప్రవర్త
నం బెఱుంగునె? వీఁడు లింగంబు జాఱఁ
నంత నే ప్రాణములు వీడఁ డాయెఁ గాన. 329
చ. శరణులు విన్న నీగతికి స్నేతు రె యంచుఁ గ్రుధాత్ముఁ డై నిజా
వరజునిఁ జాలఁ గాఁ బదరి పాపప మంచుఁ జనంగఁబోవున
ప్పరుసును గాంచి బాలకులు బాపురె! యీగతిఁబల్కు వీనిపెం
పరయుడ మంచు నొక్కమొగి నందఱుఁ బైఁబడి వానిలింగమున్.
క. బలిమిని దెంచినఁబ్రాణము,దలఁగును వెఱఁగంది మగుడఁ దల్లింగము మై
నిలుపుటయుఁదోనె బ్రదికినఁ, జెల రేఁగి కుమారకులుకు చేష్టితులగుచున్.
తే. పెక్కువరుస లింగంబులఁ బెరుగఁ దీయు
చును రయంబునఁ గ్రమ్మఱఁ దనువునందు
నొంచఁ జేయుచుఁ బ్రాణవియోగయోగ
కలన కద్భుత మందుచుఁ గాంచి యంత. 332
క. చిఱుతలము మీమహత్త్వం, బెఱుఁగకయిటు చేసినార మీపసిదయ చే
మఱువదగు స్వామి యనున, త్తఱిఁ దద్గురుఁ డైన మాచధన్యుఁడువచ్చెన్.
ఉ. వచ్చి కుమారులం గని శివాధవభక్తిపదం బెఱుంగఁగా
వచ్చె శివుండు దేహ మెడఁబాయుట గల్గునె? భక్తకోటి కీ
యొచ్చెము సల్పవచ్చునె?యయో! యని చింత యొనర్చుచున్న భా
స్వచ్చరితాఢ్యుఁ గన్గొని హసన్ముఖు లై గుమిగూడి బాలకున్. 334
ఆ. అంగమందుఁ బాయ దఁట వీసిలింగంబు
చోద్య మిప్పు డిదియుఁ జూత మనుచుఁ
దొంటిపగిదిఁ గదిసె దూసినఁ దల్లింగ
మెద బెనంగి యంటి వదలకున్న. 335
చ. కనుఁగొని బాలు రిట్టిగతి గంటిమె వింటిమె యెందునైన నీ
యనఘులు శంకరాంశజు లటంచు నుతించుచు మ్రొక్కుచున్న యం
త నగరవాసభక్తతతి తన్మహిమక్ష విని వారిఁ జూచు వే

ఢ్క నరుగఁ గాంచి సూత్మ జన్ముగంబును దాను నమస్కరించుచున్.
క ఉన్నెడ మాచయఁ గనుఁగొని, యన్నాగకలాపభక్తులద్భుతమతులై
మెన్నఁగలవారిలోఁబడి, సన్నమహామహులువీరె జగతి నయారే!.
ఆ. చెకసిఖ క్తియు క్తి గొడగూచి తిరునాళ్ల
పోవ నరియమయును బాచకాటు
గర్భవాసు లైరి గాని యీగతి లింగ
మంగమందు విడమి యవనిఁ గలదె?. 338
క. అని వినుతించిన నందొక, యనఘుండిట్లని మోదొల్లి యనిమిషుండనఁగ
ల్గునతనిచరితము చెప్పెద,వినుమని తెలుపంగదొడఁగె విస్పష్టముగాన్.

అనిమిషుని కథ.

సీ. అతివేడ్కఁజెన్న యసునాడు శ్రీగిరికేగుచోనాత డొక్కెడ స్వలింగ
మవనిపైఁ బడి తన కనపడకున్నంత నచ్చోటనిల్చి దేహంబుదొరఁగ
నమకించునాడ దనూకలితాత్ముడై నందికేశ్వరుఁడేతెంచియిటులజీవ
మెకసేయఁ గారణం బేమి?నా నమ్ముఁడైయిట్లనునాలింగమెచటఁగాన
ఆ. రాకయుండెఁ గానఁ బ్రాణంబు వీడనే, ననఁగఁ జేయవలసె ననిన నంది
నగవుతోడ ననియెఁ బెగునచే నీగతి,దారుణంబు నేత ధరణిఁగలదె?
ఉ. ఊరక జీవముల్ విడున నొప్పునె? యెవ్వరిచేతఁ జిక్కెనో
యారయు మెచ్చటం బడెనొ యంతట నంతటఁ జూడు ప్రాతరా
ర్యారమణార్చనం బెచట నయ్యెనొ యచ్చటఁ గాంచుఁ బంపుమా
దారి విమర్శసేయుమను తప్పక లింగము గాన నయ్యెడిన్. 341
వ. అనినఁ బక్క క్తవరుండిట్లను నయ్యా! శేపకడ నొక్క సరోవరతీరంబునఁ
బ్రాతఃకాలశివార్చనం బొనరించి పయనంబు దరలి యొండుచోట
నిలువక నచ్చివచ్చి యిచ్చట మనీయాంగంబున నీశ్వరుండు లేమిఁ
గంటిం గావున నిచ్చట మల్లింగంబు దొరకవలయుఁగాక యచ్చోటు
నదలి వేతె యొక్కచక్కి వెదకం బోవ నిది నానియమంబు నియ
మవర్తనులైనవారల నీశ్వరుండు కరుణించి కృతార్థులం గావించు
నది యెట్లనిన వినుండు. 342

ఉగ్గాణదారి కథ

క. అండజనాయకవాహను కొండాలయిలాత్మ ప్యూజయకమఁబుఁ డేను వే

పండహారివసుమతిఁ బగల్గాండ్రారెయనంగ నొక్కధన్యుఁడు వెలయున్.

తే. విశ్వసన్నుతుఁ డతఁ డగస్త్యేశ్వరునకుఁ
బ్రతిదినంబును శతఘటపరిమళోద
కంబు లభిషేక మొనరించి కాని కుడువ
ననుచు వ్రత మూని యట్లు సేయంగ నంత. 344

సీ. విశ్వదిగంతరావృతికజ్జలపటలంబు పవమానతాశనపక్వతరుచయంబు
ద్వాదశాత్మకరాభితప్తావనీతలంబు వారిదరోద్వేషివనమృగంబు
ఛాయాప్రదేశవాంఛానక్తపక్షికంబు పానీయవారికాపంకభరంబు
శైత్యగంధవహార్థసంచరద్భుజగంబు సలిలమరీచికాసముదయంబు
తే. నిర్జలతటాకవాపికానిర్ఝరంబు, జనభయంకరపశ్చిమస్పర్శనంబు
శాల్మలీతూలకీర్ణనిర్జరపథంబు, నగుచుఁ గనుగొననయ్యె గ్రీష్మాగమంబు.

వ. ఆసమయంబున. 346

చ. తనపురి నీరు లేమి వసుధారథుమజ్జన మంతరించునో
యని పరిచారవర్గముల నన్యపురంబులఁ గన్పి వారిఁ దే
బనిచి దినంబు నేమ మొకఁబాయక సల్పుచునుండి యొక్కనాఁ
డనఘుఁడు తొంటియట్ల గిరిజాధిపమజ్జన మాచరింపఁగాన్. 347

క. చేదప్పి నూఱవఘటము, మేదినిఁ బడి భిన్నమగుడు మృగధరభక్తుం
డీదివసవ్రతసాంగము, గాదయ్యె నిఁకేమి సేతు గౌరీరమణా! 348

క. చెరువనీరము పుట్టదు, దూరము పంపుటకు నెడము దోఁప దిపుడు నే
నేరీతి వ్రతము గడుపఁగ, నేరుతునని మూర్ఛచే మునింగినయంతన్.

చ. సరసిజవైరిజూటుఁ డొకజంగమరూపము దాల్చి వచ్చి యా
శరణవరేణ్యుకట్టెదుట స్వర్ణఘటంబు జలాభియుక్తముం
దిరముగ నిల్పి నీవ్రతము దీర్పుము సాంగముగాఁగ నంచుఁ దె
ల్పి రయము మాయ నేగుటయు లేచి దిశల్ పరికించి యొచ్చుటన్.

చ. ఘటమును జంగముం బొడగానక చింతిలి యాత్మ నక్కటా!
యిట్టి కలఁ గంటిఁ గాక నిజమేని కనుంగవఁ గబ్బకుండునే
యెటుల చరింతు నానియమ మేగతి సాంగముఁ జెందుఁ నంచు ను
త్కటపరితాపవేదనల గ్రమ్మఁగఁ గన్నులు మూసి తా వెసన్. 351

ఉ. తొల్లిటిపైఁడికుండ నిజ[illegible] గాంచి శూలిన్నా

యుల్లముఁ జూడఁ గోరి జలయుక్తకలశంబు మదీయగర్భమం
దల్లన నిల్పె మేలిఁక భయంపడనేల కుఠారధార నే
నెల్లరుఁ జూడ గర్భగతహేమఘటంబు వెగల్తు నిత్తఁజిన్. 352

క. అని వాఁడిసురియ చేకొని
తనయుదరము చించఁదలఁపఁ దత్క్షణమున హ్రా
ద్భవజమున దయ దలిర్పఁగ
మనసిజహరుఁ డిటుల వలదు మాను మటంచున్. 353

తే. కట్టెదుట నిల్చి యాతనికరము పట్టి
మేలు గణవర్య! నీచర్య మెచ్చువచ్చె
రమ్ము కైలాసమునకు శీఘ్రమ్ము గాఁగ
ననిన శివునకు మ్రొక్కి యి ట్లని నుతించె. 354

పంచచామరము. అంబుజాక్షసాయకా! యజాండభాండనాయకా!
శంబరారిమారణా! నిషాదవేషధారణా!
కంబువర్ణవిగ్రహా! వికారికాలనిగ్రహా!
శంబరాంకభూషణా! నిశాచరాళిశోషణా! [పిదప

ఆ. అనుచు సన్నుతించి యార్యమనోనాథ, పూనువ్రతము సాంగమైన
రాక యెప్పఁగాక లేకున్న నిచ్చట,వదలివచ్చు టుచితవర్తనంబె?

వ. అనిన శర్వుం డి ట్లనియె. 357

తే. అంజనఖనిత్రధూపదీపాదికములు
ధరణి సేవధి దొరకు నంతకునుగాదె ?
తద్ధనం బబ్బుపిదప సాధనచయంబు
లెన్ని యేనియుఁ బనిగొను నే? తలంప. 358

ఉ. కాన మదీయశాసనము గల్గినయంతకుఁ గాదె? నీ విటుల్
పూని యొనర్చునట్టివ్రతపుంజము భక్తసమూహిలోనఁ బెం
పూనితి వింక సంశయము నొందకు నీనియమంబు నిండె నీ
నూనవిమాన మెక్కి పద శోభనరౌప్యధరంబుఁ జేరఁగాన్. 359

సీ. అనఁ బగల్తొండారి యనియెఁ బ్రమ్మట మ్రొక్కి
స్వామి! మీ రనుమాటయే మదిష్ట
మగుఁగాని వ్రతలోప మగుటకు సమ్మతిం

పదు మఱి యావెత్తిఁ బాపవలయు
నాప్రసాదఁ గరుణించి యావారికుంభ మూ
తసిచ్చేతి కోసఁగ మోసంబు నొంద
హారమజ్జన మొనర్చి యయ్య! యీలింగాల
యములలో నను నీవుసముసఁ జేర్పు
తే. మనిన నాతఁడు కోరినయట్టుల నిజని
వాసమునఁ జేర్చె నవు డద్రినాథుఁ డట్టు
లగుట పట్టినసియమంబు డిగుట యగునె!
యని మఱియు నిట్టు లనియె నయ్యనిమిషుండు. 360
మ. అతిభక్తిం దన మెత్తుగుగ్గులము నిత్యం బిశుద్ధర్మాపహా
ర్పితముం జేయఁగఁ గౌశికూట మది దుష్ప్రాత్మాత్ములై యొక్కనాఁ
డతనిం గానక నీక డాఁచ నిజదేహం బగ్గిలోఁ గుగ్గులా
యితమై యొప్ప నొనర్చి హీనత నరుం డీశాను నొప్పింపఁడే?. 361
చ. జడధిశయానబాణునకు సంతతముఁ వెయి దీపముల్ వెలుం
గిడుచుఁ బదార్థ మెల్ల నదె హేతువుగా వ్యయ మొంద ధీరుఁడై
జడముడి విచ్చి దీపములచందమునఁ వెలిఁగించి తోడనే
కడనులనంబి శంకరుని కాయముఁ జెందఁడె బొందితోడఁ తన్. 362
తే. ఎండ వెన్నెలఁ దనువంటనీని వ్రతముఁ
బూని గుహనుండి రవిసుపుంజ మాత్మ
గాత్రమునఁ జొన్ప నాతనిఁ గని శపించి
యీశుదయఁ గనెఁ దొల్లి సురేశ్వరుండు. 363
తే. చందనము మూఁడుసందెల శర్వమూర్తి
కిచ్చువ్రత మూని నిజధన మెల్ల సమయఁ
జెయ్యి గంధముగాఁ దీసి శివునికరుణ
వలన నణుమూర్తి కైలాసవాసి గాఁడె!. 364
తే. మఱియు నడిభర్త గుగ్గుల మాచిదేవుఁ
డాది యగుభక్తవర్యులు సాంగసియమ
కలనచేఁ గాదె శివుకృప గాంచి రట్టు
లగుట వ్రత మరయఁగ నిట నగునె? యనఘ!. 365

వ. అసిన నందికేశ్వరుం డనిమిషనిష్ఠాగరిష్ఠత్వంబున కచ్చెరువందుచు
సుహాసితాననుండై యిదె కొమ్మని తల్లింగం బతనిచేతి కొసంగి లిం
గాంగైక్యమార్గం బుపదేశించి నేఁటంగోలె నీమూర్తి నీదేహంబున
నంటు వదలకుండు నని యనుగ్రహించి దండప్రణామయుతుండగు
నతని హితవాక్యంబుల నాదరించి ప్రమథాధ్యక్షుండు నిజేచ్ఛం
జనియె నాఁటంగోలె నయ్యనిమిషుండు నిజకరతలన్యస్తలింగలీనదృష్టి
తత్పరత్వంబున నిరంతరంబు దన్ను మఱచి చిదానందాబ్ధి నోలలాడు
చుండె నని తొల్లిటిభక్తవర్యుల చర్యల విందుము నేఁడిమ్మహాత్ములఁ
గన్నులం గంటి మని సన్నుతించు నవసరంబున నమ్మాచిదేవుభార్య
యేతెంచి యచ్చటిభక్తులకు మ్రొక్కి నిజపతిసుతులం గనుంగొని
గూఢతరయగు మనభక్తి నేటికి నిచ్చ కెక్కె నింక మర్త్యంబు చాలు
రండు రండు పోద మని కుమారుల నిరువురఁ జంకల నిడికొని ప్రాణే
శ్వరు మూఁపుపై నెక్కించుకొని సకలజనంబులు ఘే యని జయ
వెట్ట వైహాయసగమనంబునఁ గైలాసకుధరంబున కరిగె నంత నచ్చటి
భక్తులు నత్యాశ్చర్యంబు నొంది తమలోన. 368

సీ. విలసితచతురంగబలసమేతుండయి చెన్నయాఖ్యుఁడు శర్వుఁజేరనరిగె
సకలతంత్రముదాను శమనారిసతిచేరగుమారపాలకూర్జరుఁడుచనియెఁ
దొమ్మిదిపురములతోఁగూడ శివపురి డాయంగ నేగె హలాయుధుండు
గురునకై దొమ్మరకులమెల్లఁగొని తారసృక్శేఖరముఁ జేరె బిళ్లమాఖ్యుఁ
తే. డనుచు విందుమా ద్యోక్షులయందు దొల్లి, కంటి మిత్తఱిఁ గన్నులకవ్వడీఱ
దేహములతోడ గైలాసదేశమునకు, ధారుణీజనులందఱ వీర లేఁగ.
ఆ. పలికినట్లు నడచు భక్తులు వీర కా, కవనిలోన నెవ్వరైనఁ గలరె?
యనిన నొక్కజంగమయ్య యిట్లని పల్కె, వినరె తొంటిభక్తవితతిలోన.

ఘటాలయ్య కథ.

శా. కామక్రోధమదాదిశత్రుబలవద్గర్వాపహుం డింద్రియ
స్తోమోద్దామవికారదూరుఁడు విసృష్టాఖిలాఘుండు దీ
నామర్త్యక్షితిజంబు భక్తగణపాదాంభోజసేవార్చన
స్థేమాత్ముండు వసర్చు నిర్వ్వసుమతీసీమ ఘటాలయ్యనాన్. 369
వ. ఆయనమహాత్ముభార్య విమలాంగి యనంగ విలాసవిభ్రమ

హారియకళాభిరామ సితపంకజపత్రవిశాలనేత్ర స్వ
ర్ణాయకరత్నవేణి యుడురాజనిభానన భద్రకుంభికుం
భాయతసత్పయోధర మృగాధిపమధ్య తనర్చు నెంతయున్. 370

సీ. ఆయింతి పతి మెచ్చఁ బాయక నిత్యంబు కేవలభక్తి గల్గినదియగుచు
సుచితోపచారంబు లొనరఁ జేయుచు మన్న నాయత్తమానసయైనయాలిఁ
గూడిచరింప నక్కోవిదుఁ డెల్లెడఁ దెక్కసేయక లింగలీల ధరణిఁ
దిరుగుచు భక్తమందిరములకేగి తదంగణరజము పాంసంగ నూడ్చి

తే. తెచ్చి యొకభాండ మొనరించి గృహిణి నూత్న
లబ్ధభక్తుల కొసఁగి తల్లబ్ధి జంగ
మార్చ లొనరించుచు దురంత రాజవంజ
నభ్రమాతీతమార్గుఁడై నడచునంత. 371

వ. అంత నొక్కనాఁడు. 372

చ. శరణులు కొందఱా ఘనుని సద్మముఁ జేరఁగ నేగి వానిచేఁ
జిరతరపూజనావిధులు చేకొని మున్న తదంగనాగుణం
బరయుటచే స్వమానసములందు ననహ్యత దోఁచఁ గిన్కమై
హరగణు లెల్ల నిట్లనిరి యాతనితో నుత నేకవాక్యులై. 373

తే. జ్ఞానవైరాగ్యనిష్ఠల జ్ఞాతలమున
వన్నెకెక్కిన యోభక్తవర్య! నీదు
తరుణి గొఱగాని త్రిమ్మట దిరుగఁజొచ్చెఁ
జక్కఁగాఁ దీర్చు మనుటయుఁ జాఁగి మ్రొక్కి. 374

క. తనకాంతఁ బిలిచి యాభక్తని కాయము నీవు చక్కఁగాఁ దిరుగఁగ లే
వని సెప్ప నటుగాన పీఠల కనుఁగవకట్టెదుట మెచ్చఁ గ్రమ్మఱుమనినన్.

తే. అంతఁ బతిమాట జవదాఁట కజ్జలాట
పాతకి మడమలు భువి మోపి యపుడు కుంభ
కారచక్రంబు విరిగెడుతీరు దోఁపఁ
దిరుగఁ గని భక్తు లిటుల పల్కిరి హసించి. 376

తే. మేలు మేల్ముగ్ధ! నీచర్య మెచ్చువచ్చెఁ
దిరుగుటలు నాఁగ నిటు గాదు దెలియ వినుము
కాంత నడవడి చక్కన గా దటన్న

నతివప్పైఁ గోపగించి యి ట్లనియె నతఁడు. 377

క. నీనడక చక్కఁగావఁట, యీనాగకలాపభక్తు లెల్లను మెచ్చన్
బూని నడు మనినననగ్రజ, పూని విలాసముగహంసయటులనడచినన్.

క. కని తన్భ క్తని కాయము, వినుము ఘటాలయ్య! యెంత వెఱ్ఱివి మేమా
డినమాటలెల్ల యనేవదు, పునకచ సేఁతలు పొసంగుగానననుటయున్.

క. కొఱఁగానిసేఁతలెల్లను, తెఱఁగయనుచునాకు నెపుడు తెలియదు నేనె
త్తెఱఁగునఁ జెప్పిన నట్టుల,యనసేయక సేయు నట్టులాశంగగునే?

చ అను నీతఁ డింత తెల్పఁ దెలియం డని యంగనోకభక్తపుంగవుం
డనియెను రహస్యవృత్తి సహయాత్మక! నీప్రియ కామచారయై
తనకులశీలవర్తనలు తప్పి చనం గడుమింపగీతతో
నెనసి చరించు నీ కిటులు మేటికి నూరక చూచుచుండఁగాన్. 381

వ. అనిన పరమానితానసుం డై ఘటాలయ్య యి ట్లనియె. 382

చ. హరగణవర్య! మీ రిటుల యాడుట ధర్మమె! యన్యనింద చే
దురితము వచ్చునంచు మఱి దోషపదె? పామవృత్తిఁ జెంచెనన్
గిరిశుఁడు వానిఁ జేకొనునె? కేవలభక్తిపదానువర్తులౌ
శరణులు మెత్తురే? చెలఁగుఁజాలక మాయలఁ జిక్కువారలన్. 383

చ. ధరణిపరాన్ననాయకులఁతర్జనకున్ జనకోటినిందకున్
బరమునఁ గాలుచేఁ బడెడుబాధలకున్ భయమంది కొంద ఱా
స్మరకువికారవర్తనలు మాని వసింతురు కొంద ఱిచ్ఛమైఁ
బరగుదు రంగనామణులు వారలఁ బేర్కొన నేల? మాటికిన్. 384

క. ఒకయేటినీరు వాడరు, సకలమహీజనము లొక్కసరణి నడునరే
ప్రకటముగఁ బెక్కుమానవు,లొకరొక్కరిసామ్యటంటయోగ్యంబగునే.

తే.సకలఫలములలోఁబీజసమితియట్లు,మునిగియుండిరిసంసారమునసుగొన్ద
ఱాజవంశమునంగొంద ఱంటియంట, గరయ భల్లాతకీబీజమట్లధరణి

వ. కావున నెవ్వరెవ్వరిప్రకృతివిశేషంబు లె ట్లట్ల వారలుచరియింతురు
తద్గుణంబులు లెక్కింపం బనియేమి? సమస్తధర్మాభిజ్ఞుల రగు మిమ్ముఁ
బోఁటిమహాత్ము లన్యగుణదోషనిరూపణం బొనర్చుట కర్తవ్యాశ్చ
ర్యంబ య్యె నొకఁడుచనుతోఁ శివవేతొకండుచనునే? సకలజనంబులకు
భక్తి యొక్కటియై యుండుఁ దద్భక్తియుక్తులుకొందఱుస్వశరీరంబ

యింకొఁ గైలాసంబు నొందెదరు మఱికొందఱు తనుత్యాగులై చనియెదరు కొంద ఱాత్మలింగవిలీనత్వంబు నొందెద రవి యెల్ల నాశాస్పదంబులైన మార్గంబుల యనినఁ బశ్చాత్తాపరు లొండొరుల యాననంబు లాలోకించుచు నితం డాత్మప్రియానుసక్తుండై మనల నోడంబఱుప నిట్లాడుచున్నాఁడో లేక యితనిమార్గం బిట్టిదియో యదియునుం గాక యీశ్వరుం గలయు తెఱంగులు గొన్ని యుగ్గడించి యివి యెల్ల నాశాస్పదంబు లని యెమ్మార్గంబులుఁ దప్ప నితం డెప్పగిది నంబికాధీశుఁ గలయునో తెలియఁగవలయు నని శూలాలయ్యు నుద్దేశించి యందఱు నేకకంఠంబుగా ని ట్లనిరి. 387

ఉ. లోకములోన భక్తులు త్రిలోచనుఁ గూడెడునట్టిమార్గముల్
నేకొన కాడి తే వెటుల చెందెదవో పరమేశుఁ జెల్వుమా
మా కిపు డన్నఁ దద్గణసమాజవచశ్శ్రవణానుమోదుఁడై
యాకరుణాకరుండు వినయంబున నిట్లని పల్కె మ్రొక్కుచున్. 388

చ. అనఘతరాత్ములార! జగదంతరవర్తన లెల్ల నెమ్మదిం
గనుఁగొనఁజాలు జ్ఞానగుణగణ్యులు నామది మీ రెఱుంగరే?
ఘనదయ లోకసన్నుతుని గా నొనరించుట గాక నావయిం
గినియుట గా దయారె! ధరణిన్ నెన రిట్టుల యుండఁ జెల్లదే 389

వ. అయిన మీ రిట్లాన తిచ్చినపు డే నూరకుండుట చన దస్మద్వర్తనంబు వెల్పెద వినుం డని యి ట్లనియె. 390

క. కాయం బిడి దగ్ధపట, న్యాయంబునఁ జంద్రధరుని యందునఁ గూర్తు
న్నాయనిబల్కుట తద్గతి, సేయుట యొక్కొక్కనాఁడు చెల్లునె తలఁపన్.

క. అని యంతఁ బోక తన్నుతి, కని కాయంబునకు మ్రొక్కి కడువడి పద్మా
సనమున నాసీనుండై, ధనదాప్తుం గలయఁ దలఁచి తత్క్షణమాత్రన్.

సీ. తనరు నాధారపద్మము మెట్టి దిగనాడి కనువృష్టి యిష్టలింగమునఁ గూర్చి
తలవంపు తమ్ము లూర్ధ్వముఖంబులుగఁ జేసి వెస జీవవల్లికవేరు పెఱికి
తఱిపఁ బ్రాణానిలబంధతతు లూడఁగాఁ దన్ని తగు పంచభూతసద్మములు మాసి
విలసితాంతర్జ్యోతి వెలిఁగించి తను లెల్లఁ గలయ లోఁ గాల్చి చిత్కళ వెలిఁగించి
తే. బ్రహ్మరంధ్రంబు భేదింపఁ బ్రణవనాద
మెల్ల నిక్కలఁ గడుఁ బిక్కటిల్ల సకల

జనులు చూడ్కులు మిఱుమిట్లు గొనఁగఁ జేసి
తత్క్షణంబున శ్రీపరంధాముఁ గలయ. 393

ఉ. ధారుణి దిర్దిరం దిరిగెఁ దారలు డుల్లె నభంబు వ్రాలె ది
గ్వారము గ్రుంగె సప్తకులపర్వతముల్ చలనంబు నొందెఁ జం
ద్రారుణకాంతు లింకె సకలాంబుధివర్గము పొంగె నాదిభూ
దారము బొబ్బరించె బెడిదంబగు తత్ప్రణవారవంబునన్. 394

వ. తదనంతరంబ. 395

క. కురిసెన్ బువ్వులసోనలు, మొరసెన్ సురదుందుభులతిముదమున రంభా
దిరమణు లాడిరి చల్లని, మరుదంకురపంక్తి వీచె మాంగల్యముగాన్.

ఉ. అట్టిమహాద్భుతంబు గని యచ్చటిశాంభవు లెల్ల లేచి మే
మిట్టివిచిత్ర సౌఖ్యసుధ నెన్నఁడుఁ జూడఁగ లేదటంచు లోఁ
దొట్టినమోదసంపద నుతుల్ ప్రచరింప నితండు రూఢిగా
గట్టులవేలుపే యటుల గాసియెడన్ బడి నిట్లు సేయునే?, 397

ఉ. ఎంతమహాత్ముఁ డెంతఘనుఁ డెంతతపోధనచక్రవర్తి వీఁ
డెంతకృతార్థుఁ డెంతగుణి యెంతసమస్తసమానవర్తనుం
డెంత నిరస్తుఁ! డంచు వచియించుచు సద్గతి తద్గణాధిపుల్
స్వాంతములన్ బ్రమోద మొదవంగ గనుచున్న తఱిన్ రయంబునన్.

ఉ. ఆం దోకభక్తుఁ డీతనిక్రియాపరిపూర్తి యొనర్త మంచు బా
లేందుకిరీటభావుఁ డయి యేచ్చినయాతనిఫాలపట్టికం
బొందుగ భూతిపుండ్ర మిడఁ బోవఁ బతంగము భస్మమైన నా
చందము సర్వశర్వగణసంతతి గన్గొని యద్భుతాత్ము లై. 399

తే. ఒండొరుల మాఱె యేమియు నుండనీక
యవ్విభూతి నిజాంగములందు నలఁది
కొని మహాముక్తి చేకొంటి మనుచుఁ జనిరి
సంతసము నందుచును నిజసదనములకు. 400

క. కావునఁ బలికినగతి శివ, దేవు ఘటాలయ్య గలసె ధృతి నిత్తఱి మ
ర్త్యావళియద్భుత మొందను, మావల్లభుఁ డంగుటూరిమాచయ కలసెన్.

వ. అని తెల్పిన జంగమవర్యవాక్యమ్ములకుఁ బ్రమోదమానచేతస్కులై
సమస్తభక్తజనులు యథేచ్ఛం జనిరి. 402

తే. ధీరుఁ డైనట్టి శ్రీకటంగుటూరిమాచ
యాఖ్యచరితంబు చదివిన నర్థి వినిన
నాయురారోగ్యపుత్రపౌత్రాభివృద్ధిఁ
జెంది తుది మోక్షసామ్రాజ్య మొందు నరుఁడు. 403

వ. అని తెల్పి సిద్ధరామునితోఁ జెన్నబసవేశ్వరుండు మఱియు నిట్లని
చెప్పందొడంగె. 404

క. శంబరధ్వజాతశ్రీ, కంబుగ్రీవాధిపాదిఖచరార్చితపా
దాంబుజభవకనదాత్ముం, డంబికచౌడయ్యయనమహాఘహరుఁ డొప్పున్.

అంబిక చౌడయ్య కథ.

సీ. అతఁడు భక్తానీక మౌనసభక్తిఁ బాయక సూపకారకాయకము పూని
సలుపుచుఁ దల్లబ్ధి జంగమార్చనము లొనర్చుచు నిరుపమానందలీల
నిష్టలింగార్చల నేప్రొద్దుఁ జేయుచు నిష్టలింగులమైత్రియే వలఁచుచు
నిష్టలింగాధిక్య మిలఁ బ్రతిష్ఠించుచు నిష్టపూజావిధు లెఱుఁగ నట్టి
తే. నరుల నెమ్మది మెచ్చక తిరుగుచుండు
నంత నొకనాఁడు గుమిగూడి కంతువళన
భక్తు లొకకొంద ఱొకయెడ భాసురేష్ట
గోష్ఠిమై సమ్మదంబునఁ గూరుచుండి. 406

చ. ఘనతరవేదవేద్య త్రిజగజ్జనసేవ్య సమస్తదేవతా
వినుతమహత్త్వ పాపపరిహరణాద్భుతశీల మానసం
జనన ధరిత్రి ఘోరభవసాగరతారిణి యోగవిద్యఁ బో
ల నొకఁడు గల్గునే యమృతలక్ష్మిని గైకొనుమార్గ మేరికిన్. 407

తే. హృత్కమలకర్ణికామధ్య సీమ నిల్పి
మానసార్చన లొనరించు మానవులకుఁ
గరతలామలకము మోక్షసరణి యనుచు
నొండొరులతోఁ బ్రసంగించుచుండు వేళ. 408

ఉ. అక్కడి కేగి చౌడయ గణావళిఁ గన్గొని మ్రొక్కి నిల్చి యా
ముచ్చట లాలకించి యిది మొక్కల మిష్టసమర్చనాధ్వ మి
ట్లాచ్చము చేసి యోగవిధి యోగ్య మటంచు వచింతు రయ్య యో
మెచ్చునె కాలకంధరుఁడు మేలిమి చెందునె? యెవ్విధంబునన్. 409

క. ధారాధరంబులోపలి, నీరము మది నమ్మకుండ నీ రెడలించే
వేరిడిగతి నస్యపథము, గోరి కరస్థలశివార్చ గూడునె? విడుమా. 410
సీ. కరమున జ్యోతిరాకారలింగము గల్గనణుమాత్రకళ గనసలతయేల?
ఖ్యాతపురాతనగీతారవము గల్గ దశరవశ్రుతిచింత దవుల నేల?
యక్షయంబైన పంచాక్షరి యుండంగ షట్చక్రచింతనశ్రమ మదేల?
సారమౌత్రివిధప్రసాదామృతముగల్గనమృతకుంభేక్షణాయాస మేల?
తే. కలితసద్భక్తి యనియెడు కన్య గలుగఁ
బాపకన్నియ మేల్కొల్పుబాధ యేల?
సులభముగ ముక్తి గాంచెడుచొప్పు గలుగఁ
జాల వెత నొంద నేటికి? శరణతతికి. 411
క. అనియిటులయతఁడువల్కిన,వినియన్నాకశరణుఁడనియెవెలుపలిపూజల్
తనువలయ నెన్ని చేసిన,ఘనమానసపూజఁ బోలఁగలవే? యందున్.
తే. మహితచిద్బ్రహ్మమునఁ బనమానసంబు
లీయ మగుదాఁకఁ జను నిష్టలింగపూజ
సలుప నారూఢుఁ డైనచో సాధనముల
వలనఁ బని యేమి గలుగు? భూతలమునందు. 413
క. వేదాంతవేద్యమార్గము, గా దనఁగా నీకుఁ దగునె? కలితాత్మజ్ఞా
నాదరులగు బుధవర్యులు, మోదంబునఁ దొల్లినిత్యముక్తింగనరే.

ఆత్మదేవుని కథ.

ఉ. ధారుణి నాత్మదేవుఁ డనుధన్యుఁ డొకండు త్రికాల మంబికా
ధారుని మానసార్చన ముదం బొనరించుచుఁ గొంతకాల మీ
తీరునఁ బుచ్చి సానులు నుతింపఁగఁ దా నొకనాఁడు కూలికై
దూరము వోయి తోడిప్రజతో వరి గోయుచు నుండున త్తఱిన్. 415
చ. జలజసఖుండు మింటినడుచక్కికి రాఁ గని భర్గపూజనల్
సలుపఁగ వేళ యయ్యె నని సయ్యన నచ్చట గూరుచుండి కన్
గలువ లొకింత మూసి వెలి గన్గొనఁబోక తదేకనిష్ఠుఁడై
యలరినఁ దోడికూలిజను లాతనిచందము గాంచి నవ్వుచున్. 416
ఉ. కూలికి వచ్చి యీడ వరిగోయుచుఁ గూరుకు చెందవచ్చెనే?
మాలుగుఁబోతు వీని కనుమానము లే దిఁకఁ జేనిపెద్దచే

దోలుఁడి యీదినంబు మనతో సరిగాఁ బడి ముట్టఁబోదు వే
యేల వినుండు పీనుఁ బని కెవ్వరుఁ బిల్వరు నేఁటనుండియున్. 417
ఉ. కూటికి లేకొ యాఁకటనొ కూలి యొనర్చి గడించు కాసు లే
చాటున నైన డాఁచి కసుఁజాలకయొ కుడువంగఁ గట్ట లే
కాటికి పీనితోడఁ గలహం బొనరించెనొ రాత్రి యిప్పు డి
ప్పాటొనరించుచుం గునికిపాటును జెందెడు నిద్ర చాలకన్. 418
వ. అని కేరుచు. 419
క. కనుమూసెదేమి? లేరా!, యని వారలలోన నొక్కఁ డాతని ప్రక్కం
దనవ్రేలఁ బొడువ బిట్టుగఁ, దనువల్కఁగ లేచి వానిఁ దార్క్షి యలుకన్.
క. ఓరీ మూర్ఖ! దురాత్మక!, గౌరీశున కర్పితంబు గాఁ జేయు నెడన్
దోరంబగు దధిభాండం, బేరా పడద్రోచితంచు హెచ్చినకినుకన్.
క. చేతికొడవంటఁ గొంకక, భూతలమున వానిశిర మపుడ యేయఁగ నే
భీతి గొని తోడిపనివాం, డ్రాతఁ డంబరు గత్తినృపునకంతయుఁ దెలుపన్.
మ. విని కోపంబున నమ్మహాత్ము నిపుడే పిల్పించి యారా! మను
ష్యుని నిష్కారణ మేల? చంపితివి నీచుం డైన నీరీతి ని
వ్వసి గావించునె? నిన్నుఁ గొల్తునఁ బడం బాల్పెట్టినం గిన్క వో
వునె? యున్నట్లు నిజంబు పల్కు మనినన్ భూభర్తతో ని ట్లనున్.
క. పుడమిదొర! నిర్నిమిత్తం, బడఁచఁగ నే వెఱ్ఱినయ్య? యాకర్ముఁడు నా
యెడ నడిచిన నడువడి యే, ర్పడఁ దెల్పెద వినుమటంచుఁ బలికె నభయుఁడై.
క. జీవేశార్పితదధిఘట, మీవంచకుఁ డొరఁగఁద్రోయ నేఁ జంపితి నే
నీవిధము దెలియ కూరక, నావలనం దప్పు లెన్న న్యాయమె? యధిపా!
వ. అని యమ్మహాత్ముని నేరంబు దెల్పిన వారలదిక్కు మొగం బై నృప
వరుండు. 426
క. ఊరకఁ జంపె నితం డని, మీ రంటిరి చంద్రధరసమీపదధిఘటం
బారయక తొలఁగఁద్రోయఁగఁ, గారణ మేమనుచు వారి గద్దించుటయున్.
తే. ఈతఁ డనెడుమాట లెల్ల బూటకములు
కూలి సేయుచుండి కున్కఁ జెందె
నింతె కాని పూజ లేమియు మే మటఁ
గానలేదు దమరె యాన యనిన. 428

చ. విని నృపవర్యుఁ డౌ గడుసుపే టివ! ధాత్రియె దావులింగమో!
మును వెడి కోయునట్టి పరిమోపు లె పూజ యొనర్పఁ గోరి తె
చ్చినకుసుమాదివస్తువులో! చెంగటిదాహపునీలముంత క
మ్మనిదధిభాండమో! తెలుపుమా విన వేడుక యయ్యె నిత్తఱిన్.

ఉ. నావుడు నమ్మహాత్ముఁ డను నాహృదయాంతరవాసియౌ మహా
దేవుని మానసార్చనగతిన్ భజియించితిఁ గాని బాహ్యపూ
జావిధి గాదు పోళనము సల్పఁగఁ గూడ దటన్న నవ్వుచున్
భూవరుఁ డౌర! పొంకముగ బొంకితి విట్టుల నేర రెవ్వరున్. 430

తే. కోలభాతి భూమిఁ గొలిచి కొం డిదె నడు
మనెడుమాటవోలె నహహా! నీదు
పలుకుమార్గ మెంచఁ బౌఢుండ విమ్మాట
వలన నీకు నింద దలఁగఁబోదు. 431

చ. అనినన్ భూపతిదిక్కు గాంచి జనవర్యా! నీదుచిత్తంబులో
ననుమానం బఱిఁ జూడు నాహృదయమధ్యస్థాద్రిజాతేశ్వరా
ర్చన లంచున్ గొడవంట నాతనిసువక్షం బప్పుడే చీల్చి యొ
య్యన హస్తంబుల రెండుపాయలుగఁ జేయం దోఁచె నాలోపలన్.

శా. శ్రీరమ్యం బగురత్నపీఠముపయిం జెల్వొందు జ్యోతిర్మయా
కారం బౌ శివలింగ మాశివునికై కావించు పూజావళుల్
భూరిభ్రాజితభాజనాంతరమునన్ బొల్పారునైవేద్యముల్
సాగంబౌ దధిభాండ మాపెరుఁగు పెల్చం జిందుతీ రత్తఱిన్, 433

మ. కనుపట్టన్ సభవారలున్ వసుమతీకాంతుఁడు వీక్షించి హృ
ద్వనజాతంబుల భీతి సమ్మదము చిత్రంబున్ ప్రవాభక్తిభా
వన లొక్కుమ్మడిఁ దోఁపఁ గేల్గవ శిరోభాగంబులం దాల్చి ని
ల్చి 'నమో నీలగళాయ తే' యనుచు హాళి న్మ్రొక్కి రి ట్లందఱున్.

ఉ. మ్రొక్కి మహీతలేశుఁడు ప్రమోదముఁ జెందితి నిమ్మహాత్ము పెం
పెక్కినమానసం బెఱుఁగ కీతఁడు క్రేఁరిమాట లాడి తెం
కెక్కడి సత్య? మేటి బ్రదు? కెక్కడి సత్పథ? మేటి కీర్తి? నా
కక్కట! పాపభంజన! శివా! దురితాత్ముల నెట్లు బ్రోచెదో. 434

ఆ. కొఱఁక లనెడుకుంచెకోలచే వక్షశిక
తాఁటు లిపుడు తెలిచి వామవేప్ర
గర్భగేహమందుఁ గానంగఁ జేసితి
వౌర! యెంతఘనుఁడ వాత్మ వేఁ!. 436

చ. అని వినుతించుచున్న సమయంబున నద్భుత మొప్ప నంతలో
మునుపటిరీతి నక్షమటుమూసుకపోయె ధరావరుండు వేఁ
డినఁ గనచే మృతుం డయినయర్భకుఁ గ్రమ్మఱ నిపయుక్తుఁగా
నొనరిచి యాత్మదేవుఁడు మహాన్నతుఁడై చని మెన్ని జేర్చ్చలన్.

వ. అడిగియునుంగాక. [బూ

క. తొలియట్టులహృదయంబున,మలహరుఁబూజించిముక్తిమార్గముగనెఁ
సలనయనారటుగాఫ్సన, నిలమానసపూజసాటి యేదియునగునే. 439

చ. అనవుడు మానసార్చనమహత్త్వము మెక్కుడటించుఁ బల్మరుఁ
వినుతి యొనర్చి పక్కెదరు విశ్వమునన్ సత తేష్టలింగపూ
జన లొనరించువారికినసత్వము వర్ణన సేయ శక్యమే!
ఘనజఘవాద్రిభిన్మఖసుపర్వులకైన నటన్న నుగ్రులై. 440

ఉ. గర్భము చించి శూలిఁ బొడగానఁగఁ జేసి గతానుఁ డైనయా
యర్భకుఁ గ్రమ్మఱన్ బ్రదుకఁగ ట్లొనరించి బుధు ల్నుతింపఁగా
స్వర్భుజగాలయానుః సాయశోవిభవంబు నిల్పె నా
నిర్భవదుగ్రుండై యతఁ డి వేఱొకఁ డిట్టుల సేయ నేర్చునే? 441

క. నాపుడుఁ జోడయ నప్పుడుఁ, నో విడవరులార! గర్భగోళము వెలఁగా
నివిడాన్యకృతఘనభూ, యానస్త్రముచించివింటహారుఁ జూపింతున్.

తే. అనుచు మొలనున్న దర్వి చే నంబనంబుఁ
జిమ్మునంతనె కోటిరాజీవమిత్ర
తేజమునఁ దోఁచెఁ గత్సభాస్థలి సమస్త
జనులకన్నులు మిఱుమిట్లుగొనఁగ నపుడు. 443

శా. కైలాసంబును దానిమీఁదఁ గనకాగారంబు నం దొప్పు ర
త్నాలీఘోన్నతపీఠ మాపయి సముద్యజ్జ్యోతిరాకారుఁ డౌ
బాలాబ్జాహితమౌళి యాశివుపరిన్ భాసిల్లుశీతాద్రిరా
డ్బాలారత్నము తత్సభం బ్రమథతండం బాడి తేయావళుల్, 444

వ. మఱియును. 445

ఉ. మానసస్తోత్రవచోవిలాసములు రంభానాట్యసంరంభముల్
నానాగాయకగానముల్ పటహవీణావేణుభేరీముఖ
ధ్వానంబుల్ వరవందిమాగధుల కైవారంబులుం నేత్రహ
స్తానూనార్చ్యటులుం సమస్తజనహృన్యంబై దిశల్నిండఁగాన్. 446

శా. మింటం దోఁచినఁ దత్సభాజనులు పేర్మిం గాంచి వే లేచి కే
ల్జంటల్ ఫాలములందు నిల్పి నతపాలా! దేవచూడామణీ!
కంటిం గంగ తరింపఁజేయుగతి మాకుం గోర్కి లీఁగోరి యీ
వెంటం గన్పడి తీవు మానుకృత మురిన్వం జెప్పఁగా శక్యమే? 447

క. అని సన్నుతించుసమయంబునఁ జౌడాచార్యవిభుఁడుపూర్వపురీతిన్
ఘనమాయాంబరమాచ్ఛాదన మొనరించుటయు రజతధరణీధరమున్.

వ. అందున్న యశేషవిశేషంబులు నాకుణంబ. 446

చ. కొలువున నున్నవారల కగోచరమై చనఁ జౌడరాయప
జ్జలజయుగప్రదేశమునఁ జాఁగిలి వందన మాచరించి వా
రలు వినుతించి రి ట్లనుచు రాజకళాధరభక్తవర్య! నీ
వలన మదాత్మసంజనితవాంఛలు నేఁడు ఫలించె మించుగన్. 450

ఆ. హృదయములను దావకేష్టలింగార్చన
మహిమ లెఱుఁగలేక మందమతుల
మైన మమ్ము శివునియాకృతిఁ జూపించి
మసిచి తీవు కరుణ పెనఁగొనంగ. 451

వ. అని యతనిం గొనియాడి తద్భక్తు లందఱు తమతమనివాసంబులకరిగి
రమ్మహాత్ముండు తొంటిచందంబున యథేచ్ఛ విహరించుచుండెం
గావున నిష్టలింగపదార్థం బిట్టి దని యానతిచ్చి చెన్నబసవేశ్వరుని
యడుగుల కెరఁగి సిద్ధరామవర్యుండు దేవా! భవదీయకరుణాకటాక్ష
వీక్షణమ్మువలనఁ గృతార్థుండ నైతి నని పెక్కుభంగులం గొనియాడి
యద్దేశికసార్వభౌమానుజ్ఞాతుండై నిజపురంబున కరిగి నిరంతరేష్టలిం
గార్చనం బొనరించుచు నిర్వంచకంబుగా జంగమారాధనం బొనరిం
చుచు సుఖంబున విహరించుచుండె. 452

క. ఈసిద్ధరాముచరితము, భాసురముగ జనుల్విని నఁబఠియించిన ది

గ్వాసునిక్రుపఘోరాఘస,రాసంబోనరించిము క్తిరమఁగాంతురోగిన్.

వ. అని యి ట్లానతిచ్చి రేణుకునితో లోపాముద్రావరుండు తదనంతర వృత్తాంతం బె ట్లయ్యె నని యడిగిన. 454

మ. ఘనకీర్తిద్యుతిసిద్ధితాహిపమరుత్కాండాంబుభూభూజ భూ
జననేత్రోత్పలరాజ! రాజవరపూజాయుక్పదాంభోజ! భో
జనరాధీశసమానకావ్యరచనాసంతోషితాత్యంతపా
వనశాస్త్రజ్ఞసమాజ! మాజనకభాస్వత్తూణభక్తావనా!. 455

క. సత్యజితహరిశ్చంద్రా!, సత్యాలలనేశసదృశసాత్వికగుణ! నా
సత్యజయంతాకార!, సత్యాత్తేశ్వరనూజనమశౌర్యనిధీ!. 456

ఉత్సాహ. పుండరీకవైరిఖండభూషభక్తపోషణా!
కాండసంచయప్రపూరితాచ్ఛకీర్తిభూషణా!
మండలేశమంత్రివర్యమానితోరుభాషణా!
ఖండనస్థలాఖిలారిపంక్తిచిత్తభీషణా!. 457

గద్యము. ఇది శ్రీమచ్చెన్నమల్లికార్జునకరుణాకటాక్షలబ్ధకవితామాధురీధురీణ కౌశికగోత్రపవిత్ర సుకవిజనస్తుత్య పావయామాత్యప్రణీతంబైన చెన్నబసవపురాణం బనుమహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.



# చ తు ర్థా శ్వా స ము.



## కూకదమారయ్య కథ.



క. శ్రీలలవృష్యరాగ్రభ
వైఖిలసభార్క్షచంద్రహరిహరివాణీ
లోకజనసమాఖ్యా! వాగ్జిత
లేలిహానముఖ్యా! యమృతలింగసమాఖ్యా!. 1

వ. అవధరింపుము కుంభసంభవునకు రేణుకుండు తరువాతికథ యిట్లని చెప్పం దొడంగె. 2

క. ఒకనాఁడు చెన్నబసవం, డకలంకగణాలితోడ నాస్థానమునం
సుకరేష్టగోష్ఠి సలుపుచుఁ, బ్రకటితగతి నున్న యవసరంబున నెలమిన్.

మ. సుచరిత్రరత్నముఁ దాను చెన్నబసవేశుం జూడఁగాఁ గోరి కూ
కదమారాఖ్యగణాధినాథుఁ డరుదేఁ గొల్వున్న భక్తాలితో
నెదురై మ్రొక్కుచుఁ దోడితెచ్చి సభలో హేమాసనార్ఘ్యాదిదీ
వ్యదనూనార్చనకృత్యముల్ సలిపి నాగాంబాత్మజుం డత్తఱిన్. 4

శా. స్వామీ! యెచ్చటనుండి వచ్చితిరొకో సంపత్ప్రభం జెందె మ
ద్ధామం బిప్పుడు తావకాంఘ్రిజలజాతద్వంద్వసంస్పృష్టిచే
నామోదంబు వహించె నీనిఖిలభక్తానీకచిత్తంబు లా
హా! మాభాగ్యవిశేష మింత యని శక్యంబౌనె? వాక్రుచ్చఁగన్. 5

క. అని సన్నుతించుచెన్న, య్యనుఁ గన్గొని మాదిరాజు హర్షముతో ని
ట్లని యెవినుమీమహాత్ముని, యనఘచరిత్రంబు దెలుపుదంతయువరుసన్.

తే. ఆత్మశృంగారకలనచే నలకనలకఁ, జేసి శ్రీనాగులూరు ప్రసిద్ధిఁ గాంచె
నప్పురంబునకధిపతియైయితండు, పెంపుమీఱఁగభూమిపాలించుచుండి,

క. అష్టోత్తరశతభార్యా
హృష్టుండై తన్ను భక్తి లేమఁ గోరి సం
తుష్టిఁగ నొసఁగెడు నియమము
కష్టతరం బనక యతఁడు గైకొనియుండెన్. 8

వ. ఇట్లుండి. 9

చ. ఎడనెడ జంగమోత్కరము లెంతయు వేఁడిన నూటయెన్మిదిం
బడఁతుల నివ్వఁ జిక్కె నొకభామిని దానిని వేఁడ నిచ్చునో
పుడమి మగం డటంచు హితపుంజము రాజు గణింపనీక చె
ల్లెడ ధర భామిభక్తికిఁ జింతులు లే రని యెంచె సంతసన్. 10

క. నారదుఁడు గానశాస్త్రవి
శారదుఁడు సమస్తవిబుధజాలస్తుత్యు
స్నీరదుఁ డీశ్వరచింతా
పారదుఁ డొకనాఁడు శర్వభజనోత్సుకుఁ డై. 11

శా. కైలాసంబున కేఁగి పారిషద వాక్యాంతాచ్యుతాదిత్య ది
క్పాలాంభోజభవామృతాంధుఖగరాడ్గంధర్వ విద్యాధర
వ్యాళాధీశ్వర సిద్ధ సాధ్య నిగమవ్రాతంబులుం గొల్వఁగా
బ్రాలేయాచలకన్యకాసహితుఁడై భాసిల్లు సర్వేశ్వరున్. 12

ఉ. చూచి నమస్కరించి శ్రుతిసూక్తుల సన్నుతిసేయ వానితో
బూచులతేఁడు పల్కె మునిపుంగవ! లోకములోనిచర్య లె
ట్లే చనుచున్న వే! భువన మారసి వచ్చితి విప్పు డన్న నో
మేచకకంఠ! యొక్కగతి మేదిని గాంచితిఁ జిత్తగింపవే. 13

ఉ. రాజితనాగలూరినగరంబునఁ గూకవ మారయాఖ్య గో
త్రాజనపాలుఁ డాత్మవనితాతిలకంబుల నూటయేడ్వురం
వ్యాజము లేక భక్తనివహంబుల కిచ్చినఁ జిక్కె నొక్కయం
భోజదళాక్షి వేఁడుగణపుంజము రాకయె రాజుకూర్మినో. 14

క. అని యిట్లు దెలిపి కలహా
శనముని యొకకొంతవడికిఁ జంద్రార్ధకిరీ
టుని వీడుకొని నిజేచ్ఛం
జనియెం దదనంతరమున సర్వంసహపై. 15

సీ. కలకంఠములు నోరుకాయకఁగ పడిఁ గుయ్యఁ
బమ్మినయిలమీఁది తెమ్మ డియ్యఁ
బరిమళసుమఫలభరముచేఁ దరు లొప్పఁ
దేఁటుదాఁటులమ్రోఁత దెసలఁ గప్పఁ
గుసుమాయుధుఁడు పుష్పకోదండము ధరింప
వలిగాడ్పుపుప్పొడి వసుధ నింప
శారికాశుకహంససంచారములు మీఱఁ
బూఁదేనెసోనలు పొంగిజాఱ
తే. జాతి గడుఁ గుందఁ బాంథులు ప్రీతి నొంద
జీర్ణపర్ణాళి రాల లేఁజిగురు గ్రాల
మంచు తెఱవీడ శృంగారమహిమతోడ
జగతిఁ దగెఁ గాంతవాసంతసమయ మంత. 16

వ. అట్టి మధుమాసదివసంబులయం దొక్కనాఁడు. 17

క. ఆరాజు భక్తిఁ జూడఁగఁ, గోరి మహావృద్ధభక్తకుంజరతనుఁడై
శ్రీరమ్యంబగుతత్పురిఁ, జేరఁగ నేతెంచి రాజశేఖరుఁ డంతన్. 18

సీ. చని యప్పురముఁ జొచ్చి తనముది మేర్పడఁ
గోల చేఁబిగఁ బూని తూలికొనుచు
గోడనీడలఁ జేరి కూర్చుండఁ గోరుచు
నకట! మహాదేవ! యని పలుకుచు
బారెఁడు చనువెను బడలికచే వంగి
మోఁకాళ్లపైఁ గేలు మోపికొనుచుఁ
బిఱిదెస నెవ్వరైనఁ బిలిచిరో యని నిల్చి
బయ లాలకించి విభ్రాంతి గొనుచుఁ
తే. జుట్టుకొని నవ్వుచిఱుతలఁ దిట్టుకొనుచు
నెండ కడ్డముగాఁ దాళవృంత మిడుచుఁ
బనికిమాలినజీవితమునకు విసిగి
నృపునిసభఁ జేర నరిగి తన్నికటమునను. 19

చ. దలముగ వేఁడియూర్పు లెగఁదట్టఁగఁ జెమ్మట లూర భూమిపై
నలసతఁ గూరుచున్న శరణాగ్రణిఁ గన్గొని రాజమౌళి చె

గ్గిలి భయ మంది లేచి చని కేవలభక్తి నమస్కరించి యీ
యలఘుఁడు చాల డస్సె గద హా!యని నెమ్మనినార్తి నొందుచున్.

సీ. ఆతపహరణార్థమప్పుడప్పటువితానము లేయఁబంచి వెంట నెసుమూంబు
వులు పైనఁ జిలికి కప్పురముపీనుఁగనూఁడి మేలిచందన మెరమేగి తాళ
వృంతంబు చేఁ బూని విసరి జంపిరనాగరమిశ్రతక్రంబు హారసమర్ప
ణము చేసి యింతింత నాలుక ద్రవ మూరఁ బట్టినకొంత సేపటికి సేద

తే. దేఱి చరమూర్తి కన్నులు దెఱచి వినయ
భరితుఁ డగు రాజుఁ గనుఁగొని భళిర! పార్థి
వేంద్ర! నీభక్తి వన్ని యకెక్క మమ్ముఁ
బోలుబడుగులఁ బ్రోవంగఁ బుట్టితౌర!. 21

తే. బాపురే! యూర! విమలసత్కీర్తిపూర!
నిన్నుఁ బోలంగఁ గలరె? యేనృపతులైన
సకలజగములు నిండెఁ బావకసమాఖ్య
యనినఁ గ్రమ్మఱ మ్రొక్కి యయ్యవనివిభుఁడు. 22

చ. చపలుఁడ దుష్టవర్తనుఁడ శౌర్యగతాత్ముఁడ దుర్మదాంధుఁడన్
గుపతుఁడ లోభదూషితుఁడఁ గ్రూరుఁడ దంభుఁడ భక్తిహీనుఁడన్
వ్యపగతసత్యవాక్యుఁడ దయారహితాత్ముఁడ నైననన్ను నీ
విపు డిటు సన్నుతింప నగునే? శరణాగ్రణి! యన్న నవ్వుచున్. 23

ఉ. కూకదమూర! యాత్మనుతి కూడదు భక్తుల కన్ననీతిచే
నీకరణి న్వచించి తిపు డింతియె కాని భవత్సమానుఁ డే
లోకమునందు నెంచినఁ గలుంగఁగ నేర్చునె? దీనలోకర
క్షాకర! నిన్నుఁ గాంచితి హృదబ్జము సంతస మందె నెంతయున్.

ఉ. మారవిరోధిభక్తులకు మాటున దాఁచక యగ్నిసాక్షిగాఁ
గోరి వరించుభామినులఁ గొంకక కొమ్మని యిచ్చువార లీ
ధారుణి లేరు నీ వొకఁడు దప్ప నహో! యిటు లుండఁ జెల్లదే!
సారవివేకధైర్యగుణసాహసముల్ శివభక్తకోటికిన్. 25

ఉ. ఇంతుల నిచ్చుమారుఁ డని యే మును చాలఁగ విన్నవాఁడనై
సంతస మంది వృద్ధవశె సంభవ మైనది గాన సిట్టిచోఁ
జెంతల సేవ సేయుటకుఁ జేడియ యొక్కతె యొప్పు నంచు నే

నెంతయుఁ గోరి వచ్చితిట నింతులు లేరని వింటి నీ కడన్. 26

క. వినియును భక్తిసనాథ్యుఁడ
వని నినుఁ గనువాంఛ నిచటి కరుదెంచితి నా
కనుఁగమ్ము లలరె నే నిఁకఁ
గనివినిమెద నన్ను జడిసి పార్థివుఁ డనియెన్. 27

తే. అనఘ! జంగమవర్య! మదాలయమున
కరుగుదెంచి తెవార్చన మాచరింప
కెటులఁ బోవచ్చు నీవేళ నిందు నిలువుఁ
డన్ని పనులు విచారింత మవల ననిన. 28

క. భార్యాసహితుఁడు సేయుస,పర్యాశివహంబు గొనఁగవలదని ధరలో
నార్యులుపలుకఁగవినియును,మర్యాదయెపూజగొనఁగమాకిటనీచేన్.

వ. అనిన భూవరుం డిట్లనియె. 30

క. స్వామీ! యున్నది యింకొక
కామిని మీదాసి కరుణఁ గాంచి సపర్యా
స్తోమము గైకొని మామక
ధామము పూతంబు సేయ ధన్యుఁడ నగుదున్. 31

క. నాపుడు మును భక్తాలికి, నీవెలఁదుల నిచ్చియుండె నెలఁతుక గలదం
చీవనిన నెట్లు నమ్ముదు, భూవర!మిథ్యోక్తులాడఁబోసఁగునెయనినన్.

ఉ. శరణవరేణ్య! నాపలుకు సత్యముగా నొకయింతిమాత్రమే
యెరు లడుగంగ రాకునికి నున్నది కామిని లేనియట్టియా
పురుషుఁడు చేయునట్టి చరపూజ యనర్హమటంచుఁ జిత్తమం
దరయక రమ్ము మామకగృహాంతరసీమకు వేగ నాపుడున్. 33

ఉ. పక్కన నవ్వి యాకిపటభక్తవరుండును నీదుభక్తి పెం
పెక్క జగంబు మెచ్చఁ జరియించితి వింతియె కాని లోపలం
జిక్కినయాసపెంపు విడిచేయఁగఁజాలవు లోభవృత్తి నీ
కెక్కడ సంభవించె బరమేశ్వరుఁ డీగతి కిచ్చు మెచ్చునే?. 34

ఆ. అసిమిలోనిదొకటి యమ్మెడుదొక్కటి,యనినచందమయ్యె నవనినాథ!
భార్యదాఁచి యింకఁ బడఁతులు లేరని,చాటఁబనిచితౌర జగతియందు.

క. గుటియిడి పరువెత్తుదు నని, దటిఁజేరఁగ ప్రేలెఁడంత తక్కువ యైనం

గోఱుఁతయ కాదె యించుక, తఱిఁగిన నియమంబు మోక్షదంబగునె? నృపా!

క. భూమిని మును న్నాటలుపది, నోములు నొకరంకువలన న్యూనంబగు నో
సోమాన్వయదీపక! నీ, భ్రాంతిక మిఁకఁ దెలిసె వేయుఁ బలుకఁగ నేలా?

వ. అనిన మానవేంద్రుం డయ్యా! తొయ్యలిం డాఁచియుంచితినని పెక్కు భంగు లానతిచ్చితి రీవాక్యంబు లస్మద్బుద్ధిసంపాదనహేతుకంబులు గాని నన్ను నిరాకరించుట గాదు భవత్సన్నిధానంబున నాగుణదోషంబు లున్నట్లు విన్నవించెద మన్న నచే నవధరింపవలయు నాకుఁ గల లలనాజనంబు లందఱు మహేశ్వరాధీను లైనకతంబున నియ్యంతి యుండు టెఱుంగక లోకంబునజనంబులు రాజునకిఁక భార్యలు లేరను కొని రింతియె కాని గణాధీశ్వరు లరుదెంచి చంచలాక్షి నర్థించుటయు నేను నాయెడ లేదని యసిచిప్పుచ్చుటయు లేదిప్పుడు మీ రేగుదెంచి కాంక్షించితిరి గావున సమర్పించెద దానిం గైకొని నన్నుఁ గృతార్థునిం జేయు మనిన నమ్మహానాజంగముం డిట్లనియె. 38

సీ. అను వైనసతు లెల్ల నయ్యలపాలుగాఁ
గోఱమాలి చిక్కినకుటిలమతియొ
మాటనూ టెఱుఁగదో నోటిగయ్యాళియో
యాచారహీనయో యేఁ సురాలొ
పనిపంజయో యింటిబాసినబిడ్డయో
వెఱ్ఱిచెఱ్ఱిమనులదో చిట్టగొట్టొ
తెవులు గొట్టియొ వైసుదీఱినమేసిదో
మోజమాలినదియో బీజుగొట్టొ

తే. యెవ్వరికి నక్కఱకురాని యిగురుఁబోఁడి
బోర మల్లన్న పాలన్న పోల్కి మాకొ
సంగఁ దలఁచితివొ౯ చాలుఁ జాలు నీవ్ర
సంగ మటు లుండనిమ్ము రసాతలేశ! 39

ఉ. నావుడు స్వామి! యీయవగుణంబులలో నొకటైన లేదు త
జ్జీవనదాభవేణియెడ శ్రీకర సర్వగుణాభిరామ దీ
నావనశీల జంగమపదాంబుజభక్తివినిశ్చలాత్మ దే
వావలి కైన దానిఁ గొనియాడఁదరంబె? యటండ్రు లోకముల్.40

క. జంగముఁ డిట్లను వర్తకుఁ, డంగడి నమ్మంగఁ జిక్కినది యిద్దేహో
రంగైగనఁ స్తు నన్న, ట్లంగన బల్మంచివనుట కక్కజ మయ్యెన్. 41

క. నెలఁతుక యిలఁ గల చెలువల, తలసొమ్మని మమ్ముఁ బలుఁ దగిలింపను పో
పలుకులుఁ గలవలివేళల, కలమెక్క డభక్తి యెచటఁ? గువలయనాథా.

క. అనిన రా జిట్లని యె. 43

ఉ. ఏల నిరాకరించెదొ? నహీనగుణాకర యైనబాలికా
మౌళిని వేఁడునట్టిచరమాన్యున కాత్మశరీరకృత్తికిక్
వాలున నొల్చి తీసి చెలువంబుగఁ జెప్పులు మల్చి యిత్తునో
కాలగళస్వరూప! సముఖంబున నేఁటి రాయబారముల్. 44

చ. అటు గొనిపోయి యొక్కమణిహర్మ్యతలంబున హీరరత్నసం
ఘటితసువర్ణపీఠమునఁ గాయజసంహరుమూర్తి నుంచి హృ
త్పుటగతసమ్మదంబు వెలిఁ బొంగఁగ నాత్మసతీలలామ న
చ్చటికి గొనకచేడ చేతను వెసం బిలిపించెను దత్క్షణంబునన్. 45

ఉ. అందెలు మ్రోయ లేఁతనగ వచ్చుపువెన్నెల గాయ మోముడాల్
చందురు నింపసేయ బిగిచన్నవ యద్రులతోడ రాయ మై
కుందనమింపు రోయ జడకూఁకటి చీఁకటిఁ జాయ మూయ నా
చందనగంధి వచ్చె విభుచక్కికి నిబ్బరి యామతింపఁగాన్. 45

క. చనుదెంచి విభునిభావము, కనుఁగన్నఁ దెలిసి శరణకంఠీరవస
ద్వనజాతము లకు వందన, మొనరిచి యహస్తులమర నుగ్గలిపలికెన్.

ఉ. ఓమహితప్రభావగుణ! యోకరుణాఘలరాశి! యోగురు
స్వామి! యజాదిదేవతలు సన్నుతి సేయఁగలేనియట్టి మీ
కోమలపాదపద్మము లకుంఠితభక్తి నుతింపఁగాఁ దరం
బె? మముఁబోలువారి కని శీతమృగాయతనేత్ర క్రమ్మఱన్. 48

తే. మీకు వెలుఁగుబొక్కి చెలువునఁ గలరుచి
మూఁగ శబ్దవిసరములు గ్రహింప
లేనిపగిదిఁ దాసకనపదాంభోజ
భక్తి దెలియ నాకు శక్తి గలదె? 49

చ. నినుఁ బొడగంటి హృత్ప్రియమవనీరధిఁ దేలఁగఁ గంటిఁ గ్రమ్మఱన్
జననము నీడఁ గంటి నరసంబుగ ముక్తికిఁ ద్రోవఁ గంటిఁ బా

వనశరజంగమావలికృపాపరిపూర్ణతఁ గంటిఁ దొల్లి చే
సినసుకృతంబు లీయెడలఁ జేకురఁ గంటిని మంటి నెంతయున్. 50

వ. అనిన జంగమవర్యుం డి ట్లనియె. 51

ఉ. పో యెడివాని నన్ను నట పోవఁగనీక భవద్వరుండు తాఁ
దీయనిమాట లొప్ప ననుఁ దెచ్చె మదంబుజపాణి వేడినం
గాయజవైరిభక్తునకుఁ గాయము చర్మము నొల్చి సంబవుల్
సేయఁగఁ జాలుదయ్య యిఁకఁ జెచ్చెర రమ్మనియంచుఁ జెప్పుచున్.

చ. జనవరుఁ డాత్మమోహవివశత్వమునందున భార్య నింతగా
ఘనతరఁ జేసి గాక మును గంటిమె? వింటిమె? యిట్టిధైర్యవ
ర్తనల నటంచు నెంచియును దక్ష్యము గాంచుఁ దలంచి వచ్చితిన్
వనరుహపాణి! నీవినయవైఖరిఁ జూడఁగఁ జాలు దంతకున్. 53

వ. అనిన నవ్వధూవతంసం బి ట్లనియె. 54

సీ. వాదించి గురువింట వైచునారిదె కాక కలుగునే? యమ్ముస కలఘుశక్తి
నాటిగానాడించుసూత్రధారిదె కాక జంత్రంబునకు నాట్యశక్తిగలదె?
త్రిప్పుకులాలునిదె కాక దారుచక్రమునకుఁ గలుగునే? భ్రమణశక్తి
గిరిదరిఁ బల్కఁ బల్కించువారిదె కాక గుహాలకుఁ గల్గునే? కూయుశక్తి

తే. యటులఁ దాపకకరుణ నాయందు నిలిచి
త్రిప్పినట్టివిధంబునఁ దిరుగుదానఁ
గాన సద్భక్తి నడుచుమార్గం బెఱుంగఁ
బరమశరణాగ్రగణ్య! యోగురువరేణ్య!. 55

వ. అని మఱియును. 56

చ. కటకట! యిట్టివేసవిని గాల్నడఁ గంటకశర్కరావృతో
త్కటపథదూరభూమిఁ దిరుగం బని యంతటి దేమి వచ్చె? ని
క్కటముగఁ గానుపించె నరకాళి ను బొక్కలు బాదరక్ష లే
మిటికిఁ దొడంగరైతి? రని మీనవిలోచన పల్కెఁ బల్కనన్. 57

చ. అలికులనీలవేణి! భవి నంటనినేమము మాకు భూమిలో
పలిపశుజాల మెల్ల భవివర్గము కానఁ దదీయకృత్తిచే
మలచినయట్టిసంబవులు మెట్టుదు మేసరణిన్? శ్రమంబు మొ
క్కలముగ నెంత దోఁచినను గాయసుఖంబున కర్థమున్నదే!. 58

ఉ. చిక్కినవారికే పగలఁ జెందుదు నింతియె కాని మున్ను మా
కెక్కడ నెవ్వరు న్వగవ రెన్నఁడు నీ విపు డార్తి నొంది మా
పొక్కులు గాంచి పొక్కెదవు భూతదయాకర వేమి చెప్ప నో
చక్కెరబొమ్మ! నీపలుకుచందము డెందముకుందుఁ బాపెడున్. 59

తే. పలికితివి చాల చల్లనిభాషణములు
వింటి మిప్పుడ చెవులకు విందు లయ్యెఁ
బలికినట్లన యుండునో భావశుద్ధి
కలన వేఱయి యుండునో తెలియదయ్యె. 60

వ. అనిన నయ్యతివ యిట్లనియె. 61

సీ. నిర్వంచకస్థితి శర్వభక్తాళికిఁ దనుమనోధనములు దాఁచఁబోక
యొసఁగుచు సద్భక్తి సుండెడువారికి శీతలకరమౌళి చిక్కుఁగాక
తక్కులు విద్దెలుదంభంబుపామరత్వముకామకపటవర్తనము లాదవు
వారిచేఁ జిక్కకవాఙ్మనఃకాయకర్మములు వేలుగఁజేసి యమృతపదముఁ

తే. బాయఁజాలుదు నయ్య! యిప్పట్టునందుఁ
దెలిసి యుండియు నాడంగవలసి యిట్టు
లాడితిరి నామది పరీక్షఁ జూడవలయు
ననని తలంచినఁ జూడుఁ డోయకలుపాత్మ!. 62

చ. అనవుడతండు పల్కు 'వనితా! ఘనకూపముఁ గాంచి యెంత లోఁ?
తన దగుదానిలో నడిగి యందలిమ న్నొకముద్దఁ దైనఁ దేఁ
జనఁ' డనుమాడ్కి భాక్తికవచస్సముదాయముఁ జూపవచ్చుఁ గా
ని నడుప శక్యమే? యనిన నీరజలోచన ధీరచిత్త యై. 63

క. తనపతిఁ గని యీఘనుపద్వనజాతములకు మదీయతనుచర్మము గొ
బ్బున నొల్చిమల్చి సంబవులొనరిచి యిమ్మనిన నమ్మదోన్న తమతియై.

క. సాహసము మీఱ నతిపై, మోహంబించుకయు లేక ముఖమునధైర్యో
త్సాహములుదోఁపఖడ్గము, బాహువునమర్పుశరణవల్లభుఁ డనియెన్.

ఉ. మందున కాకు వెమ్మనిన మ్రాసిమొదల్ దెగఁజూచి నట్లు గో
రం దగఁ జీరుదాసిని గరంబున గొడ్డలి గొన్న యట్లు నీ
వందితి కత్తి సంబవులకై సతిఁ జంపఁ దలంచినాఁడవో!
యెందున దుర్మదాంధులు మహీపతు లన్న విధంబు గన్పడెన్. 66

తే. ఇంతద్రోహులఁ జైతిమే యింతిఁ బంపఁ
బంపఁ బెండ్లికుమారుఁడు వచ్చిపోవ
గౌరికళ్యాణములు పాడుకరణి యయ్యె
మేము సుఖ మంద దలఁచుట మేదినీశ!. 67

చ. జనవర! మాకు సంబవు లొసంగెడువాఁడు వేఁడి నీసతిన్
ఘనముగ వద్ది గానియిక కొమ్మసఁ జేరఁగ నీక మమ్ములం
గనుఁగొననీక చాటునకుఁ గైకొనిపోయి తదంగకృత్తి మె
ల్లన వదలించి మల్చి యకలంకమతిం గొని తెమ్ము వ్రాసెదన్. 68

మ. అనినన్ భూపతి మ్రొక్కి దేవ! ఘనయత్నోత్కృష్ట మెట్లైన నే
నొనరం జేయుదు యామమాత్ర మిట మీ రుండుండు పూసెజ్జపై
నని యట్లాతని నుంచి కాంతయును దా నభ్యంతరావాస మొ
య్యనఁ జేరం జని హస్తకల్పితకృపాణాగ్రంబున న్నైర్వనన్. 69

క. అక్కాంతమేఁపుచర్మము, గ్రక్కున నాజంగమయ్య కాళ్లాదికి రా
నొక్కింత దిగిచి సంబవు,లక్కజముగ నార్చిపైఁడిహారి వారణమున్.

క. జతనముగ నుంచి భస్మన, హితతాంబూలంబుగొనుచు నెంతయుభక్తిం
గుతలపతిమాళినిడియది, యతిరయమున దెచ్చియుంచె నాతని యెదుటన్.

మ. ఉనిచినఁ గాంచి యోనృపకులోత్తమ! మా కనుమానమయ్యె నీ
వనిజనుఁ డైన నింతవడిఁ బన్నఁగ నేర్చునె? మున్ను నీగృహం
బున నివి యున్నవేమొ మసిబూసి యివి నేఁడుకాయ లన్న భూ
జనములు మెత్తురే? కొనుము సంబవు లే లిఁకఁ బోయివచ్చెదన్. 72

ఉ. నావుడు భీతి నొంది నరనాథుఁడు పల్కు మహాత్మ! నేఁడు నీ
సేవకురాలిచర్మమునఁ జేసితి నింతియె కాని మున్ను మా
తావున మీ కొసంగుటకుఁ దాఁచినవాఁడను గాను సర్వభూ
తావలి సాక్షి నమ్ము విడనాడకు నన్నన నాతఁ డుగ్రుఁడై. 73

చ. పుడమిమగండ నీనుడువు పొందయిన న్నిజకాంతచర్మ మే
కడఁ దెగఁగోసినావొ యది గన్గొనెదం దరుణీలలామ యు
న్నెడ కిటు దమ్ము పోద మని యెంతయు సత్వరవృత్తిఁ బల్కినం
దడయక యయ్యెఁ దోడికొని తోఁ జని మూర్ఛ మునుంగు కామినిన్.

సీ. అతనికిఁజూపె యోయంగన! చరమూర్తియరుదెంచినాఁడు లెమ్మనినయంత
గనువిచ్చి తెప్పిఱి కరములు మోఁకాళ్ళపై నూనితనుభరమూని వెన్ను
వెనుకకు విఱిచి యా ఘనునిగటాక్షవీక్షణమునమునుపటికరణిఁజర్మ
మలరిసొంపెక్కు దేహముగల్గి లేచియాత్మాంఘ్రులకెఱఁగినయతివఁగాంచి
తే. పార్థివునితోడననియె నీపద్మగంధి, మేనుగోసినజాడ యేమియునుగాన
రాకయున్నది నీమాటమాకుఁ దెలిసె, నెన్నివిధములనీనైజమేలమాను?
క. కోకిలతో సరి యగునే? కాకము? వజ్రంబుసాటి గనునే పటికం
బాకరణి భక్తవర్యా, నీకముతో నీవు పోలఁ నేర్తువె? యధిపా!.
చ. పొలఁతులమిన్న సర్వగుణపూర్ణ యటం చనురక్తి నొంది నీ
జలజదళాక్షి నయ్యల కొసంగక డాఁచినవాఁడ విప్ప డె
ట్టులఁ వవనూనచర్మము కటుక్కునఁ గోసెద వింతమాత్రముం
దెలియనివాఁడఁగాఁ దలఁచితే ననుఁ జాలు మహీశ! నావుడున్. 77
ఉ. నాతిని డాఁచినాఁడ వని నాయెడ నేరము పూన్పఁబోకుఁడీ
యాతఱి నీవు చూడ రచియించెదఁ జర్మముఁ గోసి సంబవుల్
భూతపతిస్వరూప యని బోటిని డగ్గఱి కృత్తి యొల్వఁగాఁ
జేత నిశాతహేతి నతిశీఘ్రముగాఁ గొనినంతలోపలన్. 78
వ. ఆజంగమరూపంబు విడనాడి మహాదేవుండు. 79
సీ. ఒకకేల మొనవాలు సికపట్టి వినుజాలు
మొలతోలు నెమ్మేనఁ దెలుపుడాలు
చేతఁ గంకటితుండు చెంప జాబిలిచెండు
గెడల జేజేపిండు జడలదిండు
గుదిగొన్న మెడఁ గప్పు నుదుట ప్రేలెడునిప్పు
కసికరంబునునొప్పు కనులమెప్పు
చెలువైనసామేన నలరెడుగనుచాన
పలుకు తేనియసోన నలువులీన
తే. వెండికొండఁ బోలువెలగిత్తపై నెక్కి, బాసవాలుగములు బలసికొలువ
నాకసంబుపుడమి నలమినవెలుఁగునఁ, గాన నయ్యె వేసికంటివేల్పు.
తే. ఇట్లుప్రత్యక్షమైనసర్వేశ్వరునకు, బుడమిసాష్టాంగమెరగి యాభూమిభర్త
ఫాలతలమునఁ గెంగేలుగీలుకొల్పి, యధికసద్భక్తియుక్తినిట్లనినుతించె.

షట్పదగర్భసీసము.—

శ్రీపార్వతీలోల! శ్రీజనపాల పాపాబ్ధివాతూల! భక్తానుకూల!
పన్నగాధిపహార! పాండుశరీర! సన్నుతసురవార! జననవిదూర!
నందీశకంఖాణ! నాట్యధురీణ! వందారుసంత్రాణ! వసనిధితూణ!
భక్తాద్రికోదండ! పాలితాజాండ! నిర్మలగుణకాండ! నిర్భావపండ!
తే. యక్షనాయక! మిత్రహవ్యాసినేత్ర!, శిక్షితాసురగోత్ర! చిన్మోక్షసత్ర!
మేశసంభవభంగ! పృథ్వీశతాంగ!, పాశమోచనచెంగ! పద్మేశసంగ!

వ. అని యిట్లు సన్నుతించు భూవల్లభుం గనుగొని దయారసభరితాంతరంగుం డై యాలతాకుంతాంతకుం డిట్లనియె. 83

ఉ. రాజకులావతంస! యప్రరా! వృషచిత్తుఁడ వీవె యెన్నఁగా
నీజగమందు నీకు సరి యెవ్వరు? నీరమణీలలామ యా
నీజలజాక్షిధైర్యగతి యేమని చెప్పఁగ వచ్చు? మాహృదం
భోజము విప్పునం దనరె భూనుత! తావకభక్తి కెంతయుఁ౯. 84

తే. ఐన నొకమాట దెలిపెద నవనినాథ!
కామభోగానుభవములఁ గాంత నీవు
పేర్మిఁ గొన్నాళ్లువర్తించి పిదప నాగ
మాంబికాసుతుఁ డుండుకళ్యాణమునకు. 85

మ. చని యా శైవధురీణుఁ గాంచి సకలాశాసంతతాయాతభ
క్తనికాయాభవతత్త్వగోష్ఠి మది నుత్సాహంబుతో నెప్పుడు
న్వినుచుం దద్విమలప్రసాద మచట న్వేమారు సంతృప్తిగాఁ
గొనుచుం గొండొకకాల ముండి తుది న స్థూడంగ రమ్మా వెస౯. 86

శా. ఆరీతి న్గిరిజాధినాథుఁడు దపశ్శ్యాకారుఁ డైనంతట౯
నారీరత్నముతోడ నద్భుతమనోనాళీకుఁడై స్వామినా
కారుండై పొడచూపి మోక్ష మెడఁ గాఁగం గొంతకాలంబు సం
సారభ్రాంతి దగిల్చెఁగా యని జుగుప్సం జెందె రాజత్తతిన్. 87

చ. నిజగురుమూర్తి కేవలవినీలగళాపరమూర్తి చక్రిపం
కజభవముఖ్యనిర్జరనికాయనుతామల కీర్తిసేవక
వ్రజహృదయానువర్తి ఘనభక్తసముచ్చయచక్రవర్తి శి
ష్యజనమనుప్రజానవిలసద్గుణపూర్తి విలాస మొప్పఁగ౯. 88

మ. చనుదేరం బొడగాంచి భక్తి నెదురై సర్వాంగసహానాథుఁ డం
గనయుం దాను నమస్కరించి కడువేడ్కం బ్రేమఁ దోడ్తెచ్చి యొ
య్యన రత్నోన్నతపీఠిపై నునిచి యర్ఘ్యాదిప్రపూజావిధుల్
వనరం జేయుచు స్వాగతం బరసి చిత్తం బూనఁగా నిట్లనున్. 89

ఉ. దేవ! మహానుభావ! భవదీయమహామహిమం బకెట్టిదో
భావజవైరిన్పృద్ధతరభక్తవరాకృతి దాల్చి వచ్చి మ
ద్భావపరీక్ష చేసి పరివారముతోఁ దనరూపు చూపి స్వా
ఖ్యాకమహాయశోవసనంబు ద్విపదంతకఖడ్గము నిచ్చి మెచ్చుగాన్. 90

తే. ఇచ్చి నిజపథసంప్రాప్తి నెసఁగు పెట్టి
చనియె గురుసాక్షిగా మము! యీచంద్రవదన
ధైర్యవిస్ఫూర్తిపలన నహార్యచాప
దర్శనం బబ్బ్యె నేఁడు నాతపము పండె. [రుద్రా?

క.అనవుడు గురుఁడనునది యొక, ఘనమా? భక్తులకు శివుఁడుగనుపడుట
మునుకమ్మరగుండయ్యకు, సేనరూపము చూపివయసు నయసేయఁడా కో?

క మానినిధైర్యము పెద్దగఁ, బూని నచించెదపుతొంటిపాలఁతులలోని
చానసరియగునెభక్తిని, ధానంబున కనిన జడిసిభరణిపుఁడనియెన్.23

క. ఎఱుఁగక యిటుగానిమాడితిఁ, దెఱపనునాతప్పుసైఁచి దేహమ్మును బెం
పఱముగఁ దరుణులుభక్తిం, జఱపినవిధమానతిమ్ము సంశయ మెడలన్.

వ. అనినఁ దద్దేశికశ్రేష్ఠుం డి ట్లనియె. 95

ఉ. శంబరవైరివైరిపదసారసభక్తగణార్చనక్రమా
లంబనితాంతకల్మషకలాపమహాన్నతభూతధాత్రిభృ
చ్చుంబ సమస్తలోకనుతసత్యవచోనికురంబ వీరసం
గాంబ యనంగ నొక్కసతి యంచితవృత్తిఁ దనర్చు నెంతయున్.96

ఉ. ఆతరుణీలలామ పతి యంబరకేశునిఁ జెందుపిమ్మటన్
బాతకదూరసద్గురుకృపాకలనంబున భక్తిచిత్తయై
ఖ్యాతి జనింపఁగా కదురు కాయక మూని తదీయలబ్ధిచేఁ
బ్రీతిగ నేపురయ్యలకుఁ బెట్టు నిరంతర మింపుగాన్నముల్. 97

వీరసంగాంబ కథ.

చ. ఇది వ్రత మూని సల్పుతరలేమణభావవివేచనార్థమై

మదనవిరోధి యామగుడమందిరసీమను జంగమాకృతిన్
గదిసినఁ గాంచి మ్రొక్కి కుతుకంబునఁ బూజ యొనర్చి షడ్రసా
న్వదమగుభోజనం బిడిన సంతస మొప్ప భుజించి యంతటన్. 98
చ. వడఁతిరొ! నిత్య మైదుగురుభక్తుల కన్న మొసంగి కాని పే
కుడువవు నీగృహంబునను గుమ్ములు గాదెలు లేవు నీకడం
గొడుకులు లేరు తెచ్చికొనఁ గూలి యొనర్చిన నీదుపొట్ట కే
గడుచుట దుర్లభంబు పసకాయక మెట్టిదొ మాకుఁ దెల్పుమా. 99
వ. అనిన నాసతి యి ట్లనియె. 100
క. కలిమికిఁగారణంబు బలుగాదెలుగుమ్ములు గావు నీదుస
జ్జలరుహాభక్తి గాని యిది చాలదె గల్గినఁగల్మి లేనిచోఁ
బలితపు లేనిచూడ క్షణభంగురమై చనుమేటిభాగ్యముం
దలఁతురె దొడ్డుగా జగతిఁ బావకభక్తులు మానసంబునన్. 101
వ. అని మఱియును. 102
చ. అనుపమమైన మద్గురునియానతి భక్తిగణార్చనార్థమై
ఘనతరభక్తి నీఁదురు కాయక మొక్కటి వ్రాసి దెసిచే
ననుదిన మస్మదీయనియమాచరణం బొనఁగూరుఁ జేతు నో
యనఘతరాత్మ! యంచు వినయంబునఁ బల్కిన నాతఁడిట్లనున్.103
క. కాయకము దలఁపఁ గొంచెము, పాయకనీ సేయుచున్న భక్త్యార్చలకా
దాయముచాలదుదినగతి; యేయనవున జరుగునసిననింతియతనితోన్.
చ. ఉరుతరపుణ్య! మీ రెఱిఁగియుండియుఁ బల్కుటచోద్యమయ్యెము
న్నరణులు కొద్దికాయకమున న్బహుజంగమపూజ సల్పరే?
ధరణి నటన్న నప్పగిదిఁ దప్పక చేసినవార లెవ్వరో
తరుణి వచింపుమా యనినఁ దచ్చరణాగ్రణి కాంత యిట్లనున్.105

## చక్కిమాచయ్య కథ.

శా. ము న్నొక్కండు పయోజగర్భబలభిన్ముఖ్యామరానీకను
తైన్నత్యాశ్రయపావచంద్రధరగేహాస్వాంతపద్మోడు వి
చ్ఛిన్నాఘుండు సమస్తలోకజనతాసేవ్యుండు నాచక్కిమా
దన్నాఖ్యుండు గలండు జంగమపదార్చాసక్తుఁ డుద్ధారుఁడిన్. 106
ఉ. ఆతఁడు భక్తి నిత్యము గణాలయసీమలి కేగి తన్నతి

జాతము నంప ఓళ్లకడ జాతినబియ్యము చేరెఁ జేరి సం
ప్రీతి వలిప్పఁ దెచ్చి తనప్రేయసి కిచ్చిన నాపె వానిపై
భూతి విదల్చి మ్రొక్కబలుపుట్టికలో నిడి యాక్షణంబునన్. 107

క. గురుకృపచే నక్షయమై, పరగినబియ్యంబు వండి భవభక్తసము
త్కరమునకు నన్న మొసఁగుచు,వరతరకల్యాణపురిని భాసిలునంతన్.

చ. బసవఁడు తత్క్రమం బెఱిఁగి భక్తుల నంపఁడె బీవ్ల బంచి మీ
బసలకు వచ్చి మ్రొక్కశివభక్తుఁ డులూఖల మున్న భూస్థలి
న్ముసలవికీర్ణ ధాన్యకణము ల్గానిపోవు నతండు రాకము
న్నె సకలమందిరస్థలులు నింపుఁడు దంపెడుచోట బియ్యముల్.109

ఉ. ఆపెనుపేదభక్తునకు నంపఁడు ముంగలభంగి నీగతిం
బ్రాపానరింప మే లనుచుఁ బల్కిన వారలు సమ్మతించి త
ద్రూపిత మట్ల సేయ భవదూరుఁడు మారఁడు తొంటిశీతనా
రేపకడం బిరానఁ జని శ్రీకళుకొత్తుఁ దదంగణంబులన్. 110

క. మెండుగ నుండిన సన్నపుఁ, దండులములు గాంచి బసవదండాధీశా
ఖండకృపామతి నేఁడిటు, పండువుగా దొరికె ననుచు భావంబలరన్.

ఆ.అచటనున్న జాఁచియాతండులంబులు,మోయుకొలఁది పెద్దమూటగట్టి
మోచి తెచ్చియింటిముంగిటనిలిచిని,జాంబుజాక్షిఁబిలువనతిరయమున.

చ. ఎదురుగ వచ్చి బోటి హృదయేశ్వరుమూఁపున మూట గాంచి లో
నొదవినభూతిమై ననియె నోగుణభూషణ! నిత్యచర్య చే
వదలితి వేల? చూచి గణవర్గము నవ్వరె? బియ్య మట్ల నేఁ
డొదులుగ నబ్బె నంచుఁగొనుటొప్పునే?తప్పనిదోఁచదాయెనే?113

క. జీవము శీలము రెండును, గావటిలోఁ గుండలట్లు గావున ధరపై
జీవము గలుగఁ శీలముఁ, బోవిడఁ దగునె?యింతయాసపొందుట మేలే?

వ. అనిన నతండి ట్లనియె. 115

ఉ. కామిని నిత్యమై పరగు కాయకలబ్ధియె కాని వారి నే
నేమియు వేఁడి తెచ్చు టొకయింతయు లేదు శివుం డెఱుంగు నా
నేమము ఓళ్లచుట్టు కడు నిండుగ నుండఁగ శాలితండుల
స్తోమము దండనాథుకృప దొర్లుటగాయవి జంగమార్హమై. 116

క. కొని తెచ్చినాఁడ ననవుడు, వనితామణివలికె వారినసతుఁలలోన

న్మను పెన్నఁడిట్లు చిలికి నొయ్య నుక్కిన గావలెనె? యిది యెుధికముగ నినన్.

చ. చిలుతలు దంప బ్రోల్లకడఁ జిందెనె చూడఁడ యేమి వింత యి
త్తెఱఁగున నొల్కఁబోసిరి గదే యని తల్లులఁ బిల్చి వారితో
నెఱుఁగఁగఁ జెప్పఁగావలెనె? యేటికిఁ జెచ్చితి పిట్టినేఁతకుఁ
గఱమెడవేల్పు తాఁ గరుణ గాంచునొ కాంచఁడొ నీవ యెంచుమా.

మ. అనవుడు నేమియుం బలుక కాతఁడు క్రమ్మఱ వేగ నేగి తా
మునుకొని తెచ్చుచోటుల సమూహముగా నవి చల్లి కొంటిలా
గునఁ బనచాలెఁ జేరికొని గొబ్బునఁ దె నవి గాంచి మెచ్చి చే
కొని సతి వండి భక్తవరకోటికిఁ బెట్టె మనోహరాన్నముల్. 119

వ. అంత. 120

క. చారునివలనం బసవఁడు, మారనిసతి పల్కినట్టిమాటలు విని నే
నేరనిపని చేసితి నేఁ, డీగతిమై వారిమహిమ నెఱుఁగక యకటా!.

చ. అని మదిలోన నెంచి భయమార గణావలితోడ మారయా
ఖ్యునిగృహ సీమ కేగి వినయోన్నతి నమ్రతఁ గాంచి మ్రొక్కినం
త నతఁడు ప్రీతిమై సతియుఁ జానునుఁ జాఁగిలి మ్రొక్కి వేనవే
ల్వినతు లొనర్ప భక్తిసమవేశుఁడు శ్రీబసవేశుఁ డిట్లనన్. 122

చ. అనుపమమైన మీవ్రతమహత్త్వ మెఱుంగక వేగ లంచుఁ జే
సినయపరాధ మొక్కటి సహింపరె భక్తులు పండ్లఁ బ్రోల్లఁ బా
ఘన మునుపంటికం టెఁ బరిపూర్తిగ భాగ్యము లబ్బినట్లుగా
నొనరిచినాఁడ మీకరుణ కొయ్యనఁ బాత్రునిఁ జేసి నా పనికే. 123

చ. అని యిటు పల్కుచున్న బసవాధిపువాక్యము లాలకించి మా
రనిసతి విన్నవించెఁ బ్రభురాయ! మహామతి మీరు మమ్ము సా
క సెనపు పుట్టిచేసితిరి గాని తలంపఁగ నట్లు మేము నే
కొనుటకుఁ జాలువారమె? యకుంఠితమన్నియమంబు దక్కఁగాన్.

ఆ. సద్గతిప్రదాత సద్గురుఁ డిచ్చిన, నియమవృత్తి దప్ప నేఁడు చాల
నొరకె నంచు కొనిన ధూర్జటి మెచ్చునే? పసిగ కేగిరాశిఁ బట్టఁజనునె.

క. మీ రెఱుఁగని దేమున్నది, సారదయామూర్తి యయ! దేవసంగన బసవే
శారాధననిరతుం డై, వారనుపఁగ బసవఁ డాత్మవాసముఁ జెందెన్.

క. ఎప్పటియట్టుల మారఁడు, గప్పురగంధియును దాను గాయకవృత్తిం

దప్పక జంగమపూజన లొప్పఁగఁ గావించుచుండె నొడయలు మెచ్చన్.

వ. అది గావునఁ గాయకంబు లధికంబు లని స్వల్పం బని యెన్నంబని లేదు సద్గురుకటాక్షంబునఁ గొంచెంబైన నధికం బగు ననిన దరహసిత వదనుండై యతం డవ్వా! నీగురుఁ డిచ్చినకదురు గనుంగొన వేడు కయ్యెడు నది యెట్టిదియొ చూతము తె మ్మనుటయు నట్లు కాక యని యాసంగమాంబ సత్వరంబునం జని రాట్నంబున ధార మా ధారంబుగా నున్న కదురు దివియునంతలోనె పెళక్కున నడిమికిఁ దునకలై యుండినం గని గుండియ ఝల్లు రన బెండుపడి మూర్ఛ మునింగి కొంతసేపటికిఁ దెలిసి తత్ఖండంబులు హస్తతలంబున నిడి కొని శోకవ్యాకులితచిత్తయై బాష్పజలంబు లురుల నిట్లని విలపించె.

ఆ. ఎదురు లేనిభక్తి చిదురుప గానీక
యదరు బెదరు మదిని గుదురనీక
ముదురకరుణ నన్ను చదురుగాఁ బెసిఁగెడు
గదుర మద్వ్రతంబు గాచు కుదుర. 129

ఉ. హా! సుగుణాఢ్యదేశికవరాంచితహస్తపయోజవర్తి! యా
హా! సతతాంబికావరపదార్చనబృంహసమర్చనాకరా!
హా! సుతమిత్రబాంధవధరాధిపదాత్మజనోపమేయ యా
హా! సురభూజకల్ప పృథయైతివి యే నిఁక నేమి సేయుదున్. 130

క. అని సగలమిగులఁ బొగిలెడు వనితామణిఁ గాంచి కపటభక్తుండను నో
వినుతార్యతశీలా నీ, ఘనమోహభ్రాంతి నేఁడుఁ గానఁగనయ్యెన్. 131

చ. మునుకొని పెక్కుగా నినుపముక్కకు వెక్కుచు నేడ్చువారి నెం
దున గన మిట్టి భ్రామికను త్రోవయె భక్తికి నాసమాలి చే
సిన గణపూజ బాలశశిశేఖరుఁ డెంతయు మెచ్చుఁ గాక యీ
యనవున నాజవంజవమహార్ణవమగ్నతఁ జెందవచ్చునే. 132

తే. కదురుమీఁద నెంతకాంక్ష నీకుండిన
దెరవ రెండు మూఁడు దెచ్చి యిత్తు
వగవ కుండు మనిన వనిత యాతనిఁ గాంచి
యెలుఁగు మంద మొంద నిట్టు లనియె. 133

చ. శరణవరేణ్య నాప్రియుఁడు శర్వపథంబునఁ జెందుఁ బిమ్మటన్

కరుణ వలర్ప మద్గురుఁ డఖండితజంగమవర్యపూజనో
త్కరము లొనర్ప మీకడురు కాయకలబ్ధి నటంచు నిచ్చె నా
కరుదుగఁ దీనిభక్తి నది యాదిగ తత్క్రియ మెప్ప జర్పితిన్. 134

తే. ఇపుడు నాజీవ మగునది యిట్టు లయ్యె
నయ్య? నావ్రత మీడేర నానతిండు
గురుపథంబునఁ జెందెదఁ గోదుపడక
యనిన దరహాసవదనుఁ డై యతఁడు పలికె. 135

ఉ. కాయము వీడెదే కదురు కాదకుఁగా మదె నాసపీడఁగాఁ
జేయవు బాగురే! యినుపనీలకు సొధము గాల్పఁ గూడునే
మాయలఁ బెల్లియంత పెనుమక్కువఁగల్గిన వెండిపైడులం
జేయఁగ బంచి యిచ్చెదము చేకొను మీకదు రట్లు గాసిచోన్.

క. యావజ్జీవోపాధికి, నేవెర వొనరింతు కొమ్ము నెలఁత కదురుకై
చావకు మని తనజోలిం, దేవి పసిఁడిజాతి యొకటి వెగిచి రయమునన్.

క. ముందరపైచినసతియది, యందకనామదిగ్రహింప కయ్యయొమాయం
జెందం జేయఁగఁ దగదే, కందర్పారాతిమూర్తి కరుణింపు మిఁకన్.

తే. ఇంక నిమ్మాటక్కఁ బలికితివేని దేవ!
నీకు నీయాన సెలవిమ్ము నీలగళుని
గూడ నరిగెద నను మదిఁ గొంకులేక
తతశివార్చనవేదికా స్థలమునందు. 139

క. భావం బలరఁగ యొకగుమా, గావింపఁగఁ బంచికదురు ఖండంబులతో
నావివరముఁ జొరఁబోవఁగ, భావజహరుఁడింత మెచ్చి ప్రమథులతోడన్.

క. ప్రత్యక్షంబై నిలిచిన, నత్యంతకుతూహలమున నయ్యంగన స
న్నత్యభినుతు లొనరించిన, కాత్యాయనివిభుఁడు కరుణ గడలుకొనం [గన్.

తే. కామినీమణిఁ గైకొని కమలసంభ
వామరాధిపనుతిపాత్ర మైనరౌప్య
ధారుణీధరరాజ్యంబుఁ జేరి ప్రమథ
కాండలీలావినోదుఁ డై యుండె నంత. 142

వ. అదియునుం గాక. 143

క. అజనిరథనిబలక్షరద, ప్రజగిరియుదుసింహాసనమధురాసుగవదనో

రుజశేఖరేంద్రకరిరథాశ్వభటజనాలయ మొప్పెఁబురి పుడమిజంబురసన్
వ. అప్పురంబునందు. 145

## రౌద్రసత్తక్క కథ.

ఉ. చొక్కపుసూనృతోక్తవుంసూదనపాదపయోజభక్తి పెం
పెక్కగుణానుశక్తి గిరిశేఖరనామవిరక్తి సేవక
ప్రాక్కలినాఘసంచయవిపాటనశక్తి వహించి రౌద్రస
త్తక్క ధరాతలంబున మహామహిమాయతి నొప్పు నెంతయున్.
ఉ. పంచశిలీముఖారిపదభక్తుల కెప్పుడు తద్గుణాఢ్య ని
ర్వంచకవృత్తిఁబూజ లనురాగముతో నొనరింపుచుం జగం
బెంచక నన్యదైవముల నెప్పుడు పల్కక మ్రొక్క లెవ్వరిం
కించి పచించిన స్వినిసకేవలసిద్ధిఁ జరించుచుండఁగన్. [క్రై
క. తరుణిదృఢభక్తిధైర్యము, లరయఁగధరకెల్లఁ దెలుపహరుఁడొకచరుఁ
యరుదెంచి తద్గృహాంగణ, పరిసరమున నిల్చిఘంటవాయించి వెసన్.
క. భిక్షాందేహియనఁగ విని,యాక్షణమునదర్వివేఁడియన్న ముగొని యా
ప్రక్షాళితకల్మష చని, భిక్షుకునకుఁ బట్టు మనుచుఁ బెట్టం బోవన్. 149
క. మెతు కొకటి క్రిందజాఱిన, నతఁడక్కటికంబునొంది హరిహరియనదాఁ
నితఁ డేటి జంగమని సతి,యతికుపితమనస్కయగుచు నడచెం దర్విన్.
చ. అడచిన శ్రీతినొంది యతఁ డక్షులనీరము నించి తూలుచుం
బుడిమిని వ్రాలి కోలెఁ బిగఁబూని హరీ యని లేవఁబోవ నీ
నుడు విఁకమాను మంచు మది నూల్కొను నాగ్రహవృత్తిఁ గ్రమ్మఱం
బెడతలవ్రేయ సొమ్మసిలి పెక్కగ దుఃఖము పిక్కటిల్లఁగాన్. 151
చ. తగిలిన దిక్కుఁ జేసడిమి తామసి రక్కసి దోసకారి న
న్నగపడనీక మ్రింగు క్షణమైన నిలం వగ దీడ నన్నుఁ గా
వగ నీక నెవ్వరో గరుడవాహన యంచుఁ జనంగ వెంబడిం
బెగఁబరువెత్తి చేకొలఁది లెడ్డున వెన్నదరంట మోదినన్. 152
చ. పెనుదెసఁ జూడఁబోక తలవీడఁ గటిచ్ఛదమూడ గంట మే
పనిఁ బడవ్రేయ మోము కళదియ్యనియార్పులు మీఱ బొంతజా
నధర మెండఁ బెట్టుగ నురస్థున జెమ్మట నిండ నొక్కప
ర్యావనజనై తత్పరిశరభపుంగవకోటి వసింపుముక్కికన్. 153

సీ. చని గణకోటిఁ గాంచి మునిసాధ్వసమందఁగ నిల్చి వారితో
ననియె మహాత్ములార! యొకయంగన యిప్పరి దుర్మదాంధప
ర్తన బలుసత్తజంగమవిదారణశీల యటంచు మున్ను నే
వినసికతంబున న్మదిని వివేకవిహీనత భిక్షుకేఁగితిన్. 154

గీ. ఏఁగి దేహి యన్న నింతి చిల్లిశకలాచు, లెడ్డుతోడ కూడఁదెచ్చి పెట్టి
వాసితోన వీఁపుతాట నెత్తఁగ మోదె, నన్ను లాగిపిన్న కనుచుఁజూచి.

గీ. దిక్కులేనివాఁడు తిరిపెమెత్తెడువాఁడు, వీఁడటంచు జారవిడువఁబోక
పాడి నెఱపవలయు భక్తాభిమానులై, కావరయ్య నన్ను గరుణతోడ.

క. పాడి విచారించి యెమ్ము,న్నోడధరానాథుఁ డాత్మసూనునియసువుల్
దూడకయిదోలఁగఁజేయఁడె, వేడుకవినుఁడా క్రమంబువివరింతుఁదగన్.

చోడరాజు కథ.

చ. వసుమతి సింగ నగరవల్లభుఁడై చను చోడఁ డన్యభూ
పసుతినొంచుచున్ హితులఁ బాలనసేయుచు వీరశైవగో
ష్ఠిసలుపుచున్ శివాథవునిసేవయొనర్చుచు సత్యసంధుఁడై
వెసఁయశంబునిల్పి జగతీతలమేలుచునుండు నంతటన్. 158

ఉత్సాహము. అరసాధినాథసూనుఁ డంత నొక్కనాఁడు ర
త్నారమైత్తనర్చుస్యందనాధిరాజ మెక్కిన
ద్భేరికాహళారవాళిపెంపు సొంపు నింపఁ ద
త్పురవీథి నేగుచుండ దైవయోగ మొందుటన్. 159

చ. గురుగృహధేనుతర్ణకము గొబ్బున నడ్డమువచ్చి క్షితిచే
నరుగఁగ లేక త్వద్రథసమాయతచక్రవిఘట్టనంబున
న్మరణము నొందఁ గాంచి నృపనందనుఁడెంతయుఁ జింతనొంది హా
హరహర! యంచు నేగె నగరాంతికపుష్పవనీధరిత్రికిన్. 160

సీ. అంతటఁ దద్ధేను వటవీథ్థలంబున
బోవు మేయుచుఁ బాలు చేపువచ్చి
వత్సంబుఁ దలఁచి యంబారవం బిచ్చుచు
రయమునఁ జనుదెంచి రథ్యఁజొచ్చి
పడియున్న పృథుకంబుఁ బొడగాంచి మోమును మో
మునదువ్వుచును జను మొనల్ల మూర్తి

పై నంటఁజేయుచు మేను నాఁకుచుఁ జుట్టుఁ
దిరుగుచు గన్నీరుఁ దెచ్చుకొనుచుఁ
తే. దోఁకనీఁగలువిసరుచుదమ్మునోరఁ,గరచి యెత్తుచునిలచినల్గడలుగనుచు
బండ్లుకాళ్లువిదల్చుచుఁబంచితంబు,నొయ్యనొయ్యనవిడుచుచునున్న
ఉ. పట్టిగరాసిదుఃఖమున బజ్జజనంబులు విస్మయాత్ములై [రనుచు.
చుట్టునురాఁగ నేగి మొరసుద్దివినన్ నృపతోరణంబునం
గట్టినగంట గొమ్మునను ఖంగనఁ జిమ్మిన నాలకించి యా
బెట్టిగునావ మేమనుచుఁ బృథ్వివరుం డరుదెంచి యచ్చటన్. 162
చ. కన్నులనీరుజార మనుగ్రమ్మిననోరను జొంగలూర వా
ల్జన్నులఁబాలు గార మొగసాల రవం బొనరించు నైచికి
న్విన్న జనంబుదోఁపఁ బృథివీపతి డగ్గరిచూచి యేటికో
సన్న యొనర్చి కూయిడుట శంకర యంచు విచారమగ్నుఁడై. 163
క. ఉన్నెడను నాత్మతనయుఁడు, చెన్నుగ రథమెక్కి పురివిశిఖ నేగఁగ నా
సన్నమటుగురునివత్సం,బున్నతరథచక్రనిహతి నొందుటఁ దనతోన్.
చ. పురజను లెల్లఁ జెప్ప విని పుత్త్రునిశత్త్రునిరీతిఁ జూచి స
త్వరమునఁ జంపఁగావలయుఁదర్ణకసూదను నంచు పౌరపా
మరగురుబంధుమిత్త్రబుధమంత్రిసమాజముఁగాంచి ధైర్యవి
స్ఫురణఁదలిర్పఁ బల్కె నృపపుంగవుఁ డత్తరి మధ్యవర్తి యై. 165
క. తనయేలుభూమిలోపలి, జనములు గావించుపాపసంచయ మెల్లం
జనుఁ జెందుననఁగ తనయుం,డొనరించినపాపఫలము లొందకచనునే.
క. కొంచెము గాదిది యెంచఁగఁ, బంచమహాపాతకములపాటి దఖలు నే
వంచనచే సుతమోహం, బుంచిన నిందాఘఫలము లొందకచనునే.
క. నామదిఁ దోఁచినచందం,బీమెయిమీకెటులఁదోఁచు నేర్పడఁజెపుఁడా
యోమహితులార! యనవుం,డామాటలకేమిదోఁచ కందఱునొకటై.
ఉ. సన్నుతకీర్తిసంభరిత సర్వదిగంతరసత్యసంధ్యలో
కోన్నత! ధర్మశాస్త్రవిధు లొప్పఁగ మీరె వచించినారు మే
మెన్నడిదేమిగల్గు పరమేశ్వరుఁ డీగతిఁ దెచ్చె నింక మీ
కన్నదికాను పలుకు తమఁగ్రమ్మినదుఃఖము నాఁటిపల్కినన్. 169
క. విని నృపుఁ డదియే తారకు యనుమతిగా నిశ్చయించి యాఁవత్సముపైఁ

దన తనయునిఁ జెగవ్రేయుం,డని తలవరిజనులతోఁ ద నాజ్ఞాపించెన్.

వ. ఇట్లాజ్ఞనొసంగిన. 171

ఉ. అంతకముస్నై వచ్చి భవనాంతరమందువసించి యయ్యయో!
యెంతటికర్మినైతి పరమేశ్వరద్రోహము సంభవించె నీ
చింతిదొలంగుమార్గ మింక జెందదు వేళాకరీతి నాత్మదే
హాంతముదప్ప దంచు వివశాకృతినున్న నృపాలనందనున్. 172

చ. కని తలవర్లు మ్రొక్కిలిడి కన్నుల నీ రొలుకంగ దేవ! మీ
జనకుఁడు సాహసించి నినుఁ జంపు మటంచు ననుజ్ఞ నిచ్చె న
ప్పని మెయి వచ్చినార మని పల్కిన సంతసమంది యౌరా? నా
తనుపుకృతార్థతం దనరె తప్పె మహాఘము లోకనిందయున్. 173

చ. జనకుఁ డనుజ్ఞ నిచ్చుగతి సల్పుఁడు మీరలు సత్వరంబ యా
ఘనుఁడు జలాభిషేచనముఁ గైకొని చేల్వలు గట్టి వల్చగాఁ
దనువున భూతిఁబూసి యలుత నృదురాక్షసరంబు లేసి హ్రా
ద్వనజమునందు దేశికపదంబులు నిల్పి వినాసధుర్యుఁ డై. 174

క. ఇలు వెడలి ఖడ్గకరులగు, తలవరులును దాను నేగుతనుజన్మునిని
శ్చలధైర్యకలనవిని భూ,తలనాథుఁడు మెచ్చి చూచుతలపుననంతన్.

చ. సకలవిబంధుమిత్రనృపవర్గము ముస్నుగ సత్సభాగృహాం
తరజను లెల్లఁ దో నడువ దర్శకమిాల్గినచక్కి కేగి ని
బ్బరముగ ముస్నవచ్చి యట భాసిలుపుత్రుని గాంచునంత న
న్వరగుణశాలి తండ్రి కనివారితభక్తిని మ్రొక్కి నిల్చినన్. 176

వ. అయ్యెడఁ బౌరజనంబు లత్తెఱంగంతయుం గనుంగొని యత్యంతదుః
ఖాక్రాంతులై యొండొరులతో నక్కటక్కటా! యీభూపాలుం డను
పమానశౌర్యధైర్యగాంభీర్యచాతుర్యసత్యౌదార్యసౌందర్యసౌ
కుమార్యాదివిశేషంబులు గొనియాడం దగుప్రోడలదూడ్యకై తెగం
జూడఁ దలంచెనే యనువారును గట్టడితనంబున కోడక కడుపునఁ
బుట్టినపట్టి నిట్లు చేసె నింక నీపట్టణంబున నెవ్వరి నెట్లు సేయఁ డను
వారును మోహంబులలోఁ బుత్రమోహం బదికం బని యూహిం
చక సాహసంబున నితనిదేహంబు దునుమం బంచె నాహా! యనువా
రును నొక్కండె సుతుఁ డిక నెక్కు లే రని యిక్కుమారుని నక్కించు

శోకేక మీఁద దుఃఖంబునం జిక్కె ననువారును నంగడివీథి తురంగం
బులు శతాంగంబు నీడ్చికొనిపోవ ముంగిలికివచ్చి మగుడిపోవం గా
ల్గొడక యావత్సం బడంగెంగాక యిక్కుమారపుంగవుండు చేజేత
ఘాత యొనర్చెనే యనువారును నిత్యలోకస్తుత్యసత్యసంధుండు
గావున నీభూవరుండు నావారు లాతివా రనుమాటఁ దక్కి యిట్లుగా
వించి నిందాహత్య లెడఁబాపికొని కీర్తిమంతుం డయ్యె నింతవాఁ
డేలోకంబుననైనఁ గలఁడే యనువారును ధర్మంబుదప్పక నిర్మలాంతఃక
రణుండై పుత్త్రుని శత్త్రునిగా విచారించిన దైవం బాదుకొనవలదే యను
వారును బ్రాణంబుమీఁదవచ్చిన నాత్మత్రాణపరాయణుండై తొలం
గిపోవక జనకాజ్ఞోల్లంఘనంబు సేయక యొప్పె యీతం డెంత సుపు
త్త్రుం డనువారును మాకుం జూడ నిట్టిసాహసుల కిత్తెరి నీశ్వరుండు
ప్రత్యక్షుండై శాశ్వతైశ్వర్యంబు లొసంగి దయసేయకపోఁడని తోఁ
చుచున్న దనువారును నై గుంపులుగూడి చూచుచున్న సమయంబున.

చ. శరణులకెల్లమ్రొక్కి యతిసాహసమాత్మ నలంకరింప భూ
వరతనయుండు మేటితలవర్లను గన్గొని జాగుమాని మ
ద్గురుఁ డెటులానతిచ్చె నటు గొబ్బునసేయుఁ డటన్నవారు శీ
కరగతి నాతనిం దునుమ ఖడ్గమొర న్వెడలించి వ్రేయఁగాన్. 178

తే. వాలు పువ్వుమాలయై ధరావరునిపట్టి
యఱుతదవిలిన దలవరు లధికవిస్మ
యాత్ములై యేమి దోఁచక యాగి రప్డుఁ
జొకని మొగ మొక్కఁడీక్షింపు చున్న నంత. 179

చ. నిరుపముఁడై నగోపతి ఘణిల్లనిరావ మొనర్చ మేదినీ
వరునకుఁ దత్కుమారునకు భక్తసమూహికి గాఢసమ్మదో
త్కరముదలిర్పఁ బారిషదతండవిలాసముఁ బ్రీతిఁగూర్ప స
త్వరగతివచ్చినిల్చె వసుధాధరచాపుఁ డుమాసమేతుఁడై. 180

చ. సిలిచినఁ గాంచి యాధరణినేత వినూతనకౌతుకంబునఁ
జలిమలతేనియల్లునకు జాగిలి వందన మాచరించి ని
శ్చలు నిరుపాయు నిర్గుణు నిశాకరశేఖరు నీలకంఠు ని
ర్దళితపలాశి నిత్యశుభదాయకు నీరధితూణు నిర్మలా. 181

వొప్పునఁ బల్కెనో యడిగిచూడుఁడు ము న్నిట నీతఁ డన్న వా
క్యప్పుడు భిక్షుఁ గాంచి యని కంకలు మోములఁ గిన్కు దోఁపఁగాన్.

ఆ. అడచె నిర్నిమిత్త మంగన యని సభా,మధ్యమందు కల్లమాటలాడఁ
నగునె మించ నాదుతప్పు నీకొడఁగల్గి, యెంతకైన దగుదు వెన్న ననిన.

క. నారాయణనారాయణ, నేరం బేమియును లేదు నెలఁతుక నాపై
నూరక నాడె ననంగా, నేర మని మహోగ్రహంబు నిగుడఁగ నడచెన్.

చ. అడచిన శ్రీహరీయనుచు నయ్యలదిక్కుఁ గనంగ నంతలో
నుడువను మన్న శబ్దమని నూల్కొని క్రమ్మఱ నంత యాతఁడ
పృషతుక మ్రోల నిల్చె జకభావము మాని వృషేంద్రవాహుఁడై
జడలు కపాలమాలికలు చంద్రకిరీటము శూల మొప్పఁగాన్. 193

తే. ఇట్లు సన్నిధిచేసి సర్వేశ్వరుండు
మెలఁత! నీభక్తి కెంతయు మెచ్చువచ్చె
రమ్మనుచుఁ బుష్పమయవిమానమ్మునందు
నునిచికొని పోయెఁ గైలాసమునకు నంత. 194

ఉ. అచ్చట నున్నభక్తవరులందఱు నందఱు విస్మితాత్ములై
యెచ్చటనైన జూచితిమె యిట్టిమహత్త్వము కాంతపర్విచే
చిచ్చులకంటి దేవరను జేకొఁ దిం బ్రహరించి లోకముల్
మెచ్చఁగఁ జెందెఁ దత్కృప నుమేశశుభాకరతారశైలమున్. 195

క. అనిపలుకుచున్న వారలఁ,గనుగొని యొకభక్తుఁడని యోగమలాంఘకరుం
దనువలయ మోదిక నెనొక,యనఘుఁడు తత్పవము తొల్లి యది యెట్టిద [నన్.

మ. అసమానోత్తరశైవతత్త్వనిధి సిద్ధాచారుఁ డీశానభ
క్తిసముత్సాహుఁడు నిత్యభక్తగణతీర్థప్రసాదోపభో
గి సమస్తేంద్రియనిగ్రహుండు విలసత్కీర్తి ప్రభావుండు ర
క్కసిబ్రహ్మయ్య యనంగ భక్తవరుఁ డొక్కం డొప్పు నిద్ధారుణిన్.

రక్కసిబ్రహ్మయ కథ.

సీ. అతనిమహత్త్వ మత్యద్భుతం బెట్లన్న నింటికి చరమూర్తులేగుదేర
నైదుదినములుండ యనుపువారుం డెవ మనిన నెన్నండింటికలుగనీను
సమ్మతించి రేనిసరసాన్నపానము ల్గొనుచునుండుండనియునుచుగొంత
కాలంబు చనె నని చాలయపేక్షులై పోవంగఁ దలఁచినఁ బోవ నీక

తే. బలిమిచేఁబట్టియప్పుడుపనిగెదవారి, పూజసల్పుచునుండుము పూఁటలిట్టు
లతఁడు వ్రతమూని చరియింపనవనిజనము, లంపటావిధ మారసియచట

తే. సంతతము వీరి యింటికిఁ జనిన నంబి [నచట.
కామనోహర భక్తలోకంబులోన
నయ్యె లోకకోంపతేమొకో యాగ్రహంబు
వెడలి క్రమ్మఱిపోవ రేవిధము దలఁప. 129

తే. బొమ్మరక్కసి యొక్కటి భూతలమున
శరణతతిమ్రింగ భక్తవేష మనిపేరు
తిరుగావించుకొను వారిఁ గనుచునుండఁ
బోలుగాకున్న నిట్టియద్భుతము గలదె. 200

క. అనిసంశయించుధరణీ, జనముల యనుమాన మెల్ల నడలించుటకై
మనసిజ సంహారుఁడపుడ, త్యనుపమ సంతోషపూరితాత్ముం డగుచున్.

సీ. చలిపోరువాసిక మెఱయంగఁ బైఁగట్టెభసిత త్రిపుండ్రంబునొసలఁ బెట్టి
పృథుసూత్రగతలింగపేటి ప్రక్కకుద్రిప్పి కెంగుజారహారంగు చేలగప్పి
నీలిచల్లాడంబు మేలికాసెబిగించి వాలుముమ్మొనవాలు కేలనుంచి
సన్నపురుదురాక సరములు మెడఁబూని గండపెండెర మొకకాలనూని

తే. వంకి మొలఁజెక్కి దంతపుపావలెక్కి
తమ్ములము వేసి మేన గంధంబుఁబూసి
వితతయౌవనసౌందర్యవిభ్రమంబు
లలర నొకచరమూర్తియై యద్భుతముగ. 202

తే. రక్కసి బ్రహ్మావరమందిరమున కప్పు
డరుగుదేఁగాంచి యతఁడు సాష్టాంగ మెరఁగి
కలితరాజవదుపచార కలనఁబూన్చి
వినయమున నున్న బ్రహ్మయ్యఁ గని యతండు. 203

మ. భళిరా! రక్కసి బ్రహ్మ యివ్వసుమతీభారస్థభక్తావళిం
గలయం జూచితిగాని నీదువిశసత్కారుణ్యగాంభీర్య ని
శ్చలభక్త్యర్పనశీలదానగుణముల్ చర్చింపలే దెందు నే
డలరిం జెందె మదీయమానసము నిన్నిత్తింప శైవోత్తమా! 204

ఉ. ఎప్పుడు నిన్నుఁగూడి చరియింపఁగ వేడుకపుట్టె మాకు నీ

విప్పని కియ్యకొమ్మనిన నెంతయు సంతసమంది దేవ! నే
నొప్పితి నట్లు మీరిచటనుండుఁడు పల్కినమాటఁ గ్రమ్మఱం
దప్పినఁ బాపనీయ నని దాసి కొడంబడి సత్యమార్గమై. 205

తే. తా నతం డిచ్చు భూతిహస్తమునఁ బట్టి
యతని నుదుట ధరించి నీవనిన యట్లు
నిలుతు మని పల్కి మఱియొక్కనిమిషమునకు
మాకు పనియున్న దిఁక పోదుమా యటన్న! 206

చ. గడుసుజనంబొ! కోడిగమొ! కల్మియొ! చూడఁగ నీస్వభావమో!
గడెగడెకొక్కమాట పలుకం దగవే? మును నీకు నీవ యి
క్కడ వసియింప భూతిఁగొని క్రమ్మఱఁబోయెద నన్న నిన్ను నే
విడుతునె యేల నీభ్రమలు విశ్వము మెచ్చునె బాసదప్పినన్. 207

తే. ఇటకు రానేల పోనేది యింతవింత
గలుగునే లగ్నమపుడె 'నాగబలి' యనెడు
సామిత నిబద్ధియయ్యె నీజాడఁజూడ
ననిన దరహాసవదనుఁడై యతఁడు పల్కె. 208

ఉ. మాగుణముల్ దలంప బహుమార్గము లెన్నఁగ నేల? నీకు నే స్వ
చ్ఛాగతుఁ డైన జంగముఁడు స్థావరమై యొకచోట నిల్చునే
సాగి చనంగ నీకుఁ జెరసాలను నన్నిడఁజూచినాఁడ లో
నాగముఁబట్టిలో నిముడునా యిదె పోయెద నడ్డగింపుమా! 209

చ. అనవు డతండు పల్కె శరణాగ్రణి మీర లెఱుంగనట్టి శా
స్త్రనిగమచోదితంబు లగుధర్మము లెందున నైనఁ గల్గునే
మునుపొనరించునా నియమము స్వాడి యిచ్చుటనుండి నేఁడు నా
తనువునఁ బ్రాణముల్ గలుఁగ దప్పఁగ నిత్తునె నిన్ను నాప్రభున్. 210

ఉ. ధారుణి వేదచోదితఫలంబుల భక్తసపర్యసల్పువా
రారయ వారియిష్టమటు లాగి యొనర్చిరి గాని నీక్రియం
గారియఁ బెట్టి బూన్చుటలు గానము బాలిక నీసపర్య యే
తీరున నీడనుండుటకుఁ దీరదు పోయెద నన్న నుగ్రుఁడై. 211

క. వలఁజిక్కి తెక్కలార్చినఁ, బులు దెగసి చనంగఁ గలదె పొమ్మిటు బోవం
గలవే యని పెట్టిదముగఁ, బలికిన చరమూర్తి తీవ్రభయదాకృతియై.

ఉ. బెబ్బులియాఁగునే చెప్పులబిల్లిలఁ బత్రిక వ్రాసి మున్ను నీ
యబ్బకు నీకు నేమయిన నిచ్చితినే చన నీకపట్ట నీ
బొబ్బల కేమి వేరు సరిపో? నటియించితివి కాక తొల్లి నీ
రబ్బినఁబో లె జంగములయందరితో నను సాటిచేసితే. 213

ఉ. వచ్చినభక్తకోటి పలవాకిలి వెళ్లఁగనీఁపట్టి నీ
యిచ్చగ బందిసుంచు ఫలమెల్లఁ గనంబడఁజేతు నన్ను నీ
విచ్చట నడ్డగించ కిఁక నేటికిచూచెదు రమ్ము పట్టుమం
చచ్చటఁబాసి సాఁగ నతఁ డడ్డముగా నగలించి తెచ్చెదన్. 214

క. మొలసురియఁ దినగఁబోవఁగఁ
దొలఁగక బ్రహ్మయ్య యతనిఁ ద్రోచి యటకు పోఁ
గలవో పొమ్మని డగ్గరి
కలయంబడి పట్టిమోది కలకలనగుచున్. 215

ఉ. పట్టినపట్టునీడనన పౌరుషమా యిఁక నెట్లుపట్టెదో
పట్టుము నీవటంచతఁడు వైలగుడు న్మదినేమిదోచ క
ప్పట్టునఁ జింతనొంది వ్రతపద్ధతిమానుము వచ్చె నింక న
న్నెట్టుల మెచ్చు శంకరుఁ డిపీ యని భక్తులు నవ్వుకుందురే. 216

క. శీలముదొరగినపిమ్మట, నేలా కాయంబు దీని నెడనేయుటయే
మేలని హృదయాబ్జంబున, కాలాంతకుసిల్ప గండగత్తెఁగొనఁగాన్.

ఉ. అంతటిలోన నీశుఁడు దయామతి సన్నిధిచేసి బ్రహ్మ నీ
యంతటి శీలవంతుఁ డిఁక నారయఁగల్గునె పల్లవించె మ
త్స్వాంతము నేఁడు నీదయినవాంఛిత మిచ్చెద నన్న నాతఁ డ
త్యంతకుతూహలంబున పదంబుగ్రలకుం బ్రణమిల్లి వేడుకన్. 218

చతుర్విధకందము:—

గౌరీశ పరఘృణారస, పూరా కామారిశైవ భూషణసోమా!
వారాశి సుజనసోమా, ధారా హేమాద్రిచాప తారకరామా.

వ. అని యిట్లు సన్నుతించి దేవా! భవదీయదర్శనంబునకంటె వాంఛితం
బొం డెద్దియైన నొక్కటివేడెద మదీయనికేతనస్థానేకభక్తసహి
తంబుగా నన్ను భవత్సదనంబుఁ జేర్పవలయు నని విన్నవించిన నట్ల
కాక యని శంకరుం డదఱఁబుష్పకారూఢులంగావించి నిజధామం

బునకుం గొంపోయె నట్లు గావున నిప్పడతియు నారక్కసి బ్రహ్మ యయ్యవిధంబున నీశ్వరునకుఁ దిరుగంబడి తత్పదంబు గాంచె నని చెప్పిన నచ్చటిభక్తవరులందఱు నత్యాశ్చర్యంబు నొంది రౌద్రసత్తక్కం జెక్కువిధంబులం గొనియాడి నిజనివాసంబులకుం జని రడియునుం గాక. 220

—శాంతసత్తక్క కథ.—

తే. సంతతాత్మీయభక్తిని శాంతకుసుమ
మంతమాయాపహరణవిక్రాంతశర్వ
చింతనామృతపూరిత స్వాంతయగుచు
శాంత సత్తక్క వెలయును సంతతంబు. 221

సీ. ఆయింతి యొక్కనాఁ డాత్మవల్లభునకుఁ దలయంటినలుగిడిజలకమార్చు
వేళదో సెఁడునీరు వెలిఁజల్ల నాతఁడు గని యిదియేమినిష్కారణంబ
నీరుఁజల్లితి వన నెలఁతుక వినియును విననట్లయుండిన విభుఁడు గినిసి
నామాట నీచెవి నాటదో గర్వమో యన నెమ్మొగమ్మున నల్లనల్ల
తే. చిఱునగవుతొంగలింప నోజీవితేశ !
మీమదికిఁ దోఁచియుండియు నాముఖమున
వినఁగ వేడుకయైన దద్విధము తాన
మూఁడు పిమ్మటఁ దెలిపెద ననిన నతఁడు. 222

చ. అటులగునంచు వే జలకమాడి మడుంగులుగట్టి భూమిపె
న్నిటలముఖాంగదేశముల నిల్పి శివాక్షమణుల్ ధరించి ధూ
ర్జటిభజనాంతమందునఁ బ్రసాదము భక్తులతోడఁగూడి యా
దట భుజియించి లేచి ప్రమదం బెసఁగంగ సుఖోపవిష్టుఁ డై. 223

మ. తనభార్యామణి దగ్గఱం బిలిచి కాంతా ! నింగికై నీరుచ
ల్లినవృత్తాంతము చెల్పుమా! యనిన వల్లేయంచుఁ గేల్మోడ్చి యి
ట్లను మత్సోదరి శర్వునాత్మపశుఁ జేయన్ యోగసత్తక్కనా
వనితామాళి మహాటవిందవము దుర్వారంబుగాఁ జేయఁగాన్. 224

ఆ. తత్తపోగ్ని వెడలి ధరణిఁ గ్రమ్ముచు నిటు
రాఁగఁ గాంచి డాసి రాకయుండ
జలముఁ జల్లి దాని మలఁగఁజేసితి నన

చింతితోఁగ నాథుఁ డిట్టులనియెం. 225

ఉ. ఎక్కడిచల్లె లేటితప మెక్కడి కానవ మేటిమంట లే
చిక్కనఁ బుట్టె గాంచి తెటు లేకపనాశ్చితి వెట్టివింతయుం
బుక్కటఁ బట్టినావొ ననబోఁడిరొ బొంకులు చాలు నన్నుఁ బెం
పెక్కిన భక్తితోననియె నింపునిభాసన తాల్మి మీఱఁగన్. 226

తే. ఎచటనోయున్న దాని నీవిటులఁ గాంచి
తనఁగ నేటికి భూతలమందు నెందుఁ
దెలియ దూరశ్రవణదూరదృష్టు లీవ్వ
రాన్పకుఁ గబ్బుబరు వె యెట్లనిన వినుము. 227

క. శ్రీవసుధాపాలక క్షత్రుఁడ! వేదాగమకథితనియమవిశుద్ధితుఁ డఘవి
చ్ఛేదుఁడు కళ్యాణమున, న్వేదక కేతాఖ్యుఁ డొక్క మేదరి యొప్పున్.

కేతయ్య కథ.

ఉ. ఆతఁడు సంతతంబు గగనాంతరసీమల కేఁగి వేణుసం
పాత మొనర్చి తెచ్చి నిజపత్నియుఁ దానును జీరి వావిచేఁ
జేటికొలంది జల్లెడలు సిబ్బులు చేటలు చూచువారికిం
బ్రీతి జనింప నల్లి పురవీథుల నమ్మి తపేయలబ్ధిచేన్. 229

చ. శరణదరేణ్య! బూజనలు సల్పుచుఁ దానొకనాఁడు వేణువం
బురహరుమూర్తి కత్తిఁగొని భూరికురంటకకోవిదారకే
సరపిచుమందచూతఘనసారకపిత్థశిరీషశింశుపా
గరుముఖభూజరాజిగలకాననసీమల కేగి యచ్చటన్. 230

చ. అరిమురివంశగుల్మముల నారసి యందొక గట్టిబొంగు లే
నఱుకుచు నుండఁగాఁ బ్రమథనాథుఁడు కేతన నెమ్మనంబుఁ దా
నెఱుఁగ సువర్ణబీజతతి యేర్పడ దానిఘటింపఁ గాంచి తో
తెకపిసిపుష్పివృట్టె నిధితెంచిన నేమనిరోసియవ్వలన్. 231

క. మఱియొక్క కట్టఁగ్రమ్మఱ, నఱకిన నాఁటిని కనంబడఁగా నే
నెఱుఁగక వచ్చితినిటకని, తెరచోటికిఁబోయి యొక్క పృథుగుల్మమునన్.

చ. చొరఁబడ నొక్క గట్టివెనుపోక గనుంగొని వాఁడి కత్తిచే
ధరఁబడ దానినేయ నడిదంబు కరంబున జారి యుర్లచేఁ
బరఁగిన కుంజమధ్యమున భవ్యతపంబొనరించు తాపసిం

ఘనముగ దాఁకి యొక్కఁ బరిత్రయ్యేఁగఁ జేసిన నంతలోపలన్. 233

గీ. హరసమర్చనాయయమును నాతఁడు గూల, కేతఁడు గరిమఁ దనకేల బట్టి
తెచ్చి బైటనుంచి తెగినచందమును గబరి, తుంచి శోకతప్తచిత్తుఁ డగుచు.

ఉ. అక్కట! యెంతపాపమున కాస్పదమైతి? ప్రభాతవేళనే
యిక్కడి కేల వచ్చితి? మునీశ్వరుఁ డీశానునింటఁ గాననే
యొక్కని మైత్రికృత్యమున మోసముఁ జెందితి నెట్లు బాయు నీ
మిక్కుటమైన హత్య ఘనమేచకకంధర! యంచు నుండఁగన్. 235

ఉ. అచ్చట కేతనార్యసతి యత్తరి భక్తగణార్చనాలయం
బిచ్చ నలంకరింపఁగ మునీశ్వరునార్తరవంబు వీనులం
జొచ్చ స్వదేశికప్రవరశుద్ధరయం బెనుబొందు జ్ఞప్తిచే
నచ్చటి పల్కులైన దనకేర్పడఁ దెల్లమియాచునుండుటన్. 236

చ. అటు విని మానిచచ్చుటయు నాతనికై పతి దుఃఖమొందుటల్
పటుమతిగాంచి మందిరకవాటము తాళమువైచి చెచ్చెరం
జటులభుజంగపతిమృగశైలముల న్వెదకెంత లేక య
య్యటవికి నీలకుంతల యకుంఠితధైర్యము వెంటఁదోడుగాన్. 237

చ. విపినముఁ జొచ్చి యొక్కయెడ విచ్చనవిత్తుఁడైన పాన్నికై
విపులవిషాదవేదనల వేగెడునాథునిగాంచి మ్రొక్కినన్
వ్యపగతదుఃఖుఁడై యతఁడు తల్లీ! యిట కేగతి వచ్చితొంటి నీ
విపుడిట రాఁ బనేమి మరి కెంతయు నద్భుతమయ్యె మానినీ! 238

ఉ. కానుగుచెట్లపంటి పలుగాకులు పన్నొసలె వ్వరేని యే
మైనను నించనాడి నాగణార్చనకాలము దప్పునంచు నో
కానక సేయు నాదయినకర్మము చెప్పిరొ యెవ్వరైనన్నో
మానిని! నీదురాక కనుమానముఁ జెందెడు మాకుఁ జెల్పుమా!. 239

చ. అనవుడు కేలుమోడ్చి వినయంబున నిట్లను మించు మీరఁ గ్రీ
వ్వాచతలమందు శోకమున వందుచుండఁగ నిన్నుఁ బాసి నే
ననుచిత మింటనుండుటని యారయ వచ్చితిఁ గాని యొండు లే
దనిన లతాంగి నాదయిన యాపద నీకెటుదోఁచె దెల్పుమా. 240

ఉ. నాపుడు మీయనుగ్రహము నాయెడఁ గల్గుట మానిఁ బాల్గుచో
వావిరిఁ బల్కఁగా వినియు వచ్చితి నెమ్మదిఁ గాంచి యిట్లనో

దైవము తప్పఁజూచె నని తాలిమినీడఁగఁబుచ్చి యేమియు
న్భావమునందుఁ జోఁచక విపన్న తవచ్చితి నిన్నుఁజూడఁగాన్. 251

వ. అని పల్కిన నిజప్రేయసిదూరశ్రవణజ్ఞానంబుల సత్యాశ్చర్యంబు
నొంది సద్గురుకటాక్షపాత్రం బగుసిప్పయోజానన బుద్ధివలన మేలం
గుట యిహపరసాధనం బని తలంచి యాదెలో నిట్లనియె. 252

చ. కమలదళాక్షి! యీయెడలఁ గానక నే నొనరించుహత్య యే
క్రమములఁబాయు దైవత ధరాధిపవాఙ్ముఖు మెచ్చునట్లు లో
కము సరిదీరు నెప్పగిదిఁ గ్రక్కున నొక్క యుపాయమెంచి న
న్విమలునిఁజేయుమీ? యనిన నీలసరోధరవేణి యిట్లనున్. 253

తే. ఇలప్రమాదవశంబున నెనయుహత్య
లైన దేహాంతముఖవిధులందుఁ బాయు
ననుచు నార్యులచే నీవు వినుచునుండి
నన్నడుగనేల యనినఁ గేతన్న యనియె. 254

మ. మునిసంస్తుత్య తపోధనుండగు మహాత్ముం డంసి వేదోక్తి
మన పత్నాపనివృత్తిఁజేసికొన నారూఢంబుగా బుద్ధి నా
ల్కొన జిప్పట్టున నియ్యతిప్రవరుతోఁ గూడ న్మదీయాసువుల్
చనఁగాజేసెద నెంతగాలమునకుం జాకుండ జీవింతునే. 255

తే. అనిన సతి దృఢనిశ్చయం బాత్మ నెఱిఁగి
సతి యతనికన్న మున్నుగాఁ జనఁగవలయు
ననుచు మునిఁద్రుంచు కత్తిచేఁగొని గళంబు
ద్రుంచికొనఁబోవ నంతలో నంచితముగ. 256

సీ. ఉంచినాఁడేదేవుఁ డుర్వీధరేశ్వరా త్మజనర్ధదేహంబు నందు నెలమి
నించినాడేవేల్పుపంచభూతాదివ్య చంద్రాత్మమూర్తిమైజగములందు
త్రుంచినాఁడేస్వామితో యజాసనవర ప్రబల దైతేయపురత్రయంబు
కాంచినాడే దైవమంచితసార రే క్షణమున నాత్మభక్తవ్రజంబు

తే. నించి నాఁ డేమహాత్ముండు కాంచనోద
రాండ భాండంబు లెల్ల గర్భాంతరమున
నట్టి పరమేశ్వరుండు కళ్యాణమూర్తి
యమరమునిపంక్తి గొలువ ప్రత్యక్ష మయ్యె. 257

క. ఆరీతి నెదుటనిలిచిన, గౌరీశ్వరు మోదమలరఁ గన్గొని కేతం
డారూఢ భక్తితత్పర, సారసములకెఱఁగి యిటులసన్నుతిఁ జేసెన్.

సీ. ప్రాలేయశైలేంద్ర బాలికా ధీశాయ మదనాంతకాయ నమశ్శివాయ
శారద నీరద చారుదేహాయ శ్రీ మదనహరణాయ నమశ్శివాయ
ద్వాదశాత్మాగ్ని సుధాధామ నేత్రాయ మదవిదూరాయనమశ్శివాయ
గంగాతరంగసంగత జటాభాగాయ భస్మాశ్రితాంగాయనమశ్శివాయ

తే. యంబుజాతాసనత్రిదివాది నాథ
ముఖ్యదైతేయ విద్విష్ణు మూహామకుట
ఘటితకాంచన నవరత్న కాంతిపూర
మహితపాదాయ తుభ్యం నమశ్శివాయ. 259

వ. అని యిట్లు సన్నుతించు కేతనార్యుం గనుంగొని మందస్మితాననుండ గుచు, సర్వేశ్వరుండు భక్తవర! మీదృఢ భక్తిజ్ఞానంబులకు మెచ్చు వచ్చె రండని వారిరువుర పుష్పకారూఢులం గావించి తత్తపస్విం బునర్జీవితుఁ గావించి, యాతనితో వారఁ నిజధామంబునకుఁ గొని పోయెం గావున దూరశ్రవణంబునంగలయంగన మహిమం బిట్టి దింక దూరదృష్టిపదంబు దెల్పెద నని కాంతసత్తక్క నిజనాథునితో ని ట్లనియె. 260

నారదబ్రహ్మయ్య కథ.

సీ. కలఁడిలోకభక్తుండు కళ్యాణపురమున నారదబ్రహ్మాసమాహ్వయుండు
నలజయంత వసంతనలకూబరాకారుఁ డతులితశైవరహస్యవేది
సంగీతసాహిత్య సరసకళాస్ఫూర్తి సత్యవ్రతుఁడు గణార్చనవినోది
యాతనికాయకం బద్భుతం బెట్లన్నఁ దనసోయగంబు గన్గొనిన జార

తే. కామినీతిలకులు రతిఁగలయఁగోరి
పిలిచినసువర్ణటంకమే వెలత యొసఁగు
దానితోఁగూడి యస్ఖలితప్రభావ
మునను వాంఛిత మీడేర్చు మోదమంది. 261

క. ఈసరణిఁదెచ్చుద్రవ్యము, వాసుకి యజ్ఞోపవీతభక్తార్చల కై
కాసైననుమలునాటికి, మూసియిడకవ్యయ మొనర్చు మోదంబలరన్.

వ. అట్లుండి యొక్కనాఁడు. 263

మదియిఁక నెట్టులోర్తు నను మన్నననాతఁడు గాంచు టెట్టు లోఁ
బొదలిన మోహతాపశిఖిపొంగిఁక నేగతి నారు నక్కటా!
చెదరని చింతలంమునుగఁ జేసెగదా విధియేమిసేయుదున్!. 268
ఉ. గ్రక్కున నేగి యాసొగసుకానికి నావెత లెల్లఁదెల్పి యీ
చక్కికిదోడితెచ్చి మది సంతసమందఁగఁ గూర్చువారు నా
కిక్కడ నెవ్వ రిప్పగిది యిక్షుశరాసనసాయకవ్యథం
జిక్కకయుండుదాననని చేడియ చింతమునింగియుండఁగన్. 269
ఉ. ఆతరుణీలలామసఖి యత్తరి నచ్చటికేగుదెంచి మో
హాతికృశాంగియైన జలజాననఁగన్గొని డాయనేగి యో
భీతకురంగనేత్ర! యిటు బెగ్గిలి నెమ్మది లోన నింత యే
లాతపియింప? నీదగుతలం పెరిగింపుము దాఁచ కంతయున్. 270
క. చెప్పిన నెప్పనియేనియు, నిప్పుడు సమకూర్తు చెలిమి కెయ్యెడలను నే
దప్పమ తెవ్వరు నమ్మిన, కప్పురగంధు లిఁక నీకు కమలదళాక్షీ. 271
చ. అనవుడు తత్సతీతిలక మాత్మముదంబున నొంద సిగ్గువెం
పున దనవాంఛితంబు వెలిఁబుచ్చఁగలేక యొకింత సేపు న
మ్రనవముఖాబ్జయై యితరమానినులచ్చట లేకయుండుటల్
గనుఁగొని యెట్టకేలకు మొగంబొకయించుక యెత్తి యత్తరిన్.272
ఉ. నెచ్చెలిఁ జూచిపల్కెఁ దరుణీ! వినవమ్మ మనోహరాకృతిం
బచ్చనివింటిజోదు గెలువంగల యొక్కవయోవిలాసునిం
ఇచ్చగ రాజవీథి జరియింపఁగఁ గాంచితి నంతనుండి లోఁ
గచ్చుగనంగఁజొచ్చె దమకంబిఁక నేగతిఁ దాళియుండుదున్. 273
ఉ. ఎక్కడఁబోవ నైప దిఁక యేమియుఁదోఁచక మోహవార్ధిలోఁ
జిక్కిన దాని కట్టితరిఁ జేడియ నీవొకతెప్పవై వడిన్
గ్రక్కున గానుపించితివి గావున నాతనిదోడితెచ్చి నా
మక్కువదీర్పుమంచుఁ బతిమాలిన యాసఖి నవ్వి యిట్లనున్. 274
ఉ. ఈతరి నీకుగానిగుణ మెట్టిది నెమ్మది సంభవించె బ్ర
ఖ్యాతిగ బొట్టుఁగట్టువిభుకంటె విటాకృతిఁ జూడగంటికిన్
బ్రీతివహించెనే మనసు నిల్పఁగలేక పరానుకూలవై
పాతకమేలచేసెదవు బంధుజనంబులు విన్న మెత్తురే?. 275

ఉ. ఉత్తమమైనవంశమున నుద్భవమందితి వింతదాఁక స
ద్వృత్తయనంగ నొప్పితివి యేకతసత్తరి నన్యపూరుషా
యత్తమనోంబుజాత వగుటర్హమె? నీసరికామినీమణుల్
పొత్తునఁ బిల్తురే సుగతిఁ బొందఁగ నేర్తువె వారిజాననా!. 276

ఉ. అత్తగయాళి మామకపటాత్ముఁడు చెంత సపత్ని నీవుఁ బం
గుత్తుకబంటి బావ ప్రతికూలుఁడు నాథుఁడు కోపధారి ని
న్నొత్తినతోడికోడలు మహాశసి మేనట నెంచిచూచినం
గత్తులబోను కాపురము కాదని! నీతలఁ బొప్ప దియ్యెడన్. 277

మ. అసినం జిత్తములోన తిలి వయస్యా! నీవు నాతోడఁ జె
ప్పినసాంసారికధర్మమంతయు నిజంబే కాని నాదేహమా
తనితోఁ గూడక నిల్వ దెట్టులయినం దాక్షిణ్యభావంబునం
జని తోడ్తెమ్మిఁక వానిసత్వరగతిం జాతుర్య మేపారఁగన్. 278

క. వ్యామోహము దీరినతుది, నేమైనను నెన్నయింక నేమియునన కో
కామిని! నను బ్రతికింపుము, కాముఁడు మననీడ టంచుఁ గరములు మోడ్పన్.

చ. చెలి గని యింత యేలవగఁ జెందుదు? లోకము పాడిమెంచి యే
చెలిమితిఁ గాని నీకిటుల చెప్పరమాటను నేసహింతునే!
వెలఁది! యనుజ్ఞ యిమ్ముచని వేగమ తోడ్కొని వాని నిప్పుడు
న్గలపెదనన్ను మోహమునఁ గౌఁగిటఁ జేర్చి లతాంగి యత్తఱిన్. 280

ఆ. వీథి మెలఁగుచున్న విటశిఖామణి వ్రేలి, సన్న జాలకమున సతికిఁ జూపి
వాని దెచ్చి నాదు వనటఁ దీర్పుము వేగ, పడతి యనుచుఁ బంపెఁ బంపఁ బ్రటయు

సీ. ఆయళికచరత్న హార్మ్యావతీర్ణయై పురవీథి కేగతిఁ బోదు ననుచు [ను.
ద్వారబంధంబున దిడ్డివాకిటనిలిచి దైవయోగంబున నవ్విలాసి
యచటికి రాఁగనియాడఁబోయినతీర్థ మెదురైనగతి నితఁ డేగుదెంచె
నిచ్చట కనిచేర నేగిరహస్యసంగతిఁ దదంభోజాక్షి క్రమముఁ దెలుప

తే. విని యతం డాదిబూనినతన వ్రతంబు, దెలిపె సనుకన్నె టంకమే దెచ్చి యిత్తు
సంశయింపకరమ్మనిజనము లెవ్వ, రెఱుఁగఁ గారాస యొకదారి నెలమి

చ. కొని చని చంద్రకాంతమణిసద్యసువర్ణకవాటమేఘహా [మీఱు.
హానమణికట్టిమప్రకటితాంబుజరాగనిబద్ధవేదికా
ఘనతరమౌక్తికస్తబకకాంతవితానవిలింపకామినీ

జనసమసాలభంజికలసంగతినొప్పెడు మేడలోపలన్. 283

చ. శిల్పికళాఢ్య నిర్మిత విచిత్రతరా స్తరణోపరిప్రభా
నల్పసుగంధబంధురలతాంతము భాసురరత్నకాంచనో
త్కల్పితకాయమానరుచికాంతము నై తగుహంసతూలికా
తల్పమునందు నాతని ముఖంబుననుంచి లతాంగియంతటన్. 284

ఉ. వచ్చినకూర్మి పెంపెసఁగ నాయిక యున్నెడ కేఁగి లేమ! నేఁ
దెచ్చితి తద్విభుం బ్రియంబునగిదిం ఘనమొప్పి విలాసి నావుడుం
బొచ్చెము లేనికూర్మిఁగఁ బోటివినీఁ యటంచుఁ బత్నితి
న్నెచ్చి సరోరుహాననయమేయముదాప్తి నొసంగి యత్తఱిన్. 285

చ. నడుము చలింప వేణి జఘనంబు పయిన్నటియింపఁ గావిపా
వడరుచిజాళువాజిలుగుపన్ని యచీరపయింజనింప సొం
పడరిన రత్నహారనివహంబు గుచంబులఁ జొకళింప న
ప్పడతుకవచ్చెఁ బ్రాణసఖిపంపున నాకదబ్రహ్మపాలికిన్. 286

క. చను దెంచి చెలియ చెప్పిన,యనువునఁబదియారుమాడలాతని యెదుటం
గనకపుపాత్రంబున నుం, చినఁ గైకొని హర్షభరిత చిత్తుండగుచున్.

చ. తరుణికరంబువట్టి సుమతల్పము మీఁదికిఁ జేరఁదీయుచున్
సరసిజనేత్ర, వాకిలి దెసం గనుభావ మెఱింగి లేచి స
త్వరమున తన్మణీగృహకవాటము గొళ్లెము వెట్టి మళ్లినన్
సురుచిరమందహాసమున సుందరి మోముఁ బరాంచి పిల్చినన్. 288

ఉ. కామినిడాసి నిండు బిగకౌఁగిటఁబట్టి లతాంతశయ్యపైఁ
జేరిమదలిర్పఁజేర్చి తమిపెంపునఁ గాముని భంగిఁ దద్విట
గ్రామణి కేళిదేలు నెడఁ గ్రక్కునదానిసపత్ని యొక్కభా
మామణి దెల్పఁ దత్క్రియము మాటుగఁదా విని క్రోధచిత్తయై.

చ. ప్రమద మెలఁగ్పఁ దద్గృహకవాటము డగ్గఱఁజూచి బైటఁగొ
ళ్లెముదవిలించి యాత్మలవలేశముగొంకక ప్రాణభర్తకీ
క్రమ మెఱిఁగించి చూపిడుదుఁగాకనితొల్లిటి క్రోధఃప్రత్తి పెం
పమరఁగఁగాపువెట్టె నల నాకదబ్రహ్మయ దేవి యంతటన్. 290

చ. తనపతి రాకఁజూఁగయినఁ దత్క్రియమంతయు జ్ఞానదృష్టిచేఁ
గనుఁగొని చింతలేక మిహికాకరమౌళి కృపాకటాక్ష వీక్షా

యనువున నుండె శాంభవ వ్రతార్చనమానుటఁ గూడ నెట్టు లా
ఘనవ్రతవస్తుమే నిపుడు గైకొని యీదినచర్యఁ జేసెదన్. 291

వ. అని విచారించి. 292

చ. కులుకులబోటి యంత గబ్బిచనుగుబ్బలపై నజాజారుపై
న్నలరెడు జాజికొప్పుఁగల నాతులు పాపలి కేలఁ బెల్లుగా
కలపలి కేల మొల్లవిరిబంతి విటాళికిఁ జేకరైక న్య
స్వానము సల్పి సల్పి దలవాకిలి వెంత విలోకనంబునన్. 293

ఉ. ఆగతి నిల్చినం బురజనావళి తత్సతిఁ గాంచి యిమ్మహా
భాగ యిదేమొకో? యితరపద్ధతి నేఁడు వహించియుండె నా
వేగతి నుండుఁ గాక! మన కేమిటికిం కిమె గుణంబు లెంచ రా
వ్యాగనివాసుఁడే యెఱుఁగునంచుఁ బజానతుఁ జూచు నేగఁగాన్. 294

మ. జలజాతాయతనేత్ర భావమరయం జంద్రార్ధకోటీరుఁ డ
య్యలఘుభాస్వద్విషేషియై యొరపుఁగా నేతెంచి యొయ్యారి! మే
ల్పడఁగా నిచ్చిన దానిఁ గాంచి వరిఁ జేరం బోయి యోకాంత! యె
క్కడ నేఁ గన్గొనలేదు నీవిలసదాకారాక్షిలీలాగతుల్. 295

చ. అలికులవేణి! నిన్ననిదయప్పటినుండి మదీయచిత్తమ
గ్గలముగ నిన్నుఁ జెందె ననిగాదు వలె నిత్తరి నీకుఁ బగ్గరో
వెలయుఁడ లేచు గాని కలచిత్తము దాఁచక యిత్తు నొమ్ము మా
డలుపడియుండుటన్న మగువంబలికెఁ దా సతిసమ్మతాత్మయై. 296

చ. అనఘతరాత్మ! నే గొనుపదార్థమ దంతియ కాని యెక్కడా
ధనమున కాససేయ ప్రమదంబున లోపలి కేగుదెంచి యెం
దనభవదీయవాంఛితము దీర్చికొనం దగు సత్వరంబుగా
ననిన వరస్మితాంచితముఖాంకురుహంబున నాతఁ డిట్లనున్. 297

ఉ. ఒక్కెడ మాకు చాలపనియున్నది మే మటపోయి క్రమ్మఱం
గ్రక్కున వత్తుమీ ముడుపు గైకొనుమంచు నొసంగఁబోవ మీ
యక్కఱఁ దీర్పఁ జిమ్ముట పదార్థముఁ జేకొనఁ జెల్లుఁ గాక ముం
దక్కట నట్టుచుం బుచ్చికొనధర్మమె యంచు లతాంగి పల్కినన్. 298

ఉ. ఇచ్చిన ముల్లె గైకొనుట కేటికి గొంకెద విప్పుఁడైన న
న్నచ్చుగ నేల నట్టి తుదనైన నొసంగెదు వాఁడ నేను యే

వెచ్చము గ్రింపనైన నివిపీడునపిమ్మట వెమ్మటన్న నే
నిచ్చునదేమిగాన కొను నిందునిభానన యన్న నిట్లనున్!. 299

ఉ. మాయలమాట లేమిటికి మున్ని యమంబు వినుండు తెల్పెద
న్నాయక యీగతిం బెపసనాథుఁడు గ్రుంకిన దాఁకయుండి త
త్కాయకలబ్ధి రాత్రిగణకొండసమున్న లోనర్చుహారమ
త్యాయతసక్తభానుఁ డపరాంబుధిఁజేరుచు నుండెగావునన్. 300

ఆ. సమ్మతించి తేని యిమ్ముల్లెయొసఁగునీ
కోర్కె యిపుడె తీర్చి కొనఁగవలయు
కాసియెడలభనము గైకొనమాటల
ప్రొద్దుఁగడపవ్రతము పోవుననిన. 301

ఉ. కామినియట్టెపోయి తిరుగం జనుదెంతు నటన్నమాత్రనీ
నేమముపోవునే తెలియ నేరని దానవుగాన నింతికిం
గాముకుఁ డర్థమిచ్చి తన కార్యముఁ దీరిచికొకపోవఁ డిం
కేమిటికింత చేర్చుకొను నిచ్చెదద్రవ్యము వేగవచ్చెదన్. 302

చ. అని బహుభంగుల న్జలరుహాక్షికి నమ్మికపుట్టబల్కి నో
య్యనవొడపాటొనర్చి పదియాఱువరాల్ సతిచేతికిచ్చి యా
ఘనుఁడటఁబాసిపోయెఁ గలకంఠి యొకించుకసేపుచూచి యా
తనిపునరాగతక్రమము దప్పిననంతవిచారచిత్తయై. 303

చ. కటకట! మోసపోతి దినకాయక మేగతిఁదీర్తుఁ బద్మినీ
విటుఁ డపరాద్రిఁజేరె నలవేడుక కాఁ డిట రాకయుండె న
క్కుటిలునిమాట బబ్బరనికోకధనంబపు డేల కొంటి నే
డెటువలెదొంటికై పడి గణేశ్వరపూజలు చెల్లుదైవమా!. 304

ఉ. కాయకలబ్ధికై యరిగి కాంతుఁడు బందిని జిక్కెఁ దత్క్రియం
బీ యెడ నేవహించి దినకృత్యము దీర్తునటంచుఁ బూసినన్
*మాయవిటుండు నను మాటల నేభ్రమయించిపోయి రాఁ
డాయె ధనవ్యయంబు కొఱయాఁనె తదీప్సితసిద్ధిగాకమున్. 305

ఉ. ఇంతటికేమి మన్ని యమమిద్దివసంబున గానియట్లు గా
స్వాంతము నందుఁదోఁచె నిఁక వంచనయేటికి చింతఁదక్కి దే
హాంతమొనర్తునంచు నిశితాసియురంబున నాను నంతలో

గంతువిరోధిమ్రోలఁ బొడకట్టైనహేమాచలకందరంబుఁ జెచ్చెఱన్. 306

తే. అటుల సన్నిధి నెయఁ బంకజాక్షి
విస్మయానందములు మది వెల్లిగొనఁగ
మ్రొక్కి నిల్చిన శర్వుఁ డామునితొ యనుఁగు
పుత్త్రి నక మునిపల్కిన నెలుఁగు మీరి. 307

క. గిరిజేశ! మీకు సంగిన, పరముగ నా న్నాకుఁదనుగనె వల్లభుఁ డొకచో
వెఱపరియుండెఁ నాతని, కరుణంబిలుపించియుండు కామితఫలముల్.

తే. అనినపరమానపదనుఁడై యద్రిసంభ
వాధినాయకుఁ డట్లె? యూ యనుచు ననఘ
భార్యవై నట్టి యాపర బ్రహ్మునాత్మ
ముదముననదలంచె నంతకమున్న యచట. 309

సీ. అలఘనికుని పిన్న యాలునపత్నిగా పరభవవీక్షణ వాంఛదవిలి
రమణుండు రాజకార్యపుతెగ నంతరిపురమునకు నరగునరాకయున్న
నెప్పుడువచ్చెడ నెప్పుడు కీసిచూపుదునంచు కోరిక నెదురుచూచు
చుండెనాలో బ్రహ్మఁ డొక్కింత సేపుండి మగుడరానేరకమానసమున

తే. వ్రతముజరుపుటకై వచ్చి బందిపడితి
ప్రొద్దుగ్రుంకుచు నున్నది పోవరాదు
నేఁడు గణపూజసాగ దెన్నిటగణింప
నను పరిత్యాగనర్హమా యనుచునుండి. 310

క. తనువించుకపరవశమై, కను దెఱచిన యంతలోన గఱకంఠుకృపం
దనమందిరమున నిల్చిన, గనితత్క్షముదాక్షి మోదకమలధిదేలెన్.

ఉ. అత్తరినాథునుండు హృదయంబున విస్మయ మావహిల్లన
త్తైత్తి గణేశసర్వదిగధీశ వృషేశమునీశ యుక్తుఁడౌ
చిత్తజవైరిగాంచి కలఁ జెందితినో యదిగాక నిక్కమో
యిత్తెఱఁగౌట కేమికత మియ్యెడనంచుఁ దలంచుచుండఁగన్. 312

ఉ. బాలశశాంకశేఖరుఁడు భక్తవరా! యిటురమ్ము! నీదుజం
బాలరుహాక్షి నీవచట బందిని జిక్కభవద్వ్రతంబుఁ దా
నాలరిగాఁగ నీకవెలయాలివిధంబు వహించె నోయగం
బాలలితామలాంగి యహహా యనిమానసమందు మెచ్చఁగన్. 313

చ. అటుల వహించి ద్వారముల కంతట నింతట సంచరించి నీ
క్కటకజనంబు లెల్ల నెడగాజననొల్లక పల్లవుండనై
యిటకరుదెంచి బల్మి ముడుపిచ్చెద వచ్చెదనంచు నేగె నం
తటమఱికొంత సేపు గని తన్విశరీరము వీడఁజూడఁగాన్. 314

గీ. అంతలోనేము ప్రత్యక్షమై వరంబు
వేఁడు మనవుడు నిన్నురప్పించియొసఁగు
మనియెఁ గావున నిటకు రాఁబనిచినాఁడ
నడుగువాంఛితమనిన బ్రహ్మాయ్య దెలసి. 315

క. ప్రమదమనోపహరుండగు, ప్రమథేశ్వరుదివ్యపాదపద్మంబులకుం
ప్రమదారత్నము తానును, ప్రమదంబున మ్రొక్కి యిటుల బ్రస్తుతి చేసెన్.

సీ. దరసమదేహమందరధరాధర గేహ పన్నగభూషయాపన్నపోష
కాండధితూణ ప్రకాండశైశవబాణ రాజకిరీటఘోరాజఘోట
సురనుతపాత్రభాసురతమోహాననేత్ర నతమునిజాల దీనతతిపాల
కరధృతశూలశ్రీకరపార్వతీలోల నవకృత్తివాసదానవనిరాస

తే. వనజమృదుపాదసేవకావనవినోద
కల్పవిధిదీక్షయాశ్రితకల్పవృక్ష
పరభయదవేష ఘనదయాపరమనీష
కాలముఖశాస్త్రశాతకంకాళహస్త. 317

చ. అనియిటుసన్నుతించి ప్రమథాధిపతావకమూర్తి దర్శనం
బొనరుటకంటె వేరె మఱియున్నదె వాంఛితమైన వేడెద
న్ననురతిగూడినట్టి లలనావళితోడుత నన్ను నీపదం
బున దయఁజేర్పవే యనిన భోగివిభీషణుఁడావరంబునన్. 318

తే. అట్లయగాక! యనుచు బ్రహ్మాయ్య నతని
కామినీమణి నాతనిఁ గలసినట్టి
మందయానలఁ బుష్పవిమానపంక్తిఁ
గూర్చి కొనిపోయెఁ గైలాసకుధరమునకు. 319

వ. అంతతద్ధనికాంగనయు బ్రహ్మాయ్యసాంగత్యవిశేషంబున తేజోమయ
స్వరూపయై కైలాసంబున కేగుచు నాస్థానంబున నున్న నిజనాథు
నకు తనమోక్షపదప్రాప్తివిధం బెఱింగించి యతండు చూడ

నంతర్ధానంబు నొందిన నచ్చెరువంది వేగంబ యభ్యంతరమందిరం
బునకుం జనిన యాతనిపెన్నయాఁ డెదురువచ్చి సవతి నేరం బెంచుచు నత
నిం గొని చని యదె చూడుమని తలుపుగొళ్లెంబుదీయ తద్గృహంబు
శూన్యంబైయున్న జూచు సతి లజ్జనొందియుండె నతం డొక్కింతసేపు
చింతాక్రాంతుండై నిజసతీలలామభాగ్యం బగ్గించుచుఁ దనవారిక
త్తెఱంగు నెఱింగింపుచు నంజలినూని యెప్పటియట్ల వర్తిల్లె గావున
దూరదృష్టిగలసతీవతంసంబు మాహాత్మ్యం బిట్టిదని నిజనాథునితోఁ
గ్రమ్మఱ దద్వృత్తాంతంబు సత్వరంగాఁ జెప్పం దలంచి శాంతసత్త
క్క యిట్లనియె. 320

ఉ. ఉత్తరి నచ్చటం గలగణాధిపులెల్లను విస్మితాత్ములై
యిత్తెఱఁ గెందునుం గలదె యింతియుభర్తయు నేకచిత్తులై
బత్తియొనర్చి రంచు బహుభంగుల సన్నుతిసేయ నందులో
నుత్తముఁ డొక్కరుండనియె సూక్తిసుధారస ముప్పతిల్లఁగన్. 321

సీ. శ్రీకాళహస్తిపురీస్థలి నైన నరుండన నొక్కభక్తుఁ డంగనయుఁ దాను
నయ్యలేమడిగిన నడుగిడకిచ్చుచు నుండంగ వారలు యుల్లమలర
కట్టుబట్టయతప్ప నడు లేమిఁబుట్టించి శర్వుఁడు భక్తుఁడై చలినివచ్చి
బట్టవేఁడినవాని పడతికట్టినదియ్యఁ గొనఁగ నేగిన నొంటికొకతనకు
తే. చాల దంచేఁగెనో యని నైనదాఖ్యుఁ
డాత్మనస్త్రమొసంగఁ బో నంతలోన
నచటఁ బ్రత్యక్షమై తన్మహాత్మ్యుఁ దెలసి
వారిఁ గొనిపోయె నాత్మనివాసమునకు. 322

ఘ్రాణదబ్రహ్మయ్య కథ.

వ. మఱియును. 323

తే. ఘ్రాణదబ్రహ్మయాఖ్యుఁడు గలఁ డొకండు
జంగమారాధనవినోది సత్యవాది
యఖిలవేదాంతవేదనిత్యాను మోది
యమృతసంపాది పరిజనిత్యాన్యవాది. 324

ఉ. బాణవిరోధిబాణ పదభక్తుఁ డతండు మహిష్ఠభక్తిక
ళ్యాణమున న్వసించి యనయంబును గాలము గోలజాలెయుం

పాణితలంబునం బిడి ప్రభాతమునందు గభీరవాహినీ
వేణుల నేగి యందు మది వేడుక మీనులఁబట్టి వానిలోన్. 325

తే. తొలుతఁ దగులు చేప తుహినాంశుధరునకు
నవలఁదగులు మీన మద్రిసుతకు
మఱియుఁ దగులునట్టి మత్స్యంబు గురునికై
తలగవిడచి పిదపఁ దగులువాని. 326

ఉ. బంగనమర్చి తెచ్చి మదిపొంగక వేగమ తత్క్రియార్హమౌ
నంగడివీథిలోన నవియన్నియునమ్మి తదీయలబ్ధిచే
జంగమకోటి కర్చనలుసల్పుచు నుండెను నొక్కనాఁడు హృ
త్సంగతహర్షయై యతనితామరసాయతనేత్ర నమ్రతన్. 327

చ. వరునకు మ్రొక్కి యిట్లనియె వల్లభ! శ్రీబసవప్రధానుమం
దిరమున నేఁడు నాఁడనక తృప్తిగ లక్షయు దొంబదారు వేల్
శరణులు షడ్రసాన్నము మెసంగుసురాగణకోటి నొక్కనాఁ
డరయగ మద్గృహంబున శిలార్చన సేయ వదేమి చెప్పుమా. 328

ఉ. పొందుగ వారిఁబిల్చుటకు బుద్ధిజనింపదొ శక్తిచాలదో
యెందులకేగకుండ బసవేశ్వరు డంపఁడు నడ్డగించెనో
యిందున కేలరారు మది కెంతయుఁ గోరికపుట్టె నిప్డు డా
నందముగాఁ దదీయభజనం బొనరింపఁగ నన్నఁ బ్రీతుఁడై. 329

మ. బాలా! నీకిటువంటివాంఛితములోఁబాటిల్లె మేలయ్యె నే
నేలీలం జని మ్రొక్కి వేఁడికొని నీయిష్టంబు చేకూర త
త్కాలాత్మాంఘ్రిసరోజభక్తితిలకవ్రాతంబు దోతెచ్చి నేఁ
డేలింగార్చన సల్పఁజేయుదుఁ జుమీ డెందంబునం దింపుఁగన్. 330

క. అనిపలికి నతిరయమ్మునఁ, బని విని యాశరణవరుఁడు బసవేశనికే
తనమునకొయ్యనఁజనియట, నసుభవమంటపమునందు నద్భుతలీలన్.

సీ. ఘనపురాతనభక్తగణకాద్యులగువారు
శీలమార్గవిమర్శ సేయువారు
కర్మఫలత్యాగధర్మ మెన్నెడువారు
నపవర్గమిట్టిది యనెడువారు
శైవాగమగ్రంథ సంధానులగువారు

వేదాంతసూక్తుల వెలయుచూరు
మంత్రమంత్రార్థము ల్మహిమఁ జెప్పెడువారు
త్రివిధార్చనోన్నతిఁ దెలుపువారు
తే. నగుచు యొడ్డోలగంబున్న నఖిలజాలి
భక్తతతిఁజేరి సాష్టాంగవందనంబు
సలిపి పీఠ్యంబు భూతి తత్సన్నిధాన
మందు నిడి భక్తిఁ దొలుత బ్రహ్మయ్య యనియె. 332
చ. సదమల చిత్తులార! తమసన్నిధి నేనొక విన్నపంబుచే
సెద దయ చిత్తమం దునిచి సేవకునింట శివార్చనంబు మే
ల్గదుర నొనర్పఁగా వలయుఁ గన్నడ సేయక మీరలన్న నె
మ్మది వెలుఁగొంది వా రనిరి మందరసస్మితవక్త్రపద్ములై. 333
ఉ. ఎన్నఁడు నిన్నెఱుంగము నిఁకెక్కడ నెయ్యది పేరుల్ంగసం
పన్నుఁ డనం బ్రసిద్ధి గనుబండరికేగెడుఁ గాక భూమిపై
నెన్నఁగ వేఱొకండు గలఁడే మమునందఱఁ బిల్చిపెట్ట నీ
వన్న సదుక్తి కీట్టులన నాయితుగాదన నాతఁ డిట్లనున్. 334
ఆ. ఘనగుణాఢ్యులార! ఘ్రాణవ బ్రహ్మయ్య
నామ మిప్పురంబు ననవసించు
మీకృపాసమృద్ధి నేకొఱతయుగల్గ
దరుగుదెండు సంశయంబుమాని. 335
చ. అన విని సమ్మతించి శరణావళిభూతి గ్రహింపఁబొంది య
య్యనఘుఁడు వేగ నేగి ప్రియకఁతయుఁ దప్పకచెప్పి తొంటిలా
గునఁ దనకాయకంబు కొఱకుం జని చాల గలుంగ మీలఁగై
కొనిచని యొక్కవీథి వెలకుం దగనమ్ముచు నున్న తత్తఱిన్. 336
క. ఒకభక్తుఁడుగనిచనిగణ,సికరమునకుఁ దద్విధంబునిజముగఁదెలుపఁగా
నిక్క యెమ్మృష యోయనివేఁజొకనిననుప నేగియాతఁడుల్లం బెరియన్.
చ. కనుగొని వేగవచ్చి గణకాండముగన్గొని స్వాములార! నేఁ
బని విని గాంచి వచ్చితలవాఁ డొకయంగడి హేయ మెంచక
మ్మునమున నొక్కమీనమిడి మూగిన నీగలఁజేతిరెమ్మ బోఁ
జునుపుచు దీనిగొండు వెలసా మ్మనియమ్ముచు నున్నవాఁ డనన్,338

మ. వినివాఁ డంచటు మోసపుచ్చె నిఁక నే వెంటం జన న్వచ్చు నే
మని వైనారిణవాసవాన్వితకుటీరాన్నంబు నేనెట్లు గై
కొనవచ్చుఁ గ సనివప్పె నీదినము కన్మూర్తింబడం జెల్ల ది
ప్పనికై యాతఁడురా వెనంగడిమి కంపం జెల్లునం చాఘనుల్. 331

క. ఒక్కమతినున్న బ్రహ్మం, డక్కడమీఁ లమ్మి తెచ్చు నర్థము చేఁ బెం
పెక్క మతిబోక యత్నం, బక్కజముగఁ జేయఁ బనిచెనక్షయలీలన్.

వ. తదనంతరంబ యతండు. 341

చ. అరిగి గణాళిఁ గాంచి శరణార్థిశివార్చన వేళయయ్యె స
త్వరముగ రండు మీర లిట తద్గుణపుంజములోన ధూర్తులౌ
శరణులు కొంద ఱౌర! యొకసక్కములాడఁగ వచ్చినాఁడ పో
విరసులగాఁగ నెంచితివె వీరలనంచటు నీమనంబునన్. 342

చ. అసమసుగంధబంధురములై చెలువొందెడు పద్రసాన్నముల్
బసవనియింట నిత్యము సపారముగా భుజియింపుచుండు నీ
కుసుమశరారిభక్తులను గూరిచి పెట్టఁదలంచినాఁడ పో
మసలిడి మత్స్యమాంస మనుమానము లేక భవద్గృహంబునన్. 343

ఉ. ఇచ్చటనుండఁగూడ దిఁక నేగుడు డీవనసాములార! మీ
యిచ్చకొలంది చేకురెడు హీనపువస్తువు లేల యన్న స
న్మచ్చికగాంచి రమ్మనెడు మాత్రనె పైఁబడి మొత్తితొట్టఁచిన
స్మచ్చముమనింగివచ్చి తనముద్దియకంతయుఁ జెప్పెఁ జెప్పినన్. 344

చ. తనమదిలోన కొంతవడి తామరనేత్రుణ చింతనొంది యేఁ
జని వినయంబునన్ శరణసంతతికిం బ్రణమిల్లి వేగదో
డ్కొని యిటువత్తునంచు గణకూటముఁ జేరఁగ నేఁగి మ్రొక్కి యో
యనఘతరాత్ములార! పదరయ్య శివార్చనవేళ మించెడిన్. 345

మ. అనినన్ మీగృహసీమభోజనము సేయన్ సమ్మతిం జెంద రీ
యనఘాత్ముల్ చనుమింక నిప్పలుకు మారాడంగ నూహించి తే
ని నిజాధీశునకాపరాభవము తస్వీ నిన్నుఁ జెందుం జుమీ
యన ఖిన్నాననయై వెసంజనియె నాత్మావాసముం జేరఁగన్. 346

మ. చనిప్రాణేశ్వరుతోడఁ దద్గతి సవిస్తారంబుగాఁ దెల్పె యో
యనఘాత్మా! శరణాళికై సలుపు నీయత్నం బయో! వ్యర్థమై

చనునట్లుండె నిఁకేమి యీశ్వరకటాక్షం బెట్లుగానున్నదో
యని యాతండును దానునెంతయును చింతాక్రాంతులై యుచ్చటన్.

తే. అంత వృత్తాంతమును ఫణిహారివలన
వినియమాత్యాగ్రగణ్యుండు విస్మితాంత
రంగుఁడై వేగగణనికరంబు పరియ
నరిగి సాష్టాంగమొనరఁగి యట్లనినాఁ డిపుడు. 348

సీ. ఘనులారయారక్షేత్రాణదబ్రహ్మాయ్యగారి గారియఁట్టెట్టుఁగార్యమేమి?
హింసాపరుండని యెంచితిరేని జొమ్మయ్యాదిభక్తుల ఖ్యాతివినరె?
యతినీచకాయకంబనిగణించితిరేని యదిభక్తకాయకంబనియెఱాఁగె?
కులమె ముఖ్యంబని తలఁచితిరేనికక్కయ్యమున్నగుశరణాళిగనరె?

తే. కర్దమమున తమ్మి కాష్ఠంబులోనగ్ని
పలలమందుపాలు శిలలపసిడి
గలిగి వెలుఁగునట్లు ఘనులెట్లు లుండిరి
కొఱఁతగనమి మీర లెఱుఁగరయ్య. 349

మ. జలధివ్రాతపరీతభూతలమునన్ సాటిన్మృగవ్యాధరు
ద్రుఁడుగాఁడే ఘనుఁ డామహాత్ముఁ డన నిందోపింపఁగాఁ బాడియే
మృడుభక్తావళిభూతియం దిడుట బ త్మేలందురే కావునన్
గడువేడ్కం జని యాదరింపవలయుం గాకన్న వారంపలున్. 350

ఉ. దిగ్గునలేచి యాబసవభీమణి నీమనిఁదోఁచుమార్గమే
యొగ్గగు గాన బోదమని ముంపలి చారునిఁ బంప వారలం
డగ్గరఁజేరి యాతఁ డెదురన్ ధరజాగిలిమ్రొక్కఁ గాంచి వే
యగ్గలమైన ప్రేమ దొలుకాడఁగ లేవఁగనెత్తి యిద్దఱున్. 351

క. ఓయయ్యాయేమివచ్చితి, వీయెడ కని యడుగ నాతఁ డిదె బసవనితో
మీయాలయమున మాధవ,సాయకభక్తాళిగుడుప జనుదెంచెనవన్.

చ. అమృతము వీనులం జిలుకునట్లుగఁ దద్వచనానుభూతి మో
దము మదిఁ బొంగి పర్వ విని తండ్రి! దయాపరమూర్తి శోకవా
ర్ధి మునిఁగియున్న మాకడకుఁ దెప్పవిధంబున వచ్చినాఁడ విం
క మఱుతుమయ్య యుష్మదుపకారమటంచు నుతించుచుండఁగాన్.

ఛ. గొడుగులు నాలవట్టములు గుంచెలు చామరతాళవృంతముల్

పడగలు శోభిలంగఁ బదపాయుఁ డహో! యని కంచుసువ్రజం
బెడ నెడ నెచ్చరింప బసవేశ పురస్సరులై ముదంబునం
బుడమి చలింపవచ్చె గణపుంజము తద్గృహాసీమకత్తరిన్. 354
సీ. ఎదురేగి ముదమున ముదితయు దాను సాష్టాంగంబు చేసి పాద్యాదులిచ్చి
తోడ్తెచ్చి సిర్మధికోయ మజ్జనములు గావించి మడుగులు గట్ట నిచ్చి
పరుసదీర్చిన రంగవల్లులవెంబడి బంతులు సాగించి పత్రపుష్ప
గంధాక్షతాదిలింగసమర్చనద్రవ్యములుగూర్చి తత్క్రియల్ జరుపు [నంత
తే. భాసురాచ్ఛిద్రకదళికాపత్రభాజ
నములు మెల్లన ప్రక్షాళనం బొనర్చి
తానె కొనివచ్చి వారికందఱికి వైచి
స్వర్ణరచితపుభపకముల్ సరసనునిచె. 355
క. అంతటఁ దద్గజగామిని, సంతోష మెలర్ప భక్తసంఘంబునకుం
స్వాంతములుపల్లవింపఁగ, వింతఁగవడ్డింపఁదొడఁ రెవిభునాజ్ఞ మెయిన్.
చ. కలమపువంటకం బిగురుకాయలుగూరలు గందిపప్పు ద
ప్పళములు చారు రాపయిడు పచ్చడు లామ్రరసంబు దేనె య
ప్పళములు బొబ్బిమూలములు బాయసముల్ పులఖండ మూరుగా
యలు వరుగుల్ ఫలంబు లొడియంబులు గమ్మని నెయ్యి వెన్నయున్.
తే. గారె లరిసెలు బొబ్బట్లు గరిజెకాయ
లట్లు బూరెలు జంతికెచుట్లు మణుగు
బూలు వెన్నప్పములు జటుబూరె లిడ్డె
నలు మనోహరములు వంట చలిమిడియును. 358
తే పరఁగ నమృతంబుతో సరిపాలు పాలు
పేర్మిమంచున నిరసించు పెరుఁగు పెరుఁగు
చాల వెన్నెలరుచి వెడచల్లు చల్ల
మేటిరుచిజాలముల్గలలోని తేట తేట. 359
క. ఎవ్వరికేవ్విధి యిష్టం, బవ్విధి వడ్డింప శివుని కర్పించి రుచుల్
నివ్వటిల భక్తులందఱు, నవ్వేచు నారోగింపఁబొనర్చిరి తమిచేన్.
తే. అంతఁ గర్పూరతాంబూల మర్పణంబు
చేసి యొకయెడ నంద తాసీనులైన

యవసరంబున నెదుట బ్రహ్మాయ్య కేలు
మొగిచి నిలిచినబసవండు ముదమెలర్ప 361

చ. అతనిప్రభావమెల్ల శరణావళికింగనుపింపఁబూసియో
యతులగుణాఢ్యనీవహరహంబొనరించెడు వేఁట యెట్టిదో
కుతుకముతోఁగనుంగొనఁగ గోరిరిభక్తులుగాన వీరి యా
ప్సితమొనఁగూర్పుమాయనిన వేగమ బ్రహ్మయ సంతసంబునన్. 362

మ. సకలారాధ్యవరభక్తకోటికడు మెచ్చంజెంతతన్మజ్జనో
దకకుండాంతికమందు నిల్చికరయుగ్మంబునం జుట్టుజా
లెకబంధారకమందునిల్పితిపనజేఖాళిబ్రహ్మచ్యకేం
ద్రకకుప్పాలకరుద్రగోపగిరిజాతా శర్వమూర్తుల్వడిన్. 363

క. అమ్మొననొక్కొక్కపరి గ్రమ్ముననాశరణులని చెలంగుచు దనిచి
త్తమ్ములగడువిస్మయమొ, నమ్ములు బెనఁగొనఁగ లేచిధరణిరథునకున్.

క. సాష్టాంగమెఱఁగిశంకర, దుష్టగజాసురవిదూరతో యోక్షవనే
త్రేష్టఫణినాయకాంగద, యష్టాపదశైలచాపహరిత్రిపురారీ. 365

చ. అనివినుతించుచున్నసమయంబున ధూర్జటిబ్రహ్మచర్యుఁడ
ప్పవరుహనేత్రఁగాంచి చెలువంబగుతానకభక్తికాత్మమె
చ్చొనరపసంతసపోవమని యజ్జ్వలపుష్పవిమానమెక్కఁగా
బనిచినిజాలయంబులకు వారలఁదోడ్కొనిపోయె నత్తరిన్. 366

చ. బసవఁడుమున్నుగాఁగలుగుభక్తులు హెూయిటు లెన్నఁడెవ్వర
వ్వసుమతిగాన లేదితఁడు వట్టినకాయకమెంత యుప్పు డీ
యసదృశజంగమార్చన మహామహిమంబది యెంతబాపురే
ప్రసవశరారి మెచ్చుగను భక్తుఁడితండె మదిం దలంచఁగాన్. 367

క. అనియిటు తద్దంపతులును, గొనియాడుచుభోజనమునకున్మెచ్చుచుభ
క్తనికాయమునైజనికే, తనములకుంజనియె మంత్రితనయుఁలు చేరన్.

వ. అనిచెప్పి యాజంగమఁర్యుండింతి యెదుటనున్న వారలెల్లనేక మన
స్కులై యావత్సమయంబునన్నైనను భక్తిపదలక నీశ్వరుకరుణవడ
సీన శరణులురు గలరు తత్క్రమం బెట్టిదనిన వినుండని ఇట్లనియె.

ఉ. శంకరపాదభక్తుఁ డఘశాసనుఁడాంతర్వైరవర్గనా
శంకరుఁడార్యసన్నుతుఁడు శాశ్వతకీర్తియుతుండు ఖండితా

హంకరణుండు పావకగుణాఢ్యుఁడు మారట శంభుమూర్తిని
శ్శంకసమాహ్వయుండు గణసత్తముఁ డొప్పు ధరాతలంబునన్. 370

మారటశంభుమూర్తి యను నిశ్శంకుని కథ.

ఉ. అతఁడుగురూపదేశమున హాలికుఁడౌచు తదీయలబ్ధి చే
సతతముజంగమార్చనము సల్పుచునుండఁగ నొక్కనాఁడుత
న్మతిఁబరికింప శర్వుఁడు కుమారుఁడు నాతడు చేనుదున్నఁగా
ధృతిగతినొక్కఘోరవిషకృష్ణభుజంగముఁ బంపెనంపినన్. 371

శా. తత్కుంభీనసమాత్మ దంతగరళోద్యత్పావకజ్వాలికా
ఫూత్కారంబులు పర్వ నాతనిసుతుల్ బోల్పార మూర్ఛిన్నచో
హృత్కంపంబున బొందడక్షులజలం జేతేరనీవిప్పుఁడా
పత్కాలం బరుదెంచె నంచు వడిఁ జెప్పం జేరి కించిద్వ్యథన్. 372

క. జననీజనకులు దలఁపఁడు, వనితామణినడుపఁడాప్తవర్గముఁబిలువం
గనుమానపడఁడుమాంత్రిక,జనముం జేర్పఁడు కాలుజాడింపఁడొగిన్.

క. చెడుపురువని నెమ్మదిలో, వడవఁడునిజకాయకంబువప్పఁడు పెదవుల్
వడపఁడుదైవముదూరఁడు,బుడుతనిధైర్యము గణింపఁబోలు నెజగతిన్.

క. అటులుండికొంతవడిక, క్కుటిలోరగవిషము రోమకూపంబులని
క్కటమైపర్వుచుపలకె,క్కటయుంగతజీవుఁడగుచుఁ గూలెన్నేలన్.

క. అక్కరణిఁబడినసుతుఁగని, యెక్కింతయుపగవకాతఁ డూరకవానిం
గ్రక్కునవీడిచితనపగు, దుక్కిపనుల్ సేయుచున్న ధూర్జటియంతన్.

తే. అప్పటప్పటికప్పురికరిగిభిక్షు,గొనుచుపమునన్దఁనిముస్సుగురు తెఱుఁగు
శరణుకైవడినొక్కవేషంబు దాల్చి, యలసితనచేనిచెంగటసిలఁచి యు[న్న.

తే. జంగమాకృతిగాంచి నిశ్శంకుఁడేరు
నిలిపివందనమొనరింప నిటలమందు
భూతిధరియించి యోపుణ్యపురుష యింత
వంటకము పెట్టు మాకొన్న వారమనిన. 378

చ. గరళగళాభ యొక్క ఘటికాద్వయమీడ నిలుండు తెత్తురో
గిరములుమీకు యోగ్యముగఁ గిల్కొనునాఁకట నంతదాఁకనో
ర్వరయితి రేనిమామకనివాసముఁ జేరి భుజింపుఁడేనస
త్వరమునవత్తుఁగాని యటవచ్చినసిచ్చట గాయకంబరున్. 379

చ. ఇదియును మీవిధించుపని యే యటుగావున పాండు వేగ మ
ల్లదె తెరువన్నమల్లి శరణాగ్రణిపోవఁగ చెంతగాలఁ బెక్క
గుడిగొను కాలసర్పమునఁ గూలినయన్నను గాంచి బిట్టు గా
నవరివడంకుచుం బరిగి యత్తులు మూయుచు ఛేతుకై వడిన్. 380

క. తనపైఁబడనిశ్శంకుఁడు, వెనుచేతులఁజఱచి యింతవెఱవఁగ నోహో
యననాతఁడిట్లులను మీ, తనయుండట్లనికి కనరె తలకవు మదిలోన్.

సీ. పాపనివధియించెఁ బాపపురుషుని, దానిఁజంపవదేమి దలఁచినావు
పసులమాపనకై నబరితపించుపబుధు,ల్గోడుకునికెడమీదుపుడమిఁగలదె
యింతనిర్భాగ్యహీని యెంచుఁజూడఁగ లేదు, నీయంతకఠినుని నిన్నె కాని
పుత్రలాభంబెంత పుణ్యవంతునకబ్బు,గతిఁజేర్ప నేరిక సుతుఁడు కాఁడె

తే. యనిన నిశ్శంకుఁడనియె ఋణానుబంధ
మునను సమకూడుదురుసతి కొనయముఖ్యు
లవనినది సిరఁగోప్రుదు వంతమంత్ర
మునను దగఁజెందనేటికో యనఘమూర్తి. 382

తే. పాండుసుతుఁ డర్జునుం డంత పరితపించి
మరలదేనోపెనే యఘమన్యుఁదొల్లి
యెచటితలిదండ్రు లయ్యేరో యెచటిసుతులు
చిక్కనేమాయనీపవసేపకుండు. 383

సీ.అనిన వృషాజంగమార్యుండుగినిని నీ విపరీతవైరాగ్య మిపుడుమాని
భక్తులకెఱిగింపు బ్రతికింతురీతని నెట్లన్న నొక్కమహీంతలేశుఁ
బెలిదేవి వేమయ్యప్రీతిచేబ్రదికించె మునుపిల్లనైనారు మనిచె వెలమ
నటుగాన వేగ భక్తాళికిఁగతిఁజెల్ప పననీకు నేజతపత్తుఁగాని

తే. యనిన నిశ్శంకుఁడని యె నోయయ్యసకల
మెఱిఁగియుండియు మీరిటు లేలపల్క
జిక్కిమాదన్న యీశ్వరుఁ జెందువిధము
దెలిపెనాభక్తులకువాని తీగఁబోణి. 384

క. కావున ననిత్యతనువుల, కేవగఁజెందంగఁ జెల్లునే యన మది త
ద్దేవుండచ్చెరువందుచు, నాఁడలికరుగంగవానియన్న మును మునన్.

క. కనుపించినవానికి త, మ్మునిగతివినుపింపనప్పుమోమున యనెనో

యనఘాత్మ మీరలెఱుఁగని, ఘనతరసద్భక్తిపథము గలదేజగతిన్.

శా. సాయంకాలమునందు పక్షులు ధరాజాతంబునం దన్నియుం
దోయం బై వసియించి వేగవిడియందుంబోవ కొండొంటితో
బాయంజాలక సిల్చునే యటులనోభవ్యాత్మ యీసోదర
న్యాయంబిట్టిద వాసికై పగవఁగా నర్హంబె నాకిత్తఱిన్. 387

చ. అనవుడు నీప్రపోజగతి సంపతికెంతెవిరాగి చెన్నము
న్ని నకులుఁడై నరామధరణీశుఁడు తమ్మునిపాటుఁ గాంచి లో
గనివగనొపధావళులఁ గ్రమ్మఱ జీఁ ముసిల్చి కొంటతో
చనిపసి చేసెనో యెఱుకచాలదొ యాతని కివ్విధంబునన్. 388

తే. భక్తి విజ్ఞానములుగల్గు ఫలము భార్యత్ర
మోహ మెడ బాయుటయె చాలు గూహకంబు
లెన్ని జన్మములకుఁ గల్గునిట్టి తమ్ము
డక్కటా యెంతకఠినుఁడవయ్య నీవు. 389

వ. అనిన నతం డిట్లనియె. 390

తే. చనిన దేశికవర కరస్థలి జనకుఁడు
జంగమము దాదిసద్భక్తి సాగమూర్తి
సోదరుఁడ సత్యమగుశీల యొనరుముక్తి
తరుణియటుగాక వేఱె బాంధవులు గలరె?. 391

క. అనవుడు నాటసిమది మె, త్తనగానక యవలఁజనుచు దర్వీకరద [న్.
ష్టునిపడిగాంచియు తద్గతి, వినుపించిన నిటులఁ బల్కె వేఁడియతనితో

తే. అంతనొకచోటఁ గూడినజనులువచ్చి, పనులుదీరినతుదివిడిచన రెమగుడ
వగచిరే యొకరొక్కరు వారలట్లు, కాడెయీబంధకంబనిగడచిచనఁగ.

ఉ. అచ్చెరువంది శూలిచను చవ్వల నాతని భార్యగాంచి యా
ముచ్చటలెల్లఁ జెల్ప విని మోమున దీనత లేకపల్కెనో
నచ్చరితోగ్రగణ్యజనసంతతి ధారుణియందుఁ బుట్టుటల్
చచ్చుటలబ్బురంబె సువిచారులు మెచ్చనిమాట లేటికిన్. 394

చ. అతులనదీప్రవాహమున నాడదియీడది రెండుకాష్ఠముల్
జతపడి కొంతదవ్వరిగి లంకతటాలున నడ్డమైనయా
జతవిడి యొక్కటేగునటు సాగర మొక్కటి నిల్చుగావున

స్వాత కుడువంగనేల ననుపీడె నతం డని నెమ్మనంబునన్. 396

క. నావుఁడుగుహనాశరణుం, డావెల్లఁదుకతోడ ననియె నబలా ధర నీ
భావంబువంటి కితెనవు, భావం బెయ్యెడలఁ గానఁబడ దెటులన్నన్.

క. పెనిమిటికర్థాంగం బగు, వనజేక్షణ యనెడునుడిలవంబును నీయం
దునఁ గాన మర్థ దేహాంగ నినుం జెందంగ నెట్లు గాంచం గలవో.

మ. పతిదైవంబు గురుండు ప్రాణమనుచుం భావంబులో నిల్పి యం
చితభక్తిం జరియించి యాతఁడు మృతిం జెందఁగఁ గేహార్థమా
తృతనూజన్మపితృప్రియాప్రముఖులందే భ్రాంతియుక్తి లేక యూ
ర్జితబుద్ధిక్షసహయానకాసతులు నర్పింపంగ నజ్ఞానులే. 398

చ. అన విని యాలతాంగి వినయంబున నిట్లను దేవ నాథుతో
ననుగమనంబు చేడియల కర్తమె కాని తలంప వీరకై
పనికరమార్గముం దదిధువంబుగఁ జెల్లదు మీరెఱుంగరే?
యనుపమవేదశాస్త్రనివహంబులఁ జెల్పెడురీతు లన్నియున్. 399

క. కావున తనలింగంబె, దైవంబు గురుండు తల్లి దండ్రియుఁ బతియుం
జీవంబు గతియు మఱియును, భావింపఁగ వేఱెకలదె భక్తాధీనా.

చ. అనవుడు నేమియుం బలుక కవ్విలికేగి వధీయమాతతోఁ
దనయునివార్తఁ జెల్ప వనితామణి నెమ్మదిఁ గొంకులేక యి
ట్లనెను సమస్తయోనిజవరాగతనీచఘటాలిభిన్నమై
చనుటయెకాక నిల్చునె రసాస్థలి నో బుధవర్య! తెల్పుమా. 401

క. తనయుండనవల్లి యనక, ఘననాట్యపుఁ బొమ్మలింతెకాక నతములో
ధనదావ్తుమాయజివ్రరం,టినఁబడుదురు జనులు కడువడిని పక్షిగతిన్.

క. అనియు మృషాశరణుఁడవో, వనితాతిలకంబ సర్వ వసుధాస్థలి నేఁ
గనుగొంటిగాన నీతో, నెనయదు కొనాత్మఁ జూడ నెచ్చట నైనన్.

తే. తల్లిఁ బోలినదైవంబు దయితసాటిఁ
బంధు వాత్మజమోహంబువంట మోహ
మనని లేదని యనఁగ నీ యట్టితనయుఁ
డట్టులైయున్న గన్నుల నైనఁగనవు. 404

ఉ. ఆమయదేహి వెట్టి వికలాంగకుఁ డైనను దల్లి సూనుపైఁ
బ్రేమవిడంగఁ జాలదు ధరిత్రివయుం గణియింప రోగి గాఁ

దేమిట వెట్టిగాఁడు రుచిరేతరగాత్రుఁడుగాఁడు నీసుత
గ్రామణి యిట్టివాఁ డవటుగాఁ బడఁజా లెటులేదు నీమదెన్. 405

ఉ. ఇంతటికేమిఁ నీగొనయు సిట్టిపదంబును జెందఁజేసె నా
కంతుమదాపహారి కలకాలము సేమఱఁబోక నెమ్మదిం
భ్రాంతి వహింపక యాత్మపదపద్మము నమ్మినఁ జువ్వె యింతపె
న్వాంత ఘటించె వెల్తిడిసె నాసతి యాశివుఁ గొల్చుభాగ్యముల్.

చ. అన విని యాలతాంగి శరణాగ్రణి! న న్నిటులేని భ్రాంతి జా
న్వినఫలమేమి! యీశ్వరుని నింద యొనర్పఁగనేల? దేహముల్
వనరుహబుద్బుదంబు లటులంటివి నిత్యములంచు వెఱ్ఱులై
చనుదురె? తాపకీనపదసారసభక్తులు ధారుణీస్థలిన్. 407

క. చల్లన గంధపహారిన, నొల్లక ఫణి మన్ను దినఁగ నోపునె మీపద
త్పల్లవదాస్యం బమణి, యెల్లెడ భక్తుండు మోహ మెదలో నిడునే.

చ. అన విని చెచ్చెర న్మఱలి యచ్చట శూలధరుండు వారిదా
సిని గని తత్క్రియం బెఱుఁగఁజేసిన నిట్లనుఁ దండ్రి! యమ్మచూ
పిన జనయిత్రి పెన్వెసముఁ బెట్టిన నీశుఁడు చంపఁజూచినం
జనవన మాన్ప నెవ్వరికి శక్యము? దుర్భ్రమ లేల? నాపుడున్. 409

సీ. అటుబాసి పడియున్న యక్కుమారుని వెస
కేతెంచి సర్వంబు నెడచివైచి
చెవిదండ మంత్రించి చేమెయి సిమిరి భ
స్మముఁజల్లి లెమ్మనుమాత్ర నతఁడు
కనుదెప్పలెత్తి నిట్టన నీల్గి యూరుపు
లావిర్భవింపఁగా నావులించి
పరమేశ్వరా! యని పల్కుచు లేచి చెం
గట నిల్చి యున్న దన్గాంచి మ్రొక్క

తే. నాఁత డోరికుమార! ని న్నహి వధింప
నించుకేనియుఁ గనికర ముంచఁబోక
యూర కున్నారు మీవార లౌర! యెంత
కఠినులో యిట్టిజనులను గాన మెచట. [లం

క. మం దనరు మంత్ర మన రే, చందముఁ గలజనకమాత్రుఁ జాయామాగ్రజు

డెందమున విశ్వసించుట, యుంగంబని నాకుఁ దోఁచ నది యెట్లన్నన్.

తే. భీమసైతము తన్నింటఁ జొబ్బవాఁడపి
దండ మొనరించునప్పుడు డాసపాటి
కినుకయును లేదు నీ వెంతఁ గనికరంబు
లేక చరియించువారిపై లేశ మనిన. 412

సీ. పాపులైనావారుజాలినొందఁ బంచు, సహింపమింపమి యంటివారికగు నె
యుర్విపై బొరలుటలుత్తనూంగొనక, తాడనములుబొబ్బ లేడుపులును
మేరలుంగకయున్కి కానసాగి చలుంపుఁ, గనితఁ జోఁతలుతనువిరక్తి
యివి మొదలగు చేష్టల వసింపారిక, భ్రాంతులయ్యాకాక భవదుదార

తే. పత్పయోరుహచింతనాపరుల కెందుఁ
గలుగ నేర్చునె యాప్తవర్గంబులెల్ల
సర్వసాధనములు గల్గి సర్వనిహతి
కాపరీక్షిన్మహారాజు నాగికొనిరె.? 413

క. అనవిని వారల నంగజు, ఘనసత్త్వశీలభక్తికలనను మదినె
క్కొనుసమ్మదమునమునిగణ సనకాదవరచక్రముఖసుపర్వులుగొలువన్.

ఉ. శంకరుఁ డక్షయుం డపుడు సన్నిధి చేసినఁగాంచి యంత ని
శ్శంకుఁడు దుక్కిసిల్పి యతిసత్త్వుఁడై చనుదెంచి యీశప
త్పంకరుహద్వయంబు తనఫాలమునసోఁకి నమస్కరించి స
ద్వంకపగాంగభంగరవవైఖరి సన్నుతిచేసె నేగతిన్. 415

సీ. శ్రీవికచోత్పలాక్షీమనోహరబాణ, బాణసంగత పాదపంకజాత
జాతరూపధరాధరాతతకోదండ, దండధరోద్దప్పదళనదక్ష
దక్షకృతోరువితాననాశికకరతలన్యస్తభాసురకురంగ
రంగదుత్తుంగతరంగగంగాధర, ధరజామనస్సంస్థాయిహంస

తే. హంసకైరవమిత్ర హవ్యాళనాక్ష, యక్షజన్మానివినుతమహాప్రభావ
భావసంభవదుర్మదభావహరణ, రణనిహతసింధురాట్పుత్రప్రముఖదైత్య.

వ. అని సన్నుతించుచున్న నిశ్శంకుని శంకరుండు నిజకరుణాకటాక్షవీక్ష
ణామృతధారాపరిషిక్తాంగుం జేసి భక్తపరాతావకీనచర్యావిశేషంబు
లకు మెచ్చువచ్చె భవదీప్సితం బొసంగెద వేఁడు మనిన నతండు పు
నఃపునఃప్రణామంబు లొనరించి దేవా! భగవద్దర్శనంబుకంటెవాంఛి

తం బొం డెద్దియసి నిరుపమానం బంబున నున్న నతనిసత్పుత్త్రస్నుషా
పరిచారికాసమేతునింగాఁ గైలాసంబునకుం గొనిపోయె నని చెప్పిన
తత్ప్రభావసదులైన భక్తు లాశ్రయణపుంగవుంగాంచి మీ రానతిచ్చిన
మహాత్ములచరితంబులు వినుటం జేసి కృతార్థుల మైతిమని యతనిం
గొనియాడి యంతలు నిజనివాసంబుల కరిగి రట్లుగావునఁ బ్రాణే
శ్వరా! భక్తప్రభావం బెట్టిదని వర్ణన సేయ బ్రహ్మాదుల కశక్యంబె
నెంతదాన ననిశాంతసత్తక్క పలికిన వన్మనోహరుం డాశ్చర్యంబు
నొంది యి ట్లనియె భవత్స్వచరిత్రపౌనివాసం బెచ్చట నమ్మహాభాగం
గనుంగొన వేడుక పుట్టెనని తత్సతీవతంసంబు భవదభిప్రాయం బెట్ల
ట్లరమ్మని యతనిం దోడ్కొని. 417

ఉ. శైలములు త్తరించి ఘనసాలవనంబులు మించి వాహినీ
జాలములెల్ల దాఁటి మృగసర్పవిహారయసయామినీచరా
భీలవిహారదేశముఁ బెంపగు శైలవరింగజానుహ్వా
న్మాళిపదావలగ్న నిజమానసయై వచియించుసోవరిన్. 418

తే. వలికిఁ జూపిన నతఁడు విభ్రాంతుఁడగుచు
నింతతప మొనరించెడు నింతి కేల
హరుఁడు ప్రత్యక్షమై నిల్వఁడబల యనిన
వినయమున శాంతసత్తక్క యని యె నిటుల. 419

మ. గురుచర్యం బోకలింగనుచ్చి, యిటనీకు న్వేల్పు తత్పూజనా
చరణం బే సకలంబు సుమ్మనిన నాచార్యాజ్ఞ లంఘించి సుం
దరి యోగంబె ఘనం బటంచు నెపుడుం దన్నిష్ఠచేనుండి గా
నరసాస్యందనుఁడాదరంబున బ్రసన్నుం బోట లే దీ పెకున్. 420

వ. అనిన నతం డాచార్యాజ్ఞ మీఱినకతంబునఁగాదె యెంతయోగంబైన
ను బసిగొనదయ్యె నీక దీనిం గృతార్థం జేయవలయు నని తలంచిన
నిజపత్నిం గనుంగొని యి ట్లనియె. 421

ఉ. సజ్జనులెంతయుం బరవిషాదముగాంచి సహించ రన్న చో
నిజ్జలజాక్షి నీకుఁ గణియింపఁగ బోవరి యేగతి న్మహా
సజ్జలధాసిముస్ద్గరగవాకనియుఁ బరిజేర్పకుంట యో
పిజ్జలతావతంస దయఁ జేకొని దీని కృతార్థఁ జేయవే. 422

తే. అనిన ముదమంది పతికి జోహారుసల్పి కలితపద్మాసనస్థయై కరతలమున
లింగమూర్తిని నిల్పి సల్లీలదృష్టి నొందుభావమె ఱుంగక యుండునంత.

తే. హస్తమున జ్యోతిరాకారుఁ డైనలింగ
మూర్తి యవయవసహితుఁడై ముదితయెదుట
సన్నిధి యొసర్పఁ గాంచి తత్సాధ్వి వినయ
భరితయై మ్రొక్కి యిట్టులఁ బ్రస్తుతించె. 424

ఉత్సాహము. తారహార హీరతుల్యధావళ్యవిగ్రహా
శూరమారవార శౌరిసూనునాశనా విషాదనా
సారధీరవారవంద్య సర్వమంగళాధిపా
భారభూరధారమేరు బాణబాణపోషణా. 425

చ. అని వినుతింప శంభుఁడు దయామతి వేఁడుము వాంఛితంబు నా
ఘనకచమాకు ముక్తిసరణిఁ గల్గఁగఁ జేయుము నీపదంబునన్
అనవుడు నట్లుగాక యని యప్పుడు దివ్యవిమానపంక్తిచేఁ
గొని చనె రౌప్యశైలమునకున్ సుర లద్భుతమందిచూడఁగాన్.

వ. కావున పావనసతీవతంస మాహాత్మ్యం బిట్టిదని నిజచ్ఛాత్రుం డైన యీ కూకదమారనితోఁ జెప్పి నతండును విస్మయాక్రాంతుండై పునఃపునఃప్రణామంబు లొనరించి వధూసహితంబుగాఁ గరకమలం బులు మొగిచి నిలిచినఁ గరుణార్ద్రదృష్టిం గనుంగొని చెన్నబసవేశ్వరుసన్నిధికిఁ బొమ్మని యనుజ్ఞ యిచ్చి నిజేచ్ఛం జనియెం గావున నీలమాహాత్మ్యం బిట్టిదని మాచిరాజయ్య చెప్పిన సభాసదులోఁ జెన్నబసవేశ్వరుం డత్యంతప్రమోదంబు నొంది యతని నిరంతరరాజ నదుపచారంబులఁ బూజింపుచుండె. 427

క. కూకదమారనిచరితము, ప్రాకటసద్భక్తి వినినఁ బఠియించిన ద
ర్వీకరభూషణుకృప నస్తోకశుభావళులు బరఁగుదురు నరు లెప్పుడున్.

వ. అని చెప్పిన నగస్త్యుండు తరువాతవృత్తాంతం బేమని యడిగిన. 429

శా. పట్కాలాబ్జధరార్చనానియమభాస్వచ్చిత్త సంజాత గో
రాట్కంసారికుబేరపుత్ర సుకుమార శ్రీసమాశ్లిష్ట గో
రాట్కంఠీరవశారదాబ్జకరశుభ్రద్రాజస్వకీర్తిఖ్యాతి వి
ద్విట్కాండాద్భుతబాహుశౌర్యజిత కుంతీవ్యోమగంగాసుతా. 430

క. శరజాతజన్మమృదుపద, శరజాతవిలగ్నహృదయ సద్డింభక శ్రీ
శరణసమాగతదేశిక, శరణసపర్యావిధాన సంతుష్టమతీ. 431

మాలినీ. సరసగుణనివాసా శంభుపూజావిలాసా
నిరుపమశుభమూర్తీ నిర్మలాచారవర్తీ
దురితతిమిరసూరా తోషితాప్తార్యవారా
పరహృదయవిభేదీ బంధులోకప్రమోదీ. 432

గద్యము. ఇది శ్రీమచ్చెన్నమల్లికార్జున కరుణాకటాక్షలబ్ధకవితామాధురీ ధురీణ కౌశికగోత్రపవిత్ర సుకవిజనస్తుత్యపాపయారాధ్య ప్రణీతం బైన చెన్నబసవపురాణం బను మహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.



# పంచమాశ్వాసము.



## మల్లయ్య బ్రహ్మయ్యల కథ.



విబుధాపనకృత్యా
కేవలతరనియమమునితగిరివరభృత్యా
పావనజనతాస్తుత్యా
జావర్ధితనిత్యసత్య యమృతామాత్యా. 1

వ. అవధరింపుము కుంభసంభవునకు రేణుకుం డవ్వలికథ యిట్లని చెప్పం
దొడంగె. [మంత్రి

తే. అంతనొకనాఁడు మల్లబ్రహ్మయ్యనాఁగ, భక్తులిరువురు శ్రీచెన్నబసవ
పజ్జవింతగదివిటీలుబట్టువిధము, దెలిసిదుర్మంత్రి యొకఁడుబిజ్జలునిఁజేరి.

చ. నరవర ! వింటివేబసవనాథునియల్లుని సన్నిధానమం
దిరువురు పూరుషోత్తము లహీనబలాఢ్యులు దివ్వెటీల వా
రరుదుగనున్నవారలు మహాద్భుతమయ్యెడు వారిచర్య గో
చరమొనరింప నెట్లనిన సర్వముఁదెల్పెద చిత్తగింపుమా!. 4

తే. వారుచేఁబట్టి దివిటీలు వచ్చినఁ గూర్ప
కయిరగుల్కాను దైలసంగతముగాక
యేవెలుఁగుతేజ మెడలక నెప్పుఁ డచటఁ
గానఁబడునంతనవ్వు సౌగంధ్య మొసఁగు. 5

చ. అన విని రాజు చెన్నబసవాధిపు నప్పుడె పిల్వఁబంచి యో
యనఘ! భవత్సమీపగతులై తగుదివ్వెలవారి సిద్ధుల
న్ననుఁ గొలువంగఁ బంపు మనినం బరమేశ్వరుఁ డెంత దెచ్చె నా
ఘనులు దురాగ్రతుం గొలువఁ దా నెటుపంపుదునేమిసేయుదున్. 6

ఉ. పంపఁగరాదు వారి నటఁ బంపకయుండిన మామమీఁద నే
తెంపు వహించునో యితఁడు దెప్పరమయ్యె నటంచు చింత త

స్మింప నోకింత సేపు తనమో మఱవాలిచియుండి యట్టులం
బంపఁగఁ జీవ బవ్వలఁ గనంబడు దీనికి తన్మహత్వముల్. 7

చ. అని మదినిశ్చయించి ఫణిహారిముఖంబున వారిఁ బిల్వఁగాఁ
బనిచి మహీతలేశ్వరునిభావము దెల్పఁగఁ బూని జంకి న
మ్ర సిజముఖాంబుజాతుఁడయి వకానము దాలిచి తన్మనోగతం
బనఘులుగాంచి మ స్మితని కిప్పన సేయుమకొంక నేటికిన్.? 8

క. నావుడువారలయనుమతి, భూవరునకుఁగానుపించిపో యెడమనిస్వ
యోవాసము చింతాకుల, భావమునం జెందెఁ జెన్నబసవండంతన్.

క. బండారుబసవఫణిమణి, మండలపతి నడిచినట్టిమార్గము విని యా
తం డింతకొత్తుకొనె నిఁక, నొండేగతిసంభవించునోయనియుండెన్.

చ. మనుజవరుండు దుర్మతిని మల్లయ బ్రహ్మయగార్ల నిద్దఱన్
దనమొడది వ్వటీలిడఁగఁదక్షణమాసమయంబునందు రాఁ
బనిచినఁ దేటగాఁ దమప్రభావముఁ జూపుదు మంచు నేగి య
య్యనఘులు వానికట్టెదుట నంచలుఁజూడఁగ నిల్చిచెచ్చెఱన్. 11

తే. పలుడిపిడిదివ్వటీలు చేబట్టికగులు
కొలువునంతటిలోన నక్కోటిదివ్వ
టీలుగాడనమూడ్కొఁగడిండిమంట
లాత్మతనుతాప మొనరింప నవనివిభుఁడు. 12

ఉ. తాళఁగలేక తాల్మిచెడి తల్లడమందుచులేచి నేలపై
వ్రాలుచుఁ బొర్లుచున్ విహితవర్గముఁ జీరుచుఁ బెద్దసిందుపై
సోలుచు నల్లడల్ బెగడిచూచుచుఁ గ్రమ్మఱఁగన్నుమూయుచున్
గే లెదఁజేర్చుచున్ జలువక్రేవలకేగుచు నీరుఁద్రావుచున్. 13

క. వా యెత్తియఱచుచుండఁగ, నా యెడబసవేశుఁడనియె నవనీశ్వర! నీ
కాయపరితాపవేదన, బాయువిధం బొకటిదోఁచె పరికింపంగన్. 14

చ. అదియెటులన్న మాధవశరాపరమూర్తులు శాంభవేందిరాం
బుదపవనుల్ మహాత్ములని బుద్ధిఁదలంపక దుష్టబోధ నీ
మదిఁగనిదివ్వటీలిడఁగ మల్లయ బ్రహ్మయగార్లని త్తరి
న్మదమునఁ బంచుహేతువున మంటలు నీకుదయించె మించుగన్. 15

క. కావున నప్పని యెడ నిపు, డావీరుల మాన్ప నీకు నారోగ్యమగున్.

నావుడు పతిద్రోహి భసిమడి, చేవిన చెక్కబొమ్మటంచుఁ జెప్పినమాడ్కిన్.
సీ. ఆసైగఁగని తెలియక భూవరుండనకుఁ గోపము వచ్చె ననుచు బత్తములవారు
వారలఁగనుసి యవ్వాఁకేగుమని వెట్టుగడిమిన చిఱునవ్వు గదుర నిండ్ల
కరిగేగి కచ్చుట భవశీను తాపంబు మంత్రించినట్టుఁ దమానుటయును
జనకని గని యతం డసమాక్షి కృత్యనీ కతన నేటికిఁ బ్రతికితి నటంచు
తే. వేయువిధములఁ గొనియాడి వేడుకొల్పి
చచ్చి పుట్టినయట్టుల సంతసిలుచుఁ
గొలువు చాలించి నగరలోపలికి నరిగె
రాజమంత్రియు నిజమందిరమున కరిగె. 17
సీ. ఆమఱునాఁడు నరసాధిపవర్యుండు నేమములేకయే నిన్ని బత్త
మల్లయ్య మధుపయ్య యనుభక్తవర్యులఁ బిలిపించి కన్నులఁ బెఱుకఁ జేయ
పసిబసవఁడు కోపశీలుఁడై బిజ్జలుండకటా! చెడచూచె ననుచు వారి
రక్షించి యెఱుక నెప్పటి యట్లన జనని భక్తాళి కప్పట్టణమున
తే. నింక నుండుట తప్పు నేఁడట్టులయ్యె, నిన్నటట్టులయ్యెనని తనయున్న కడకు
వేగ జగదేకమంత్రి రావించి యతని, కెల్ల భక్తులు వినుచుండ నిట్టులనియె.

మల్లయ్య మధుపయ్యల కథ.

సీ. జగదీశ! నీవుముక్కు జంగమేత ప్రకృత్య మొనరించి వారల కినుక కోర్వఁ
జాలక వేగ తచ్చరణంబు నొంచిన నిచట నీ ద్రోహి యింకఁ గొంత
కాలంబు నను బుట్టు గలదు తద్ద్రోహి నింట చుమ్ము వెలుంగు చెంతగిన
యట్టి ప్రాయశ్చిత్తమని రిగావున నీవు జవనీసుఁ డట్టి ద్రోహం బొనర్చె
తే. అట్టులగుట జంగమాజ్ఞఁ దప్పక నేఁడ, ఖలుని వాని బట్టి శిలుకుమార్చి
సకలభక్తవితతి సన్నుతింపఁగ సుమ, కార్ముకాపహారి కరుణఁగనుము.
క. అని తెలిపి యతని బంపం, బనిచి యమాత్యేశ్వరుండు భగినీతనుజ
న్మని కెఱుకఁ జేసి యాతని యనుమతిఁ బురి వెడలనడచి యాక్షణమాత్రన్.
సీ. మడివాలు మాచయ్య మసణయ్య మాచిరాజయ్య యేకాంత రామ
య్య ఖిండ, సంగయ్య వనిపుర శంకర దేవయ్య యచ్చయ్య మధుపయ్య
యనిమిషయ్య, కిలికేత బ్రహ్మయ్య కక్కయ్య తెలుఁగు జొమ్మయ్య బ
ల్లేశు మల్లయ్య వీర, బ్రహ్మయ్య కన్నడ బ్రహ్మయ్య కిన్నర బ్రహ్మయ్య
ప్రేవుల బ్రబ్బతయ్య

తే. ఆత్మదేవయ్య సురియచోడయ్య భాస్క-
రయ్య కొట్టురుబాచిదేవయ్య హిల్ల
పాళబ్రహ్మయ్య ముసిడిచౌడయ్య నాగు
మయ్య పడమరుసయ్య శూలాయుధయ్య. 21

చ. మొనఁగుభక్తరాజి కడుమోదముతోఁ జనుదేఱ నచ్చటన్
గదిలి సమస్తశైవశుభకారణ కప్పడి సంగమేశ్వరం
బదె యిదె యంచు నేగి బసవాధిపుఁ డచ్చట దేశికాగభి
త్సవనముఁ జెంది యాతని ప్రసన్నునిఁ జేయ గణాలిచూడఁగన్. 22

చ. గురుఁ డువరంబు నిచ్చి కడుఁగ్రుచ్చియుఁ గౌఁగిటఁ జేర్చు చాట్పున
న్వరగుణధుర్యుఁ డైన బసవప్రభులోపలఁ జేసికొంచు వే
వరిగె గృహంబులోపలికి నంతట మ్రోసె సుపర్వదుందుభుల్
గురిసె లతాంతవృష్టి సుమకోమలు లాడిరి మింట జంటలై. 23

తే. అంతయును గాంచి యచటిభక్తాళి యాత్మ
భరితచింతల శ్రీచెన్నబసవవిభునిఁ
గాంచి మీమాను యిటులయ్యెఁ గాన నింక
భారకుండవు నీవె మాపాలికనిన. 24

క. నే నెంతవాఁడ మీపలు, పూని నడుపు డనిన నెట్లుపోయెడనని లో
నూనినభక్తింపచ్చుర, ణానుత్కుఁడై యపుడె వారియందఱతోడన్. 25

తే. అచటఁ బాసి వచ్చి యతిరమ్యమగునొక్క-
వనముఁ జేరి బసవపర్యుచర్య
లుగ్గడించుకొనుచు నుండిరచ్చటబస
వండు వెడలఁ బడవ పట్టణమున. 26

సీ. ధరణిచణంకె మాతంగవనములింకె
తారలు రాలె సౌధములు కూలె
వనతతు లెండె సర్పములతోఁకలు వండె
వరదులు గూసె దిక్పాలి మాసె
రవియుగ్మ ముదయించె రాజంతకునిఁ గాంచె
పిడుగులువడి యిరాగుడులు పడియె
సస్యముల్ మాడె శీర్షముల కాకములాడె

కండలు గురిసె శీకటులు బెరసె
తే. కషణముల్ పుచ్చె మృత్యువుఁగొన వచ్చె
యగ్గిచల్లారె నిండ్లనయ్యములుచేరె
ధూళిమినుగప్పె వడిసుడిగాలిరొప్పె
ప్రజలకళ యెల్లఁదప్పె నప్పట్టునందు. 27
వ. మఱియు నీదృశ్యంబులగు ననేకదుర్నిమిత్తంబులు పుట్టిన. 28
చ. అటు చని యింకుకీడుగని యంబజుక్షితిలి చింతనొందికం
తట జగదేవమంత్రికుఁడా శివపూజయొనర్చివేగని
క్కటకపతింవధింపఁ జనగావలె నంచు నిజాలయంబుఁ జే
రుటఁ గని తల్లి తక్రియము రూఢిగము స్వనియుండుటన్ నృపన్.
మ. శరణద్రోహము విన్నయంతట నె యాచండాలు మర్దింపకే
రరుదేరం జనునే? గణాజ్ఞఁగొని మీరాలస్యముం జేతురే
హరుఁ డిబ్బంగినిమెచ్చునే శిరికిపండా ఛలచెబ్బొండ యే
కరణిం బాయునటంచుఁ బెక్కుగతులం గర్జించి తర్జించినన్. 30
చ. శిర మఱసంచి తప్పితము చెందెఁ గదా యని లజ్జనొంది స
త్వరమున నీగుఁ బూన్చి తనతల్లియొసంగిన భంగి వేగ మో
గిరము భుజించుచుండఁగ నకిల్బిషచిత్తులు మల్లబ్రహ్మగా
రిరువురువచ్చికూడి భుజయించిరి యాతనితోడ వేడుకన్. 31
ఉ. ఆగతి నారగించి పరమాద్భుతపీవరసాతిరేక సం!
యోగమనస్కులై మువ్వురు నుర్విగిహాల్పుగ నిశ్చయించి క
ర్పూరగరుచందనాంబరసుమాదులుదాల్చి యమాత్యమాతకుం
జాగిలియాపె దీవన లొసంగినఁ గైకొని లేచి చెచ్చెఱన్. 32
చ. కరములు మండలాగ్రములు గ్రాలఁగ గేహమునిర్గమించి భూ
వరుసభ చేరఁగా నరిగి వాంశికపైఁ జికెన ర్తకావిబం
ధురతరలీల లెంచుచు కుతూహలియై కరదీపికాసము
త్కరరుచిపర్వమానికపు గద్దియపైఁ గొలువున్న బిజ్జలున్. 33
చ. తటుకునఁగాంచి కన్గవలదారుణవహ్నికణంబు లొల్కను
ద్భటతరసింహనాదముల తారలుమేరలు మీరి ధారుణిం
ధాటతొటరాల పర్వడులుఁ ద్రొక్కుచు నందఱమీఁద నొక్కటన్

బటపటపండ్లుగిటుచు సభాజనముల్ వెఱఁగంది చూడఁగాన్. 34

మ. ప్రళయాక్షీలకపాలిపాలికల తద్రాజాధముల్ జేరని
శ్చలులై యేసిరి మున్స్వొక్కమొగి చంచచ్ఛాత ఖడ్గంబులం
బలశత్రింసహాకిశోరమర్దితఘనానాగంబు చందంబుగా
నిలసైఁగూలె నతండు జెగ్గిలి జనంబెల్ల న్నవ్వ షింబారఁగన్. 35

వ. ఇట్లు బిజ్జలుంబరిమార్చి మువ్వురు రాజమందిరంబు వెడలి రప్పుడు జగదేవుండు మల్లయ్యబ్రహ్మయ్యగారలఁ దత్సమయసముచితాలాపంబుల వీడ్కొలిపి నిజసదనంబులకుం జని నమస్కారపూర్వకంబుగా నంతవృత్తాంతంబు తల్లి కెఱింగించి తదనుగ్రహంబు వడసి రాజసేవాపరాధం బొనరించుట విన్నయంత నే వానిం జంపక జాగుచేసిన తప్పున కాత్మతనుత్యాగంబె ప్రాయశ్చిత్తంబని గండకత్తెఱ గళంబున నవిలించుకొను నంతటలోన సర్వేశ్వరుం డగుపార్వతీశ్వరుండు ప్రత్యక్షంబై యతని తన్మాతృపుత్రమిత్రకళత్రాదులను స్వశరీరంబుతో కైలాసంబునకుఁ గొనిపోయె మల్లయ్యబ్రహ్మయ్య లపుడే కళ్యాణపురంబు వెడలి చెన్నబసవేశ్వరనివాసం బరయుచుం జని యతనిం గాంచి గణప్రకారం బంతయుం దెల్పి వారు నచ్చటనేయుండి రంత నచ్చట సూర్యోదయంబగుటయు పట్టణంబున. 36

చ. ధరణిపుచావు తెల్లముగఁ దత్ప్రియబాంధవులెల్ల గాంచి హా
ద్భుతవిషాదవేదనలఁ దల్లడమందుచు వానికగ్నిసం
స్కారమొనర్చి యింత బలుగాఁదపసుల్ బసవంం డొనర్చెగా
కొరులకు శక్యమే మనకొప్పదు వీని నుపేక్ష సేయఁగన్. 37

తే. ఇంత పనికొప్పుకొను బసవేశ్వరునిక
దాప్తులను వానియల్లుని నవనివిడఁసి
తోటివారిగఁజేయుటె సూటియనుచు
నంద ఆలోచనలొనర్చి రంత మీఁద. 38

వ. కొన్నిదినంబులు చన్నపిదప. 39

చ. అరిబలభంగగంగ చతురంగబలంబులతోడ నాచమూ
వరులను బంచి తన్నృపతి బంధువు లాప్తులు భేరికాహళా
ధిరవమ్ము లొక్కపెట్ట దివిదీటుకొనన్ సమర్థానుకూలభా

సద్వ్రతావేశులై పురమువాహ్యబలోద్ధతి నిర్గమింపఁగన్. 40

సీ. స్యందనధ్వజపటాంచలజాతవాతముల్ తోయదపంక్తులఁ దూలఁజేయ
పటుతరసింధురపదఘట్టనంబుల ధర మోఁయు శేషాహి శిరము వంచ
తురగోరింఖోద్ధూతధరణీపరాగంబు సోఁగసబాంధవ సరణిఁ గప్పఁ
బటుసింహనిస్వనాస్ఫాటులు మదాపహా దిగ్గజంబుల నిట్టు మొగ్గఁజేయ
తే. నడచె నత్తరి బలవితానంబు బాణ, మండలాగ్ర పరశ్వధ భిండివాల
పట్టిస కుఠార ముద్గర ప్రాస ముఖ్య, సాధనప్రభలాభీలసమితి వెలుఁగ. 41

వ. మఱియు నవ్వాహినీవాహినియుం బోలె బహుళశైవలహారివిరాజమానంబై పుష్పితోద్యానంబునుం బోలె మత్తభ్రమరసారంగవిలసితంబై ధరాధరగహ్వరంబునుం బోలె నుద్భటసింహనాదంబై వైకుంఠంబునుం బోలె చక్రిసంచారస్థానంబై సత్యలోకంబునుం బోలె లోకేశ్వరభాషావిశేషోత్సాహసహితంబై కైలాసంబునుం బోలె నభంగధర్మవాహంబై భాగవతంబునుం బోలె సింహబలారికర్ణశల్యోట్టహాసంబై భారతంబునుం బోలె నసమాస్త్రనిరుద్ధంబై రామాయణంబునుం బోలె విశ్వామిత్రగతానవాసనంబై యాకాశంబునుం బోలె రాజహంసవిలాసభాసురంబై ప్రావృట్కాలంబునుం బోలె శరధారాప్రకృష్టంబై ఘోరకాంతారంబునుం బోలె ఖడ్గాచ్ఛభల్లపుండరీకాధిష్ఠితంబై పెంపు మిగిలి నడతెంచు సమయంబున నవ్వనంబున నున్న శరణపుంగవు లక్కోలాహలంబు చాలించి సముత్సుకవృత్తారోహులై తమమీఁద వాడిపెట్టవచ్చిరని సముద్దీపితకోపాటోపంబున. 42

సీ. గట్టుతునుకలు సేయుఁ జెట్టుదేవయ్య మదకరివిదళించుమాచవిభుఁడు
గిరి జేతఁ బల్కించు కిన్నరబ్రహ్మయ్య భవుని ప్రేవ్రేలఁ బూన్చు బ్రబ్బతయ్య
విశ్వేశు దలనొంచు వేమనారాధ్యుండు నాల్కలీశునకిచ్చు నాగవరుఁడు
నెలకపుత్తడి రాల్చు కలకేతబ్రహ్మయ్య మహిఁ జిరంజీవియానమాదిరాజు
తే. వీరు మొదలుగాఁ గలుగు నేబ్బారువీరు
ఘనబలవ్రతస్థితులును నవసహస్రి
మఱియు నొకలక్షతొంబదియాఱువేల
చరులు పన్నెండువేల్మిండజంగములును. 43

క. మఱియునసంఖ్యాతములగు, కఱకంఠపదాబ్జభక్తగణసింహంబుల్
దరిలేనిశౌర్యకలనం, బిరుతివియక్షత్రుసైన్యభీకరతనులై. 44
చ. నడుములుగట్టుచుం బెలుచ నవ్వుచుఁ బంతులుగీటుచుం బొమ
ల్ముడుచుచు మండలాగ్రణయముల్ జళిపించుచు గూఢవర్మముల్
దొడుగుచు గోఁగుమీసములు దువ్వుచు బాహువు లప్పళించుచుఁ
గడువడిమిన్నుఁ దాఁకుచు నకంపితనృత్తిఁ జెలంగియార్వఁగన్. 45
తే. అట్టి కోలాహలం బప్పుడరసి చెన్న
బసవఁ డరుదెంచి తద్భక్తపద్వరోజ
ములకు సాష్టాంగమెఱఁగి కేల్మోడ్చి నిలిచి
వినతిపూర్వకముగ నిట్లు విన్నవించె. 46
మ. తగునే మీరలు కోపగించ ఘనశాంతంబారడింబుచ్చి యీ
పగిదిం శైవమహత్త్వము ల్మదిఁ దలంపంబోక వర్తించుదు
ష్టగుణుల్ దామె నశింతు రెట్లన భస్మస్వర్ణగేహారిప
న్నగహారున్మదియింపఁబొల్పడిశనంతం దానకీడొంటఁ డే. 47
తే. అరిమదేభములకు సింహమహితకాన
నమున కగ్నియ మిత్రమేఘముల కలన
సఖమురిపుశైలములకు వజ్రంబుమీఁదు
జ్ఞానభక్తివైరాగ్యనిష్ఠలు దలంప. 48
క. అటుగాన మీరలిత్తరి, కుటిలాత్ములమీఁదజనఁగఁగూడదు నిలువుం
డిటులఁ వారికి నీకమీఁదటనగుఫలమనిన సమ్మదంబునశరణుల్. 49
ఉ. వైరులమీఁదఁబోక నిలువంబడు నంతటిలోన దుష్టచే
ష్టారిబలంబులోన నిబిడాంధతమంబు విధిప్రయుక్తమై
ధారుణిమిన్ను మోసె వెడిదంబుగఁ బట్టినవాన తచ్చమూ
వారము విస్మయంబును వివర్ణతదోఁపఁగ నత్తరిఁ జెసన్. 50
మ. ప్రళయాంభోధరనిస్వనంబుపగిదిం బ్రహ్మాండభాండంబు భీ
తిల నొక్కుమ్మడినార్చి తమ్మొరులు మర్దింపంగ నేతెంచు ద
ట్టులఁ దోపంచము దామె యొండొరులఁ బట్టండీయఁగంచుఁ భయా
కులులై పైఁబడి రుగ్రఖడ్గశరశక్తుల్ పూని భీమాకృతిన్. 51
వ. ఇట్లు. 52

చ. ఘటసికరంబుఁ జెంచుచుఁ దుర్వప్రకరంబులఁ గూల్చుచుఁ హాయ
చ్ఛటఁ నడంచుచు న్నెఱయు స్యందనవర్గముఁ జక్కు సేయుచుఁ
జటులధనుర్లు ప్రకాండహతి సల్పుచు వర్మచయంబుఁ జించుచుం
బటుధవళాతపత్రముల పంక్తులు భూమిఁ దొరంగఁ జేయుచున్. 53
వ. మఱియును. 54
సీ. మణికేతనోద్దండఘృణి కొంత వద్వేగి
యవిబడ చనలేక నడలుకథులు
ప్రచురముక్తాచ్ఛత్రరుచి కొంత వడిసేగి
యవిగూలతడఁబడి నొవ్వులు కరులు
పటువజ్రనఖరప్రభలకొంత వెడమేగి
యదిజార నిలఁబడునట్టి హరులు
జళిపించు ఖడ్గప్రభలుకొంతఁ బడవేగి
యవిపోవ నలుదిక్కు లరయు భటులు
తే. నగుచు నగ్గాఢతమమున నంతకంత, కగ్గలం బైన పీరరసాతిరేక
కలననంపఱుయదువుల కరణిపోరు, సల్పి సమసిరినిర్విశేషంబుగాఁగ.
క. అంతటనగ్గాఢతమం, బంతయువిరియంగ జైనులందఱుహాతులై [చుఁ.
రెంకియు వేడుకఁగనుగొని, యంతక హరుభక్తవితతియార్చిరిపెలుఁ
ఉ. అత్తరిమ్రొక్కి చెన్నబసవార్యుఁడు వారలతోడ నోశర
ణ్యోత్తములార! మీరలు మహోన్నతు లేమని చెప్పవచ్చు మై
మత్తిలి మిమ్మెఱుంగక సమస్తరిపుప్రకరంబు వచ్చి యు
న్మత్తుగఁగూలె పాపమతు లెయ్యెడలం జయమందనేర్తురే. 57
తే. శరధిచే సీత సీదుట జ్వాలదరణ్య
పావకజ్వాలకరమునఁ బట్టుకొనుట
తూగిపారెడు నది కేల నాఁగికొనుటఁ
గాదె మిముజైను లణపఁగఁ గడఁగుటెల్ల. 58
చ అని యిటు సన్నుతించి మదహర్షముతోడుత వారు దాను నా
దినమటువుచ్చి రేపకడ తేజమెలర్పఁగ నందు వాసికాం
చనవరత్నసంఘటితసౌధవిరాజితమై తనర్చి పే
ర్చిన హులికాఖ్యపట్టణము చేరఁగఁ దద్ధరణిపుఁ డత్తఱిన్. 59

క. చారుల ముఖమున విని యుచిత, భేరీముఖరవములఁ బరఁబ్రియబంధు చమూ
వారముతో నెదురుగఁజని, దూరంబున భక్త సంతతులఁ గాంచి వెసన్.

చ. కరిదిగి పాదచారియయి గ్రక్కునఁ జేరఁగ నేగి కన్గొనన్ సల్
ఘరపయి సోఁక జాఁగఁబడి తద్గణకోటికి మ్రొక్కి నంతలో
వరగుణుఁడైన చెన్నబసవప్రభువర్యుఁడు నచ్చు యాతనిం
గరములఁ గ్రుచ్చి వేగ నిగికౌగిటఁజేరిచి సమ్మదంబునన్. 61

ఉ. చెప్పఁగ విందు నిన్ను నృపశేఖర! భక్తపరేణ్యుఁ డంచు నే
నిప్పుడుగంటి మోదము సహించె మదీయహృదిం దలింపఁగా
ముప్పిరిగొన్న భక్తి కరము ల్ముకుళించి యతండు వక్కాణి
ట్లొప్పునె నన్ను మీరలొకగణోన్నతుఁ డంచు గణింపధీమణీ. 62

చ. అని వచియించి క్రమ్మఱ మహావినయంబునఁ బల్కె వీరభ
ద్రనృపతి యో మహాత్మ! శరపంబునకుం భుజగారి శంబరాం
కునకు చకోరమధ్యమునకు న్వలి జిక్కవగాఁచి యుండులా
గున భవదంఘ్రిదర్శనముఁ గోరి వసించితి నింతకాలమున్. 63

క. దీనుఁడు పెన్నిధి గనుగతి, నే నినుఁ జూడంగఁగంటి నేటికి నాదౌ
నేనగపటలము విరిసెను, భానుగతిఁ జెందితిం గృతార్థుఁడ నైతిన్.

చ. శ్రితజనపోష మన్నవన సీమకు మీరరుదే మదీయవాం
ఛిత మొనగూడునట్లు దయసేయుఁ డటంచును నా గణేశసం
తతి నొడబాటొనర్చి ప్రమదంబున నాత్మపురాధివాసుల
ద్భుతమతులై కనుంగొనఁగఁ దోడ్కొనిపోయి మణీగృహంబునన్.

తే. వారినందఱి నునిచి యపారభక్తి
సేవలొనరించి వేడ్కభుజింపఁజేసి
పిదప నొక్కమనోహరసదనమందు
శివకథాగోష్ఠి నున్నట్టి యవసరమున. 66

క. చెన్నబసవేశు గనుగొని, సన్నుతగుణధుర్యుఁడగు రసాతలపతికే
లున్నదురుగ దియఁజేరిచి, విన్నప మొనరించె నిట్లు వినయ మెలర్పన్.

చ. ధరణిఁ బునీతఁజేయ గిరిధన్విసుతాంశము దాల్చి నాగమో
దరమున ద్వాదశాబ్దములు తాఁ వొనరించి రసాతలేశకుం

జయసఘమాత్రకీర్ణమున సంభవమై ఖలజైన బౌద్ధసం
ఘాకార మెంచఱ్చి శైవసమయంబు నుచ్ఛతం బ్రబలంగఁ జేయవే. 68

చ. సకలనిగమాగమాన్విత వాగ్విభవశిప్రవరాదులైన శక్తిలే
నన మమునిట్లు కెట్టు లగు నాశ్రమజంగమకల్పవృత్తునం
జనిత నిరూపితాత్మహితశైవవిపక్షవిశుద్ధభావ స
జ్జనపరిరక్షణంబుచు నను సన్నుతి సేయుచు నున్న భూవిభున్. 69

తే. ఎలమిఁ గని సన్నుతిసేయఁ డిట్టు లనియె
నఖిలము స్తోత్రమున కర్హులయిన యిష్ట
మాత్ముఁ డనుతింప నగుఁ గాక నగునె పేరి
మానుఁడగు నన్నుఁ గొనియాడ ధరణినాథ!. 70

సీ. కమలబాంధవునితోఁ గవలు మెఱయువుపుర్వు
దేవతాకుజముతోఁ దెల్లదుమ్మ
చామీకరాద్రితోఁ జౌటచెర్గినదిబ్బ
సింహడింభకముతోఁ జెవులపిల్లి
వాహినీనాథుతో వరిమళ్ల కాలువ
వ్యాళనాయకునితో వానికట్టె
వైనతేయఖగంబుతో నూరఁబిచ్చుక
రాజరత్నంబుతో గాజుపూస

తే. సాటిగా నట్టి పగిది నీకరుణకోటి
కోటి సరిరాని నన్ను సంస్తుతులు సేయ
నగునె పేరిమాహాత్మ్యమెట్లనిన వినుము
పార్థివేశ్వర యనుచుఁ జెప్పంగఁ దొడఁగె. 71

క. భావజహరివృషభసంసర
పావనతరపాదపద్మభజనామోద
ప్రాకృతమతి యీ సెట్టిన
దేవరసయమహిమ మొదటఁ దెల్పెద వినుమా. 72

సీ. ఒకనాఁడు బిజ్జలుండొక్కయోలగంబుండి బసవయ్యఁ గనుఁగొని పలికె సెట్టుల
మాభక్తులనుపమమహిమాఢ్యులని చెప్ప నెప్పుడుబలుకుదు రీవు వట్టి
బూటకంబులు విన్నఁబోలదు నీమాట లందఱికింటె వారధికు లెట్లు

లెక్కఁ జెక్కఁగ వార లేమేమి చేసి విఖ్యాతిఁ బొందిరి త్రిజగంబు మెచ్చ
తే. నరయ నాల్గుయుగంబుల బరఁగుమాన
వాధిపుల నడవడులు విస్పష్టములయిన
నిట్టుపల్కుఁవు తద్విధ మెట్టిదనిన
సావధానత విను మమాత్యాగ్రగణ్య!. [రాముఁ
సీ. మహిపుల ముయ్యేడు మాఱులు వధియించి ధరకశ్యపున కిచ్చెఁ బరశు
డబ్ధిబంధించి దశాస్యుని ఖండించి ప్రబలె శ్రీదశరథరామ విభుఁడు
కలికంఠు మెప్పించి కాలకేయాదులనొక్కఁడు బరిమార్చె నింద్రతనయుఁ
డరులఁ జెండాడి దేహంబున హరిగద్దెనుండఁ డే విక్రమార్కుండు మొన్న
తే. నరయ వీరలుగాక మహాప్రతాప
గరిమఁ బగురాజు లిప్పుడు గలరు ధరణి
నిట్లు మీవారు నడిచిరే యెన్నఁడైన
నని యుపాలంభనము దోఁప నాడుటయును. 74
చ. విని బసవేశ్వరుండు పృథివీవర! యెన్నటనుండి నీమదిం
జననమునొందె నింతటివిచారము మాతృవిధారు సత్క్రియా
ఘనతరదుఃఖనిస్స్వకులఘస్మరు నస్తికభోగభాగ్యులన్
వినతి యొనర్చితీవు గణవీరమహత్త్వ మెఱుంగ కిట్టులన్. 75
వ. అని పల్కి జంగమప్రభావం బొక్కటి చెప్పెద విను మని దండనాయకుండు. 76
సీ. ఆకారరేఖచే నాదరబ్రహ్మయ్య ప్రథితకళాస్ఫూర్తి పండితయ్య
గురుభక్తి బిళ్లమ ధరణీతలేశ్వరుం డురుగానవిద్యచే నొడయనంబి
భూరిశౌర్యంబుచేఁ జేరమభూభర్త యంగలింగజ్ఞత ననిమిషుండు
పటుతరసత్త్వసంపద యిర్యదాండారి కలిమికి బల్లాణగహ్వరేశుఁ
తే. డిమ్మహాభక్తుఁ డని జనులెల్లఁ దన్ను
బ్రస్తుతింపంగ నెగడె ధరాతలమున
భవ్యజంగమసందోహ పాదపద్మ
షట్చరీకుండు శ్రీవీరసంగమయ్య. 77

వీరసంగమయ్య కథ.

చ. అతని వయోవిలాసఘుషమాప్తతులం గని పెద్దతండ్రి యా

నుతునకుఁ బెండ్లి సేయఁ దగుచో టరయంగ నకౌ నంచు తత్పురో
హిత గురుయుక్తుఁడై వెడలి హేమమణీమయగోపురాంతరాం
చితపటచిత్రసుప్రకటసింహాధ్వజాకులవాసవైభవమై. 78

క. తనరిన ఓంకారపురం
బున కేగి తదిందిరావిభూషణమై యొఁ
ప్పిన తన మేనమఱఁది గృహ
మున కరిగినవాఁడు గడుప్రమోదముతోడన్ 79

చ. కనుగొని కౌఁగిలించుకొని గద్దియలందగువారితోడ నా
తని వసియింపఁజేసి యుచితం బగుపూజ లొనర్చి సేమముల్
విని కడుసంగఁ బెట్టి యటువిస్మిట నిష్టవినోదలీలలన్
వనియుచు మీదురాక సుఖదంబగు మా కని పల్కెఁబల్కినన్. 80

వ. తద్గురుభక్త్యాఖ్యుండు. 81

క. నీపల్కినపల్కులు నిజ,మాపగిదిని శుభముఁ జెందునన సర్వాలయం
దాపసనేటికి వచ్చిన, మీపని యెఱిఁగింపు బావ! మేలనుచాలున్.

తే. ఆసిన మాళీరసంస్త్యా కనఘ! నీదు
పట్టియగు చంద్రిణీదేవిపరిణయంబు
సలుప నూహించి మీతోడఁ దెలుప వచ్చి
నాఁడ మనప్రదు నాతఁడానంద మొంది. 83

క. మీరుస్వతంత్రులు మీమదిఁగోరిన పని యడ్డగించు కొనువారిటఁ గ
ల్గ్వా రచ్చట కిచ్చుటకేం, భారకులై మమ్మునడుగఁ బనియేమిటికిన్?.

చ. అని వచియింపఁ దత్సభికులందఱు సంతసమంది బాపురే!
వననిధిమేఖలాస్థలయ వాసజనంబులయందు బంధుభా
వనఁ దిలకింప వీరి సరివారలఁగాంచితిమే యటంచు పె
న్కనుతులొనర్చి సత్తజీనకుంతికకౌతుక మాఁకిల్లఁగన్. 85

క. మున్నేఁ గైసేసియుంచిన, కన్నియ రప్పించి తండ్రి కాంచనమణిభూ
తిన్నిలిపిన దీవెన లిడి, యెన్నికలగ్నంబు నిశ్చయించిరి విప్రుల్. 86

క. అంతటఁ దత్కన్యామణి,నంతిపురంబునకుఁ బనిచి యాగృహపతి దా
సంతోషంబున నంబర, సంతతి గట్టంగ నిచ్చి సమ్మతినను పన్. 87

ఉ. వారు ముదంబునం దిరిగివచ్చి సుహృజ్జనకోటితో సవి

స్తారముగాఁగఁ బత్క్రియము సర్వము దెల్పి వివాహయోగ్యసం
భారము లెల్లఁ గూర్చుచును బంధులకుం శుభలేఖలం బుచూ
ద్వారపువేడ్కనుండిరి ఘనుండగు సంగయకుత్సకంబునన్. 88

వ. అంత నచ్చట నోంకారపురాధినాథుం డగు భాస్కరాఖ్యనిపాలుం డొక్కనాఁడు బాహ్యాళివెడలు సమయంబున నత్యంతరూపవిలాసభాసురయగు చంద్రిణీదేవిం గనుంగొని తత్సౌందర్యంబున కచ్చెరువంది మారవికారపూరితమానసుండై తనలోన. 89

చ. సురగరుడోరగప్రముఖసుందరులం బ్రకటింపవింటి ని
ద్ధరణిన నేకకోమలలతానిభ గాత్రులఁగంటిఁ గాని యా
సరసిజనేత్రవంటి నెరజవ్వనిఁజూచి యెఱుఁగ దీని నే
పరిణయమైనఁగాక సుమబాణునిబారికి నోర్వశక్యమే. 90

తే. శైవలాంశజ విద్రుమశంఖగరిత, రంగస్థితినాగపులినహర్మ్యచలోచ
నాధరగళ స్తనవళికోమాళిజఘన, చరణయీయింతి సౌందర్యజలధి గాదె.

సీ. యువిదలమిన్న భ్రూయుగ్మంబుగానదా పోడిమచెఱకు విల్బూన నేల!
పడతుక నెఱివేణి పరికింపఁదావిదే పోవు తుమ్మెదనారిఁ బూననేల
నెలనాగవాల్చూపు లెఱుఁగడా! ధరగూలుపుష్పబాణంబులు పూననేల?
కలకంఠిజంఘలఁ దెలియఁడా యెదుగంటి నానునక్రాంకంబు పూననేల?
తే. తలపనఖిలజగద్వస్తుతారతమ్య, వేదియగుమాధవునకుఁ జ్ఞవించి యెంత
తప్పుపని యొనరించెకందర్పుఁడిట్టి, బేలగాకున్న శివుని చే నేలమడియు.

సీ. కనకాంగి నెఱివేణిఁ గనుగొన్నయంత నే విరిపైన నాలజ్జ విరియఁజొచ్చె
విద్రుమాధరిమోము వీక్షించునంత నేతలపనాధైర్యంబు దొరగఁజొచ్చె
కామిని నేత్రముల్ గాంచినయంత నె యంచనామదిచంచలింపఁజొచ్చె
సుందరిజఘనంబుఁజూచినయంత నె యొప్పైనబుద్ధి కుములఁజొచ్చె
తే. నలిన చిత్రాంగముల పాటి నెనయవచ్చి, పోలఁజాలని వార్షికనీలమేఘ
శర్వరీనాథచంచలాసైకతముల, సగణి నేనింక నేజాడ? నైసువాఁడ.

తే. ఒక్క సన్నిధిపాల ద్విపేంద్రయాన
త్రివళిచతురాస్యపంచమ శ్రీనినాద
షట్పదాలక యగుదీని సప్తపదము
లేను ద్రొక్కింపఁ గలుగుట యెన్నఁడొక్కొ?, 94

సీ. శరదిందుముఖియయానగరిమ త్తేభంబు పీనపయోధరపిటుఁదుప్పృథ్వీ
రంభోరు వీక్షణరాజి యుత్పలమాల శాతోదరినాస చంపకంబు
శష్కులికాంచిత శ్రవణ మేనసుగంధి తరుణిపాదయుగంబుసరసిజంబు
రమణి మాధుర్యస్వరము మత్తకోకిల కార్ముకభ్రువు నీలకచముకుంద
తే. మబల కాంతి విద్యున్మాల యబ్జసదృశ
కంఠి రోమాళి పరభుజంగప్రయాత
మౌర! యీయింతి శుభలక్షణాంగయాట
నిఖిల సత్కవివరవర్ణ నీయగాదె. 95
చ. అని మదిలోనఁ దన్నుఁ గొనియాడుచుఁ బోవక నిల్చుభూపతిం
గని యిదియేమొకో యనుచుఁ గన్నియ తత్తరమంది లోనికిం
జన ధరణీశ్వరుం డవల సాగి చన న్వలె నన్న సిచ్చలే
క నిజగృహంబుఁజేరి యెడగానియటుల్ బిలిపించిమంత్రులన్. 96
చ. తన తెఱఁగెల్లఁ జెప్పి వనితామణి తన్వరియించు నట్లు త
జ్జనకుని మందలించి యట జాగొనరింపక రండు పొండనం
బనివిని వారలాతనికిఁ బార్థివువాంఛనెఱుంగఁ జెల్పిన
న్విని మదిలోఁ గలంగి గృహనేతయమాత్యులతోడ ని ట్లనున్. 97
తే. అంత భూభర్త జామాత యగుటకంటె
మాకు వేఱొక సంతోషమహిమ గలదె
యైన నొకవిన్నపంబును నవధరింపుఁ
డెటుల కీమాట మించినదేమి సేతు?. 98
తే. ఎన్నదగు వీరసంగయ్యకే లతాంగి
నిత్తుమని మున్నె విబుధులయెడల నిశ్చ
యించినారము పలువదికేమి పలుక
ననినఁ జని వారు నృపునితో నట్లు తెలుప. 99
చ. కువలయభర్త వారిపలుకుల్ విని నంతనె కిన్క నెమ్మదిం
దవిలిన నాఁగి యాప్తవిబుధవ్రజమందఱఁ జేరఁ బిల్చి యా
ప్రవిమలగాత్రి తండ్రినొడబా టొనరించి మదీయభావసం
భవపరితాపవేదనలు బాపుడు పొం డనినన్ల రయంబునన్. 100
ఉ. వా రరుదెంచితచ్ఛరణ వల్లభుఁగన్గొని యోమహాత్మ! నీ

సారవివేకదానగుణ సాహసకీర్తి కళాప్రపూర్ణతల్
వారిధిమేఖలావలయ వాసజనప్రచయంబునందు నె
వ్వారికి లేదు నీమహిమ వర్ణనసేయఁగ మాకుశక్యమే!. 101
చ. అని కొనియాడి రాజహృదయస్పృహముల్ సచివాననంబులన్
గని పరదేశవాసివలె వేఱొకభంగిని నాడవచ్చునే
జనపతి వేదమానవులసాటిగ నెంచకు తత్కృపారసం
బెనసిన మేరువౌ తృణ మహీనబలుం డతఁ డెన్నిభంగులన్. 102
ఉ. ఆడినమాట తప్పననునాగ్రహముంచకు కన్నె యన్నచోఁ
జూడరె వేఁడరే యెవరు శోభనవేళల తగ్గుమొగ్గుగా
జాడలేటులుంగఁగావలదె సారసనేత్రమణీమయంబులౌ
మేడలసంచరించుటకు మీమదికిన్ బ్రియమూనదయ్యెనే. 103
క. కావున మామాటలు నీ, భావంబునఁ బాదుకొల్పి పార్థివునకు సౌ
ఖ్యావహముగ నిక్కన్నియ, నీవలయు నటన్న నాతఁ డిట్లనిపలికెన్.
ఉ. పావనులార! మీరనెడు పల్కులె సత్యముగాని యింక నా
భావము వేఱెయొక్క లఘుపద్ధతిఁ జూర దట్టులౌట ధా
త్రీవరు నిప్పు డెప్పగిదిఁ దెల్పఁగవచ్చునొ తెల్పి తన్మనో
వ్యావృతవాంఛఁబుచ్చి శమితాగ్రహుఁజేయుఁడు వేయునేటికిన్.
క. తొల్లి హరిశ్చంద్రమహీ, వల్లభతల్లజుఁడు సత్యవాక్యధరము పైఁ
జెల్లింపఁబడిన భాషలు, తెల్లముగా వినరె యపుడు ధీయుతులారా!
క. అటులగుట దీననగు ఫల, మెటులైనను లెస్సమీర లెఱుఁగని పదమే
నిటులనుచును దెల్పంగన, ఘటనాఘటనాధుర్యులార్యగణనుతచరితుల్.
చ. అన విని వారలంవలు తదానతిఁగైకొని సత్యనిష్ఠనీ
యనువుననుండఁ గావలదె యంచు మహాద్భుత మందిక్రమ్మఱిం
జని తగువేళ భాస్కరరసాతలనాథునిగాంచి తా మునుప్
బనివిని వారితో ననిన పల్కులు సర్వము దెల్పక్రమ్మఱన్. 108
ఉ. రాజకులావతంస! రిపురాజవితానతమిస్రహంసమీ
యోజన కాతఁడాత్మముద మొందుచు మున్నుగమాటమించుటన్
భాజనమయ్యె చింతలకుఁ బ్రాజ్ఞులపద్ధతు లిట్టివేకదా!
యీజగమందె మీరలు గ్రహింపని ధర్మము లెందు గల్గెడిన్. 109

క. మీారే లేదు రాజ్యంబున, సారమతిఁ సత్యనిష్ఠ సలుపుచునుండే
వారలు గలుగుట మీాకే, తోరపుసత్కీర్తికాదె దుష్టవిదూరా. 110
ఉ. కావలెనన్న నీవెలఁదికంటె మనోజ్ఞవిలాసరూపరే
ఖావిమలాంగులై తనరు కన్నియ లెందఱు లేరు? నీకు త
త్ప్రావనశీలుమాట యథార్థవంబుగఁజేయ ననుగ్రహింపు పృ
థ్వీవర! నేఁడు మామనవిదప్పకనన్న ధరస్మితాస్యుఁడై. 111
క. మంచిది పొండనివారలఁ, బంచి ధరానరుఁడు పంచబాణవశుండై
యించుక నిలువఁగఁ జాలక, పంచాననమధ్యయున్న భవనంబునకున్.
క. ఏకతమయేగ నాతని
రాకను తలిదండ్రులరసి పరిచలితతనులై
వ్యాకులము నొందఁ గనుగొని
యాకన్నియ ధైర్యమూది యపుఁ డీట్లనియెన్. 113
ఉ. ఏమిటి కింతభీతి? ధరణీశ్వరుచే నగునట్టి దేమి నా
స్వామియనుగ్రహంబున వెసం జని వానికి లోకులీకమ
ద్ధీమహితోక్తుల న్మనసుఁ ద్రిప్పి బిరానన సాగఁబంపి మీా
కోమలపాదపద్మములకుఁ బ్రణమిల్లఁగ నేగుదెంచెదన్. 114
చ. అని యిటు లూరడంబలికి యప్పుడు చంద్రిణిదేవి భూపతిఁ
గనుగొని చెల్లెలుం గనెడు కాంతిమెయిఁ జనుదెంచినారొ ర
మ్మని మణిపీఠమిచ్చిన నిజాస్యము న న్కళదప్ప నాతఁడో
య్యన వసియించియున్న గమలాయతలోచన వల్కె క్రమ్మఱన్. 115
తే. అన్న నాపై నిప్రేమచే నరుగుదెంచి
నారొ? మేలయ్యె నాయంతవారుతోడఁ
బుట్టుటొట మదీయమహా పుణ్యమహిమ
గాదె? యేభాగ్యములకైన కడమగలదె! 116
చ. అన విని యాతఁ డిట్లనియె సంబురుహాయతనేత్ర! నీపయిఁ
ఘనతరవాంఛనేనిపుడు గన్గొనవచ్చిన నిట్టులాడఁగా
జనునె? కఠోరవాక్యములు సర్వములున్నె యెఱింగి నన్ను వం
చనయొనరింపఁజూచుటకుఁ జాలఁగ నద్భుతమయ్యె నెమ్మదిన్. 117
చ. వనధరవేణి! నాకయిన వైభవరూపవిలాసవైఖరుల్

గని తముదారె వారిరుహాగంధులు కొందఱు నన్వరించి రా
యనువునఁగాదు సేవ భవదాకృతికిఁ భ్రమఁజెంది వేడ్కఁ గ
న్గొన నరుదేర నామనసునొవ్వఁగ నాడఁగ నీకు న్యాయమే? 118
చ. అలయికలేక యెంతపనియైనఁ దలంచినమాత్రఁగూర్చుకో
గలుగు బలంబునా యెడలఁ గల్గియు నీమదినొచ్చునంచు ని
ట్టుల నొకరుండవచ్చితి కడుంబ్రియమందఁగఁ గారవించి నా
పలుకుగ్రహించి నన్ను మరుబారినిద్రోయక యేలు కోమలీ? 119
చ. నిరుపమభోగభాగ్యములు నీవశమౌనటు సేయువాఁడ నా
తరుణుల నీవుబంచె దెటు తప్పకయట్టుల సేయువాఁడ భా
సురతరతావకీయకృపఁజొప్పడురీతి మెలంగువాఁడ న
న్వరిణయమై సుఖంపు మని నం జలజానన వాని కిట్లనున్. 120
క. పరిణయ మొందిన సతులం, గరిమం బెండ్లాడువారు గలరె? ధరణిఁ మ
గ్గురులునసుము స్నె యొనఁగిరి, సరసాగ్రణియైనవీరసంగయకెలమిన్.
ఉ. రాజవు సర్వధర్మపరిరక్షణదక్షుఁడ విట్టు లన్యనీ
రేజదళేక్షణాతతివరింపఁగ నెమ్మది వాంఛసేయు టే
యోజ దశాస్య కీచకమహోగ్రబలాధికు లిట్టికోరిక
న్తేజముదృంగి కీర్తిచెడి నీఱయిపోవుట నీవెఱుంగవే? 122
తే. పరసతీసంగమంబునఁ బరిణవిల్లు
సౌఖ్యమిల నణుమాత్రమై పరఁగు దాన
నొదవు పాపంబు భూమిధరోపమాన
మై నిలచు నేటికి? కిట్టి తుచ్ఛానుభవము?. 123
క. సరసాన్నపానములుమం, దిరమునగలిగియును తిరియ దివి రెడుగతిభా
సురకులకామినులుండఁగ, ధరణీశ్వర! యన్యవాంఛదవులంజను నే?
వ. అనిన నతండచ్చోటిమాటలుగీటునం బుచ్చుచు క్రమ్మఱ ని ట్లనియె.
సీ. బాల! నీవీక్షణబాణముల్ నామీఁదవ్రాలి దేహంబుదూరకయమున్న
తరుణి! నీమధ్య కేసరినామనోగుహాసెనసిప్రాణంబులు గొనకమున్న
తరలాక్షి! నీయానదంతినామోహిలను*యట్టాడికాలరాయకయమున్న
పడతి! నీనూగారుపాము నాయెదుటఁగన్పట్టిప్రాణము గ్రసింపక యమున్న

* 'మట్టాడి' యని పాఠాన్తరము.

తే. ధర నహింసకు మిక్కిలి ధర్మపథము
లేవనెడుమాట నీమదిఁ బాదుకొల్పి
ప్రేమ దొలుకాడ స్మరతాపపీడఁ వీడ
నన్ను దయనేలుకోఁగదే? సన్నుతాంగి. 126

వ. అనినఁ దద్వ్యాఘ్రాపతంసం బిట్లనియె. 127

ఉ. నాలుక నంటినంతనె ఘనంబుగఁ జేదగు వేము మీఁదరోఁ
గ్గాళినడంపదేహమున కంచితసౌఖ్యమొసంగు మెక్క చో
మేలగు మాధురింబరఁగు మీఁదట ప్రాణమెడల్చునాభి యా
పోలిక తెల్లమౌ పిదప పుణ్యము పాపము సేయువారికిన్. 128

వ. కావునఁ బ్రస్తుతసుఖంబు నఖిలషించి ఘోరదుఃఖంబు నొందకుమనినఁ దద్ధారుణీవల్లభుం డిట్లనియె. 129

సీ. సుదతి! నీజంకెన చూపున బెదరించు నతిగంధపొడిబూది జల్లుమేన
తెరవ!నీకొననొళ్ల చురుకులంటఁగజేయుతరళాక్షి! నెఱివేణిత్రాటమోదు
చతురాస్య! నీబాహులతికలఁబంధించుసరిగళెరవమంత్రసరణి నెఱపు
కోమలి!వరకుచకుంభముల్గాన్పింపు చెలి!యధరామృతసింధువానఁగు

తే. నాతి! నీదేహవిద్యుతిజ్యోతినిలుపు,పడతి! నీనెఱగాలిచేఁ బారఁజిమ్ము
పంకజానన! ననుఁబట్టిబాధపెట్టు,గడుసువలరాచభూతంబువిడుచుఁగాని.

క. వేఱెయొక సరణినాముడి,మీఱిన తాపంబు చెడదు మీనేక్షణ! నం
దేటికృపంగనుగొనుమిఁక,మాఱాడకుమనినఁగుపితమానసయగుచున్.

క. నోటికి వచ్చినగతి యిటు, మాటికి దుర్భాషలాడ మనుజేశ్వర! నీ
కేటికి? ధర్మముచెడి మముఁ, బోటులఁకాసింపనీదు పోడిమి చెడదే?.

చ. అనవుఁడు తోకద్రొక్కిన మహాహివిధంబునఁ గోలఁబెట్టు దా
కిన పులిరీతి బిట్టదరి కిన్కమనంబుననుప్పతిల్ల లో
చనములు నెట్టదోఁప వెలుచం దనుగన్గొను రాజుఁగాంచి బ
ల్మిని తనుబట్టునో యనుచు మీనవిలోచన జంకె నెమ్మదిన్. 133

క. దుర్మార్గుఁడు కామాంధుఁడు,ధర్మవిహీనుండువీఁడు తలఁచినతలఁపుల్
నిర్మూలము చేసి కృపా, భర్మాచలధన్వినన్ను భావింపఁడొకో. 134

క. పులిబారిఁ జిక్కి ధేనువు, మెలగంగాలేనికరణి మీఁదెఱుఁగని యీ
పలుగాకి బారిఁజిక్కితి, తలఁగిచనంజాల నింక వది యెయ్యదియో!.

సీ. వీని నెట్టులయిన విడఁజిమ్మిపోయెద నంటినాయబలను న్యాయసహిత
ధర్మమార్గముల బోధయొనర్చితలఁగెద నంటినామున్ను నేనాడినట్టి
పలుకులన్నియునునిష్ఫలములై చనురద్ది చేసియెవ్వరికైనఁజెప్పికొందు
నంటినామఱివీనికంటెనిక్కడనెక్కుడగువాఁడు లేఁడుకోపాగ్నిశిఖల
తే. మడియఁ జేయుదు నంటినా పుడమి తేనిఁ
గూల్చుట మహాసుపర్వునికూల్చుకంటె
నెక్కుడగుపాపమని యందు రెల్లబుధులు
గాన యెద్దియుపాయంబు గానఁబడదు. [ద్రో॥

క. అని చింతనొందుసమయం,బుననొక్కయుపాయమురగభూషణకృపఁ
చిన నబ్బాలారత్నముఁ, జనపతి కనుకూలమైన చందముదోఁపన్.

ఆ. కాలయాపనంబు గావించిభూపతి, సాగనంపి తండ్రి సంధిదప్ప
నింక నిలువుదాన నేనంచు మదినిశ్చ,యించి యతనితోడ నిట్టులనియె.

ఉ. ఎన్నివిధంబులన్ వలవదేమిటి కీతమకం బటన్న నా
విన్నప మెక్కటైన నృప! వీనులఁజొన్పవు నీకుఁ గట్టిగా
నన్నుపరిగ్రహించెడి మనం బిఁక నింగిని మాన్పువార లీ
యున్న జనంబులోఁగలరె? యుక్తమయుక్తము నెన్న నేటికిన్. 139

మ. ననుసంతోషముఁ నొందఁ జేయుటయె మిన్నాయంచు నూహించితే
ని! నరాధీశ్వర! యేడునాఁడు లెడమీయంగావలెన్ నేటికిన్
జినఁగా భూనగధీశ! పూజనలుపన్ నాయంబు మానంగడం
బున నేనట్లయొనర్పఁగావలయు ముప్పూటల్ వివాహార్థమై. 140

ఉ. నావుడు సమ్మతించి జననాయకుఁ డింటికిఁబోయెఁ బోవ త
త్పావనశీల యంత తలిదండ్రులకాగతిఁ దెల్ప వారు ధా
త్రీవరు దుండగంబు సుదతీమణి పూనికయంత వ్రాసి స
ద్భావుఁడు వీరసంగయకుఁ బంపినఁగాంచి యతండు నెమ్మదిన్. 141

చ. హరహర! యెంతపాపమున కొప్పదవృత్తి వహించె నేఁడు భూ
స్కరధరణీతలేశ్వరుఁడు చండ్రిణి నేక్రియవాంఛఁదీర నే
పరిణయమాడు? నాకుట్టెలభావుని నేక్రియ దెప్పరింతు? నే
సరణిఘటించునో శరభ సాళ్వమూర్తి యటంచు నత్తఱిన్. 142

వ. చింతాక్రాంతుం డై యున్నతఱి తజ్జనకాదు లతని యొద్ది కరుదెంచి

తన్ముఖంబున నావృత్తాంతంబు విని బలవద్విరోధంబు చెందుట భావ్యంబుగాదు కళ్యాణోత్సవంబు సమకూడదు రహస్యంబుగాఁ జని వివాహంబొనర్చుకొనవచ్చుట మే లని నిశ్చయించి యాస్థితి సంగమ్యతోఁ దెలిపి యతనిం నొడంబఱిచి పెండ్లికొడుకుం గావించి యొకయుత్తమాశ్వంబుపై నెక్కఁజనిచి యుచితపరివారంబుతో

తే. తారు వేడుక వెడలి యోంకారపురముఁ [నేగి.
జేరఁ బోవుచుఁ దమవార్త వారి కెఱుక
పఱుపఁ దగువారిముందటఁ బంపి తోనె
నాఁటిరాత్రియె యేగి రన్నగరమునకు. 144

చ. సిరి దళుకొత్త నిప్పగిదిఁ జేర నికూఢత వియ్యపిల్లుస
త్వరమునఁ జొచ్చి యప్పుడె వివాహము నేర్పునఁ జేసి తద్వధూ
వరులహాయంబుపై నునిచి బంధులతో నరుదేరి యప్పురం
బురువడి నిర్గమించిరి మహాత్మ్యకతం విభవంబు మీఱఁగన్. 145

ఉ. భూరిగుణాఢ్యుఁ డిప్పగిదిఁ బోవుచునుండఁగ నంతలోపలన్
జారుఁ డొకండువచ్చి ధర జాగిలిమ్రొక్కి మహీశ! నీమదిన్
గోరిన చంద్రిణీమణిని గొంకక నొక్కఁడు పెండ్లియాడ పెం
పొ రహినేగె దానవరసాధిపవర్యుఁ డుదగ్రకోపుఁడై. 146

మ. అపురా! యెంతకువచ్చె నానుడతి నూర్యన్గొల్చి నిన్నాంతు మూ
డవనాఁడొం డొక మాయఁబన్ని నను పీడంజేసి లోలోపలన్
ధవునిం బిల్వఁగఁ బంచి తోన గనియెన్ నమ్మంగరా దెయ్యెడం
జిపురంబోడులఁ జేలనై విడిచితిన్ జేఁజిక్కఁ గాంతామణిన్. 147

చ. భువి పులినోటికండఁగొనుపోలిక వేడుక నేవరింపఁగో
రు నవజనేత్రిఁదోఁకొని యొరుల్ గనకుండ వివాహుఁడై సుబాం
ధవుఁడయి యేగె వానిపటుదర్పము గీటణగించి యిప్పుడా
యువిదమరల్చి తెత్తు నని యుగ్రదవానలరేఖ మంచుచున్. 148

శా. సేనానాథులఁ బిల్వఁగాఁ బనిచి యక్షీణోద్ధతి స్త్రీరలా
హీనాత్ము న్నడియించు తత్సదతిఁ దెం దేగుండు మీ వెంట నే
నేను న్వచ్చెదనంచుఁ బంప భటదంతిస్యందనాద్యాదినే
నానీకాభియుతంబుగాఁ గదలి రుద్యద్బాహుదర్పంబులన్. 149

శా. ఆరీతిజ్ఞ జని వారలందఱు వివాహాయాతమర్త్యావళిం
దూరం బేగఁగనీకఁ జుట్టుకొన నిర్దోషాత్ముఁడా వీరసం
గాగాధ్యుండు హయంబుసిల్పి రిపుసేనాళి న్విలోకించి యిం
కేరితిజ్ఞ జనవచ్చు శత్రువులనే నెబ్భంగి నిర్జించెదన్. 150

చ. పటుతరదర్పమొప్ప పరిపంథులఁగూల్పఁగ శక్తిచాల దే
నట నిటఁ దప్పరించిచన నాయితుగాదు లతాంగిఁ జేకొనం
గుటిలమహాధవుం డిటుల కొంకక నాపయి దాడివెట్టె హా!
కటకట! కాంతసిచ్చి చనుకం టె శరీరము వీఁడ మేలగున్. 151

ఉ. కాంత నెపంబువెట్టి నను కత్తులపాలుగఁజేయఁ బూనినేఁ
డింతకు దెచ్చినాఁడు హృదయేశ్వరుఁడా శరభావతారుఁ డా
వంతయునైన బ్రాణమున కాసయొనర్ప సతీలలామకై
చింతయొనర్తు నేనగలి సెజ్ఞ వెరవెద్దియొకో తలంపఁగన్. 152

వ. అని యొక్కింతసేపువిచారించి యంతలోననే తెలివొంది యహా! పాంచభూతికవికారంబున నెంతతలంపుపుట్టె సకలజగత్సంహారకారణం బైనత్రిపురారింగొలుచువారల కసాధ్యంబులుం గలవే? యని నిశ్చలచిత్తంబున నిమీలితనేత్రుఁడై యీశ్వరపదధ్యానంబుసేయు నంతలోన. 153

శా. కాళీదుర్గలుపక్షముల్ రవిశశిగ్లౌనేత్రముల్ తీవ్రదం
భోళిప్రాయనఖంబు లష్టచరణంబుల్ వ్యాధిమృత్యూరు లు
త్తాలజ్యోతిశిరద్వయంబు తటిదుద్యజ్జిహ్వ ఘోరార్వనల
జ్వాలాభైరవకుక్షిపక్షములు దీవ్యద్బాహుసాహస్రమున్. 154

చ. తనరఁగఁ గానుపించి మది తల్లడమందకు వత్స! శారభం
బనఁగు మూర్తి నే నిటదయామతిఁదావకవాంఛఁదీర్పఁగాఁ
బనిగొని వచ్చినాఁడ నవపద్మదళాయతనేత్ర! వేగఁ జే
కొని పరిపంథిసంతతులఁ గూల్పఁగఁజాలుదు వంచుఁ బల్కుచున్.

తే. పావకాస్త్రస్వరూపమై పరఁగుమండ
లాగ్ర మొకటిచ్చి యాయుజ్జ్వలాయుధంబు
శత్రువులమీఁదఁ జళిపింప జ్వాలనశిఖలు
దీనఁ జనెయుంచి తచ్ఛమూవాహినిఁజేయు. 156

చ. అనుచుఁ దిరోహితుం డిటులఁ జెప్పఁగఁ గెప్పిరి యద్భుతంబుగాఁ
దనకరమందు వాడియడిదంబుఁ గనుంగొని మోదమంది సం
గన తనతల్లిదండ్రులకు ఖడ్గముఁ జూపి ప్రసన్నుఁడై వచిం
చిన శరభేశభాషితవిశేషము సర్వము దెల్పి యంతటన్. 157

ఆ. సంతసంబెసంగ సకలబంధువులకు,జడుపువాపియపుడు పుడమివడఁకఁ
గడలుప్రీలలీలగర్జోపమాన మా,సింహనాద మెలమిసేయుటయును.

వ. అమ్మహాధ్వని వినునంతనె పరిపంథివరూథినీసముచ్చయం బెల్ల బెదరు
గదుర డిల్లపడిచూచుచున్న సమయంబున వారిపిఱుంద నరుగుదెంచు
మానవపతి దానును భయకంపితతనుండై డాయనోడి తత్ప్రాం
తోన్నతశైలారోహణం బొనరించి కనుంగొనుచుండె నంత నబ్బ
లంబులు నిజసేనానాయకప్రేరితంబులై ధైర్యంబు నవలంబించి
యసిముసలముద్గరప్రాసాదిసాధనంబులతో సమరాభిముఖులై
యొక్కపెట్టుకవిసిన నవ్వీరసంగమేశ్వరుం డత్యంతభక్తితాత్పర్యం
బున శరభసాళువమూర్తిం దలంచి పావకాస్త్రస్వరూపంబైన నిస్త్రిం
శంబొఱ వెఱికి ప్రావృట్కాంచలోపమానంబుగా జళిపించిన దత్ఖ
డ్గంబువలన సంవర్తసమయతాండవధురీణత్రిపురహరఫాలాంబకో
ద్భూతతేజోమాలికాభీలం బై యొక్కయనలం బావిర్భవించి త
ద్వైరులంజుట్టుముట్టి దహించి పంచత్వంబునొందించిన నంవొక్క
శరణపుంగవుప్రాణంబుల బ్రహ్మరంధ్రంబులవ్రచ్చుకొని తేజోరూపం
బునదివంబున కేగునవసరంబునఁ దత్కళేబరంబాయోధనబహిఃప్రదే
శంబునఁబడిన వీరసంగయ గనుంగొని. 159

ఉ. అక్కట! మోసమయ్యె శరణాగ్రణిజీవముఁ గొంటి నింక నా
కెక్కడి మోక్షమేడ యశమే టిది భక్తి? మదిష్టమూర్తి నేఁ
డిక్కడ భక్తహింస ఘటియింపఁగఁ బోలును వాడి ఖడ్గమే
నెక్కరణిన్ సహింతు తనకీపగయున్నెటనుండి యుండెనో. 160

చ. అనుచు విషాదమగ్నహృదయాంబుజుఁడై గణవర్యుతోడఁ దా
నును మృతిఁ జెందఁగాఁ దలఁచి యూల్కను ధైర్యమునన్ గటారిచేఁ
గొని యద నూనునంటనె యొకో యని తచ్ఛరణుండు లేచి యో!
యనఘ! యిటేలచేసెదని హస్తముపట్టి మరల్చె నంతటన్. 161

శా. శైలాగ్రంబున నున్న రాజవరుఁ డాచందంబు వీక్షించి స
చ్ఛీలుం డీతఁడు శర్వభక్తతతి వంచింపండు నేనిప్పుడా
లీలంబోయి మదీయపద్వినతుఁడై లేవంగఁబో నంతలో
గూలం జేయుదు మత్ప్రహారవిహతిం గొంచింపఁగా సంగయున్.

వ. అని తలంచి. 163

చ. గళహృదయాంసశీర్షతలకాయములన్ శశిహారనాయకో
జ్జ్వలమణిశాటికామకుటచర్మలెడల్చియు గొప్పశక్తిచే
వెలయు శివాక్షముల్ గిరిశపేటిక కావిపటంబునున్ జటా
వళిభసితంబు దాల్చి గణవర్యుని చందముఁదోఁప నత్తఱిన్. 164

క. చనుదెంచి యెదుటనిలచిన,జననాయకుఁ గాంచివీరసంగయ్య ముదం
బునఁ గేవలశరణాగ్రణి,యని యెదురుగ నేగి మ్రొక్కునంతటిలోనన్.

క. కేల నున్నట్టి శితకర, వాలంబున నతనిశిరము వ్రైవఁగ నదిపూ
మాలికయై కంఠంబున, వ్రేలె ధరావల్లభుండు వ్రీడం జెందన్. 166

క. ఆక్షణమున గిరిజేశ్వరుఁ, డీక్షేంద్రము నెక్కి నిర్జరోత్కరయుతుఁడై
సాక్షాత్కరింప సంగయ, యక్షీణముదంబుతోడ నతనికినతుఁడై. 167

మాలినీ. శమనమదవిభంగా! చంద్రఖండోత్తమాంగా!
కమలనిధినిషంగా! కాళికాత్మాబ్జభృంగా!
యమృతనిజనిభాంగా! హస్తసంభక్తరంగా!
దమిసుతగుణసంగా! దైవవేశ్యాభుజంగా!. 168

తే. అనుచు వినుతించు నాతనిఁ గని శివుండు
వాంఛితం బెద్ది వేడు మోవత్స! యనినఁ
బెండ్లివారికి మాకు నీపృథివిపతికిఁ
దావకీనపదం బిమ్ము ధర్మవాహ. 169

వ. అనిని శర్వుం డిట్లనియె. 170

క. శ్రీవీరసంగసంతత, కోవిదనుతసుగుణసంగకువలయపతి దు
ర్భావుఁడు వీనికిమోక్షం, బెవిధి నివ్వంగవచ్చు నెఱుఁగ వెయనినన్.

శా. స్వామీ! యిట్టుల నానతీయతగ దీసర్వంసహాభర్తచే
నే మీపాదముఁజూడగంటిఁ గడువర్ణింపంగ నీచిహ్నముల్
దా మైఁ దాలిచి మిమ్ముఁగన్గొనియె నీతం డెన్ని చందంబులన్

సామాన్యం బని యెంచఁబోక దయమోక్షం బిచ్చి రక్షింపవే!. 172
చ. అనిన పరస్మితాంచితముఖాంబుజుఁడై పరమేశ్వరుండు త
జ్జనవరుఁ బెండ్లివారలను సంగయ నాతని యంగనామణిం
గొని చనె రౌప్యశైలమునకుక్షా సుర లచ్చెరువంద నట్లుగా
ఘన శరణప్రభావము లపూర్వము లాత్మగణింప భూవరా!. 173

## బెట్టిదేవరసు కథ.

వ. అనిన బసవేశ్వరునితో బిజ్జలుం డిట్లనియె. 174
ఉ. తొల్లిటివట్టిముచ్చటలు దొడ్డగఁ జెప్పిన నట్లు నమ్ముదుక్ష
గల్లయొ నిక్కమో? యపుడు గన్గొనవారలలోన నేరకం
జెల్లవు తత్ప్రభావములు చెప్పినయట్టుల నీగణాళిలోఁ
దెల్లము చేయుమా యొకని దివ్యమహాత్త్వము చూడ నిత్తఱిన్.
క. అన బసవేశ్వరుఁ డిట్లను, జననాయక! యెవ్వరైన శరణావళి చే
కొనవ్రేలిగోరఁబోలరు,ము ను వే?మిపు డేమి?తథ్యముగఁ గనుమనుచున్.
క. కట్టెదుట నిల్వఁబడ నీ, బెట్టిదేవరసుగారి పృథువిక్రమ మా
పట్టణభర్తకుఁ జూపఁగ,దొట్టిన సంతోషమాత్మఁ దొలుకఁగఁ బలికెన్.
క. నృపుఁ డన్న మాటవింటివె,యపరిమితమహాప్రభావ యనునంత నె తాఁ
గుపితాంతరంగుఁడై కా, శ్యపి గగనంబంటఁ బెరిగె సభ తల్లడిలన్.
వ. ఇట్లు పెరిగి బసవేశ్వరు నుద్దేశించి. 179
సీ. సరసిజాతాబ్జ నక్షత్ర గ్రహంబులు బారనూదునొ యొ ప్రపన్న పోష!
మలజాదినుకలఁ బొమ్మలరీతికరములఁ బట్టి యాడింతు నో భాను తేజ!
యేడుసముద్రంబులిలవసంతంబు గాఁ జల్లునాఁ డుదునో ప్రసన్న హృదయ!
యుర్వీధరంబులొన్డొంటితోఁ దాకించియురుము సేతునుమామనో వసంత!
తే. యేమియానతి యనిబసవేశ్వరాత్మ, సంజ్ఞనొకగట్టు పెకలించిశయకనిష్ఠి
కాంగుళిపునర్భవంబు చేనాకసమున, కెగరఁజిమ్మిననదిబంతిపగిది నెగసె.
క. ఆరీతి నెగయు గిరిఁ గని
ఘోరిపయింబడునో యనుచు నెంతయు సభలో
వారెల్ల బెదరి గనుఁగొన
బోరున నది పుడమిదొరగి పొడిపొడియయ్యెన్. 181

ఉ. అత్తరి లేచి బిజ్జలధరాధిపుఁ డంగముకంప మొంద న
త్యుత్తముఁడైన దేవరసు నొయ్యనఁ జేరి నమస్కరింపుచు
న్మత్తుఁడ క్రోధచిత్తుఁడ క్షమాగుణహీనుఁడ నైననాకు నీ
వి త్తరికూర్మిచే నభయమీయఁగదే శరణాగతావనా!. 182
సీ. భీరహితపురాము రారివీరానీక మారకుండగు నాగహారిరూపు
ఘోరపరాక్రమ తారకదైత్య సంహారుఁడై నట్టి కుమారురూపుఁ
బారమేశ్వరభక్తిదూరదక్షవినాశ కారుఁడౌ వీరావతారురూపు
నీరేజభవశిరోదారణుండగు కాలభైరవమూర్త్యాఖ్య హారురూపుఁ
తే. బోలు నీరూపు శమియించి పూర్వసరణిఁ
దనరి జనలోచనానంద మొనరఁ జేయు
మని నుతించిన నెప్పటితనువుఁ దాల్చె
బసవముఖభక్తతతికి సంతసమెలర్ప. 183
క. వరగుణుఁడగు బెట్టిసదే, వరసు చరిత్రంబు వినినఁ బఠియించిన యా
నరుఁ డరితరిఁ బొరిగొని సు, స్థిరతరశుభసంతతులను జేకొనుధరణిన్.
క. కావున ఘనుఁడీ బెట్టిస, దేవరసయమహిమలిట్టి తెఱఁగగు మఱియున్
భూవిదితంబుగఁ జిత్రము, పావనగుణవీరభద్ర పార్థివ వినుమా.
క. కలిదుర్మాయారహితుఁడు, సలలితజంగమపదాబ్జజాతామిళితుం
డలఘుతరకీర్తియుతుఁడీ, గిలకదమారయ్యయితనికృత మెఱిగింతున్.

— గిలకదమారయ్య కథ. —

సీ. తనువునభస్మలేపన మొప్ప నొనరించి గండపెండెర మొక్క కాలిఁ దాల్చి
కరకచల్లాణంబు కాసెతో బిగియించి, కటికంపుపోగు లేఁప్రడధరించి
గళమునపాలకాయలసంకుసరులేసి ఘనమైన మేనయోగములు దొడగి
ఫాలభాగమునందుఁ బ్రాణలింగముసిల్పి పసిమిమీఱెడుశాల్వపైనిగప్పి
తే. కన్నొనల కజ్జలముదిద్ది కావిబొట్టు
ఫలకమునఁ బెట్టి నాభితలమున ఘంట
నునిచి యొకకేల గిలకయు నొక్కకేల
బొమ్మయును బట్టి కళ్యాణపురమునందు. 187
ఉ. వంచన యేమిలేక గణవర్యగృహంబుల కేగి గిల్కవా
యించుచుఁ గేలిబొమ్మ నటియింపఁగఁ జేయఁగఁ జూచి వారు మ

న్నించి యొసంగు కాంచనమణిప్రచయాంబరవస్తుజాలముల్
గొం చరపెంచి భక్తవరకోటిసమర్చ లొనర్చుచున్నెడన్. 188

తే. ఆవిధము జనులంతట నాడుకొనఁగ
విని గణాచారి సంగయ్య యనెడు భక్త
పుంగవుఁడు తీవ్రకోపవిస్ఫూర్తితోడ
మారయాఖ్యునిబిలిపించి తూలిపలికె. 189

ఉ. మాయలబొమ్మ వట్టి పలుమారు నటింపఁగఁజేసి దాన నా
దాయముగూర్చి శైవగణతండసమర్చ లొనర్చుచున్న లే
దాయనె వేఱెయొక్కసనయంబగు కాయక విట్లు సేతయే
నాయము మానసూనవగు నాధరణీస్థలి భక్తకోటికిన్. 190

క. మేదిని శరణులు లింగవి, నోదంబులు నితరమగు వినోదానుభవం
బేదిక్కున నొనరించిరి, నీదగు చరితంబుదలఁప నింద్యం బయ్యెన్.

తే. కుండచరపుర కుమ్మరగుండవిభుఁడు
చప్పటలు వేసి చారమచక్రవర్తి
హరుని నాడించి రాగతి యవలఁబుచ్చి
మాయచేఁ బట్టి యాడింప నాయమగునె. 192

చ అనవు డతండు మ్రొక్కి వినయంబున నిట్లను సంగమేశ! నీ
యనుమతి యట్లుగాఁగ ననయంబుఁ జరించెదఁ బొమ్మ యింకఁ జే
కొన నని పల్కి గేహమునకుం జని యెప్పటిరీతి కాయకం
బునకయి యొక్కమేటిగణపుంగవునింటికిఁబోయి యచ్చటన్. 193

చ. అలరకరస్థలింగమవు డాత్మకరంబున నిల్పి వింతగాఁ
గిలగిలనాగ గిల్క యొకకేలఁ గదల్పఁగ హస్తపద్మసం
కలితభవుండు పట్పదముకై వడి గంతులువేయఁజొచ్చె వి
చ్చలవిడి చూచువారు మది సంతసమంపఁగ నంతలోపలన్. 184

ఉ. శైవగళోత్తమాంగకరసారసకక్షముఖాంగవేశయు
క్పావనలింగముల్ ప్రథితకాంచనపీఠనియుక్తలింగముల్
స్థావరలింగముల్ గదలి తాండవమాగతినాడఁజొచ్చినం
భావములందు నద్భుతము పర్వఁగ భక్తవరేణ్యు లొండొరుల్.

తే. మేటికలలోన వస్త్రంబు మూటలందు

కరతలంబున నున్న లింగములు గంతు
లేయఁగాఁజొచ్చె యిదియేమి మాయమొక్కొ!
యనుచు నందఱు బసవాలయమున కరిగి. 196

ఉ. ఆతనిఁగాంచి తన్నటనమంతయుఁ దెల్ప స్వలింగమూర్తి ము
న్నాతెఱఁగొంటఁజిత్తమున నద్భుతమందగ శంకరధ్వజ
వ్రాతము పూర్వశైవనికరంబులు స్థావరపీఠలింగసం
ఘాతము నాట్యమట్లనె భయం బెదనొందఁగ వచ్చిచెప్పినన్. 197

మ. పరిశీలింత మటంచు నున్న యెడ నొప్పం బట్టణోదంతముల్
నిరతంబు న్వినుపించుచారుఁ డొకఁ డోలిన్వచ్చి సేవించి యో
వరమంత్రీశ్వర! యిప్పురాంతరమున న్నావిక్రమ్యఁగా రాని చి
త్రరసంబొక్కటిఁ గాంచివచ్చితిని దథ్యంబెట్లనఁ దెల్పెదన్. 198

వ. గిల్కొదమారయాఖ్యుం డొక్కభక్తసత్తముండు. 199

తే. బొమ్మనాడించి తల్లబ్ధి పూటపూట
నయ్యలనుబూన్ప సంగయ్య యనెడిభక్తుఁ
డీసరణిగూడదన బొమ్మ నెడమకేల
లింగమూర్తి నాడించె భక్తాంగణముల. 200

తే. మాదఁ డింతటి భక్తుఁడో ? మదనవైరి
తనకుఁ దా నాట్యమాడె నాతండు చెప్పి
నటుల నీచిత్ర మెచ్చుటనైన గంటి
మే? యనిన దండనాథుండు మెచ్చి యపుడు. 201

క. వారందఱితో సంగయ్య, గారి శుభాగారమునకు గ్రక్కునఁ జని జో
హారుతగలింగనర్తన, కారణమునఁ జోద్యమంద ఘనపదములకున్.

క. జోహారుసేయ నాతం,డాహా! యిదియేమి వింత? యధికులు మీ రి
ట్లూహింతురె? యనిక్రమ్మఱ,నాహారభక్తార్యవితతియడుగులకొరగెన్.

వ. తదనంతరంబ. 204

చ. బసవఁడు సంగమేశుఁ గని పల్కెను గిల్కొదమారశూరి కీ
వసదృశబోధసల్పమము నందఱ నిత్తఱి లింగమూర్తిచేఁ
బసచెడి మోదచేసితివి బాపురె యాతనిచర్య లెన్నఁగా
బిసరుహగర్భ శేషగిరిభిద్గురుముఖ్యుల కైనశక్యమే. 205

ఉ. మాయగ బొమ్మచేసి గణమండలియిండ్లకు కోఁతికైవడిఁ
బాయక త్రిప్పి వారి పదపంకజము ల్గొలువంగఁజేసె న
య్యాయతశౌర్యుఁ డిట్టిగతి యర్హము గాదని మాన్పఁజెల్లునే
ధీయుత! యింకనైనఁ దొలితీరున వానిఁ జరింపఁజేయవే. 206

చ. అనవుడు లజ్జనొంది బసవాధిప! నేరము చేసినాఁడ నీ
యనుపమ మర్మమేనెఱుఁగ నైతి నటంచు నచించి వేగ మా
రని బిలువంగఁ బంచి గణరత్నము పావకదివ్యలింగమూ
ర్తిని నటియింపఁజేయకుము దేశికవర్యుల యాజ్ఞనీఁ దనన్. 207

ఉ. ఓగురులార! తొంటిగతి యోగ్యము గాదని యంటి రిప్పుడీ
లాగున గూడదంటిరి కళాధరభూషణ భక్తపూజ లే
లాగున నింకఁజేయుదు తలంపఁగ కాలము మించెఁ జొచ్చె నా
కేగతి యానతిచ్చెదరొ యిండని మారని గాంచి నవ్వుచున్. 208

క. సంగయతో బసవసచివపుంగవుఁడును నితనికొక్క బుద్ధి దెలుపుఁ డీ
జంగమగురులింగార్చన,భంగము గాకుండననిన భయకంపితుఁడై. 209

చ. గిలకదమార! తొంటిదగు కృత్యముఁజేకొని బొమ్మటన్న న
ప్పలుకుఁ దలంధరించి యటువారలకుం బ్రణమిల్లి యెప్పట
ట్టుల బొమఁగొంచు వేచనెఁ గడుస్మృకమందుచు నైజవృత్తి కీ
యలఘుఁడు వీరభద్రనసుధాధిప యన్నదరంబె యీతనిన్. 210

వ. తదనంతరంబ సకలశివలింగంబు లీనర్తనంబు మానుటయు బసవేశ్వ
రాద్యఖిలభక్తపుంగవు లీతనిమాహాత్మ్యంబు గొనియాడుచు నిజని
వాసంబుల కరిగి రట్లు గావున. 211

క. అలఘుతరభక్తియుతుఁడగు, గిలకద మారన్నమహిమఁ గీర్తించిన ని
శ్చలమతివినినన్నాయం,దొలఁగుఁ గసద్గురుకృపాయుతుఁడగునరుఁడిలన్.

—ఈయురు లింగపెద్దయ్య కథ.—

వ. అదియునుంగాక. 213

ఉ. ఈయురులింగపెద్ది పథ మేమని చెప్పఁగ వచ్చు దేశికేం
ద్రాయతసత్కృపాగతి శివాధిపమంత్రకళారహస్య బో
ధాయుతుఁ డాశ్రితావనవిధానవిచక్షణుఁ డిష్టలింగపూ

జాయనసత్ప్రవర్తి సుకృతాత్ముఁడు సూనృతవాక్యుఁ డిమ్మహిన్. 214
ఉ. ఈతఁడు మోగులూరఁ జరియించుచుఁ దా నొకనాఁడు పుష్కరో
ద్ఘాతమరందపానపటుతుందిలషట్పదమేచకప్రభా
కైతవకందదర్శనవికస్వరహృచ్ఛిఖిభాసితప్రభూ
జాతకుడుంగమానసరసి సైకతదేశమునందు నొక్కచోన్. 215
తే. కలితపద్మాసనస్థుఁడై కనులుమూసి
జపమొనర్చెడి జంగమసార్వభౌము
ధీరు సురలింగ మనియెడు దివ్యపురుషుఁ
గాంచి యల్లంతనుండి జాఁగఁబడి మ్రొక్కె. 216
చ. నిలిచిన కొంతసేపటికి నీలగళాపరమూర్తియైన య
య్యనఘుఁడు మౌనవృత్తి విడి యక్షులువిప్పి కనంగనంతలో
పలఁ దిరుగంగ మ్రొక్కి వెలివాఁడ మనుష్యుఁడ పెద్దయాఖ్యుఁడన్
ఖలుఁడను నన్ను శిష్యునిగఁ గైకొని వేగ కృతార్థుఁ జేయవే!. 217
క. జననియుజనకుఁడు దాతయు,ఘనదైవముగురుఁడునీవగతియును నీవే
యని నమ్మి నిన్నుఁ జేరితి, ననుకరుణాదృష్టిఁగనుము నతజనపాలా!218
చ. అనవు డతం డొనర్చు వినయంబున కెంతయు బ్రీతిజాగి హీ
నున కెటులియ్యగాఁదగు మను ప్రభులింగము నన్నగొంకులోఁ
బెనఁగొన కొంతసేపతనిఁ జేర్కొనకూరకయుండి వానితో
నినుమును పెన్నడేసెఱుఁగ నీగుణమెట్టిదొ యేడనుందువో? 219
వ. అనిన నతం డిట్లనియె. 220
క. ఇప్పురి నెప్పుడు నుండుదు, చెప్పంబనియేమి కరుణఁ జేపట్టిన మీ
కప్పుడె నాగుణముఁగపడు,నప్పాయనిజాగి మ్రొక్కి యతఁడిట్లని యెన్.
క. గురుశుశ్రూష యొనర్చుచుఁ, జిరకాలంబునకుఁ గాక చేకూరునె నీ
యురువాంఛయనినమితియే,ర్పఱచినన టెసేయువాఁడపావనచరితా!
తే. అనిన ద్వాదశవర్షంబు లధికభక్తి
భూతిరుద్రాక్షధారివై భూతనాథ
భక్తు లెదురైన మ్రొక్కుచుఁ బరిచరింపు
మనిన నవుగాక! యనిపోయి యనుదినంబు. 223
క. ఊర్భులింగము బోధించిన, కరణిన్ గ్రమ్మరుచు వంటగట్టియ లోక మో

పరుదున వారల గేహాంగణములలో బయలనుండి వైచుచునుండెన్.

ఉ. ఈగతి మూఁడునాలుగయిదేండ్లు వచ్చి యితండు వేఁక్కచే
నాగురువర్యభవ్యకరుణాగతిచే ఫలియించునంచు వే
వేగ ప్రభాతవేళ నిలు వెల్వడి నాఁటికినంబునందు ప
ర్వాగమవేది యాగురునియంగణమందుఁ జరించుచుండఁగన్. 225

ఉ. నిద్దుర లేచి యాఘనుఁడు నీలగళున్ స్మరియించువేళ నా
పెద్దయ సంచరించునడి పీనుల సోఁకిన నావుదూడయో
యెద్దొ యటంచుఁ వాఁశియని యేత్తర ముమ్మరుఁ బల్క నాతఁడీ
ప్రొద్దునకబ్బె నాకు గురుబోధితమంత్ర మటంచు నాత్మలోన్. 226

తే. కంటిభాగ్యంబుభక్తినిగంటిఁగీర్తి, గంటిఁ బెన్నిధిగంటిమోక్షంబుగంటిఁ
గంటి జ్ఞానంబునింక నేఁగడమలేక, యుంటిని త్తఱినీగురుమహిమవలన.

చ. అని యిటులం స్మరించుసమయంబునఁ సద్గురుఁ డేగుదేర నా
తని కతిభక్తి మొ్రొక్కి యమృతప్రదమంత్రరహస్య మబ్బె మీ
ఘనకృప నంచు బల్కిన మొగంబున నివ్వెఱ దోఁప వాఁశి యం
చని మును తాను దల్చుమహితాక్షరము ల్మను వయ్యె పీనికిన్. 228

చ. పలుమరుఁ బల్క మంత్రమయి పాఁటిలె నొక! తవత్క్షరద్వయం
బిల సితవర్ప్పుఁడో కతన నీశ్వరుఁ డీగతి సంఘటించె నం
చలమినప్రేమఁ బెద్దయ! కృతార్థుఁడవైతివి పొమ్మటన్న జాఁ
గిలిపడి మొ్రొక్కి యేగె వడి గేహము బొంగుచు నంతు లేకయునున్.

క. ఆరీతి నరిగి సద్గురు, భూరికృప న్మంత్రసిద్ధిఁ బొందినవాఁడై
ధారుణి జాఁగెం దెత్తున, ధీరుఁడు పెద్దయ్యమెఱుగి తిరుగుచునుండెన్

ఉ. అంతటఁ బత్త్పురాధిపతి యాత్మమునంబున నొక్కబావి ద్ర
వ్వింత మటంచు నుప్పరులఁ బిల్వఁగఁబంచి యనుజ్ఞయీయ వా
రెంతయుఁ ద్రవ్వినన్ జలము లేమియు నారక చట్టు వడ్డ వాఁ
డింతిలి రాయి దొల్చు ఘనశిల్పికులన్ నియమింప నారలున్. 231

తే. చేతనయినంతయాచట్టు చెండిచెండి, యించుకైనను దానిభేదించలేక
విసివిభూపతికాగతివిన్నవింప,మదినివేఁడొందుదోఁచకమంత్రిఁజూచి.

క. నీ కేమిఁ దోఁచు నాశిల, యేకైవడిఁ దెగు జలంబు లేగతి నూరున్
మాకేమి తెలియకున్నది,యాకూపము పనికివచ్చునను వుం జెపుమా.

ఉ. నావు డతండు మ్రొక్కి నరనాయక! యొక్కటి దోఁచె నామదిం
దాపకపట్టణాంతరమున న్నివసియించుమహాజనంబు లీ
బావి జనించు పట్టుపడియెఁ బాపము లుంచిరయేని దీనిలోఁ
బావననీర మూరఁ నిది భాగ్యమయేసి యొనర్పు మీ వనన్. 234

ఉ. పెద్దల వారిఁ గన్గొని పురంబున నారసి సుప్రసిద్ధులౌ
పెద్దల నెల్ల నిచ్చటికిఁ బిల్వఁడు పొండన వార లేగి యా
శుద్ధి యెఱుంగఁ జెప్ప విని చోటులనుండియె వారు వచ్చినన్
గద్దియ డిగ్గి మ్రొక్కి నరనాథుఁడు నద్భుతవారయుక్తుఁ డై. 235

ఉ. తవ్వినబావి దగ్గఱి బుధప్రకరంబున కర్థి మ్రొక్కి మీ
రివ్వల కూపమందు దిగి యిద్ధభవత్పదపద్మపాంసువుల్
నివ్వటిలంగఁ ద్రొక్కుఁడు దనలీలగ నీరము పుట్టు నన్న వా
రవ్విధి సల్పినన్ సలిలమందు జనింపమి రాజఖిన్నుఁ డై. 236

క. ఉన్న యెడఁజారుఁడొక్కరు, డన్నరపతి గాంచి దేవ యంత్యజుఁడొకరుం
డున్నాఁడు ధరకుజానెడు, మిన్నగ జరియించుపదము మెట్టఁడు భూమిన్.

ఆ. తన్మహత్త్వ మెన్నఁదరముగాదెరికిఁ, గాన వానిచేత నొనరియేమొ
వారిఁ దీనిలోన నూరఁజేయఁగ నన్న, బిలువఁబనిచె నృపతి పెద్దయాఖ్య.

చ. పిలిచిన వేగ వచ్చి తనపెంపు గనంబడ భూమి కెత్తుగా
నిలిచినవానిఁ గాంచి ధరణీపతి యద్భుత మంది వీనిచే
సలిలము నూరు చట్టరు ననంశయ మంచుఁ దలంచి నూతిలో
పలిశిల వీడఁజేయుట యుపాయముఁదోఁచిన నేయుమీ వనన్. 239

ఆ. ఆతఁడట్లు సేతునది యెంతపనియని, గురునిపదములాత్మఁ గుదురుకొల్పి,
వాశి యనినఁబట్టువదలియాచట్టుబి, ట్టెగసి బయలుపడియెజగతి నణఁక,

ఉ. వెంటనె తియ్యనీరు ప్రభవించినఁ గన్గొని భూమిభర్త మి
న్నంటఁగఁ బొంగి సంతసము నద్భుతము న్మది బర్వ నేఁడు ము
క్కంటికి యె కాక యన్యులనఁగాఁ జన దిప్పు మదీప్సితంబ నే
పంట ఫలింపఁజేసె ననపాయముగా నని యెంచి వానితోన్. 241

క. అద్దంశశూకహారున, కుద్ది యన న్వచ్చు నిన్న హెూ! గుణగణకా!
పెద్దలకుఁ బెద్దవైతివి, పెద్దయ్యా! నీకు సాటి పృథివిం గలరే?. 242

వ. అని సన్నుతించుసమయంబున. 243

సీ. ఇదియద్భుతం బని మదిగణించెడివారు పోఁడిమిఁ జెడిచిన్నవోవువారు
నెవరితోఁ జెప్పక యిండ్లకేగుదువారు నొకరిచాటుననొకరుండువారు
తలవంచియేమియుఁబలుకకుండెడువారు వెచ్చనినిట్టూర్పులిచ్చువారు
కాలియంగుళులతో నేలఁ గాచెడువారు వెతలఁ జేనాత్మలవిసుగువారు
తే. నగుచు నందఱిపెద్దలు వగచుచుండు
సమయమున వచ్చి యురులింగసద్గురుండు
తనకు మ్రొక్కిన శిష్యుని నెనరు వొలుక
గ్రుచ్చి కౌఁగిటఁ జేరిచి మెచ్చుఁ దనర. 244
క. శైవాగమోక్తసరణి, న్బావనతరలింగ మొసఁగ భక్తవరేణ్యా!
నీవే నేనే నేనే, నీవే యిద్దఱికి భేద మించుక గలదే? 245
క. జాతీశుఁడు బిల్లముచే, ఖ్యాతిఁ గనినపగిది భక్తగణములలో నీ
చేతఁగడు వన్నె కెక్కితి, మాతండ్రీ! నీవు శిష్యమాత్రుఁడవగుదే?.
తే. అనఘ! నీమామ పూర్వమై యస్మదీయ
నామధేయంబు గలుగంగ నాకుఁ గోర్కె
పెరిఁగెనటుగాన నురులింగ! పెద్దయాఖ్యఁ
దాల్పు మని పల్క నాతఁడు దాల్చి వెలసె. 247
క. ఉరులింగపెద్దినిర్మల, చరితము సద్భక్తి సభలఁ జదివిన వినినన్
గురుకారుణ్యంబున సుస్థిరవాంఛాఫలసమృద్ధిఁ జెందుదురుఁ జిలన్. 248

## ఈండ్రఁగి మారయ్య కథ.

వ. అదియునుంగాక. 249
క. వేండ్రపుఁగినుకరనాదు, త్రండ్రిపయింబొడమ వాని తలయుఁగూలం
గండ్రించువేల్పువగతుం, డేండ్రఁగిమారయ్యయితని నెన్నఁగదరమే.
వ. ఇతండు కల్యాణపురంబుననుండుచు ననుదినంబున. 251
చ. మొలచుట్టు న్వడిగోలుదాన నగుబల్మోలాపయిం గీతక
త్తులు నూఱుం ముసలంబు వామభుజమందుం దాని కిర్వంకలం
గలులొట్లుండిడ కట్లనిచ్చెనపిఱుందం గొమ్ము కాల్బందముం
దలకోఁ రముడిగుడ్డయుం దనరఁబ్రాతఃకాలమం దెప్పుడున్. 252
క. నిజకాయకమునకై యం, గజరిపుపదపూజనములు గావించి మనోం
బుజమలర నేగియుర దె,చ్చిజనులకమ్మియు ధనంబుఁ జేకొని మొలమిన్.

చ. తనయులు సేరి వాఁడియడిదంబున నాత్మకరద్వయంబు ఖం
డన మొనరించి శర్వనికరంబులు మ్రొక్కఁగఁ దారకాద్రికిం
బనిచి భజించివచ్చి మునుపంటివిధంబున నంటకొన్న పా
వనశయవారిజాతముల భావగణార్చ లొనర్చు నిత్యమున్. 254
క. ఈరీతి వ్రతము సలుపుచు, మారయ నొకనాఁడు నగరమార్గంబున రా
ధారుణిపతి సభ కేగుచొ, దారిన బసవండుగాంచి దండ మొనర్పన్.
తే. మగుడ నతియొనరించు నమ్మహితుఁ డేగు
పిదప బసవండు సభ కేగి వేగ మఱలి
తత్ప్రసాదేచ్ఛ మారనిధామమునకుఁ
జనియె మువమున మూఁడవజాముతఱిని. 256
క. చని సంపతులకు వంకన, మొనరింపఁగ నుల్కి వారు దండేశుని గ
న్గొనియట్లుగోళ్లనలుపుచు, వినయంబుననిట్టు లనిరి వికసితముఖులై.
ఉ. పావన మయ్యె మాగృహము పాపము లెల్ల నణంగెఁ బుణ్యముల్
ప్రోవుగఁజేరె ము క్తిసతిఁబొందుటగూడె ఫలించెఁ గోరికల్
దేవరదార లిందు నడదే నిఁక జా గొనరింప కీశ్వరా
ర్చనవిధి సల్పఁగా వలయు జంగమవర్యులతోడ నీ వనన్. [వ
ఆ. అట్లుగాక యనుచు నమ్మంత్రిశేఖరుం, డపు డవారలిడినయమృతమయ
హాప్రసాదతృప్తుఁడై తదనుజ్ఞచే, నెలమి నిజగృహమున కేగె నంత.
క. కొండెవమాచయ ధరణీ, మండలపతిఁజేరి యీయాంధ్రమారనియింటం
బండారిగుడిచెననిబలు, కొండెముగా దెలుపనత్తఁడు కోపోద్ధతుఁడై.
క. అప్పుడె బసవామాత్యుని, రప్పించిటునల్కె మొగము రాజగమీకే
తప్పులు లేవనితలఁచితొ, చెప్పఁగవినరానిపనులు సేయందగునే? 261
మ. కులశీలంబులు నీటఁబుచ్చి విభుధోక్తుల్ గాలిఁ బోఁజేసి పూ
ర్వులచర్య ల్విడనాడి శాస్త్రనియమంబుల్ త్రోసి కల్లమ్ముపా
రలయిండ్లం గుడువంగ నెంచితివె సర్వజ్ఞుండవే యైనఁ ద
త్కులముంజూడక నీవు మిన్నకయె కక్కుర్తిఁ బడం జెల్లునే? 262
ఉ. చేతులఁగోసి యీశ్వరునిచెంతకు నిత్యముఁ బంచుచున్నవి
ఖ్యాతి గణించితే మొయది గారుడమా టెఱుఁగంగలేక నీ
వాతనిపెంపు మాకు ఘనమై కనుపట్టెద వన్న నవ్వి మో

భూతలనాథ! తన్మహిమ పొల్లుసనాడుట నీకుఁబాడియే.? 263

క. మారయ మదవిహ్వలుని, మారయయనివినుతికెక్కె మహిమెల్లెడనా
మారయమహిమౌన్నత్యము, నారయఁగాఁగలమె భూవరాధిపయనినన్.

ఉ. మాటలకేమి యీశ్వరసమానుఁడు వాఁ డనునంత నమ్ము న
న్నాటి యతండు ప్రత్యయముఁ జూపఁగ నోపినవాఁడయేని న
ప్పాటున సమ్మతింతు మసి పల్కిన: దప్పసవేశ్వరుండు మో
మోటము లేక వాసి మహిమోన్నతిఁ జూపెద రమ్ము భూవరా.!

క. అని పరివారముతో న, జ్జనపతిదోడుకొని వాసిసవనంబునకుం
జనఁగనియాతఁడెదుర్కొని, వినయంబున మ్రొక్కిబసవవిభుఁడిట్లనియెన్.

చ. అకుటిలతావకవ్రతమహత్త్వముఁ జూచుట కిన్నరాధినా
యకుఁ డరుదెంచెఁ గావున జయంబున నీతనికోర్కె దీర్పవే
సకలజనాక్షిపర్వముగ శంకరతుల్య! యటన్న నాతఁ డం
చుక మదిఁ గొంకు లేక వసుంధరి దానును భక్తినమ్రులై. 267

క. చెలఁకులు నటీకిసచాడ్పున, కలుకులుక్కునగనాత్మకరములునాల్గుం
దఱిఁగికొనునంతలోనన్, గరకంఠునిపురికిఁజనియె గగనతలమునన్.

చ. అటు చని పార్వతీశుల పదాంతికమందున వ్రాలె నయ్యెడం
బటుగతి సిద్ధరాముఁ డనుభక్తవరేణ్యుఁడు గాంచి వచ్చి మా
కిట నట నైనభూధరను శైవవివాదముఁ దెల్ప నేను వి
న్నటులను వీరభద్రవసుధాధిప! నీకెఱిఁగింతు నంతయున్. 269

క. ఆరీతిఁ దనదుపదముల, మారాంతకచరణముల గ్రమంబునఁబడు నీ
రేరుహవదనప్పూరుష,చారుకరాబ్జములుగాంచి శైలజ మదిలోన్.

తే. అద్భుతం బంది విభుఁ గాంచి యనియె నీశ!
సంతతము రెండుపురుషహస్తములు వచ్చు
చుండు నేఁ డిది యేమొకో యువిదకరయు
గంబు నరుదెంచె దెలుపు నిజంబు గాఁగ. 271

చ అన విని శంకరుండు గిరిజాత్మజ కిట్లను నింద్రమారదా
త్మసిరుపమప్రభావము క్షమన్ బసవానుమతింధరాధినా
థునకెఱిఁగింప బూని తనతో యరుపానసహస్తపద్మముల్
నినుఁ గొలువంగఁ బంచె నన నెమ్మదిఁ బార్వతి సంతసింపుచున్.272

శా. దీనజనానురాగ భవదీయపదార్చకసన్మహత్త్వముల్
పూనినుతింప ధాతృఫణిపుంగవజీవులకైన శక్యమే?
మానితసత్యసంధులసమానతరోరతులద్రిధైర్యులం
హీనిచయాపహారులసమున్నతి తేజులునీతికోవిదుల్. 273

చ. అని కొనియాడుచుం గిరిజయాత్మలినీలకచోమృతంబులో
కనికర సన్నుతాద్భుత సుగంధము బంధురపాండురప్రభా
వినికృతహంసమైనసురవృక్షసుమస్నిహదామమప్పుడా
ఘనకర యుగ్మయుగ్మమున గట్టిగఁ జుట్టి ప్రియుండు నవ్వఁగన్. 274

ఉ. అంతటఁ దత్కరంబులు శివాంఘ్రులు సన్నిధినుండి ధాత్రికిన్
వింతగవచ్చె నభ్రపదవిం బరివేష్టితపారిజాత పు
ష్పాంతర సింధుపారణసమాగతషట్పద బృందఝంక్రియా
కాంతదిగంతరంబులైన రాజముఖ్యులెవ్వఁగందిచూడఁగన్. 275

క. ఆరీతి వచ్చి తత్కర, వారిజయుగయుగము పూర్వవైఖరియపుడా
మారనికి నతనిసాధ్వికి, ధారుణిజను లెల్లఁజూడ దగిలి వెలింగెన్.

చ. అది గని బిజ్జలావనితలాధిపుఁడద్భుతసాధ్వసత్రముల్
హృదయములోనముప్పిరి వహింపఁగ శ్రీబసవేశుఁగాంచి యీ
సదమలచిత్తుసన్మహిమ స్వాంతమునన్ దెలియంగలేక నే
బదరితి కొన్ని మాటలవి పాటియొనర్పక నన్ను బ్రోవరే. 277

చ. అని వినుతించి మ్రొక్కుచు ధరాధిపుఁ డాత్మగృహంబుఁ జేరునం
త నచటిభక్తపర్యులుముదంబునమారశిగాంచిబాగురే
ఘనతరభక్తినిష్ఠలకుగాయజుసంహరసత్కృపారతిం
గనుటకు నీవె మేటి వికగల్గుదురే నినుఁబోలువారిలన్. 278

చ. బసవనిదూరనాఁడుజనవర్యుఁడులజ్జవహింపలోకము
ల్వెసువకసన్నుతింపనిజవిశ్రుతకీర్తిలతావితానము
ల్దెసలనలంకరింప గణధీరులకెల్లనుసంతసంబుమా
నసములనింపనిత్తఱిగనంబడ చేసితి నీమహత్త్వముల్. 279

వ. అని పెక్కువిధంబులఁ బ్రస్తుతింపుచు బసవేశ్వరప్రముఖభక్తులాత్మ
నివాసంబులం జెంది రట్లుగావున వీరభద్రావనీపాలా! యితని మహి
మం బెత్తెఱంగు. 280

క. ఈయాంధ్రమారయ చరిత, పాయక సద్భక్తి వినిన బఠియించిన దీ
ర్ఘాయువునారోగ్యశ్రీ, శ్రేయస్సంతానవృద్ధిఁ జెందు నరుఁ డిలన్. 281

వ. అదియునుంగాక. 282

చ. సుజనహితంబు సద్వ్రతము సూనృతవాక్యము శాంతవృత్తి భా
నుజరిపు పాదభక్తి గణవల్లభ దాస్యము దివ్యబోధ స
ద్ద్విజనవకీర్తనంబు గతరాగత నైజగుణంబు లౌటచే
నిజగుణ నాముఁ డయ్యె ధరణీస్థలి నీతఁడు మానవేశ్వరా!. 283

గుణేంద్రుని కథ.

వ. ఇమ్మహాత్ముండు కల్యాణగుణంబునం దనుదినంబు. 284

క. రేవణకవ్వెంకత నా, జీవంబునఁ దాల్చి భక్తసింహుల యిండ్లం
బావనభిక్షముఁ గొని నై, జావాసము జెంది దానవతుఁ యలీలన్. 285

ఉ. వచ్చినజంగమాళి కవారితభక్తి భజింపఁ బెట్టుచున్
సచ్చరితుం డితం డనుచు సర్వజనంబులు సన్నుతింపఁగా
తెచ్చిన ఖ్యాత వర్తిక గణేతరులెవ్వరు వేలసంఖ్యలై
వచ్చిన నిష్టభోజనముల వారలదన్పుచు నుండు నంతటన్. 286

చ. జనపతి తత్ప్రియంబు విని నైపకదుర్మతి నా గుణాఢ్యవం
చన వెలనరింపఁ బూని యొకసక్కముగా బసవేశుతోడ ని
ట్లనియె మహాత్మ! యిప్పురమునం దొక భక్తుడు వేలసంఖ్యవ
చ్చిన మనుజాళి కీప్సితము లేకున నట్టు మనోహరాన్నమున్. 287

క. అసివింటినది యొనిక్కమొ, యన్నృతమో? బసవఁడనియె నవనీశ్వర నీ
వినినంత మట్టు సత్యం, బనఘాత్ముండతనిమహిమయఁ విను మెఱింగఁపన్.

చ. కనమునఁ బట్టి భిక్షగొనుకవ్వెక గొప్పదిగాదు మాకడ
టరు వడి నిండ తండులము లవ్వల నెవ్వరినేఁడ కింటికిం
బరువున వచ్చి సద్గురుకృపాగతి యక్షయమైనవాటిచే
గురుతుగ కోటిసంఖ్యజనకోటుల కీతఁడు బెట్టు నన్నమున్. 289

వ. అనిన నమ్మహీశ్వరుం డిట్లనియె.

తే. అట్టు మనసంతతాన్నదానవ్రత, నిష్ఠఁ దైచరించు నిజగుణేంద్రు
మందిరమున గుడవ మాకిష్టమైనది, నేడు పోదమసిననృపతిఁ గాంచి.

చ. బండరివప్పెనో మనుజవల్లభ! నీకెటు దోచె నట్లవో

వండరుదెండిపాగ మది దార్కొనుకూహాకు మీర లేయు వం
వండరథాశ్వవీరభటదానసుహృజ్జనబంధుయుక్తుఁ డై
దండిగ నేగుదెంచె వసుధావరుఁడాబసవండుతోడరాన్. 292

తే. అటుల తనయింటికేతెంచు నవనిజాని
బసవనామాత్యుఁ గనుఁగొని ప్రమదమాత్మ
నలరె నెదురేగి నిజగుణి యచటభక్తి
నికరములకెల్ల కేల్మోడ్చినిలుచు నంత. 293

ఉ. ఆతనిగాంచిపల్కె బసవన్నమహాత్మధరావరుండు నీ
ఖ్యాతికి బ్రీతి జెంది భవదాలయమందుభుజించువేడ్క చే
నీతరివచ్చినాఁ డితని యీప్సితముల్ ఫలియింపఁజేయవే
పాతకజాతదుర్విపినపావకతావకభావమేర్పడన్. 294

చ. అనిన మహాప్రసాద మని యంతరిఁదోడ్కొనిపోయి మున్నుగా
ఘనతరభక్తిచే శరణకాండసమస్తులొనర్చి పిమ్మటన్
వననిధిగాంచి భక్తపరివారముతోడను భాసనంబులం
దొనరఁగఁ జేసి దివ్యమహిమోన్నతిసద్గురు సంస్మరింపుచున్. 295

మ. కదళీరాజనఖాజపంక్తు లమరంగా వైచి యంతర్భృతం
బొదవం శాకశలాటిసూపరసభక్ష్యాఖాద్యహాయ్యంగవీ
న దధిక్షీరసమేతపాండుకలమాన్నం బట్లు నడ్డింపనే
మెదలెప్పన్ ఫలియింపనుమ్ము గొనిరి భూమీపాలకుంగాదిగిన్. 296

దండకము· యీ రీతి తజ్జైను లారోగణంబొప్పగాఁ జేయుచుం దారు న
మ్మోక్తు లిం పొందఁగా నొండొరుల్ సారె నీభక్తవస్యప్రధానంబు
లెక్కింప వాక్కానిసీనాథ ముఖ్యాదులల్ శక్తులేవూని తా జేయు
చున్నట్టియాకాయకం బెంత యీవచ్చికూర్చున్న సంఘంబు సంఖ్య
న్విచారింపఁగా నెంతయెవ్వారి కెవ్వారి నేతీరుగానిష్టమౌనట్టిచందం
బు సంప్రీతిగా వేడి వడ్డించె నౌరా భళీ బాగు మేలా యె నిట్లుండవ
ద్దానెతాంతానదానక్రమంబంచు నీరీతిగా భోజనం బబ్బునం బిం
చుకంత్తైనముం దోఁచఁదాయంగదాయింట నేవంటకం విసర్జించియే
బెంతు నంభున్ వహింక్ దోషులై వేయువర్షంబులున్నంతకం టెన్

గజంబై మహార్తంబ నర్తింపమేఁ యన్న గంజంబునఁ హీనమార్గైన
నంశంబునం బుట్టి యేభోగము న్లేక చింతింపుచుఁ బెద్దకాలంబు
జీవించుకంటెఁ క్షణంబైన భక్తాఢ్యులైయుండుట శ్రేలటంచుఁ ము
దం గుత్తుకంటంగ భక్త్యాపళుల్మెక్కి సంతృప్తిలేకయ్యయో! నెత్తిపై
నోరుగల్పించితే నింకనుంగొన్ని భక్షింపవచ్చుఁ గదా యట్టుగా
నేటికిఁ జేయఁడా బ్రహ్మ పాపాత్మసంఘాతనిం దూరుచుం గాసి
పాండ్యుండు నాసాంఖ్యతొండాహ్వయుండాదియౌ వార లీజైనసం
శోద్భవుల్గారె? మాదారి భక్తాఢ్యులయ్యుయంతవారైరి యారీతినీ జా
ద్ధవంశాభిమానంబుఁ బెన్నిటిలో ముంచి యేడాదిగా నీకశైవంబుచే
కొందమంచుఁ వివాహంబులుఁ బండుగల్ బబ్బముల్ మున్ను
మాయిండులఁ జేయుట ల్లేవొ! యీవస్తుజాలంబులఁ బంచిగా వండ
లేదో! భుజింపంగ లేదో! యహా! యిట్టిసౌకర్య మే వెన్నడుంగంటిమే
వీరిచేనైనపాకంబు తీరిట్టిదో లేక శ్రీకంఠభక్తాళిగేహంబులందంత
టఁ సౌష్ఠవంబిట్టుగానుండునో యంచు నానట్టిసౌఖ్యంబునం దా
సగిల్కొంటచేకదా సర్వదేశాగతానేకభక్తావళుల్ లక్షయతొం
బదార్వేలు బండారి యిల్వెళ్లఁగా లేక యేచోటికిం బోదురు రండు
రండంచుచుం వడింగేరుచుఁ దర్వరంబెం డటంచుఁ నురంబెత్తికొం
చుఁ జరంబయ్యెనంచుఁ శిరంబంటికొంచుఁ గడుందియ్యమంచుఁ
నడిఁబావుకొంచుఁ గదఁ జూచుకొంచుఁ న్నైడఁ ద్రిప్పుకొంచుఁ
గడుంజుఱ్ఱునం జుఱ్ఱుచుఁ గుఱ్ఱునం దేన్పుచుఁ నిఱ్ఱునంనీల్గుచుం
వేడ్కతో బిజ్జలాధీశు పూర్వంబుగా నందఱుంభోజనం బొప్పఁగాఁ
జేసి యప్పిమ్మటన్. 297

నిజగుణసన్నుతిఁ జేయుచు, నిజగేహంబునకుఁజనియె నృపతిలకుఁడువా
నిజనము లహాహా యనఁబూ, నిజగంబులు మెచ్చనితఁడు నెగడెఁ భక్తిన్.

## మీమాంసుని కథ.

అనియనువీరభద్రవసుధాధిపుతో నను నాగమాంబికా
తనుభవుఁ డీమహాత్మనికతంబున నయ్యె మదీయమాతులా
వనివర దేశికేంద్రులకు వాద మదెట్లన బిజ్జలుండువో
యినిజగుణేంద్రు నింటభుజియించుటఁ దా నతికోపచిత్తుఁడై. 298

శా. మీమాంసుం డిదియేలకో తలఁప నీభూనాథుఁ డాత్మీయవం
శామంచ క్రమ మెల్లమిన్నకయె మాయంజేసి దుశ్చేష్టుఁడై
కామించెన్ శివభక్తు లిండ్ల గుడువంగా నిట్టి దుర్వర్తనం
జేమాన్పింపకయున్న పాపమగునా కిప్పట్టునం జెంతయున్. 300

చ. సరగున నప్పైనమైబలసి ఛాత్రసహస్రము గొల్వఁ బుస్తకో
త్తరభరభృత్కరుల్ నడువ దమ్మట కాహళశంఖభేరికా
దిరవములుల్లసిల్లఁ బరవీరభయంకరమైతనర్చు మే
ల్చిరునవితానమొప్ప వెడలెం గురు డందలమెక్కియుక్కునన్. 301

శా. ఈరీతిన్ జనుదెంచి భవ్యతరకల్యాణాంతికోద్యానవి
స్ఫారాక్షోణితలంబున న్విడియ నవ్వార్తల్ ధరానాథుతోఁ
జారుల్ చెప్పినలేచి యప్పుడుసుహృత్సంఘంబుతో వేగస
చ్చారుండై చనిచొచ్చె సూర్యకిరణాసాధ్యోపవన్యంతమున్. 302

వ. చొచ్చి చనిచని ముందట. 303

చ. కనుఁగొనె నేలతేఁడుమణికాంచనభూషణభూషితున్ మృగా
జినయుతుఁ గోపిచందనవిశిష్టసమంచితఫాలుఁగతుదే
శనిరుపమేంద్రజాల మనుసంచయసంపుటు నంగలిప్తచం
దనుస్ఫటికాక్షమాలు గుణధాము నసామ్యుని నైజదేశికున్. 304

ఉ. కాంచి నమస్కరించి మణికాంచనముఖ్యము లైనవస్తువుల్
సంచితభక్తి మ్రోలనిడ సర్వముఁ జూచి యితండు చిత్తమం
దెంచమదీయ భక్తియెడ నేమరఁడంచుముదంబు నొంది ము
క్త్యాంచితహార మొక్కటి ప్రియంబునఁ దీవెనతోడ నిచ్చినన్. 305

చ. అదియరుతం ధరించుకొని యామురుసర్యనిభద్రదంతిపై
ముదమున నెక్కఁగాఁ బనిచి ముంగలఁగొంచనవేత్రహస్తుఁడై
పద తొలగుం డనంచును యవాయజనంబులఁ దా నదల్చుచున్
సదనము జేరఁదెచ్చి మణిసౌధమున న్వసియించి భక్తితోన్. 306

తే. సింహాపీఠంబునందుంచి చెంత నర్హ
మైన గద్దియ తానున్న యవసరమున
బసవఁ డేతెంచి నిజపీఠమునవసింపఁ
గాంచి మీమాంసుఁ డాత్మలో గనలుగదుర. 307

చ. నరవరుతోడ నిట్లనియె నప్లనిమ్రొక్కఁగ మాఁగిలగద్దెపై
సరగునగూరుచుండె మపిజంగొకయించుకలేక యోగి యో
గురువరుఁడో యితండుప్రతిహాలుకురాజసభాంతరంబులన్
దిరుగుచునుండ నీకగునె తెల్పుము పేఁ డెవడన్న నమ్రుఁడై. 308
ఉ. దేశికసార్వభౌమ! గణియింపఁగ నీతఁడు మర్త్యమాత్రుఁడే!
పాశుపతాగ్రగణ్యుఁ డరిభంజనుఁ డాశ్రితపోషణుండు భా
షాశరదిందు సన్నిభయశఃపరిపూరితకీర్తిటుండు పం
చాశుగదుర్వికారహరుఁడంచితసూనృతవాక్యుఁ డిమ్మహిన్. 309
సీ. తనయిల్లు దోఁచవచ్చిన తస్కరులుగాల్చు
వంగకాయలోనర్చె లింగములుగ
జంగమం బడిగిన ముంగలిజొన్నల
రాశి ముత్యములుగాఁ జేసి యొసఁగె
బండార మొకమిండ భక్తునకిచ్చి య
ప్పటికిగతినాకు గన్పడఁగఁజేసె
వాదించి సభవెలి వాఁడభక్తుల కేలి
నేలజాలై పాలుపాలుపితికె
తే. చల్లలమ్ముచు పురవీధిగోపపడతి
పంకమునజారి యొఱఁగుచో బసవయనుచుఁ
బల్కనిటనుండి పడకుండఁబట్టెదాని
నితని మహిమపథం బిట్టి దిదియఁగాక. 310
చ. శాస్త్రనలోకసంచయము సల్పి చతుస్సరిధిసమభ్యయా
ధాత్రికివేడ్కమీర నను దక్షునిఁ గా నొనరించి మారభి
ద్గోత్రశశాంకహీరశరకుండలినాథ సదృశకీర్తికిం
బాత్రునిఁజేసి మాన్పె బసవండితఁ డెన్నినమంత్రిమాత్రుఁడే. 311
క. ప్రతివాదిభయంకరుఁడూ, ర్జితశాంభవభక్తి ధనుఁడు జితషడ్వర్గుం
డితనిని సామాన్యజనుని,గతిచుల్కఁగమీరు చూడఁగావలవనినన్.
ఉ. వాలముదొక్కఁబడ్డ ఫణివై ఖరినాజ్యముపోయ భగ్గునన్
జ్వాలలుగ్రక్క తీవ్రశిఖిచందమునన్గనలొంది యోరి? భూ
పాలభయంటి వీవు పరవాదిభయంకరుఁ డా యితండు చాల్

చాలుమదీయ సన్నిధివశం బగు నేనుడువె త్తదీనికిన్. 313

తే. వేదవేదాంతశాస్త్రాగమాదులందు
మంత్రతంత్రౌషధక్రియామహిమలందు
చోద్యమాయింద్రజాలాదివిద్యలందు
నాకుసరివారుగలరె? భూలోకమునను. 314

క. ఏనిత్యవలనదానా, తోవాదించఁగలఁడనుచు దండేశునిడ
కై ౘ వెసఁజిరిగి మహాప్రభావం బేర్పడఁగవైచె వాకట్టేలేసెన్. 315

వ. ఇట్లు వైచిన. 316

క. మనమునననించుకఁగొంకక, కనుఁగొనలఁ నవ్వి తనదుకట్టెదుటవసిం
చిననందికోలశాంత, య్యనుఁగనిబసవయ్యసైఁగనటుఁజూపుటయున్.

సీ. ఆలిపిపత్రికయాతఁడుగ్గె కొని కొం కొకింతయులేక గోఁజిరె
మీమాంసుఁడదివోవతామసంబునచెడకట్టివైచినదానిగాలమమురె
గడువడిక్రమ్మడి కనుకట్టువైచిన బుస్సునసెగనూది పోవఁజేసె
యిట్టితోల్కట్టదండేశుని మర్దింపవైచినశాంతయ్యచూచి తనదు

తే. పాదరక్షలు వదిలినమీఁదికెగసి
యొకటియాకట్టు హరియించె నొకటివాని
మోముపైఁబడి పండ్లూడ మోదె సభికు
లెల్ల విస్మయ చిత్తులై దల్లడింప. 318

క. ఆదెబ్బకుమీమాంసుఁడు, మేదినిఁబడి మూర్ఛఁజెంది మెల్లనదనకే
లూనుకొనిలేచిబసవని, పాదంబులమీఁదవ్రాలిప్రణుతించెనిటన్.

ఉ. మారటరుద్రమూర్తియసమానజగద్భరితాచ్ఛకీర్తిదు
ర్వారకళాప్రవృత్తి నినువర్ణన సేయఁగ నెవ్వడోపు నీ
చారుమహత్త్వముల్ దెలియఁజాలక నెగ్గొనరించినాఁడ నా
నేరము లెల్లసైచి కరుణింపఁగదే శరణాగతావనా. 320

క. దోషాచలమదసంహర, శేషునిమహిమంబుదెలియనెఱుఁగకఖలుఁడై
దూషించిభద్రుచేగని, పూషునిగతినన్ను జెందెభూనుతనీచేన్. 321

చ. అనివినుతించునాతని దయంగని శ్రీబసవండు బిజ్జలేం
ద్రునియెడవీడు కోల్పడసితోషము మీఱఁగ నందికోలశాం
తుని మదిమెచ్చుచుం గృహగతుం డగుపిమ్మటరాజదేశికుం

మనచుటవేడుకఁ మదిఁ గడున్మదిఁ బర్వఁగ వేగ సత్తఱిన్. 322

వ. మితశిష్యయుతుఁడై యసమతశుభకరం బైనబసవేశ్వరమందిరంబు నకేగిన నతనిరాక యంతర్గేహంబుననున్నఁ దనతోఁడచారుం డొక్క రుండు మ్రొక్కుచు సవినయంబున. [లాప

ఆ. తెలుపవచ్చి యిందుకోలుపుకూటంబున, నతఁడు దాను ననునయాను
ములవసించునంత నలుదెసఁగోడల, వ్రాసినట్టిభక్తవరులఁజూచి.

క. మీామాంసుం డచ్చెరువడి, స్వామీ! బసవేశ! యిట్టిసలలిత భక్తో
ద్దామాకృతిగనుప్రతిమఁ, కేమహిఁజీవములుగలుగు నెటులుండునొకో!

క. అనవుడుదరహసితాసన, మొనరఁగ నీకోర్కె యటులనుండునటుల నేఁ
గనుపించెద నిటుగనుమీా, యనిపరణొనరించిపిలువ నతక్షణమాత్రన్.

క. కీలూడి పడినకైవడి, నేలకు దిగనురికి తోడనే జీవములుం
గీలుకొన నందడింపుచు, కాలాంతక భక్తవర నికాయములంతన్.

సీ. జడముడుల్వీడిన సవరగాముడుచుచు
జిలుగువన్నియల బొంతలు దులుపుచు
తళుకుమనెడు శూలములు లీలఁద్రిప్పుచు
వీవనలను మేను విసరికొనుచు
వాలుగడ్డంబులు కేలఁజాడింపుచు
మొలకట్ల కచ్చడంబులు జెఱుపుచు
జటిలమౌ రుద్రాక్ష సరములు విప్పుచు
కక్షపాలలు భుజాగ్రముల నిడుచు

తే. నిలచిన తదీయపదముల కెలమి మ్రొక్కి
మంత్రివర్యుండు నగుచు మీామాంసుఁ జూచి
తే యనిన నద్భుతంబంది యాయమాత్యు
నభినుతింపుచు నటగురుఁ డరిగె నంత. 328

క. బసవేశ్వరుఁ డెప్పటిగతి, వసుధీశ్వర రాజ్యభార వహుఁడై గణప
ద్బిసరుహ పూజలొనర్చుచు,నసమాన మహాత్వయుక్తుఁడై విలసిల్లెన్.

వ. అని యిట్లుచెప్పి చెన్నబసవేశ్వరుండు వీరభద్రావనీశ్వరునిలో మఱి యు నిట్లనియె. 330

## కూలిచామయ్య కథ.

మ. గణవర్యుం డన వన్నెకెక్కె మహిమన్ గూలిచామయ్య స
ద్గుణవర్ణ్యవ్రత సత్యవాక్యనిలస ద్గాంభీర్య శేషాహి భూ
షణపాదాంబుజ భక్తికామముఖ హృచ్ఛక్త్యష్టసత్స్ఫూర్తితో
ల్బణకీర్త్య న్యహదీనరక్షణకళా! ప్రావీణ్యసంపత్తిచేన్. 331

తే. అతుల ప్రఖ్యాతిఁ గాంచి కల్యాణమందు
నిత్య మీతండు భక్తుల నియమమున
చేతనగు కూలిపనిచేసి చేరుధనము
వలన జంగమపూజలు సల్పుచుండె. 332

క. ఒకనాఁడు రేపకడను, త్సుకలీలం బసవమంత్రిఁ జూచుటకై త
త్ప్రకటాలయబాహ్యద్వారకవాటసమీపచత్వరంబుననొకచోన్.

సీ. అచటనుండియె యాత యాతజనంబుల సందడి కటునిటు జరుగ నేర
కొక్కింతనిలచి తానొయ్యనాస్థాన సదనముఁ జేరంగ జని యగణ్య
భక్తసముచ్చయ పరివేష్టితుం డగు బసవనిఁ గనుఁగొనఁ బడయలేక
యెడగల్గనిలచి యచ్చ్యెడనున్నవారలఁ గనిదండనాథునిఁ గనఁగనీరు

తే. పూర్ణమగు కోశమంతటఁ బొదివికొనిన
మత్తికంబుల కై వడి మాదృశులను
మిగుల నన్యాయ మిది యిట్లు దగునె? యనుచు
నందఱువినంగ నాడ నయ్యవసరమున. 334

సీ. వినికొందఱయ్యలు కనలుచుఁ జూచి వీఁ డెక్కడనుండి యిటకేగుదెంచె
నెవరు రానిచ్చి రీ మాహాత్మ్యుల నెల్లఁ జులకఁగా గణియించి పలుకఁ జొచ్చె
నై కూలిమాటలు గాదనకున్న వీఁ డేగతిబల్కు నింకెన్ని యేని
గాన యిచ్చటనుండఁగానీక వెడలింపుడని మెడపట్టితోయంగ వెడలి

తే. కన్నుగవనీరు జారగ గనలి మిగుల, కలతమది దేర మోము వెల్వెలఁగ బార
జేరి వంచకతతిఁ జేరి చుమటలూర, చని యెవగ గూర్చ నిజనివాసంబుఁ జేర.

వ. ఇట్లు చని పరిభవచింతాడోలాయమానసుం డై యేమియుం దోఁచక
నిజభవనాంగణప్రాంతస్థితశాండిల్య మహీరుహమూల వితర్దికనాసీనుం
డై యాత్మగతంబున. 336

చ. బసవనిఁ జూచి వేడ్కమది బర్వఁగ నేనట కేలపోతి త
ద్వసతి వసించునట్టి గణవర్గము నేటికిఁ దూలనాడితిం
గసరున వారునన్నుడువఁగాబడి యుండఁగ మోసె నేఁడయో
కుసుమశరారి నిత్యమగు కాలికిఁ బాసితి మోసపోయితిన్. 337
ఉ. పాపము లేమియు న్బొదువ జేసెగదా గణవర్గమెల్ల రు
ద్రాపరమూర్తియైన బసవాధిపుఁ జూడఁగనీక కొల్వులో
జూపర నస్వనాతనువు సృక్కుట జేయుట కల్మికల్గు డా
రిపగిదిం దిరస్కృతివహింతురె ధారుణి ధారుణీరథా. 338
ఉ. ఏమిటఁబూజచేసె బరమేశ్వర యీబసవండు తొల్లి నే
నేమి కొఱంతఁ జేసితి నభీష్టనిరంతర భాగ్యయుక్తుఁగా
నామహితాత్ము నుంచి లఘులైన దరిద్రము సంఘటించి బ
ల్బాముల నొందఁజేసి తిది భావ్యమె నన్ను గణాలిలోపలన్. 339
క. కూరిమి నెవ్వరుసిరిగల
వారలకే కూర్తు నెడు వార్తయె ధరపై
నారూఢమయ్యె నీ విటు,
గౌరీధవనన్ను మిగులగాసియిడుట చేన్. 340
వ. అని యిట్లు పరమేశ్వరుఁ దూలనాడుచు సాయకంబున కలుగక జం
గమార్చనవిధిఁ దలంపక యుండె నక్కట. 341
శా. చండేశాలయమందు నెప్పటిగతిం దత్పూపకాకావళుల్
వండంబూనినతండుల ప్రముఖముల్ వస్తువ్రజంబంతయుఁ
భాండాకంబుల నించునంతనవి గానం రామి విభ్రాంతితో
నుండఁగ నేఁజని తత్క్రియంబు దెలుప స్వీతాకుఁడై య త్తఱిన్. 342
ఉ. ఎన్నఁడు లేనివింత యిది యేమకొ యిప్పుడు గంటి లింగసం
పన్న గణేశ్వరప్రకర భవ్యకృపారతియందుఁ దక్కువో
నన్న దిలేదు తొల్లి యిది యద్భుతమై కనుపట్టె నేమి కా
కున్నదొ? యింక మీఁద శరణోచితకృత్యము లేమితప్పెనో!. 343
సీ. అయ్యలబోడగనుసంత నెదురేగి యడుగులకొఱగనో యర్ఘ్యపాద్య
ములొసంగనో సేశములనిల్పనో నేమములు దెలియంగనో యడలగలుగు
తలపులీడేర్పనో పంపినపని సేయనో రుచికరముగా సారభోజ

నమొనర్పఁ జేయనో సుమదామచందన తాంబూలములసమ్మదంబునొంద
తే. సలుపనో హంసతూలికా శయ్యల శయ
నింప జేయనో తత్పదనీరజంబు
లొత్తనో యేమికతమొ ద్రవ్యోత్కరంబు
మాయమయ్యె గణార్చనా సాయమెదువ. 344
చ. అనియిటు చింతనొందుసమయంబునఁ జారుఁ డొకండువచ్చి వం
దనమొనరించి యోబసవ! తావకసేవక విన్నపంబు హ్రా
ద్వనజమునం బరాకిడక తాలిమితో విను విన్నవింతు నీ
దినమున నిప్పురంబునను ధీరుఁడు భక్తవరేణ్యుఁ డొక్కచోన్. 345
క. మారేడునీడశివకరు,నీరోరుహమందునిల్పి నిగళద్వాప్త్వా
పూరితముఖుఁడై తతపణి, హారునిదూరుచు నసించె నది యెట్లన్నన్.
చ. గురుతరమైనలేమి సమకూరిచి యెవ్వరికందరాని రా
సిరిగల దండనాథు గృహసీమకుఁబోవఁగఁ బంచి యచ్చటన్
శరణులచేతఁ దాడనమొనర్పఁగఁ జేసి వ్రతంబుఁ బాపి యి
ద్ధరనునుపల్కఁగాఁ గనుట ధర్మమె? నీకిది ధర్మపావనా. 347
చ. అనుచు వచించె నాబసవఁ డద్భుతమందుచు లింగదర్పణం
బునకయి శూలిచామయ విభ్రమమంతయుఁ గాంచితప్పు న
చ్చెనని తదీయయాభవనసీమకు సత్వరవృత్తినేకతం
బునఁ జని తత్పదాబ్జముల పొంత ధరాస్థలి జాగిమ్రొక్కుచున్. 348
ఉ. దీనతఁదోఁప నిట్లనియె దేవ కృపారసదృష్టిమీరు నన్
గానఁగవచ్చుటేనపుడు గానక మోసముఁ జెందినాఁడ నె
చ్చో నను బోలి దుర్మదవశుండు ధరాస్థలిలోన గల్గునే
జ్ఞానములేదు భక్తియును సొజ్జ యెఱుంగ వివేకహీనుఁడన్. 349
ఉ. కావున నింకనైన దయఁ గన్గొని నాయెడ తప్పులెల్లయున్
నావలఁదోఁచియేలుమెడ యైనగణార్చనవేళ దప్పఁ ద
త్పావన జంగమావళితుఘాప్యథఁ జిక్కుఁ దదీయసేవ నా
జీవనమాట మీరు మును చిత్తమునందె యెఱుంగలేవొకో. 350
వ. అని యిట్లాత్మనిందయు భక్త్యుత్కర్షంబు దోఁపనాడుచున్న బసవేశు
నింగనిచామయ్యభక్తియుక్తిగ్రమ్మఱనమస్కరించుచునిట్లనియె. 351

శా. దేవా! నన్నిటు పెద్దసేయఁదగునే దీనుండ మీపాద స
త్సేవాసక్తుఁడ మీమహత్త్వములు నాచేఁ జెప్ప శక్యంబె యీ
జీవాహీనులకై సమాదృశుల రక్షింపంగ సిద్ధాత్రిపై
భావప్రోద్భవసంహారాంశమున నుత్పన్నుండవై భక్తిచేన్. 350

క. సురమణి కన్నులఁ గేలం, బరుసము ధరియించి సకలభక్తాధ్యసమున్.
త్కారములకీప్సితమొసఁగుచు, ధర వెలసితివిట్టులొరులతరమె యొనర్ప

క. శరనిధులు మేరఁదప్పిన, గిరులు చరించినను నింగి క్రింది కొఱఁగినన్
స్థిరధైర్యకొఱఁతయగునే, యురుతరభక్తియమహిమ యొకచోనైనన్.

వ. అనిన విని వినయసల్లాపంబుల ననునయించి బసవేశ్వరునిజమందిరంబు
నకుఁ బోవం బనిచిన నతండు సంతోషితస్వాంతుండై యెఱిఁగి యం
తకమున్న యప్పటియట్ల యక్షయంబైనపదార్థంబులు గాంచి యచ్చె
రువందుచు తత్క్రియంబు వారలతో నుగ్గడింపుచు నుండె నిట చామ
య్యయుఁ దనసాధ్వీకిం దనవృత్తాంతం బెఱింగించి నిత్యకృత్యంబున
కేమి యింతప్రొద్దుజరిగెనని విచారింపుచు వీథికేగునప్పుడు దైవయో
గంబున నొకభక్తుండుతనయింటికిఁ గూలికింగొనిపోయి యప్పటి యా
తనిపడియొసంగినఁ గొని తెచ్చి జంగమార్చనవిధిసలిపెఁగావున నితని
మహత్త్వం బిట్టి దని తెల్పి వీరభద్రనృపతిం గాంచినం బసవేశ్వరుం
డిట్టి మాపథవర్తులైన జంగమ మూర్తులలో నేనెంతవాఁడ నన్ను
మీ రిన్నిభంగులం గొనియాడం దగునే యనిన క్రమ్మఱ నతం డిట్ల
నియె. మహాత్మా! యిమ్మహాత్ములచర్యలు విని కృతార్థుండ నైతి.
కల్యాణంబున భక్తతృప్తివలన నాత్మతృప్తివహించు శరణుండు గలఁ
డని విందు నతం డెవ్వరనిన చెన్నయ్య యన్నించి యి ట్లనియె. 355

సీ. ప్రతికూలభార్యయాకతననింటఁగఱార్చ బోసఁగకచేన్గావఁ బోవునప్పు
డప్పురి నెదురైనయయ్యనొక్కనిఁగనిచనిమునుతాఁదెచ్చుపద్రసాన్న
ములతద్ధనునితృప్తిఁబొందించియీతనిదృప్తియేనిజలింగతృప్తిగాఁగ
వరలుకొన్నాళ్లిటుజరగఁగనొకనాఁడుతా వెంటఁగొనిపోవుశైవవరుఁడు
తే. కనులనొప్పిజనించినఁదనుపుపీడ, నందశ్రమనొందియేఁజాలకాత్మదేహ
మెడలదలచిప్రత్యక్షమౌమృడుఁడదీశ, భక్తునుగాఢగంగళబవవిభుఁడు.
చ. అనియిటు శాంభవోత్తముమహత్త్వముఁ దెల్పుచువేడ్కమీఱఁ అనా

దినమటుపుచ్చి యట్టిపగిది స్నిరతంబును భక్తవర్యగో
ష్ఠి నలరుచుఁ శివార్చనము సేయుచు నచ్చట కొన్నినాళ్లు ని
ల్చెను బసవేశ్వరుం గనిన చెన్నసుధీశుఁడు సంతసించుచున్. 357
ఆ. అటులనుండితోడియయ్యలుఁ వీరభ, ద్రోర్విపతియుఁదానునొక్కనాఁడు
నముచితేష్టగోష్ఠిసలుపుచుఁ దద్ధరా, వరునిఁజూచి చెన్నబసవఁడనియె.
ఉ. ఈశ్వరమూర్తియైన బసవేశుదయ న్నిముఁబోఁటి వీరమా
హేశ్వర పాదసేవన లభీష్టముఁ దేరఁగఁజేయఁగంటి నీ
విశ్వములోన జన్మములు నీడి కృతార్థుఁ డనైతి నింక నే
శాశ్వతమైన మోక్షపదసౌఖ్యముఁ జెందఁగనూహ చేసితిన్. 359
చ. అనవుడు కేలుమోడ్చి వసుధాధిపుఁడిట్లను దేవ! మిమ్ము గ
న్గొనినది యాది నన్యమగు కోరికలెల్లఁ దృణీకరించి పా
వనభవదంఘ్రియుగ్మ మెడఁబాయకయుండఁదలంచినాఁడఁ గా
వున సహచారిఁ జేసికొని పుణ్యునిగా ననుఁగావవే దయన్. 360
క. శరణాగతజనవాంఛా, పరిపూర్తియొనర్చుటుచితపద్ధతిగాదే?
వరగుణులకెందు నే మీ, వరపుడ నాకోర్కెఁదీర్ప వలదే! యనినన్.
చ. చిఱునగవానవాబ్జమునఁ జెన్న సహింపఁగనాగమాత్మజుం
డఱిమిఁ బల్కు నీతఁడఁ నిట్టుల యా నిఁక నేడు వేవిన
స్మృతిమిటి చీకటింగణసమూహముతో నిటు దెల్పఁ బోక నం
దఱు మరుగ న్వెలెఁ సుందవితానను తామృత పెన్నఁజేరఁగన్. 362
క. అప్పెన్న నదీతటమునఁ, దిప్పలభూజద్వయంబుఁ జేర్చొన దగు వె
ల్తిప్పకరుగసాధనమై, యొప్పననుచుఁ దెల్పనృపతియుత్సుకుఁడయ్యెన్.
వ. అంత. 364

రజతశైలంబుకరుగుట.

క. లేపిన పిమ్మట నాగాం, బాగరతనయుండు కల్యవర్తన లెల్లఁ
వేవేగఁదీర్చి సహచరు, లావీరగణాళితోడ నతఁ డిట్లనియెన్. 365
తే. సన్నుతంబైన వసుధలోనున్న నదుల
కన్నిటికి మిన్నయై తగియున్న యట్టి
పెన్న యున్నతి దలఁచిన యన్నరాళి
కెన్నఁగా మోక్ష మబ్బు చేతి వెన్నగాదె! 366

ఉ. కావున నన్ను దీవరము గణ్ గొన వేడుకయయ్యె పోదమే ?
పావనులార! యంచు నొడబాటొనరించి సమస్తభక్తులన్
గోవిదుఁడైన వీరనృపకుంజరుఁడుం దనతోడఁగూడి రాఁ
బావకసంభవాంశజుఁడు పాశ్రిభవ మొప్పఁగ నేగె నత్తఱిన్. 367

వ. ఇట్లు చని చని. 368

సీ. ఆత్మాంబుసంస్మరణానందమానస సంఘమకరం హోహాభుజంగనకుల
స్వ్వనసందర్శనానసక్తజనస్తోమ పాపకాంధధ్వాంతభానుదీప్త
వైరిజనస్నాత్యవరలోకసప్తజన్మార్జితవృజినానిలానిలాశ
నిజతోయపాయిమనుజసముదయకృత పాపభూమీంజాతపరశుధార

తే. పూరి సుకృతవంశోద్భూత భోగిమీన
కమఠనక్రజలూకకర్కటకముఖ్య
జంతుసముదాయవిహరణ స్థానమగుచుఁ
గన్నులకువస్నఁ జెన్నొందు పెన్నఁ గనిరి. 369

మ. కని డాయం జనునంతవీఁచెపయిఁ దత్కల్లోలినీతుంగభం
గనితాంతోత్క్షిత శ్రీకరప్రజలరంగత్తుంగభూమాలతీ
కనకామ్రాదివసుంధరారుహసమాక్రాంతప్రసూనప్రభూ
తనిరాఘాటసుగంధబంధురజగత్ప్రాణాంకురవ్రాతముల్. 370

ఆ. అమ్మరుద్వ్రాతముల వథాహ్వాన మవన
యించి యొకరమ్యతలమున నెల్ల భక్త
వరులు దానును శ్రీచెన్నబసవవర్యుఁ
డెలమితోడుతఁ గూర్చుండి యిట్టు లనియె. 371

ఉ. భక్తవరేణ్యులార! ననుభవ్యకృపారతి మీప్రసాదసం
యుక్తునిఁ జేసి యేకోఱఁతయున్ ఘటియింపఁగనీక యేలుటన్
వ్యక్తిగ సర్వవాంఛిత సుఖానుభవంబులఁ జెంది తింక నే
ముక్తిపదంబుఁ జెందెద నమోఘముగా సెలవిచ్చిఁ బంపరే?. 372

చ. అనవుడు తద్గణాధిపులు హా! యిటులాడఁగఁ గూడునయ్య? సం
గన బసవేశ్వరుండు కడఁ గాంచినఁ బిమ్మట నీవె మాకు ది
క్కని యెద నమ్మి మోదమెలయన్ నినుజుట్టుకయుంటి మట్లు గా
వున మము వీడి నీవొకడవుం జనుటొప్పునె? వెండికొండకున్. 373

క. వినుఁ బాసి యొక్కనిమిషంబును భూమిఁ జరింప బుద్ధిపుట్టదు మా కో
యనఘాత్మ! మమ్ముఁ దోడ్కొని, చనుమీతోఁ గూడ ననిన సమ్మతమతియై.
తే. చెన్నబసవనిపలుకు మెచ్చి త్తమెట్లు, లటుల యగానింక జాగు సేయంగవలవ
దరుగ పలెరండు శివపురికి తిరయమున, ననిన దద్భక్తపుంగవులతనితోడ.
ఉ. కోవిదవర్య! యిందఱము కుండలికుండలురాజధానికిం
బోవఁగ మార్గ మెప్పగిది? బొందులతోడనొ లేక కాయముల్
వోవఁగ దోంచిదియో కరుణఁ బూనివచింపుడు నామహాత్ములా
రా! వినుఁ డింక లొక్క మొగి రాజధరుం గనురీతిఁ దెల్పెదన్. 376
ఉ. శారభమూర్తియై హరుఁడు చండరయంబున నేగుచున్నదీ
తీరజ పిప్పలాఖ్య జగతీరుహయుగ్మము మీఁద సిల్చి నా
ఖారము వైచె నీతరులు బాపురె! యంచు గణించి కామసం
చారము నిత్యజీవిత మొసంగె దయామతితోడ వానికిన్. [లు
సీ. ఆవృక్షములనున్న యాకులుతెండముల్ సాచి మేయుదిగంతసామజము
వేడ్కనాకుజముల వేరులుపట్టియుయ్యాలలూగుదురుపాపతలిరుబోండ్లు
స్వర్గాల లాచెట్లశాఖలచాటున, సంతరింతురు గికురింతలాట
లామ్రానిగపనీడ నధివసించుజనాళి, దివమునఁగాంతిఁంచుదీపకాంతి
తే. పన్నగోపరినీడజాత ప్రతాన, సంతతులలోరహస్యము జరుగకునికి [కైన
లోనగనెచింత లోకపాలోత్కరంబు, వాసిగొనియాడ దర మెవాగ్వరుని
తే. అమ్మహీజపమిచ్చోటి కనతిదూర, మున వసించిన నచటికి జనివిలాస.
గతిదదారోహణ మొనర్చిఖండపరశు, పదము జేరుదమసిప్రేమముదవజేసి.
తే. అచటు బాసి బసవనామాత్యభాగినేయుండు సముపభక్తియు క్తుడగుచు
జనినదీసమీపముననున్న కుంజరాశనయుగంబుఁ గాంచి సమ్మదమున,
వ. తద్భక్తవరులతో ని ట్లనియె. 381
క. అనఘాత్ములార! యల్లదె, కనుగొంటిరె పిప్పలాఖ్యగనుకుజవరముల్
దిననాథ ధారుణాతప, జనితశ్రమపథికజాత సమ్మదకరముల్. 382
క. అని డాయ నేగుచుండక, మ నుశర్వుఁడు భక్తసింహములతో భువివీ
డ్కొనిసిజతనయుఁడు వచ్చెం, దనపురికనిమిగులసమ్మదం బిగురొత్తన్.
చ. నిరుపమరత్నకాంచనఘృణివ్రజకాంతము లైన యుయ్యెలల్
సిరిగల వెండికొండియము చేతుల వ్రేలుచు నుండునట్లి త

త్తరువరుశాఖలక్షఁ శరణతండముతో హరుఁ డూఁగుచుండి భా
సురతనిజాగమం బెదురుచూచుచునుండె సుమాసమేతుఁడై.
ఉ. ఆతతి వేడ్కఁ జెన్నబసవాధిపుఁ డాతరుశాఖలందు సం
ఘాతములయ్యెనో యన నపూర్వముగాఁ జెలువొందు నట్టి సం
ఘాతముగాంచి యోశరణకాండములార! భవుండు మీకు వి
ఖ్యాతిగఁబంపెఁగాంచనమయాసనముల్ గనుఁగొంటిరే యనన్. 385
చ. హరి గుహనాశ్రయించిన జనాళి కవారణమార్తికంబు వే
మరు భగవత్కటాక్ష విభవాతిశయంబునఁ జెందు మాకు శం
కరకృపఁగాంచుటే గణన గావునఁ బోదమె యంచుఁ దద్గణో
త్కరములు పల్క నత్తతి మొగంబున లే నగ వంకురింపఁగన్. 386
వ. చెన్నబసవేశ్వరుం డున్నయంతకమున్ను బసవేశ్వరుఁ గన్నంబుఁ
జొచ్చిన పిమ్మట కొందఱు భక్తపర్యులతోఁ గప్పడి సంగమేశ్వరం
బున వసియించిన నాగమాంబిక తనయుఁడు కైలాసగమనోన్ముఖుం
డగుట లింగదర్పణంబునం గని సంతోషబాష్పధారాపూరితశరీర
యై యెదురేగ నాయమ్మ యడుగులు తన ఫాలభాగంబు సోఁకం
బ్రణమిల్లినకుమారునిం గ్రుచ్చియెత్తి పెద్దదడవు కౌఁగిటఁజేర్చుకొని
మూర్ధాఘ్రాణం బొనరించి బహుకాలవియోగదుఃఖంబుఁ బాసి
సంతోషించుచున్న జననిఁ దోడ్కొని పిప్పలాపాతంబునకుం జని త
ద్భక్తవరుల నందఱ నాలోకించి. 387
ఉ. ఓగుణులార! యెక్కుఁ డిదె యుయ్యాలతొట్టెల నింక నిత్తతిం
జాగొనరింపనేల? యని సంతసమొప్పఁగఁ దల్లి నొక్కది
వ్యాగమనూనదామమయమై చెలువొందెడు తొట్టెనుండి వే
వేగమ వీరభద్ర పృథివీవరుతో నొక తొట్టెలోపలన్. 388
క. వసియించియంతఁదద్గణ,విసరారోహణముఁగాంచి విశ్వేశ్వర స[దెన్.
ద్విసరములు దలఁచునంతనె,యసదృశపూర్వవతారుఁడై చెలువొం
క. ద్వాదశమలు కేల్గన్నులు,మేదురముఖపట్కమును నమేయములౌశ
స్త్రాదివరసాధనంబులు,పాదుకొను వెలుంగుగుహునిభక్తగణంబుల్.
క. కని తోడనె పూర్వప్రమ,థ నికాయశరీర సమితిఁ దాల్చిరి శాపం
బునఁబాసినాగమాంబిక,యనుపమనాగేంద్రగమనయై చెలువొందెన్.

ఉ. నరహరి వైరిమంత్రనుత నాగలతాదళభక్షణంబుచేఁ
కురుపదకృత్రిమంబయినఁ గొంచముచే నగు త్రొక్కుఁడైనచోఁ
బరఁగఁగఁ బుల్లనౌ గృహ విభాషితలక్షణమైన తియ్యనౌ
ధరణిని మంత్రవేత్త లిటు తప్పకబోధలు చేతు రీయిలన్. 392
ఉ. కుండలిహారసూనుఁ డిదిగోఁ జనుదెంచె నటంచు వేడ్కనా
ఖండలముఖ్యనిర్జరనికాయము సంతసమొందె భేరికా
తాండవవంబులన్ సురజనప్రభవాక్షివిలాసనృత్యముల్
మండితపుష్పవర్షములు మాగధసన్నుతు లొప్పెమిన్ననన్. 393
క. అత్తఱి నద్భుతమొదవఁగఁ,దత్తరుయుగ్మంబుసురపదంబున కెగయన్
మొత్తముగనింద్రముఖసుర,సత్తము లెదురేగుదెంచె సరగుననతులై
సీ. గజముపై ధ్వజమూని క్రతుభుగ్వరేణ్యుండు
ధూపపాత్రధరించె తోయజుండు
వేత్రహస్తుం డయ్యె చిత్రభానుసుతుండు
ఖడ్గంబు ధరియించె కర్బురుండు
జలకలశము దాల్చె సలిలాధినాథుండు
కేల వీవనగొనెఁ గీర్తసఖుఁడు
బంగారుపావలు పట్టెను జేరుండు
సూటిమార్గముచూపె శూలధరుఁడు
తే. పడఁగఁ గొడుగును పైవిప్పె పాఁపఱేడు
స్వస్తి చెప్పంగఁ దొరకొనె జలజభవుఁడు
తోరణాకృతిఁ జెలువొందె తారకాళి
యమరసేనాని కైలాస గమనవేళ. 395
ఉ. ఈగతి షణ్ముఖుండు గిరిజేశ్వరుసన్నిధి కేగి నమ్రుఁడై
జాగిలిమ్రొక్క వారలతిసంభ్రమమొప్పఁగ నాత్మనందనుం
వేగమ గ్రుచ్చియెత్తి కనువిందుగఁ జూచుచు కౌఁగిలించుచుం
బాగము మీఱఁ బల్మరు శిరంబులు మూర్కొనుచుండి రయ్యెడన్.
క. నాగేంద్రగమనతొల్లిటి,లాగునగిరిజాతఁగొలుచులలనలలోనం[వన్,
దాఁగలసియుండెవ్రమథులు,నాగతిహరుఁగొలిచియుండిరతిముదమొద
క. ఆపిప్పలతరుయుగ్మము, గోపతివాహనునిభక్తిఁ గొలుచుచుఁ దద్ద్వా

గోపాంతంబునఛాయా, వ్యాపకమై నిలచెం బ్రమథు లచ్చెరువందన్.
అంతటనిట భూతలమున నంతంతట చెన్నబసవయారాధ్యుఁడు మా
కాంతుపురి కఖిలజంగమ, సంతతితోఁ దనువులిడక చనె ననువార్తన్.
క. విని యొండొరులతో నప్పు డి ట్లని రాహా! యిట్టిచిత్ర మవనింగలదే
తనువులతో శివపురికిం, జనుటొప్పె నెయీతఁ డెంతసత్వ స్థుండో. 399
క. తానొకఁడె కాఁడు తనతో, మానక చరియించు భక్తమండలి నెల్లన్
బూని కొనిపోయినాఁడట, గానఁగ లేమైతిమతనిగలసిచనంగన్. 400
తే. పసినిపండైన సత్పుత్రంబు పట్టుపీడు, గాక కసుగాయ కెంపైన గల దెవిశుట
తపసుపండినవారితోఁ దగిలిచనఁగ, నేలసమకూరుమనబోఁటిహీనులకును.
ఉ. ఎన్ని భవంబులెత్తిన గిరీశునిసన్నిధి కిట్లు బోవఁగాఁ
జన్నె యితండు వీరనృపచంద్రునిమ్రోల వసించునాఁడె నీ
కన్నసమర్థు లెవ్వరిఁక గారు దురాత్ముల బ్రోవుమంచు నా
పన్నతఁ జేరికొల్చిన కృపావరుఁడాతఁడు వీడ నాడునే. 402
చ. వలదని మాన్పిన న్విడక వానికి ముజ్జని యొక్క రొక్క దే
చలదళశాఖపైఁ గోమల సందులసందుల డాగి వారలా
గొలుసులతోట్ల నెక్కతరి గొబ్బున చేరులుపట్టి వ్రేలినం
గలుగు గిరీశలోక మటుగాకయ వెట్టులమైతి మక్కటా! 403
చ. గురువుల నిందచేసితిమొ? కూడితిమో? యితరాంగనారతిం
శరణులఁ గాంచి మ్రొక్కమొ? ప్రసాదములో రుచులెంచినారమో?
పరధనకాంక్షఁ జెందితిమొ? పాసితిమో? వ్రతనిష్ఠ పార్వతీ
శ్వరునిసపర్య కాలమున సల్పమొ? భక్తిని భక్తిమార్గముల్. 404
ఆడితిమో? యనృతంబులు, కూడితిమో! యేరుమాలికుజనులపొందున్
వీడితిమో లింగార్చన, నోడితిమో యాంతరాహితోత్కరమునకున్.
కొలచితిమో పెరవేల్పుల, సిలచితిమో శూలధరునినిందించు నెడన్
దలచితిమో? దుర్వృత్తులు, విలచితిమో? వేదమంత్రవిద్యావితతుల్.
కావున్న చెన్నబసవం, డాకాంక్షన్నలఁగొంచు నరుగడె! యనిచిం
తాకులమతి నుండిరి భూలోకంబున నఖిలశరణులుం గడుభక్తిన్.
చ. సదమలమానసంబున రసాస్థలి యిక్కథ యెవ్వరేనియున్
జదివినవిన్న వ్రాసిన నిశాకరమౌళికృపా సమృద్ధి నెం

శ్రావణంగ భోగభాగ్యములు పొంది చిరాయురుపేతులై తుద౯
ముదమునఁ గాంతు రబ్జభవముఖ్యులకందని మోక్షసంపద౯. 408

వ. అని యిట్లు రేణుక గణాధీశ్వరుండు బాహులేయువృత్తాంతంబు సవి
స్తరంబుగాఁ దెల్పిన కుంభసంభవుండు నచ్చటి మాహేశ్వరులును
సంతోషితస్వాంతులై దేవా! భవదీయకృపావిశేషంబున సమస్త
సాధనహేతుకంబైన చరిత్రంబువినఁగలిగెఁ గృతార్థులమైతిమని పెక్కు
విధంబుల గొనియాడుచున్న వారల నుచితసల్లాపంబుల వీడ్కొని
యయ్యోగిపుంగవుండు నిజేచ్ఛం జనియె నబ్బాసవాలుగమియు నేత
త్కథాశ్రవణం బొనరింపుచు నెప్పటియట్ల సుఖంబుననుండిరి. 409

చ. వనరుహరాజతేజ! నరవాహన! కర్ణసమానదాన! పా
వన! శివలింగ సంగ సురవల్లభ! మంత్రవిశేషభాషణాం
చన! నగధైర్య! ధైర్య రిపుసంచయఖండనశౌర్యధుర్య! శో
భన! సుగుణాలవాల! కవిబంధుబుధాశ్రితజాలపాలకా! 410

క. కందర్పసదృశవితరణ, కందలతాంతాస్త్రశీతకరనిభరూపా
కుందాభకీర్తిపూరము, కుందాగ్రజబాహుబల యనుంఠితవిభవా.

ఉత్సాహము. శర్వశర్వరీంద్రచంద్ర శారదాభ్ర ఫేనగో
హారవమూహతాశనేశ హారహీరశారదా
పర్వతాధినాథగోప పారదాబ్జతారకా
గిర్వరాత్మజాతతుల్య కీర్తిపూరితోర్వరా. 412

గద్యము. ఇది శ్రీమచ్చెన్నమల్లికార్జునకరుణాకటాక్షలబ్ధకవితామాధురీ
ధురీణ కాశికగోత్రపవిత్ర సుకవిజనస్తుత్యపాపయామాత్య ప్రణీతంబైన చెన్నబసవపురాణం బనుమహాప్రబంధంబునందు సప్తమంబును
పంచమాశ్వాసము సంపూర్ణము.






చెన్నపురి : 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1925.